రాధాస్వామీ దయాళ్ కీ దయా

రాధాస్వామీ సహాయ్

పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజ్

వారి

# అమృత వచనములు

తెనుఁగు అనువాదము

## ద్వితీయ భాగము

రాధాస్వామీ సత్సంగసభ అనుమతితో హిందీ మూలమునుండి
తెనుఁగు భాషలోనికి తర్జుమా చేయబడినది

ప్రకాశకులు

రాధాస్వామీ సత్సంగసభ
రాధాస్వామీ సంవత్ 165
దయాల్బాగు ఆగ్రా – 5

1983



PARAM GURU HUZUR MEHTAJI MAHARAJ

# భూమిక

పరమగురు హుజూర్ మెహతాజీమహారాజు వారి వచనముల ప్రథమ భాగము యొక్క తెనుగు అనువాదము 1980వ సంవత్సరములో ప్రచురించబడినది. అందులో 1945వ సంవత్సరము వరకు సెలవిచ్చిన వచనములు మాత్రమే చేర్చబడి యున్నవి. రాధాస్వామీ సత్సంగసభ వారిప్పుడు ఆ వచనముల ద్వితీయ భాగమును తెనుగు తర్జుమా చేయించిరి. ఆ దయాళుగురు 1945వ సంవత్సరము దరిమలా సెలవిచ్చిన వచనములీ ద్వితీయ భాగములో చేర్చబడినవి. అవి మాత్రమే గాక కొన్ని భాషణలు, సందేశములును గూడ నిందు పొందుపర్చబడినవి. ఇవన్నియు నింతకు ముందు ఉర్దూ, హిందీ భాషల ప్రేమ ప్రచారక్ పత్రికలలో ప్రచురించబడినవి. ప్రేమ ప్రచారక్ పత్రికా సంపాదకుడు తన సొంత అభిప్రాయములను, వ్యాఖ్యానములను గూడ అందు కలిపి వ్రాయు చుండినందున, మేమిపుడు, ప్రథమ భాగము యొక్క భూమికలో తెలియ జేసినట్లుగనే, పత్రికా సంపాదకుని అభిప్రాయములను వ్యాఖ్యానములను విడిచిపెట్టి, సాధ్యమైనంత మట్టుకు హుజూరువారి సొంత మాటలలోనే ఆ వచనములుండునట్లు చేయుటకు యత్నించితిమి. హుజూరు వారి వచనములు చాల మట్టుకు ఆంగ్ల భాషలో నుంచుటచే ప్రేమ ప్రచారక్ పత్రికలలో వాని అనువాదములే పడుచుండెడివి. వానిని కొంతవర కచ్చటచ్చట క్లుప్తము గూడ చేసితిమి.

ఈ పరిస్థితులలో నిందలి వచనములు, భాషణలు సందేశములును పూర్తిగ హుజూరువారి మాటలే యని రాధాస్వామీ సత్సంగ సభ హామీగా చెప్పజాలరు.

గురు సరన్‌దాస్ సహగల్
ప్రెసిడెంటు
రాధాస్వామీ సత్సంగసభ

దయాల్బాగు
డిసెంబరు 1983

రాధాస్వామీ దయాల్ కీ దయా

రాధాస్వామీ సహాయ్

# పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజు వారి

# అమృత వచనములు

## 1

6 ఫిబ్రివరి 1946– వసంత పంచమినాడు సాయంకాలము సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : ఇపుడు ఒక ముఖ్యమైన ప్రశ్న మీ యెదుట పెట్టుచున్నాను. అదేమనగా వసంత పంచమి రోజున బొట్లు పెట్టుటను గురించియే. ఈ విధముగ బొట్లు పెట్టుట వలన మీకు లాభ మేమున్నదో చెప్పవలయును. ఈనాడు ఉదయము బొట్లు పెట్టుటలో మూడు గంటలసేపు పైగా వ్యర్థ కాలక్షేపమైనట్లు చూచితిరి కదా! అందువలన మీ క్షేమమైనను ప్రకట ఫలితము కనపడినదా? ఇందుకు అనుకూల పక్షములో మీలో నెవరున్నారో తెల్పగోరుచున్నాను. అందుపైన చాలమంది తమ సమ్మతిని తెలియజేయుచు చేతులు ఎత్తిరి. హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: మీలో అధిక సంఖ్యాకులకు ఈ ఆచారము సమ్మతముగనే యున్నట్లున్నది. కాని నేను ఇందుకు సమ్మతించజాలను. దీనిని గురించి మీ అభిప్రాయమును తెలిసికొను నిమిత్తమై నే నీ విషయమును మరొకసారి మీ యెదుట ప్రస్తావించుచున్నాను. నా అభిప్రాయ మేమనగా, మొదటి విషయము, బొట్లు పెట్టుట ప్రారంభము చేసినది మొదలు చిట్ట చివరవరకు అందరు నిచ్చట ఉండుటలేదు. యెవరికివారు బొట్టు పెట్టించుకున్న వెంటనే లేచి వెళ్ళిపోవుచున్నారు. రెండవది, ఇందులకై చాల సమయము పట్టి, శ్రమ కూడ కలుగుచున్నది. ఈ విధముగ నీ పనికి మూడు గంటలసేపు పట్టుచున్నది. మొదటి వ్యక్తి బొట్టు పెట్టించుకొన్న వెంటనే లేచి పోవుటయు, ఆఖరు ఆసామి చివరవరకు మూడు గంటలసేపు కూర్చుండవలసిన అవసరము కల్గుటయు జరుగుచున్నది. అట్లుగాక సైన్యములో మార్చిపాస్టు చేయుచు సెల్యూట్ చేయు పద్ధతిని మనము అవలంబించిన యెడల నీ కార్యక్రమ మంతయు పది నిమిషములలో పూర్తి యైపోయి, అందరును మిగిలిన మూడు గంటలసేపు

స్థిమితముగ కూర్చుండవచ్చును. ఆయుధ సమేతుడైన సైనికునివలెనే మీరు కూడ "మార్చిపాస్ట్" చేయుచు నా యెదుటకు వచ్చినయెడల, నాకు మీ దర్శనము బాగుగ లభించి మీ ఆరోగ్య మెట్లున్నదో కూడ చక్కగా బోధపడగలదు. బొట్లు పెట్టుట కట్టిపెట్టి రెండవ పద్ధతిని నవలంబించవలెనా లేదా అను విషయమును గురించి తమ అభిప్రాయమును తెల్పవలసినదని తిరిగి ప్రశ్నించగా అందరును రెండవ పద్ధతినే అంగీకరించుచున్నట్లు ప్రకటించిరి.

ఇట్లు సెలవిచ్చిరి :- మరొక చిన్నమాట చెప్పెదను. అదేమనగ, **"Be Prepared"** అనగా "తయారుగ నుండుడు" అనెడి స్కౌట్ల ఆదర్శము **"Scout Motto"** (స్కౌటు మోటో)ను మీ రెల్లప్పుడు నెదుట నుంచుకొనుడు. ఈ రెండు పదములను, అందలి ఆదర్శమును ఒక్క స్కౌట్లకే గాక, సత్సంగులకు గూడ చాల యుక్తమైనవి. ఒక స్కౌటు ఈ మోటో (**Motto**)ను తన యెదుట నుంచుకొన్నందున నెల్లప్పుడు సన్నద్ధుడై యుండును. ఈ రెండు పదములును వానిలోని భావమును అతడు జ్ఞాపక ముంచుకొన్న యెడల తానే సేవ చేయుటకు ప్రతిన చేసెనో, తన కే యే కార్యములలో పాల్గొనవలసిన ఆవశ్యకత యున్నదో, ఆ యా సేవా కార్యములను కొనసాగించి తన ప్రతిజ్ఞను పూర్తి చేసికొనుట కతడు ఎల్లప్పుడు నడుము గట్టుకొని సంసిద్ధుడై యుండగలడు. ఒక సత్సంగి హృదయమున సేవాభావము ఉప్పొంగుచున్న యెడల అతడు కూడ **"Be Prepared"** అను భావమును మనసున నుంచుకొనుట యుక్తము. ఈ కాలమున ప్రపంచములో దుఃఖములకు కష్టములకు నేమియు కొరతలేదు. అన్ని స్థలములలోను కష్టములు ఆపత్తుల మాటలే వినవచ్చుచున్నవి. ఎవరైనను తనకు సేవ చేయుట కవకాశము చిక్కుట లేదన్న యెడల అది బొత్తిగ పొరపాటు మాటయే. అందుకు సంసిద్ధుడై (**Prepared**) యున్న సత్సంగికి అట్టి అవకాశము సర్వదా సమస్త స్థలములలోను లభ్యము కాగలదు. అటులనే, సైనికునికి గూడ నెల్లప్పుడు సంసిద్ధుడై (**Prepared**) యుండుట పూర్తిగ యుక్తమును, ఆవశ్యకమునై యున్నది. ఏలననగా, అతడు ఒక క్షణకాలమైన నేమరుపాటుగ నున్నయెడల శత్రువు లతని తక్షణమే చంపివేయగలరు. ఒక్క సెకండులో పదవవంతు కాలములోనే పిల్లి ఒక పక్షిని పట్టి యెట్లు చంపి వేయుచున్నదో మీరు చూచియే యుందురు. పిల్లి మొట్ట మొదట కండ్లు మూసుకొని ఏమరుపాటుగా నున్నట్లు నటించి పక్షి కొద్దిగ అజాగ్రత్తగ నున్న యెడల వెంటనే దానిపై బడి దానిని తినివైచును. అట్లే సైనికుడు కొద్దిగ బద్ధకించి అజాగ్రత్తగ నున్నచో శత్రువు అతనిపై బడిపోవును. మీరు మెళుకువగను, సావధానముగను ఉన్నయెడల సేవ లభించుట ఒక్కటే కాకుండ, మీ మనస్సున గూడ చెడు ఆలోచనలేమియు రానేరవు. మీరు చేయవలసిన మంచి

కార్యములు మీకు మరుపు లేకుండ, జ్ఞాపకముండును. ఇతరులలో వలె మీలో మంద సంకల్పము, బద్ధకము, నిర్లక్ష్యమును కలుగనేరవు. జీవులందరి పైన స్వారీ చేయుచున్న పంచ శత్రువులును మీ వశములోనుండును. అనగా, మీరు మెలకువగ నుండి మనస్సును వశమున నుంచుకొన్న యెడల సమస్త వికార లక్షణములను అణచిపెట్టి యుంచుకొనగలరు. కావున "తయారుగ నుండుము" అను పదములు రెండును స్కౌట్లకు, సిపాయీలకును, సత్సంగులకును కూడ అన్ని సమయములలోను, అన్ని స్థలములలోను యుక్తమై యుండును.

తిరిగి యిట్లు సెలవిచ్చిరి : స్కౌటు గీతమును పఠించుడు. ఆ గీతములో నీ క్రింది చరణములకు హుజూరువారు గొప్ప ప్రాధాన్య మిచ్చి వానిని తిరిగి రెండవసారి పాడించిరి.

దీన దుఖారీ దేశ దేశ మేం।
బహు బిధి సే దుఖ పాతే హైం॥
కోఈ సజ్జన ఔర్ దేశ్ హితైషీ।
దుఖ ఉనకే అపనా తే హైం॥

ఇట్లు సెలవిచ్చిరి : ఈ గీతములో దేశములన్నిటిలోను ఈ కాలములో జనులు మహాకష్టముల పాలై అనేక విధ దుఃఖముల ననుభవించు చున్నారని వర్ణించ బడినది. ఆ జనుల దుఃఖములను తమ సొంత దుఃఖములుగ భావించగల సత్పురుషులు అరుదుగ నెవరో ఒక్కరు మాత్రమే యుందురు. వాస్తవముగ విశాల హృదయము గలవారే ఇతరుల దుఃఖములను బాధలను అవగాహన చేసి కొనగలరు.

నిస్సంశయముగ వాస్తవములో వారికి స్వయముగ నేమియు బాధ యుండనే యుండదు. అయినను ఇతరుల కష్టములను చూచినపుడు ఆ కష్టములు స్వయముగ తమకే కలిగినట్లు వారికి బాధ కలుగుచుండును. అట్టి సత్పురుషునికి దుఃఖము కలిగినపుడు భగవంతుడు దానిని పరిహరించు ప్రయత్నము చేయును. దుఃఖము నిస్సందేహముగ నితరులకే కలుగుచున్నను ఆ సత్పురుషునికి అది స్వయముగ తనకే కలిగినట్లు బాధ కలుగును. రోగ మెచ్చట నున్నదో మందు సరిగ నచ్చట వేసినపుడే ఆ మందు పనిచేయును. కావున నితరుల దుఃఖ ములను బాధలను వాస్తవరూపమున తెలిసికొన గలవారే సత్పురుషులు. అట్టి సత్పురుషులకే ఆ దుఃఖములను బాధలను నివారించగల శక్తి సామర్థ్యములు కూడ నుండును.

# 2

రెండు శబ్దములను పఠించిరి :

(1) ముసాఫిర్ రహనా తుమ హోశియార్ ।
నగోం నే ఆన బిఛాయా జాల్ ॥

(సారబచన్, బచన్ 15, శబ్ద 4)

(2) రాహ రపటీలీ సాఖ ఘుర దూర ।

(ప్రేమ బిలాస్, శబ్ద 8)

ఇట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు యుద్ధము సమాప్తమైపోయినది. ప్రతివ్యక్తియొక్క ఆదాయము నింతకుముందుకన్న నికమీదట తక్కువై పోవును. ఒక్క సత్సంగులకును దయాల్బాగు నివాసులకు మాత్రమే కాదు, ఉత్తరప్రదేశములోను భారత దేశములోను ఉన్న వారికి మాత్రమే కాదు, ప్రపంచములోని అందరి జనులకును ఆదాయము తగ్గిపోవును. కాని నేను మితవ్యయ హితోపదేశకుని హోదాలో మీకు ఇచ్చెడి సలహా యేమనగా మీరు ఖర్చులు ఇంతకుముందు కన్న బాగుగ తగ్గించుకొని అదుపులో నుంచుకొన వలయుననియే. అనగా దీని అర్థము మీ ఖర్చులు ఇతరులపైన పడవేయ వలయునని కాదు. మీరు యే ఖర్చులు అసలు కట్టిపెట్టగలరో వానిని పూర్తిగ కట్టిపెట్టికొనవలయు ననియే. అట్లు చేసినందువలన మీ నెలవారీ ఖర్చు మీ నెలసరి ఆదాయము కన్న తక్కువగ నుండునట్లు చేసికొన గల్గుదురు. అదికాక కొంతసొమ్ము భండారాల ఖర్చు నిమిత్తమును, కొంతసొమ్ము జబ్బులు చావులు వగైరా అవసరములకును వేరుగ నుంచుకొనవలయును. ఈ ఆవశ్యక ఖర్చులను మనసున నుంచుకొని అనావశ్యక ఖర్చులను వర్జించవలయును. ఈ విషయము చాల గంభీరమైనది. దీని గాంభీర్యమును తెలిసికొని అందుకు తగినట్లు తమ పద్ధతులను మార్చుకొనువారి కేమియు భయముండదు. భయపడవలసి యున్నచో మృత్యువునుండియే భయపడ వలయును. రాధాస్వామీ దయాళుని వలన కూడ భయపడవలసిన పని లేదు. ఏలననగా వారు మనయెడల ప్రేమభావమునే చూపుచుందురు. కావున వారివలన భయపడవలసిన ప్రశ్నకే తావులేదు. ఒక్క మరణమునుండి మాత్రము భయపడవలసినదే. ఏల ననగా నది అనివార్యము. అందరు నొకానొక రోజున తప్పక మృతిచెందవలసియే యున్నది. కాబట్టి చనిపోవకముందే మీ అనంతరము ఇంటి కార్యము లెట్లు జరిపించవలసి యున్నదో యింటిలోని వారికి తెలియజేయ వలయును. మరణానంతరము మనకందరకును ఉత్తమగతి కల్గునని యు నుత్తమ

లోకము లభించుననియు పరిపూర్ణ విశ్వాసమున్నది. కావున మనము చావు అనగా నొక చెడ్డపరిస్థితి యను కారణముచేత భయపడ నక్కరలేదు. కాని ఆ పరిస్థితి ఒకానొక రోజున తప్పక మనకును కలుగగలదను విషయమును పూర్తిగ విశ్వసించవలయును. భార్యకు మృత్యువు కలుగనై యున్నచో భర్త అందుకు సిద్ధముగ నుండవలయును. తనకే మరణ మాసన్నమైనచో భార్య తన భర్త మరణమునకై తయారుగ నుండవలయును. నేనిట్లు చెప్పుటలో నా అభిప్రాయము అమంగళమును సూచించుట యెంతమాత్రము కాదు. అందరు స్త్రీలు, పురుషులును తమ దృష్టికోణమును ఈ విధముగ మార్చుకొనవలయు నని మాత్రమే. మరణమును జ్ఞాపకముంచుకొని మనము స్వయముగ నందు కెల్లప్పుడు తయారుగ నుండి మనతో సంబంధించిన ఇతరులనుగూడ అందుకు తయారుగ నుండునట్లు చేయుటయే వివేకము. మీలో మృత్యువు అన్నచో భయ మెవరికున్నదని హుజూరువారు అప్పుడు అడుగగా, ఎవరును చేతులు ఎత్తలేదు. అపుడు దివ్యేచ్ఛకు ఈ క్రింది శబ్దము తీయబడినది.

ఆజ ఆఈ బహార బసంత ।
ఉమంగ మన గురు చరనన లిపటాయ్ ॥

(ప్రేమ బానీ, భాగ్ 3, బచన్ 16 (1) శబ్ద 1)

దివ్యేచ్ఛకు రెండవ శబ్దమును తీయగా ఈ క్రింది శబ్దము వచ్చినది.

క్యా సోచ కరే మన మేరే ఋతు ఆఈ బసంత్ ।

(ప్రేమ బిలాస్, శబ్ద 137)

ఇట్లు సెలవిచ్చిరి: ఈ సమయమున "అంత్" అనగా మరణమును గురించి చెప్పిన వర్ణన వినిన మీదట కొందరు సోదరులకును, సోదరీ మణులకును మనస్సున విచారమును బెంగయు కలిగియుండ వచ్చును. కాని ఈ శబ్దములను విన్నందు వలన నేమియు చింత కలుగనే కూడదు. నే నిప్పుడు ఈ విషయము చెప్పుటకు కారణము మీ యందరియందు నాకు ప్రేమ యుండి నందువలననే కాని మీకు భయము గలుగ జేయవలయునని కాదు. అందువలననే ఈ విషయము ఇపుడు మీ యెదుట ప్రస్తావించబడినది.

## 3

ఇట్లు సెలవిచ్చిరి: సత్సంగులు తరచు సేవ కొరకై ప్రార్థించు చుందురు;

ఎవరైతే అంతర్యమున భావపూరితులై హృదయ పూర్వకముగ సేవ చేయుదురో, అట్టి వారికే సేవ చేసినందువలన ఆనందము కలుగును. కాని ఇతరులను చూచి గతానుగతికముగ సేవలోజేరి, సేవా భావము అంతర్యమున లేకుండ నున్న వారికి ఆ సేవ నిష్ఫలమైపోవుటయే గాక ఆ సేవవలన నట్టి వారికి ఆనంద మేమియుకూడ కలుగనేరదు. సాహబ్జీ మహారాజువారు దయాల్బాగు స్థాపించిన పిమ్మట సేవా సమితి (League of Service) అను నొక సంఘ మును నెలకొల్పి అందులో కొందరు విశిష్ట వ్యక్తులను శరీర మనస్సులను పూర్తిగ అర్పణచేసి సేవచేయు నిమిత్తమై యెన్నుకొని చేర్చుకొనిరి. అందు వలన ఆర్. ఇ. ఐ. కాలేజీ, స్కూలు, టెక్నికల్ కాలేజి, పరిశ్రమలు స్థాపించ బడి అవన్నియు సవ్యమైన విధముగ నడచిపోవుచున్నవి. కాలము గడచిపోవు చున్నకొలది ఆ సమితి సభ్యుల సంఖ్య క్రమక్రమముగ తగ్గిపోవుట తప్పదు. ఏలనన, వారిలో కొందరు వయోవృద్ధు లగుట చేతను, కొందరు రోగగ్రస్తులై బలహీనులగుట చేతను సేవ చేయుటకు అశక్తు లయిపోవుటయు, కొందరు చని పోవుటయు జరుగుచుండును. ఈ విధముగ సమితి సదస్యుల సంఖ్య తగ్గిపోవుటచే తిరిగి ఆ ఖాళీలు పూర్తి చేయవలసియుండును. కావున ఆ ఖాళీలు పూర్తి చేయు నిమిత్తమై సత్సంగి సోదరీ సోదరులు సేవచేయుటకు ఆత్మసమర్పణ చేయుచుందురు. 1942వ సం॥రములో నేర్పాటు అయిన లీగ్ అనగా సేవా సమితి సభ్యులలో ఒక సభ్యుడు మాత్రము తగ్గి మిగతావారందరు నున్నారు. ఇంక నెవరికైనను సేవచేయు ఉత్సాహాసక్తులుండి, వారు ఈ సమితిలో జేర వలయునని కోరుచున్న యెడల, ప్రార్థనా పత్రములను వ్రాసి యివ్వవలయును. ఇప్పుడున్న సదస్యు లెవరైనను మరొకచోటికి పోదల్చుకున్నను లేదా పూర్తిగ బయటికి పోగోరినను, వారు తమ యుద్దేశ్యమును తెల్పవలయును. కాని వారి కోరికను మన్నించుటయు లేదా మన్నించక పోవుటయు, సభవారి యిష్టము మీదనే ఆధారపడి యున్నది. ఇంతవరకు సోదరీమణు లెవరును సేవాసమితి (లీగ్ ఆఫ్ సర్వీస్)లో సదస్యురాలుగ చేరలేదు. కాని కార్యకారణీ సమితి అంగీకరించిన యెడల ఆడవారు కూడ చేరవచ్చును. అయితే ఆ వ్యక్తి యొక్క పూర్వ ప్రవర్తనవలన ఆమె నిస్సంశయముగ సేవ చేయుననియు, అట్టి సేవా భావము ఆమెకు ఉన్నదనియు పూర్తిగ నమ్మకము కల్గిన యెడలనే ఆమె సదస్యు రాలుగ చేర్చుకొనబడును.

## 4

మోడల్ ఇండస్ట్రీస్ కార్ఖానాకు అవసరమున్న సామగ్రిని కాన్పూరు లోని అమెరికన్ డిస్పోజల్స్‌లో నుండి కొనుగోలుచేయు నిమిత్తమై ఆ కార్ఖానా

లోని నిపుణుని (Expert) ఎవరినైనను తనతో పంపించవలయునని కాన్పూరు తివారీగారు మనవి చేసికొనెను. శబ్దమును అడిగి మీరు కోరెడి విషయమును తేల్చెదమని హుజూరువారు సెలవిచ్చిరి. దివ్యేచ్ఛకు తీయించగా యీ క్రింది శబ్దము వచ్చినది :—

మిత్రి తేరా కోఇ నహీం సంగియన మేం ।
పడా క్యోం సోవే ఇన ఠగియన మేం ॥

(సారబచన్, బచన్ 15, శబ్ద 5)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దము మేల్కొలుపు శబ్దము.

"ఓ జీవుడా, తాము స్వయముగ వ్యాపారముచేసి లాభములను పొందుచు నిన్ను కూడ అట్లే చేయమని సలహా చెప్పుచుండెడి నీ తోటివారు నిజముగ నీ శ్రేయస్సు కోరువారు కారు. అట్టివారు పరమార్థమునుండి నిన్ను దూరముచేసి నీ చిత్తమును ప్రపంచములో చిక్కువడునట్లు చేసెడి మోసగాండ్రు. కావున నీవు మేల్కాంచి తెలివి తెచ్చుకొని ఈ అజాగ్రత్తను విడిచి పెట్టుము. సత్సంగమునందు భక్తి గలిగి ప్రవర్తించుము. నీ వట్లు చేసిన యెడల గురువుగారు నిన్ను ప్రేమరంగుతో నింపివేయుదురు. నీకు ఒక్క గురుమహారాజువారు తప్ప మరొక సహాయకులు లేరనెడి మాట మనస్సున గట్టిగ పెట్టుకొనుము. కావున నిరర్థకముగ జగజ్జాలములో చిక్కునపడి పోకుము" అని యీ శబ్దములో బోధ చేయబడినది. అప్పుడు ప్రేమీభాయీ తివారీగారు తాను ఎట్లు నడుచుకొనవలసినదో మార్గప్రదర్శన మిప్పించవలయునని అడిగిరి. శబ్దమును అడుగుము అని చెప్పి శబ్దమును తీయించగ, నీ క్రింది శబ్దము వచ్చినది.

దేఖో సబ్ జగ జాత బహా ॥

(సారబచన్, బచన్ 15, శబ్ద 10)

ఇట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములో గూడ మేల్కొలుపు హెచ్చరికయే యున్నది. ఈ ప్రపంచములో జీవుడు ఆశాతృష్ణలతో కూడిన వాసనలకు దాసుడై యున్నాడు. జన్మాను జన్మల నుండి దుఃఖములను అనుభవించిన పిమ్మట, ఇప్పుడు మనుష్యజన్మ లభించినది, గురు సాంగత్యమును లభ్యమైనది. కావున నిపుడు భక్తి చేసికొనవలసిన తరుణము. ఇప్పుడు తోవతప్పి గురుభక్తి చేసికొనకుండ సాంసారిక ప్రవాహములో పడి కొట్టుకొని పోయిన యెడల నీ అపరాధము క్షమింపబడ నేరదు. ఇప్పుడు నేను నడిపించుచున్న వ్యాపారమును సాగించవచ్చునా లేక కట్టిపెట్ట వలయునా యని తివారీ అడుగగా, హుజూరువారు

"నే నిప్పుడు క్రొత్త పనిని దేనిని ముట్టుకొనుట లేదనియు, నేను వ్యాపారములోను, పరిశ్రమలలోను చేయగోరిన అభివృద్ధి నంతను యుద్ధ సమయములోనే పూర్తి చేసి కొంటిననియు, ఇప్పుడిక అభివృద్ధి చేయు ప్రణాళికను పూర్తిగా కట్టి పెట్టి వేసితిమనియు సెలవిచ్చిరి. పైగా, యెచ్చటనైన పనికి ఆటంకము కల్గినపుడు ఆ పనిని అంతటితో ముగించుచున్నామనియు, మీరు ఇపుడు సామాన్యముగ చేయుచున్న వ్యాపారమును చేసికొనుచుండవచ్చును. కాని యెక్కువ లాభము సంపాదించ వలయునను భ్రమలో పడిపోవలదనియు సెలవిచ్చిరి. తిరిగి యిట్లు సెలవిచ్చిరి: "దయాల్బాగు తరఫున అస్సాములో పరిశ్రమలు తెరవవలయునని కొందరు నాకు సలహా యిచ్చిరి. మీరు ఈ విషయమై శబ్దమును అడిగి అది యేమి చెప్పునో తెలిసికొనుడు." శబ్దము దివ్యేచ్ఛకు తీయగా యీ క్రింది శబ్దము వచ్చెను:

కాల నే జగత అజబ్ భర్మాయా।
మైం క్యా క్యా కరూం బఖాన్ ॥

(సారబచన్, బచన్ 8, శబ్దము 17)

ఆఖరి చరణ మిట్లున్నది.

రాధాస్వామీ జోర దేయ కర్ ।
గురుభక్తీ కో కహేం ప్రమాణ్ ॥

ఇట్లు సెలవిచ్చిరి: దీనికి అర్థ మేమనగా, జనులు ప్రపంచము యొక్క భ్రమలు మోసములలోను పడి యున్నారనియే. కాలు డీ ప్రపంచమునంతను భ్రమింపచేయుచు జీవులను విద్యాబుద్ధి కౌశలముల గందరగోళములో పడవేసి సన్మార్గము నుండియు గురుభక్తి నుండియు విముఖులగునట్లు చేయుచున్నాడు. తిరిగి యిట్లు సెలవిచ్చిరి: మీకు అస్సాము ప్రాంతమునకు వెళ్ళవలయునను కోరిక యున్నచో ఆ దేశపు ప్రజలు అపభ్రమలలోపడి, అపమార్గమున పోవుచున్నందున వారికి సంతు మతము యొక్క శిక్షా లాభము గలుగజేసి సత్సంగము యొక్కయు, సద్గురు భక్తియొక్కయు ఆనందలాభము కల్గించవలయునను తలంపుతోనే వెళ్ళవలయును. పిమ్మట ఇట్లు సెలవిచ్చిరి: సత్సంగములో ఇండస్ట్రీస్ స్థాపించుటలో ఉద్దేశ్యము ధన సంపాదన కాదు. పరోపకారము చేయవలయు ననియే. అనగా జనులకు ఆ విధముగ సాంసారిక కష్టముల నుండి విముక్తి కల్గి వారు భక్తి చేసికొనగల్గు లాగున జీవనోపాధి సంపాదించుకొను ఏర్పాటు కలుగచేయవలయుననియే. అందువలన అస్సాములో దయాల్బాగు కార్య కలాపము వ్యాపింపజేయు సమయము వచ్చినపుడు ఈ పారమార్థికోద్దే

శ్యము ప్రధానముగ సాధించు నిమిత్తమై అచ్చట యెట్టి వ్యాపారము పరిశ్రమలు పెట్ట వలయునో అట్టి పరిశ్రమయు వ్యాపారము మాత్రమే అచ్చట స్థాపించబడును. ఆ కార్యక్రమము యొక్క ఉద్దేశ్యము ఎప్పుడును పరమార్థ ప్రధానముగనే ఉండును.

## 5

నవంబరు 1946 :– హుజూరువారు హెడ్‌మాస్టరుగారితో, ఉదయము పూట విద్యార్థులచేత వ్యాయామము చేయించుట ప్రారంభించవలయునని సెలవిచ్చిరి. తిరిగి అందరిని మీరు వ్యాయామము చేయుట యెందుకు కట్టిపెట్టితిరని ప్రశ్నించిరి. పట్టణములలో అన్ని స్థలములలోను అశాంతి వ్యాపించిపోవుచున్నది. మీరు మీ సొంతబలము మీద ఆధారపడి స్వకీయ రక్షణకై యేర్పాటు చేసికొనకుండినచో మీకు పై నెచ్చటి నుండియో మీ సంరక్షణకై సహాయము రాగలదని యెట్లు ఆశపెట్టుకొనగలరు? ఒక వ్యక్తి తనకు సమయము లభించుట లేదని చెప్పుకొనెను. అందుకు సమాధానముగ నిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు మీకు తీరిక లేదు. నిస్సంశయముగనే అట్లైనచో మీకు అట్టి యవసరము కల్గినపుడు మాత్రి మెట్లు తీరిక కలుగును? ఈ మధ్య సమయము వ్యర్థముగ పోవుచునే యుండునుకదా! మీ నిమిత్తమై సమయము ఆకసము నుండి వచ్చిపడదు కదా. మీ సహాయార్థమై మీరే స్వయముగ నేర్పాటు చేసికొనవలసినదే. తిరిగి యిట్లు సెలవిచ్చిరి : మీరు తప్పనిసరిగ ప్రతిదినము వ్యాయామము చేయుచుండ వలయును. ఉదయము చలి యెక్కువగ నున్న యెడల మీరందరు సాయంకాలము ఎచ్చటనైన కలసి వ్యాయామము చేయవలయును. ప్రతిదినము చేయజాలని యెడల ఒక్కొక్క రోజు మధ్యన అపుజేసి మిగత రోజులలోనే చేయవచ్చును. కాని ప్రతి సత్సంగీ సోదరుడును సోదరియును వ్యాయామము అవశ్యముగ చేయవలసియే యున్నది.

## 6

1946 డిసెంబరు నెల 18వ తేదీని దయాల్బాగ్ ఆహార విభాగోద్యోగి (Food Officer) దయాల్బాగు కాలనీలోని జనులు మిగిలిపోయిన ఆహార పదార్థములను బయట పారవేయుచున్నారని ఫిర్యాదు చేసిన మీదట హుజూరువారిట్లు సెలవిచ్చిరి : నా అభిప్రాయములో ఏ పదార్థమును పారవేసినను అపరాధమే. అందులో ముఖ్యముగ ఆహార పదార్థములను నష్టపెట్టుట మహాపరాధము. ఈ కాలములో జనులకు పదార్థములు లభించకను, ధరలు పెరిగి పోవుచును ఉండుటచే కష్టములు కల్గుచున్న వసగా, ఇదంతయు

పదార్థములు వ్యర్థముగా పాడుచేయునట్టి మన చెడు అలవాట్లు పోగొట్టు నిమిత్తమై భగవంతుడే చేసిన యేర్పాటు. దీనినిబట్టి చూడగ మనము ఆహార పదార్థములను, ఇతర వస్తువులను పాడుచేసెడి చెడు అలవాట్లను దిద్దుకొనకుండ నున్నంతకాలము ఈ ధరల పెరుగుదలయు వస్తువుల అలభ్యతయు నెప్పటియట్లు పెరిగిపోవుచునే యుండునని తేలుచున్నది. మొదటి విషయము భోజనము చేయుచున్నప్పుడు ఆహార పదార్థ మెద్దియు మిగిలిపోకుండు లాగున ఎంత అవసరమో అంతయే పెట్టించుకొనవలయును. ఏదైనను మిగిలిపోయినచో దాని నేదైన పక్షికిగాని, జంతువునకు గాని పెట్టవలయును. కాని యెన్నడు నెట్టి పరిస్థితిలోను వ్యర్థముగ నష్టము చేయకూడదు.

# 7

22 డిసెంబరు 1946 : దివ్యేచ్ఛకు ఈ క్రింది శబ్దము తీయబడినది.

గురు కే దరస పర్ మై బలిహారీ।
గురు కే చరన మేరే ప్రాణ అధారీ॥
గురు కా సంగ కర ఛిన ఛిన ప్యారీ।
గురు కా రంగ లే నైన నిహారీ॥

(సారబచన్, బచన్ 4, శబ్ద 7)

ఇట్లు సెలవిచ్చిరి: "గురు కా రంగ లే నైన నిహారీ" అను వాక్యమునకు అర్థ మేమనగా, గురువుగారి యుద్దేశ్య మేమిటో వారు తాత్కాలికావసరములను బట్టి యే పద్ధతుల నవలంబించ గోరుచున్నారో కనిపెట్టుచుండ వలయుననియే. వారి యిష్టమును ఉద్దేశ్యమును అనుసరించియే మనము కార్యక్రమను సాగించవలయును. వారు మద్రాసు ప్రాంతములో పని సాగించగోర వచ్చును. లేదా అస్సాము ప్రాంతములోనైనగాని, మరెచ్చోటనైననునిగా పని జరిగించ గోరవచ్చును. కండ్లు అసలే లేనివారికిని, బుద్ధిపూర్వకముగ కండ్లు మూసుకున్న వారికిని గురు మహారాజువారి దివ్యేచ్ఛ అర్థము చేసికొనుట కష్టము. కాని ఇతరుల కందరికిని అది తెలిసికొనుట చాల సులభమే. ఎవరైనను పూర్వాచారములలోను, బంధనములలోను చిక్కుకొని పోయి, వానినుండి తప్పించుకొనుటకై యెన్ని ప్రయత్నములు చేసినను వారికి సాధ్యము కానిచో ఆ పూర్వ బంధనములను కత్తిరించి పారవేయుటయే దానికి ఉపాయము. అనగా అట్టి వారికి తమ ప్రస్తుత శరీరమును విడిచి క్రొత్త సంస్కారములతో మరొకజన్మ

మెత్తుటయే ఉపాయము. ఇట్లు సెలవిచ్చిరి: రాధాస్వామీ దయాళువు, సద్గురువు, సత్సంగియొక్క ఆత్మయు జీర్ణోద్ధారము విషయములలో నీ ముగ్గురు నెవరి కర్తవ్య ధర్మములను వారు నిస్సంశయముగ నిర్వర్తించుకొనుచునే యుందురు. అనగా ఆత్మ అభ్యాసమును చేసికొనుచుండును. సద్గురువు సహాయము చేయుచుందురు. రాధాస్వామీ దయాళువు ఉద్ధారమును ఇచ్చుచుందురు. ఈ విషయములో ఇండస్ట్రీస్‌కిని కాలేజీకిని ప్రమేయ మేమియు లేదు. ఉద్ధారము కావించుటకై వాని అవశ్యకతయే లేదు. కాని నేను మిమ్ములనొక విషయమును ప్రశ్నించుచున్నాను. అదేమనగా హుజూర్ సర్కార్ సాహెబ్ వారు రాధాస్వామీ సత్సంగ సభను స్థాపించినది యెందులకు? సభయొక్క పని యేమి? అనియే. సంఘ సంస్కరణము గావించుటయు, జనులను సన్మార్గమున నడిపించుటయు, సత్సంగము యొక్క ఆస్తిని జాగ్రత్తగ చూచు ప్రబంధము చేయుటయును గూడ సభయొక్క కార్య కలాపములో చేరియున్నవి. అంతట సర్దార్ జంగీరసింగ్ "నేను ముసలి వాడను, బీదవాడను, అశక్తుడను కదా! నేనీ కార్య ప్రణాళికలో నెవ్విధముగ పాల్గొన గల్గుదును" అని అడిగెను. అంతట హుజూరువారు "మీరు మీ మనస్సున ఉత్తమ భావముల నుత్పన్నము చేసికొని ఇతరుల యుత్సాహమును వృద్ధిపొందించ వచ్చును." అని సెలవిచ్చిరి.

# 8

1946 డిసెంబరు 23 వ తేదీ సాయంకాల సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి: ఒకరికి తినుట ఆనందముగ నున్నచో మరొకరికి ఇతరులు తినుచుండగ చూచుట ఆనందకరముగ నుండవచ్చును. ఏది యెట్లున్నను, ఇప్పుడు భోజనము ప్రారంభించకముందు కొన్ని ముఖ్య విషయములను నోటు చేసుకొనవలసియున్నది. అవెవ్వి యనగా స్టోర్సు డైరెక్టర్లు, ప్రబంధకులు వగైరా కార్యకర్త లందరును ఇచ్చట సరకును చూచుకొని, అందులో వారికి కావలసిన సరుకు నోటుచేసికొని, వారు వెనుకకు వెళ్ళిన తరువాత బయటనుండి ఆ సరుకులకై ఆర్డర్లు సంపాదించి యిచ్చటనుండి వారా సరుకును తెప్పించుకొనవలయును. రెండవది మీ కొట్టులో నేదైన సరుకు ఖరీదు హెచ్చుగ నుండుటచే అమ్మకము గాకుండ నుండిపోయినను, లేదా యేదైన సరుకులో మీ సొమ్ము చిక్కుకొని ఆ సరుకు చలామణి గాకుండ నుండిపోయినను, మీరు దానిధర కొంత తగ్గించి అమ్మవలయును. లేదా, ఆ సరుకు మరొక స్టోర్సులో దేనిలోనైన అవసరముగ నుండి అచ్చట అమ్ముడై పోవులాగున నున్న యెడల అట్టి స్టోర్సుకు పంపించ వలయును. ఈ విధముగ నిలువయుండిపోయిన సరుకు విడుదలై పోగలదు. మూడవ

విషయమేమనగా మీరు మీమీ పట్టణములలోని అధికారులకును, ఆఫీసులలో ఉద్యోగస్థులకును, స్కూళ్లు కాలేజీలలోని ఆచార్యులు, ప్రధానాచార్యులకును, విద్యార్థులకును ఇచ్చటి సరుకులు కొనుటకై ఆసక్తియు, ఉత్సాహము కలుగు నట్లు చేయవలయును. వారందరికి ఇచ్చటి సరుకు కొనుగోలు చేయుట వలన సంఘమునకు సమస్త జాతికిని గూడ లాభదాయకముగ నుండునని నమ్మకము కలిగించవలయును. బయట కొనుటకన్న ఇచ్చటి సరుకు కొనుటలో చవుక కూడ నుండునని వారికి నచ్చచెప్పవలయును. దేశప్రేమయు స్వదేశవస్తువుల యందభి మానమును గలవారికి ముఖ్యముగ మీరు ఇచ్చటి సరుకులు చూపించి వారికి మన సరుకులయందు అభిమానము కలుగునట్లు చేసికొనవలయును. ఈ విధముగ మీరు మీమీ స్థానములలో మన సరుకులయం దభిమానము సంపాదించుకొన్న యెడల మనసరుకు చాల సులువుగ చలామణి అయిపోవును.

## 9

1946 డిసెంబరు 31 తేదీ సాయంకాలము శబ్ద పాఠమైన పిదప సెలవిచ్చిరి: ఈ సంవత్సర మిప్పుడు అంతమై పోవుచున్నది. ఇంకను ఐదు లేదా ఐదున్నరగంటలు మాత్రమే మిగిలి యున్నవి. మీరు ఈ సంవత్సరము అంతము అగుటకుముందే ఈ సంత్సరము లెక్కలు సరిచూచుకొని యెట్లున్నదో తెల్సుకొనవలయును. అనగా మీ. రిప్పుడు కొన్నసరుకు లేదా ఈ సంవత్సర ములో కొన్నసరుకునకు సంబంధించినంతవరకే మీరాలోచించుకొన వలయు నని నా అభిప్రాయము కాదు. మీరందరు మీ లెక్కలన్నియు మీ వ్యాపార సరళినంతను గురించియు సింహావలోకము చేసికొనవలయు ననియే మీరీ సంవత్స రములో నడచుకొన్న ప్రవర్తనము, వ్యవహార సరళియు మీ మనసునకు నచ్చి సరిగనే యున్నట్లు అనిపించిన యెడల, మీరు రాబోవు సంవత్సరమునకు ప్రణా ళిక యేర్పాటు చేసికొనుడు. వీలు అయినంతవరకు రాబోవు సంవత్సరములో మీ వ్యాపారము ఈ సంవత్సరముకన్న నెక్కువ చురుకుగను ఎక్కువ ప్రశస్త ముగను ఉండునట్లు ప్రణాళికను తయారు చేసికొనుడు. అట్లుగాక, ఈ సంవత్స రము మీ వ్యాపార సరళి సరిగలేకుండ, మీనడతలో తప్పిదములు, పొర పాట్లును ఉన్నయెడల మీరు అందువిషయమై పశ్చాత్తాపపడి రాబోవు సంవత్స రములో ఇంతకన్న నెక్కువ సవ్యముగ ప్రవర్తించు లాగున ప్రతిజ్ఞ చేసికొన వలయును. మీకు నేను చెప్పదల్చుకొన్న రెండవ విషయ మేమనగా. మీరు ఇతరులకు సహాయము, సేవయు చేయుటకు దృఢ నిశ్చయము చేసికొనవలయును. ఇంతవరకు గడచిన రోజులెట్లున్నవో రాబోవు సంవత్సరములో నవి అట్లేయుర

డునో లేక అంతకన్న నెక్కువ గడ్డుగనుండునో చెప్పజాలము. కావున మీరు పరస్పరము సానుభూతి సహాయములు చేసికొనుచు, ప్రేమభావము, సేవా భావముతోను ప్రవర్తించుచున్న యెడల కష్టములు, ఆపత్తులు, వచ్చినను మీకు అవి అంత దుఃఖప్రదము గాకుండగను, మీ సహనశక్తి మించకుండగను ఉండ గలవు. అట్లుగాక మీరు కేవలము స్వలాభమే ప్రధానముగ ప్రవర్తించిననాడు అవి చాలా బాధకరముగ నుండగలవు. ఆఖరుమాట మూడవది, అన్నిటికన్న నెక్కువ గంభీరమైనట్టియు అత్యవసరమైనట్టియు విషయ మేమనగా, మీరు ప్రతి క్షణము సర్వకాల సర్వావస్థలయందును రాధాస్వామీ దయాళుని ధ్యానము చేసికొనుచు, వారి చరణములందు భక్తి ప్రేమలను వృద్ధిచేసుకొను చుండవలయును. అట్లే చేసిన యెడల వారును మీ భక్తిజూచి ప్రసన్నులై, అందరియందు దయ జూపి, అందరిని తమచరణములందు చేర్చుకొనగలరు.

# 10

జనవరి 1947 న ఇట్లు సెలవిచ్చిరి: మీకు ఆంతర్యమున దర్శనము కాని ఏదైన మరొక అనుభవము కాని కల్గిన యెడల అవన్నియు ఆ పరమ శక్తి మీకు మహాదయతో నిచ్చిన వరదాన మనియే తెలుసుకొనవలయును. ప్రతి జీవుని ఆంతర్య పరిస్థితియు ఆ పరమ శక్తికి విదితమే. ఆ పని ఒక మనుష్య మాత్రుని వశములో నున్న విషయము కాదు. ఉదాహరణకు మీ కెవరికైనను ఆంతర్య దర్శనము లభించిన యెడల ఆ దర్శన మిచ్చిన వ్యక్తి మీ వద్దకు స్వయముగ వచ్చిరని అర్థము కాదు. ఆ వ్యక్తి తన స్వస్థలముననే యుండును కాని ఆ యేర్పాటు అంతయు ఆ పరమశక్తి చేతనే చేయబడినది. ఈ మాట సరియైనప్పుడు మీరు పారమార్థిక విషయములలో తరచుగ పెద్ద పెద్ద ఉత్తర ములు వ్రాయుటయు, ఎక్కువ సంభాషణ చేయు నిమిత్తమై అవకాశము కోరుటయు కేవలము నిరర్థకమని అంగీకరించవలసి యున్నది. ఆ పరమశక్తి నీ ఆంతర్యముననే విరాజమానమై యున్నది. మీరు యథావిధిగా నా పరమ శక్తి సమక్షమున నొకటి రెండు సార్లు ప్రార్థన చేసి సమాధానమునకై వేచి యుండవలెను. ఆ ప్రార్థన మీకు శ్రేయస్కరమైన యెడల అవశ్యముగ అంగీక రించబడును. అట్లు చేసిన యెడల బాహ్యకార్యక్రమము అనగా బాహ్యముగ ఉత్తర ప్రత్యుత్తరములు వ్రాసుకొనుటయు బాహ్య సంభాషణయు అనవసర మైపోయి ఆంతర్య సంబంధము దృఢ పడును. ఇట్లు సెలవిచ్చిరి : ఈ మధ్య నా కొక సత్సంగి వద్ద నుండి ఉత్తరము వచ్చినది. అందులో నతడు ఒక వ్యక్తిని గురించి ఆయన వచనములు చెప్పుట లేదు. పవిత్ర గ్రంథములను వ్రాయుట లేదు.

సద్గురువుని ధర్మము లెన్నియు కూడ నెరవేర్చుటలేదు. ఆయన సద్గురు వెట్లు అగుననని ఆక్షేపణ చేసెను. ఈ ఆక్షేపకుడు కూడ సద్గురువుని కార్యక్రమమును ఒక ప్రత్యేక మానవుడే చేయుచున్నాడనెడి అపభ్రమలో పడి యున్నాడు. సద్గురు కృత్య మంతయు రాధాస్వామీ దయాళురే నిర్వహించుచున్నారు. అది యొక మానవుడు చేసెడి పనికాదు. అందు నిమిత్తమై ఏ మానవునికిని శ్లాఘ కాని ధన్యవాదములు కాని యివ్వనవసరము లేదు.

అప్పుడు దివ్యేచ్ఛకు ఈ క్రింది శబ్దమును తీసి చదివిరి.

సతగురు ప్యారే నే గిరాయా।
కాల కరాఖా హో॥

(ప్రేమబానీ. భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 22)

# 11

27 జనవరి 1947 : వసంత పంచమి రోజున ఒక శబ్దమును సత్సంగములో చదివిరి. ఆ శబ్దమును తిరిగి చదివించి, యిట్లు సెలవిచ్చిరి : మనము బాహ్య కృత్యములకన్న ఆంతర్య కార్యక్రమము, ఆంతర్య విధానములను గురించియు నెక్కువ శ్రద్ధ వహించవలసి యున్నది. బొట్లు పెట్టుటయు, ప్రసాదమును పంచుటయు నిట్టి కార్యములన్నియు బాహ్య కృత్యములు. అంతట లాల్జీ ప్రసాదు గారు ఇట్లు అనిరి : "ప్రసాదము తీసికొనుట ఆంతర్య కార్యమే. ఏలనన, అందులో ఆధ్యాత్మిక వికాస లాభమున్నది కదా !" హుజూరువారిట్లు సెలవిచ్చిరి : మీరు బలవంతముగ మీ యిష్టానుసారము ప్రసాదము దొరికినదని యనుకొనుచు సంతోషపడి తృప్తి పడవచ్చును. కాని ఇచ్చెడి ప్రభువు మీకేమైన నిచ్చిరో, లేక ఉత్త తినుబండారము మాత్రము యిచ్చి మిమ్ములను సంతుష్ట పరచిరో యెవరికి తెలుసును. వారు స్వేచ్ఛతో స్వయముగ మీకు ఇచ్చినపుడే అది అసలైన ప్రసాదమగును. వారివ్వదల్చుకొన్న యెడల బాహ్యముగ నెద్దియు నివ్వనక్కర లేకుండగనే అసలు ప్రసాదము నివ్వగలరు. దూరము నుండి ఒక దృష్టి ప్రసారముతో ప్రేమదానము నివ్వగలరు. అట్లుగాక వారి కెద్దియు మీ కివ్వవలయునని లేనపుడు మీరు వారిని బలవంతపెట్టి యేమైనను తీసికొన్నను, అందువలన మీకేమియు ఫలితము సేకూరనేరదు. ఒక్క సమయమున వారు పైకేమియు నివ్వనట్లే కనపడుచుందురు. కాని సర్వము నిచ్చివేయుచునే యుందురు. పై ఆడంబరముతో కూడిన కార్యకలాపమువలన ఆధ్యాత్మిక లాభ మేమియు లభించనేరదు.

# 12

1947 ఫిబ్రవరి 3వ తేదీని సాయంకాలము సత్సంగములో నిట్లు సెల విచ్చిరి: రబీ పైరులు బాగుగ పెరిగి త్వరలోనే కోతకు తయారు కానై యున్నవి. మీలో నెవరెవరు ఈ సంవత్సరము పంట కోతలలో పాల్గొనుటకు ఇష్టపడుదురో చేతులు ఎత్తుడు. చాలమంది చేతులెత్తిరి. ఇట్లు సెలవిచ్చిరి: వీరందరు క్రితము సంవత్సరములలో గూడ శ్లాఘనీయముగ పనిచేసిరి. ప్రతి వ్యక్తియు వారి వారి శక్త్యనుసారముగ నీ శుభకార్యములో పాల్గొనిరి. అట్లు చేయలేకుండ నుండిపోయిన వారు తా మీసేవలో పాల్గొనలేక పోయితిమని విచార పడుచుండిరి. ఇప్పుడు యంత్ర సామగ్రి వచ్చిన యెడల మీకు శ్రమ చాలవరకు తగ్గిపోవును. ఇంతవరకు కోతలు సాగించెడి యంత్ర సామగ్రి లభ్యము కాలేదు. అందుచే ప్రస్తుతము చేతులతోనే పని చేయవలసి యున్నది. ఈ కాల ములో దయాల్బాగు చుట్టును తయారై యున్న పచ్చని పంటలు చాల మనో హర దృశ్యముగ కన్పట్టుచున్నవి.

# 13

పిల్లలు సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి:

సమర్థు మోహిం ఆఈ ఆజ గురు బాత్ ।

(ప్రేమవిలాస్, శబ్ద 120)

అటుపిమ్మట నీ క్రింది శబ్దమును చదివిరి:

గురు కో ఊపర ఊపర గాతా ।
గురు కో దిల భీతర నహీం లాతా ॥

(సారబచన్, బచన్ 31, శబ్ద 8)

శబ్ద పాఠానంతరము హుజూరువారు పిల్లలను "మీరు పరీక్షలలో నుత్తీర్ణులైన పిదప నేమి చేయదల్చుకున్నార"ని 8వ క్లాసు, 10వ క్లాసు, 12వ క్లాసు పిల్లలను ప్రశ్నించిరి.

తిరిగి ఇట్లు సెలవిచ్చిరి: మీరు ఇప్పుడు చదివిన "సమర్థు మోహిం ఆయీ ఆజ గురు బాత్" అనెడి శబ్దమును పైపైకి మాత్రమే చదివితిరా, లేక దాని భావమును గూడ అర్థము చేసికొనిరా? చదువుట చాల సులభమైన పని,

విద్యాభ్యాసము నొందుట యీ కాలములో ఒక గొప్ప కార్యము కాదు. పని యనగా అసలు చేతితో చేయు పనియే. యథార్థముగా కృత్యము అనుమాట చేతితో చేయు పనికే వర్తించును. మీ రేదైన చేతిపని చేయుటయే శ్రేష్ఠము. ఇంకను పై చదువు చదువకోదల్చుకొన్న వారుకూడ ఏదైన చేతిపని చేయవలయును. రాబోవు ఆదివారమునాడు తిరిగి ఈ ప్రశ్నయే మీ యెదుట పెట్టబడును. చేతిపని చేయదల్చుకొన్నవారికి వారియొక్క ఆర్థిక పరిస్థితి చక్కచేయునట్టి లాభదాయకమైన చేతి పరిశ్రమ చెప్పగలము. అప్పుడు హుజూరువారు ప్రసాదములు ఎగురవేసి అందరికి పంచిపెట్టులాగున మహా దయ చూపిరి.

## 14

ప్రేమీ భాయీ మన్‌సుఖానీగారి పుత్రుడు వాయు విమానములో [పైలెట్] వైమానికుడు కావలయునను కోరికతో నుండెను. ఒకనాడు సాయంకాలము సత్సంగములో మన్‌సుఖానీగారు అందుకు అనుమతి గోరెను. హుజూరువారొకశబ్దమును దివ్యేచ్ఛకు తీయించగా ఆ పనిలో చేరవలదను సూచన జేయు శబ్దము వచ్చినది. కొద్దిసేపు ఆగి మన్సుఖానీగారు మరొకసారి దివ్యేచ్ఛకు తీయించవలసినదని ప్రార్థించిరి. దివ్యేచ్ఛకు తీయగా యీ క్రింది శబ్దము వచ్చినది :

నామ రస చఖా గురూ సంగ సార ।
కామ రస ఛోడా దేఖ అసార ॥ (1)
నామ కా మిలా ఆజ భండార ।
లోభ కో టాలా జాన కంగార ॥2॥
నామ ధన పాయా గగన నిహార ।
మగన హోయ బైఠే తజ అహంకార ॥ 5 ॥

శబ్దానంతర మిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దము నాకు మరేమియు చెప్పుటకు అవకాశము లేకుండ చేసినది. ఇందులో చెప్పకుండ విడిచిన దేదియు లేదు. ఇందలి బోధ చాల విస్పష్టముగ నున్నది. లోభము దరిద్రమని తెలిసికొని పరిత్యజించవలసినదే.

## 15

తేజః స్వరూపులైన హుజూరువారిట్లు సెలవిచ్చిరి : దయాల్బాగులో వచనములు చెప్పుట లేదని మనలను కొందరు ఆక్షేపణ చేయుచున్నారు.

హుజూర్ సాహబ్జీ మహారాజువారు భగవంతుడు తన కార్యమును, ఉద్యమమును ఎవ్విధముగ కావలెనన్న నవ్విధముగనే నెరవేర్చుకొనగలడని సెలవిచ్చుచుండిరని మీ కందరకు విదితమే కదా! వారికి అట్లు చేయుటకై జీవుల యిష్టానిష్టములపైన ఆధారపడ నవసరము లేదు. మరి యీ ఆక్షేపకులు ఎంచెడినెప మెట్లు సరియగును? వచనములు చెప్పుట యనెడి కార్యక్రమము ఆధ్యాత్మిక మార్గములో కొంత హద్దు వరకు మాత్రమే లాభకరము కాని అంతర్యమున సమగ్రమైన ఆధ్యాత్మిక పరివర్తనము సంపాదించుటకై సాధనయే ముఖ్యము.

ముందు ముందు సత్సంగములో మరొక క్రొత్త విధానము అవలంబించబడినపుడు కూడ ఇప్పుడు వచనములు చెప్పకుండ సత్సంగ ప్రణాళికను పూర్తి చేయు విధానమును ఎట్లు అనుచితమని ఆక్షేపించుచున్నారో, అట్లే ఆ క్రొత్త పద్ధతిని గూడ అనుచితమని ఆక్షేపణ చేయగలరు. ఒక్కొక్క సమయములో కార్యక్రమ విధానము ఒక్కొక్క ప్రత్యేక విధముగ నుండును. ప్రతి సమయమునను ఇదే విధమైన ఆక్షేపకులు నుందురు. అయినను ప్రతి సమయమందును కొంతకాల మగుసరికి అట్టి ఆక్షేపణ లన్నియు నశించిపోవుటగూడ మనము చూచుచునే యున్నాము.

కోటి రూప్యముల విలువగల సరుకును తయారుచేయుటకై హుజూరు సాహబ్జీ మహారాజువారు ఏర్పాటు చేసిన ప్రణాళికను పూర్తి చేయుటకై ఇండస్ట్రీస్ అభివృద్ధిచేసి క్రొత్త స్టోర్సులను తెరచుట అవసరమని యెంచబడినది. ఇప్పుడు దేశములో మనము వివిధ స్థలములలో తెరచిన స్టోర్సులను, ఆ యా స్టోర్సుల కార్యకర్తలు తమ సొంత సొత్తుగ భావించుకొనకుండ వానిని నియమబద్ధముగ నడిపించుచు జమాఖర్చుల లెక్కలును, కొనుబడులు, అమ్మకముల లెక్కలును సరిగ నుంచుచు, కష్టపడి ధారాళముగను, సేవాభావము, ఆత్మ సమర్పణ భావముతోను పనిచేసిన యెడల రెండు, మూడు, సంవత్సరముల లోపుననే మన ప్రస్తుత కార్యక్రముముద్వారా సంఘముయొక్క పరిస్థితి అద్భుత పరిణామము పొందగలదని నాకు పూర్ణ విశ్వాసముకలదు. ప్రతి స్టోర్సును అమ్మకములు, కొనుబడులు మాత్రమే కాకుండ తమతమ స్థలములలోని స్థానిక పరిశ్రమలను అభివృద్ధి చేయుచున్నయెడల ఆ స్టోర్సులే ఒక కార్ఖానాగ తయారై పోగలవు. ఆ విధముగ పనిచేయుచున్న స్టోర్సు లెన్ని ఉన్నవో అన్ని కార్ఖానాలు స్థాపితము కాగలవు.

# 16

సాయంకాలము సత్సంగములో హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి : స్వాతంత్ర్యమునకు ప్రతికూలశబ్దము బంధనము. ఇచట నేను చెప్పదలచు కొన్నది ఒక విశిష్టరూపమైన బంధనమును గురించియే. కావున ఒక్క మాయ యొక్క బంధనను గురించి మాత్రమే నే నిపుడు వివరించెదను. గృహముయొక్క బంధనముకూడ మాయికబంధనమే. ఏలననగా అట్టి బంధనముగల మానవుడు రోజంతయు ఇంటి నుండి బయటకు వెళ్ళి చేయవలసిన దైనిక కృత్యములను సరిగ నెరవేర్చగలడని యెట్లు చెప్పగలము? యేలనన అతని మనస్సులో తన గృహమును గురించిన చింతలే రోజంతయు బయల్వెడలు చుండును. అతనికి తన కృత్యములను నెరవేర్చుకొనుటకుగాని, వానిని గురించి స్వేచ్ఛగ నాలోచించుకొనుటకుగాని, ఆ బంధనము అతనికి స్వాతంత్ర్యము లేకుండచేయును. అతడు ఇల్లు విడిచి బయటకు వెళ్ళి స్వేచ్ఛగా ఆలోచించుకొనలేడు. "ఇది నా ఇల్లు, నేను దీనిని సుఖశాంతులు కల్గించుకొను నిమిత్తమై కట్టుకొంటిని." అనెడి తలంపే అతని మనస్సులో నెల్లప్పుడు రేకెత్తుచుండును. ఒకానొక పెద్దమనుష్యునికి తనయిల్లు సభకు అర్పించుట యిష్టము లేదనియు, కాని ఆయన తనయిల్లు ఎవరికి యివ్వదలచుకొనెనో ఆయన ఆ యిల్లును తీసికొనుట కిష్టపడలేదనియు మాకు తెలిసినది. ఇది గృహముతో బంధనము గాక మరేమగును? మరికొందరు పెద్దమనుష్యులు "మేము మా యిల్లు ఎట్లు ఖాళీ చేయగలము. హుజూర్ సాహబ్జీ మహారాజువారు మాకును, మా తర్వాత మా పిల్లలకు, మనుమలకు, మునిమనుమలకును అందు నివసించు నిమిత్తమై ప్రసాదరూపముగ నిచ్చిరి." అని చెప్పుచున్నారట. అయితే వారు మొదటలో దయాల్బాగు వచ్చినపుడు సమస్త ప్రాపంచిక బంధములను విడిచి సాంసారిక భ్రమలను చికాకుల నన్నిటిని త్రోసిపుచ్చి, సకలవిధ బంధములను విడిచిపెట్టి, సేవాసత్సంగములు చేసికొనుచు నిచ్చటనే ఉండిపోవలెనను తలంపుతో నీ యిండ్లు కట్టించుకొంటి మను విషయమును పూర్తిగ మరచి పోవుట చాల శోచనీయము. ఇపుడు ఆ మాటలన్నియు నిరర్థకమైపోయి వారు కూడ వానిని పూర్తిగ మరచిపోయిరి. ఎవరైన నేదేని కార్యమును మొదటలో నొక శుభకామన పెట్టుకొని ప్రారంభించి, పిమ్మట నా కార్యమును విడిచిపెట్టి నచో నది బుద్ధిమత్త్వమని కాని, వివేకమని కాని ఎట్లు అనిపించుకొనును? ఈ విషయమును మీరే స్వతః ఆలోచించుకొని తేల్చుకొనుడు. నే నీ విషయములో నెవరినైన నొక ప్రత్యేక వ్యక్తిని ఉద్దేశించి చెప్పుట లేదు. కేవలము సిద్ధాంతరూపముగ తేల్చుకొనవలయునను ఉద్దేశ్యముతోనే చెప్పుచున్నాను. సరే ఇల్లు సత్సంగి తన స్వాధీనములోనే ఉంచుకొన్నను కూడ అతని అనం

తరము ఆ యిల్లు అతని మరణ శాసనములో వ్రాసినట్లు తన పిల్లలకును, మనుమలకును దక్కగలదని అతడాశించుటకు అవకాశ మేమున్నది? ఏలనన, మరణ శాసనములోగాని, మరొక విధముగ కాని పేర్కొనబడినవానికి యిల్లు నిచ్చుటకుగాని, నిరాకరించుటకుగాని ఎగ్జిక్యూటివ్ కమిటీకి సంపూర్ణస్వాతంత్ర్య మున్నట్లు ఇండ్ల చట్టపు నిబంధనలలో నొక నిబంధన వ్రాసియున్నది కదా! ఇప్పుడు దయాల్బాగులోనున్న ప్రైవేటు గృహములలో, అనగా స్వంతహక్కుగల యిండ్లలో, సభకు స్వాధీనము చేయుటకు అంగీకరించనివారి యిండ్లు తొమ్మిది మాత్రమే యుండవచ్చును. వాస్తవములో అన్నికూడ లేవు. ఆరు మాత్రమే యుండును. నే నిప్పుడు ఆ ఆరుగురు సోదరులను వారు సభతో సహకరించదల్చుకొన్నారో, లేక విరోధించదల్చుకొన్నారో చెప్పగోరుచున్నాను. తర్వాత హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : సత్సంగములో దివ్యేచ్ఛకు శబ్దములను తీసి చదువు పద్ధతి సరికాదు. అట్లెందుకు చదువు చున్నారని ఆక్షేపణ చేయుచు నిప్పుడే ఒక పెద్దమనుష్యుడు నాకు జాబు వ్రాసెను. అందుచేత నేనిపుడు పద్ధతి మార్చి ముందు సంభాషణ చేయబూనితిని. ఇప్పుడు దివ్యేచ్ఛకు శబ్దమును తీసి మనము ప్రస్తుతము ఆలోచించుచున్న విషయమును గురించి పవిత్ర గ్రంథ మేమి నిర్ణయము చేయునో చూడుడు. ఈ క్రింది శబ్దము వచ్చెను.

దులహానీ కరో సియా కా సంగ ॥ టేక్ ॥
దులహా తేరా గగన బసేరా తూ బసే నైహాగ అంగ్ ॥ (1) ॥
యహ జోబన్ తేరా ఉతర జాయగా ।
ఫిర్ తూ హోగీ తంగ్ ॥ (3) ॥
తా తే అభీ సమ్హారో మన కో ।
ధారో థంగ ఉమంగ్ ॥ (4) ॥
సురత డోర బాంధ దే గురు సే ।
త్యాగో సభీ ఉచంగ్ ॥ 6 ॥
రాధాస్వామీ పతా బతాయా ।
చఢ చల పకడ తరంగ్ ॥ (7) ॥

[ సారబచన్, బచన్ 20, శబ్ద 25 ]

హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు ఇండ్లు ఇచ్చుటకు నిరాకరించు సోదరులకు ఈ శబ్దము ఎంత యెక్కువ యుక్తముగా వర్తించుచున్నదో మీరాలే స్వయముగ తేల్చుకొనుడు. అప్పుడు మరల మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయుడని హుజూరువారు సెలవివ్వగా, యీ క్రింది శబ్దము వచ్చినది :

సత సంగ కరత బహుత దిన బీతే।
అబ్ తో ఛోడ పురానీ బాన్ ॥ 1 ॥
కబ్ లగ కరో కుటిలతా గురు సే।
అబ్ తో గురు కో లో పహిచాన్ ॥ 2 ॥
గురు కో తుమ మానుష మత జానో।
వేహైం సత్తపురుష కీ జాన్ ॥ 3 ॥
జైసే తైసే మన సముఝావో।
ధర పరతీతి కరో ఉన ధ్యాన్ ॥ 4 ॥

[ సారబచన్, బచన్ 18, శబ్ద 12 ]

పాఠానంతరమందు హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : నేనీ రోజున నా పూర్వపు పద్ధతిని విడిచిపెట్టితినని పై శబ్దమును తీయక ముందే చెప్పితిని కదా! ఇప్పుడు ఎదుటి పక్షమువారు కూడ తమ పూర్వపు కపట కౌటిల్యములను విడిచిరో లేదో చూడవలసి యున్నది. అందరును తమ తమ ఇండ్లను సభ కిచ్చివేసిరి కదా! మీరేల యివ్వకున్నారని వారి నెవరైన నడిగినప్పుడు, వారు "మేము మా పుత్రి పౌత్రుల తరపున ధర్మ కర్తలమే కాని మాకు ఆ గృహములతో నేమియు బంధనము" లేదని చెప్పుచున్నారు. ఆ యిండ్లను విడచుటకు వారికే స్వయముగ ఇష్టములేక పుత్రి పౌత్రుల నెపము పెట్టి తప్పించు కొనుచున్నారు. హుజూరువారు మరొక శబ్దమును దివ్యేచ్ఛకు తీయించిరి :

కైసే గహూం రీ సరణ గురు బిన పరతీత్ ॥ టేక్ ॥
మన ఇంద్రీ భోగన మే అటకే।
నేక న ఛోడే జగ కీ ప్రీత్ ॥ 1 ॥
బచన సునత ఔర్ ఫిర్ బిసరావత్।
చిత్త న ధారే భక్తి రీత్ ॥ 2 ॥
హే రాధాస్వామీ అబ్ దయా బిచారో।
మేరే హియే బసావో చరణ పునీత్ ॥ 5 ॥

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 13 [ 3 ] 4 )

ఇట్లు సెలవిచ్చిరి : గృహములను ఇవ్వకుండనున్న వారు తమ అసత్య ప్రవర్తన, కపటత్వములను సమర్థించుకొను నిమిత్తమై చేసెడి వాదము ఈ శబ్దములో చెప్పబడినది. ఇందుకు సమాధాన మేమనగా, మిగతా నారందరు హుజూర్ సాహబ్జీ మహారాజువారి శరణ్యమును పొంది వారిమీద సంపూర్ణ విశ్వాసము నెట్లు పెట్టుకొన్నారో మీరు కూడ నట్లే చేయుడనియే. వారి యొక్క యీ పై

వాదమువలన వారికి హుజూర్ సాహబ్జీ మహారాజువారి చరణములందు గూడ విశ్వాసము లేనట్లే తేటపడుచున్నది. వారి కట్టి విశ్వాసమే యున్న యెడల, తమ ఇండ్లను సభకు స్వాధీనము చేయుటకు ఒక్క నిముషముగూడ సందేహించ నేరరు. ఏలనన యీ యిండ్లు సభయొక్క సొత్తు అయిపోయినచో చాల యుక్త ముగ నుండునని సాహబ్జీ మహారాజువారే సెలవిచ్చి యుండిరి.

హుజూరువారు ఈ సందర్భములో హుజూర్ సాహబ్జీ మహారాజువారు "సత్సంగ కే ఉపదేశ్"లో వ్రాసిన శాహ ఇబ్రిహీమ్‌గారి కథ తమకు జ్ఞాప కము వచ్చుచున్నదని సెలవిచ్చిరి. అందులో కొందరు భక్తులు భగవంతుని ప్రేమించుచుందురని వ్రాసి యున్నది. భగవంతుని ప్రేమించునట్టి భక్తుల జాబి తాలో మీపేరు వ్రాయించుకొన వలయునని యెవరు కోరుచున్నారో వారు చేతు లెత్తుడు. (చాల మంది చేతులెత్తి తమ యంగీకారమును సూచించిరి.) మీరందరును ఆనతి యిచ్చిన యెడల నా పేరు కూడ నీ జాబితాలో చేర్పించ వచ్చును. కాని భగవంతునిచే స్వయముగ ప్రేమించబడు మహా భాగ్యశాలురు కూడ కొందరున్నారు. మీరు అహంకారమని తప్పు పట్టకున్న యెడల నే నొక మాట చెప్పెదను. అదే మన హుజూర్ సాహబ్జీ మహారాజువారు ఒక మాన వుని యెడల ప్రేమ చేసెడివారు. ఇప్పుడు నేను చెప్పున దేమనగా మీలో నెవ రైతే భగవంతునిచే ప్రేమించబడువారి జాబితాలో పేర్లు వ్రాయించుకొన గోరుచున్నారో విమర్శ చేసికొని చేతులెత్త గోరుచున్నాను. ( అందుపైన చాలమంది తమ అంగీకారమును తెల్పుచు చేతులెత్తిరి ) అప్పుడు హుజూర్ వారు ఇట్టి జాబితాలో పేర్లు వ్రాయించుకొనకుండుట తెలివి తక్కువ యని సెలవిచ్చిరి. మీ కెవరికిని అభ్యంతరము లేకుండి మీరందరు ననుజ్ఞ ఇచ్చిన యెడల నాపేరు మొదటి లిస్టులోనుండి కొట్టివేయించి రెండవలిస్టులో వ్రాయించు కొందును. ఆ తర్వాత హుజూరువారు దివ్యేచ్ఛకు తీయింపగ నీక్రింది చరణము గల శబ్దము వచ్చినది :

సద్గురు దీన దయాల హమారే ।
మేహర్ కరీ మోహిం లీన సమ్హారే ।
భౌ సాగర పార ఉతారీ హో ॥ 2

( ప్రేమబానీ భాగ్ 3, బచన్ 12 (4), శబ్ద 31 )

## 17

"సత్సంగ కే ఉపదేశ్" రెండవ భాగము నుండి "సత్సంగ మేఁ లౌకిక

ఉన్నతి కా ఉద్దేశ్య" అను శీర్షిక గల 21వ నెంబరు వచనమును చదివిరి. ఆత్మబలి అనగా సేవచేయు నిమిత్తమై శరీరము స్వస్థముగను, మనస్సు పరిశుద్ధముగను ఉండి జేబునిండ ధనము కూడ నుండవలయునని యీ వచనమునుబట్టి ప్రకటితమగుచున్నదని హుజూరువారు సెలవిచ్చిరి. సేవ లేక ఆత్మబలి యివ్వవలయునన్న యెడల నీ మూడును ఆవశ్యక విషయములు. కడువృద్ధుడై బలహీనముగనున్న ప్రేమీబాయీ జంగీరీ సింహాగారు తన సంతుష్టి కొరకై కొన్ని ప్రశ్నలు వేసెను.

హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: ప్రపంచము నుండి బంధరహితుడై పోవుట మానవుని చేతిలోని పనికాదు. అది భగవంతుడే చేయగలుగును. భజన చేయుటయు, అభ్యాసము చేయుటయును, నిస్సంశయముగ బంధ విమోచనము కల్గించుకొనుట కుపయోగించు సాధనలే కాని అట్టి సాధనలు అవి యొక్కటే కాదు. ఇంకను కూడ గలవు. సేవ, సత్సంగము, అభ్యాసము ననెడి మూడింటిలోను సేవకు అగ్రస్థానమిచ్చి, అభ్యాసమునకు మూడవ స్థానము చెప్పవలయును. సేవ చేయుటకై ఆత్మార్పణ ఆవశ్యకము. ఆత్మార్పణ చేయుటకు స్వస్థమైన శరీరము, పరిశుద్ధమైన మనస్సు, కొంత ధన సంపత్తును ఉండవలయును. మీరు బలహీనముగ నున్న యెడల, కొద్దిగనే ఆత్మబలి యిండు. లేదా అది పూర్తిగ మానివేసి మిగత సాధనల నవలంబించుడు. ఆత్మ సమర్పణ చేయగల మానవుడే సేవ ఉత్తమ విధముగ చేయగలడు. కావున భగవంతుని ప్రసన్నత సంపాదించుకొనుటకు సేవ ఒక సాధనగ నెంచిననాడు బంధ రాహిత్యము సంపాదించుటకు ఆత్మార్పణ కూడ ఒక సాధనయే అని యేర్పడుచున్నది. సాహబ్జీ మహారాజువారు మన శక్తి సామర్థ్యములను కనిపెట్టి మన కేసాధన సర్వోత్తమని నిశ్చయించిరో, ఆ సాధనకే మొదటిస్థాన మిచ్చిరి.

తిరిగి ఇట్లు సెలవిచ్చిరి: ధనసేవ విషయములో మీరు తెలిసికొన వలసిన విషయ మేమనగా దానము లిచ్చుట ఆత్మ సమర్పణ ఎంతమాత్రము కానేరదు. దానము లిచ్చువానికి ఆత్మబలి నిచ్చువానికిని చాల వ్యత్యాసమున్నది. దానములు సామాన్యముగ యశస్సు సంపాదించవలయునను కోరికతోనే చేయుచుందురు. కావున దానము చేయుటలో నొక ప్రత్యేక వాంఛకూడ చేరియున్నది. కాని ఆత్మ సమర్పణము చేయువానికి స్వార్థవాంఛ లేమియు నుండనేరవు. అతడు ఒక్క సేవక రూపముగనే ఆత్మబలి దానము చేయును. ఆత్మ బలిదానము చేయు మానవుడు, దానములు ఇచ్చువానివలె బాహ్యాడంబర మేమియు చేయకుండ ప్రీతికార్యమును హృదయపూర్వకముగ చేయుచుండును.

ఆపైన హుజూరువారు సత్సంగ సంస్థలన్నియు సత్సంగసంఘముయొక్క సమస్తకష్టములు బాధలను తొలగించు నిమిత్తమై స్థాపించబడినవనియు, ఇపుడు వానిని వివిధ స్థానములలో వ్యాపింప చేయుచున్నామనియు, ఆత్మబలిదానము చేయ కోరికగల స్వయం సేవకులు ఈ సంస్థలలో పనిచేయు నిమిత్తమై ముందుకు వచ్చి, ఆ విధముగ సత్సంగ సంఘమునకు కష్టనివారణ చేయవలసి యున్నదనియు సెలవిచ్చిరి. సత్సంగులకును, సంఘమునకును సేవచేసి వారి కష్టములను నివారించుట భగవద్భక్తుల సేవ కానేరదా? తన భక్తులకు సేవ చేసినందువలన భగవంతునికి ప్రసన్నత కలుగదా? కావున ఈ రోజున చదివిన వచనములో భగవత్సన్నిధానము నొందు నిమిత్తమై చెప్పబడినట్టి సాధనను మనము స్వీకరించవలసియున్నది. మీ రెవ్వరైన భక్తునికి సేవచేసి భగవంతుని ప్రసన్నతను సంపాదించుకొన్న యెడల, భగవంతుడు వెంటనే మిమ్ములను తమ సన్నిధానమునకు బిలచుదురు. కావున మీరు ఏ పరమోత్కృష్టమైన అర్థమును గురించి పైపై మహిమాగానము చేయుచున్నారో, ఆ పరమార్థము మీకు సహజముగ సిద్ధించిపోవును. భగవంతుని పొందుటకు మార్గము ఒక్కొక్క సమయమున నొక్కొక్క విధముగ మారుచుండును. అందువలన నీ సమయమున జనులకు భగవంతుని పొందుటకు యుక్తమైన మార్గము నిప్పుడు చెప్పుచున్నాము. కావున మీరు దాని లాభమును పొందవలయును. భగవంతుడు డిక్కాలమున జనులు తన ధామము చేరుకొను నిమిత్తమై యే సోపానము నేర్పాటు చేసెనో జనులు దాని మీదనే యెక్కవలసియున్నది. ఆ విధముగ చేసిననే మన మచ్చోట చేరుకొనగలము.

హుజూరువారు తిరిగి ఇట్లు సెలవిచ్చిరి: సత్సంగములో జమయైన ధనము సమస్త సంఘముయొక్క లాభము కొరకే వెచ్చింపబడగలదు. జనులకు న్యాయార్జితమైన సొమ్ము వారికుటుంబ పోషణ కెంత యవసరమో అంత మాత్రమే యివ్వబడును. కావున వారికి పారమార్థిక హాని యేమియు నందువలన కలుగనేరదు. ఎప్పుడైన నొకనివద్ద అధిక పరిమాణములో ధనము జమకూడినను కూడ భగవంతుడు ప్రతిజీవుని విషయమును కనిపెట్టుచునే యుండును. తన భక్తు డెవ్వరైనను అధిక ధనశాలియై ధనలోభములో పడియున్నట్లు భగవంతునికి తెలిసిన నాడు ఆయన ఆ ధనమును ఖర్చుపెట్టించుటకై అనేక మార్గములను కల్పించగలరు. ఆ విధముగ చేసి అతనిని ఆ ధనలోలుపత్వములో చిక్కుకొని పోకుండ చేయుదురు. సత్సంగములో ప్రతివ్యక్తియు ఇతర వ్యక్తులను జాగ్రత్తగ కనిపెట్టుచుండును. కావున నిచ్చట అట్టి పరిస్థితులు సామాన్యముగ కలుగనేరవు. ప్రస్తుతము జనులకు తిండి బట్ట వగైరా ఆవశ్యక సామాగ్రి లభించుటలో గలుగుచున్న కష్ట పరిస్థితులను నివారించవలసి యున్నది. ఆ పరిస్థితులు

బాగుపడినపుడు అభ్యాసాసక్తులైన సత్సంగులు భక్తి అభ్యాసములను చేసికొన గల్గుదురు. కావున, నిపుడు ఈ ఆవశ్యకతలను పూర్తిచేయుట కుపయుక్తమైన సంస్థలను అభివృద్ధి చేయవలయునని బోధించుచున్నాము. ఈ ఆవశ్యకతలు పూర్తియైననాడు సకల సత్సంగులకును పారమార్థిక శిక్ష అనగా భజన అభ్యాసము యొక్క శిక్ష తప్పనిసరిగ నేర్పబడును. ఇప్పుడప్పుడే జనులకు పారమార్థిక అభ్యాసశిక్షను అభ్యసించు లాగున బలవంతము చేసినయెడల జనసామాన్య మందరును తమ తమ బాధ్యతలు ఆవశ్యకతలను మరచిపోయి చిక్కులపాలై పోగలరు.

# 18

సాయంకాల సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి: హుజూర్ సాహబ్జీ మహారాజువారు వివాహపు ఖర్చులు తగ్గించుటకు నియమముల నెట్లు నిర్ణయించిరో అట్లే ఉత్తర ప్రదేశ ప్రభుత్వము కూడ వివాహపు ఖర్చుల విషయములో నొక చట్టమును చేసిన దను సంతోషవార్తను మీకు తెలుపుచున్నాను. దీనిని బట్టి సత్సంగము యొక్క కార్యక్రమము భవిష్య కాలములో జరిగించవలసి యున్న సంఘ సంస్కారములకు త్రోవ చూపు చుండునని స్పష్టముగ కన్పట్టుచున్నది. రెండవ విషయ మేమనగా ఇప్పుడు నిరుపయోగముగ పడియున్న భూమిలో నుండి వేయి యెకరముల భూమిని ఈ సంవత్సరములో పంటభూమిగ మార్చ వలయునని యున్నది. మంచి పంట పండవలెనన్న యెడల భూమిని ఒక సంవత్సరము బీడుగ విడిచిపెట్ట వలయును. మనము అధికాధిక పరిమాణములో భూమిని వ్యవసాయార్హ్యముగ చేయవలసి యున్నది. మన మందరమును కలిసి ప్రయత్నము చేసిన యెడల దయాల్బాగు కొద్ది కాలములోనే తన కావశ్యక మైనంత ధాన్యమును పండించు కొనగలదు. ఈ పని యెన్నడు కూలిపనివాండ్ర ద్వారా జరుగునట్టి పనికాదు. ఇది సాధించుటకై ప్రతి వ్యక్తియు దినమునకు రెండు, మూడు గంటలసేపు పొలముపని చేయవలసియున్నది. అప్పుడు స్త్రీల వైపునకు తిరిగి యిట్లు సెలవిచ్చిరి: మీ భర్తలును, పిల్లలును 2, 3 గంటలు పొలము పని చేసినట్లు మీకు నమ్మకము గల్గునంతవరకు మీరు వారికి భోజనము ఎంత మాత్రము పెట్టరాదు. ఆహార విషయకమైన సమస్య చాల గంభీరమైపోయినది. రాబోవు సంవత్సరము బహుశః రేషన్ మొదలైనవి దొరకనే దొరకక పోవచ్చును. మనకు భోజన విషయములో హఠాత్తుగ కలుగబోయెడి కష్టముల నెదుర్కొనుటకు మనము ఎల్లప్పుడు తయారుగ నుండవలయును. మనము ఈ రోజులలో స్వప్నములోగూడ పొలముపని గురించియే తలచుకొనుచుండ వల

యును. నా అభిప్రాయములో అట్టి స్వప్నములు ఎవరికి వచ్చుచుండునో అతడే అసలైన సత్సంగి.

# 19

1947 మార్చి 22 వ తేదీ సాయంకాల సత్సంగములో **హుజూరువారు** పొలముపని వృద్ధిచేయు విషయములో ఒక ప్రణాళికను తయారుచేసి సభాధ్యక్షునికిచ్చి యీ క్రింది విధముగ సెలవిచ్చిరి: కార్యకారిణీ సమితియు, రాధాస్వామీ సత్సంగ సభయును ఈ ప్రణాళిక విషయము ఆలోచించి అది సరియని వారికి తోచినచో దానిని ఆమోదించవచ్చును. ఈనాడు తెలుగు సంవత్సరాది యగుటచే ఈ శుభ దినమున ఈ ప్రణాళిక విషయమై ఆలోచించుట బహుయుక్తమని హుజూరువారు సెలవిచ్చిరి. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వమువారు ఏ వ్యక్తికైనను అధమాధమము ఒక సంవత్సరము యేదేని ఒక సంఘ సేవలో పాల్గొనినట్లు నిదర్శనము చూపించు నంతవరకు అతని కీ రాష్ట్రములో ఉద్యోగ మెద్దియు నివ్వబడదని ఈ మధ్యనే ఒక చట్టమును తయారుచేసిరట. అటులనే సత్సంగములో గూడ సామాజిక సేవ చేయవలయునను నియమమును అమలులో పెట్టవలయునని నా అభిప్రాయము. దయాల్బాగులోని కృషి కార్యమునంతను సికందర్‌పూర్, జగన్‌పూర్, బహాదుర్‌పూర్ అనెడి మూడు భాగములుగా విభజించి ఒక్కొక్క భాగమునందు ఒక్కొక్క అధికారిని ఏర్పాటు చేయవలయునని నా అభిప్రాయము. ఈ మూడు భాగములలో ఒక భాగమునకు దయాల్బాగ్ మైనరు కాల్వద్వారాను, మరొక భాగమునకు యమునా కాల్వద్వారాను, మూడవ భాగమునకు ప్రస్తుతము త్రవ్వబడుచున్న బావుల ద్వారాను వేర్వేరుగ నీటి సరఫరా చేయవలయును. వ్యవసాయపు టధికారుల క్రింద నీ దిగువ నుదహరించిన రెండు విధములైన కర్మచారులు పనిచేయవలయును. 1. ప్రతి దినము కొంత సమయము తప్పక పొలములలో పనిచేయువారు; 2. కొంత రిజర్వులో పెట్టుకొని అవసరము కలిగినపుడు ఆవశ్యకమైన వ్యవసాయ కృత్యములలో ఉపయోగించుకొనవలసినవారు. వీరు ఈ క్రింది నాల్గు షరతులకు లోబడి పనిచేయవలసి యున్నది. 1. వారికి ఎట్టి ప్రశిక్షణ ఇచ్చినను దానిని వారు సంతోషముగ స్వీకరించుటకు సిద్ధముగ నుండవలయును. 2. రాత్రింబవళ్లు సేవకొరకై వారి నెప్పుడు పిలిచిన నప్పుడే వారు సంతోషముగ వచ్చి పని చేయుటకు సిద్ధముగ నుండవలయును. 3. వారిని ఏ పనిమీద నెచ్చటికి పంపదలచినను వారు అభ్యంతరము చెప్పకూడదు. 4. వారు ఎట్టి షరతులను కోరకుండ పని చేయుచు తమ సేవకు పంటనుండి ఎట్టి ప్రతిఫలమును కోరకూడదు. దయాల్బాగు

యొక్క పురాణ విద్యార్థులును, లీగ్ (League) సభ్యులును ఈ రిజర్వ్కోర్ లో (Reserve Corps.) లో సభ్యులుగా జేరవచ్చును. పైన చెప్పిన ఇరువిధములైన కార్య కర్తృ వర్గములలో మీరు ఏదేని ఒక దానిలోగాని లేదా రెండింటిలో గాని సభ్యులుగా జేరవచ్చును.

# 20

1947 జూలై 19వ తేది సాయంకాల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి : మొన్న సాయంకాలము (ఇచ్చటి కాలపరిమాణ ప్రకారము) 4-15 గంటలకు హిందూదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించిన దను విషయము వార్తా పత్రికలు అసలే చదువని వారికిని మరియు క్రితం మూడు రోజుల నుండి వార్తా పత్రికలు చూచుటకు అవకాశము చిక్కని వారికిని తెలిసి యుండ నేరదు. ఇప్పుడు మీరందరును స్వాతంత్ర్యమునొంది నందున హుజూరు సాహబ్జీ మహరాజువారు సెలవిచ్చినట్లుగ ఛాతీ విరుచుకొని సగర్వముగా తిరుగవచ్చును. అనగా ఇప్పుడు మన కందరకును లోలోపల నుండి ఒక నూతనోత్సాహము ఆవిర్భవించ వలయునని అభిప్రాయము. ప్రస్తుత ప్రభుత్వము ఈ దేశము యొక్కయు దేశవాసుల యొక్కయు క్షేమమునే ప్రధానముగ జేసికొని పరిపాలన చేయుచున్నట్లు ఇంతకుముం దెవరును నమ్మకముగ చెప్పజాలకుండిరి. ఈ మధ్య కొద్ది సంవత్సరముల నుండి మాత్రము ఒక్కొక్క సమయములో ప్రభుత్వము ఇంతకు ముందుకన్న ఎక్కువగ మన శ్రేయస్సును గురించి ఆలోచించుచున్నట్లు కనిపించవచ్చునేమో కాని ఇంతకన్న చాల యెక్కువ కార్యకలాపములలో ఈ ప్రభుత్వమువారు తరచుగ తమ దేశవాసుల క్షేమమునే మనస్సున నుంచుకొని ప్రవర్తించినట్లు స్పష్టపడుచున్నది. మన కింకను సంపూర్ణాధికారము లభించలేదు. ఆగస్టు నెల 15వ తేదీ నుండియే అది లభ్యము కాగలదు. ఐనను గూడ మనలో ప్రతి వ్యక్తికిని నూతనోత్సాహము ఇప్పుడే ఉద్భవించవలసి యున్నది. అనగా ఈ దేశము యొక్కయు, ఈ దేశవాసుల యొక్కయు శ్రేయోభిలాషయే వారి మనసున అగ్రస్థానము వహించవలయును. మనలో నెవరును మన దేశమునకుగాని మన దేశ వాసులకుగాని శ్రేయస్కరము కాని కార్యములను చేయగూడదు. అట్టి మాటలను కూడ మాట్లాడగూడదు. మన దేశవాసులు తామందరు నొకే సంఘము యొక్క సభ్యులమని జగత్తునకు ప్రకటము చేయగలుగు నంతటి అద్భుతమైన ఐకమత్య భావము. ఉత్తమ భావనలతోను, ఉత్కృష్టసేవా భావముతోను ప్రవర్తించవలసి యున్నది. ఇట్టి పద్ధతి నవలంబించి నందువలన ప్రభుత్వమునకు సౌకర్యము కలుగుటయేగాక జనులందరకు గూడ లాభకరముగ నుండి అందరకును జీవితము సుఖ శాంతులతో

సంతృప్తికరముగ గడచిపోవును. కొద్ది సంవత్సరముల నుండి సత్సంగములో నీ సిద్ధాంతమును పురస్కరించుకొని పనిజేయుచు సంఘముయొక్క ఐక్యభావమును దృఢపరచు నిమిత్తమై యెంత కఠిన ప్రయత్నములు చేసితిమో మీరు చూచియే యున్నారు. ఈ సందర్భములో దయాల్బాగులో నేమి, దేశములోని ఇతర స్థానములలోనేమి జనులయొక్క లాభార్థమై అనేక విధములైన పరిశ్రమలు సత్సంగము స్థాపించినది. అదీగాక కొన్ని క్రొత్త కార్యక్రమములు కూడ ప్రారంభించబడినవి. అందులో భూమి ని దున్ని వ్యవసాయము చేయు కార్యక్రమము ఒకటియై యున్నది. దయాల్బాగులో భూమిని వ్యవసాయయోగ్యముగ జేయు నిమిత్తమై 1940వ సంవత్సరము నుండియు నిరంతర ప్రయత్నము సాగుచున్నది. ఈ పని నిమిత్తమయ్యే ఎక్కువ శ్రద్ధ వహించి కాలము నింతక ఎక్కువగ వెచ్చించుచున్నాము. ప్రతి వ్యక్తియు నీ సేవయందు సులభముగ పాల్గొనవచ్చును. 1946వ సం॥ ఆగస్టు నెల నుండి ఈ కార్యక్రమము నిరంతరము జరుగుచునే యున్నది. అయినను ఇంకను చేయవలసిన పని చాల మిగిలి యున్నది. శీత కాలములో దిన ప్రమాణము తక్కువగా నుండుటచే ఈ పనికి కావలసినంత సమయము లభించ జాలకున్నది. నవంబరు నెల 15 తేదీ మొదలు ఫిబ్రవరి నెల 15వ తేదీవరకు మూడు మాసములు శీతకాలము చాల దుర్భరముగ నుండును. అంతకాలము పనులు అన్నియు కట్టిపెట్టుకొని యుండిపోవుట అసాధ్యము. కావున మీ స్వంతపనులకు అవసరమైన సమయమును ఈ పని నిమిత్తమై తగ్గించుకొని చాల కష్టపడి పనిజేయవలయును. పైన చెప్పినట్లుగ ఇంటింటికి అధమాధమము ఒక్కమనిషియైనను ఈ పనిలో తప్పక పాల్గొనవలయును. పొలము పనికి ప్రతిదినము వచ్చుటలో ఎన్నటూ నాగా పెట్టకూడదు. ఏదేని రుగ్మతకాని లేక మీ శక్తికి మించిన మరొక ఆటంకముగాని కలిగినప్పుడు తప్ప మిగతా కాలమంతయు మీ రీ పనిని చేయుచుండవలయును. ఈ రీతిగ పని సాగించిన యెడల మీరు ఈ భూమిని అంతను 1948వ సం॥ అఖరు లోపుననే వ్యవసాయార్హము చేయగలరని ఆశించవచ్చును.

# 21

1947 వ సం॥ సెప్టెంబరు 10 వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఒక చాలా ముఖ్యమైన విషయము మీ ముందు పెట్టవలసి యున్నది. అదేమనగా, మీరు ప్రతిదినము సత్సంగమునకు వచ్చునప్పుడు త్రోవలో నడచుచున్నపుడును ఇచ్చటకు వచ్చిన పిమ్మట సత్సంగము ప్రారంభించు క్షణము వరకును తెంపు లేకుండ మాటలాడుచునే యున్నారు. [illegible] పరి

స్థితిలో సత్సంగము వలన మీకు లాభ మేమైన లభించ గలదేమో మీరే చెప్పుడు. మీరు సత్సంగమునకు వచ్చుచున్నప్పుడు తోవలోను, లేక అధ మాధమము సత్సంగ ఆవరణలో అడుగుపెట్టిన క్షణము మొదలుకొని యైనను, ఒకరితో నొకరు మాటలాడుట కట్టిపెట్టి నిశ్శబ్దముగా నుండవలయును. సత్సంగ హాలునకు నలువైపులనున్న వీధులు కూడ సత్సంగావరణ లోనివే. కావున మీరా వీధులలోని వాతావరణమునుకూడ శాంతియుతముగ నుంచవలయును. మీరట్లు జరిగించినయెడల ఆ ప్రకారము నిశ్శబ్దముగ నున్నంతకాలములో నైనను మీరు స్మరణ చేసికొనగలుగుటయే కాక సత్సంగ లాభము మీకు చేకూర్ప నర్హమైన పవిత్ర వాతావరణమును మీతో కూడ నిచ్చటకు దీసికొని రాగలరు. అట్లు చేసినయెడల మీ వెంట శ్రద్ధాభావమును, ఆధ్యాత్మిక ప్రభావ మును ఇచ్చటకు తీసికొనివచ్చి, తిరిగి ఇండ్లకు పోవునపుడు మీవెంట నిచ్చటి ఆధ్యాత్మిక వాతావరణముయొక్క ఉత్తమ ప్రభావమును మీతో తీసికొని పోగలరు. అనగా మీరిచ్చటినుండి లేచి పోవునపుడు మీ చిత్తము ఏకాగ్రత నొంది మీ స్వాధీనములో నుండును. మీకు ఈ పద్ధతి నచ్చిన యెడల మీరు మొట్టమొదట పిల్లలను అదుపాజ్ఞలలో నుంచుకొనవలసి యున్నది. అనగా సత్సంగ మునకు వచ్చినపుడు వారు నోరు మూసికొని కూర్చుండవలయు ననియు, లేదా అసలు సత్సంగమునకే రాకుండగ నుండిపోవలయు ననియు మీ పిల్లలకు మీరు బోధించ వలయును. పిల్లలు మీ మాట విననియెడల వారిని కొద్దిగ శిక్షించవలసి యుండును. రెండు, మూడు రోజు లీవిధముగ జాగ్రత్త తీసికొనిన యెడల పిల్లలు అల్లరిగాని సంభాషణగాని చేయకుండ నుండిపోవుదురు. అదియునుగాక మరొకరెవ్వరైనను మాటలాడుచున్న యెడల మీరు వారిని మాట్లాడకుండ ఆపు చేయవలయును. అట్లు చేసినయెడల వారును నిశ్శబ్దముగ నుండిపోవుదురు. ఈ అలవాటు మీకు దృఢపడిన యెడల మీరు మీ మనస్సును ఇరువది నాలుగు గంటలు స్వాధీనములో నుంచుకొన గలుగుదురు. మీ కేదైన నొక గొప్ప ముఖ్య విషయమును గురించి మాట్లాడవలసి వచ్చినచో మీకు అట్లు మాట్లా డుట కడ్డులేదు. అదిగాక ఇతరులెవ్వరైన మాట్లాడు చుండినయెడల ఆ మాటలు మీ చెవిని పడకుండ మీరు మీ చిత్తవృత్తి నంతర్ముఖము చేసి ఉంచుకొన గలి గినచో మీరు మీ ఆలోచనలను పనులను సవ్యమైన మార్గమున నుండునట్లు చేసికొన గల్గుదురు. మీరు అధమ మొక వారమైనను తప్పక ఇట్లు ఆచరించ వలయునని నా మనవి. మీకు అందువలన లాభము కల్గినట్లు తోచినయెడల మీర ట్లే ముందుకూడ ఆచరించ వచ్చును. అట్లు కానిచో మీరు ఆ యాచరణను విడిచిపెట్టవచ్చును. "సత్సంగములోనికి వచ్చునపుడు, ఇంటికి వెళ్ళిపోవునపుడు, సత్సంగములో కూర్చుండి నపుడును మాటలాడ కూడ"దని వ్రాసి ఇచ్చట నాలు గైదు ముఖ్య స్థలములలో నోటీసు బోర్డులు కట్టవలయునని కార్యదర్శి గారితో

నే నీ నాడే చెప్పియున్నాను. అట్లు చేయుటవలన జనసామాన్య మందరి మీదను తప్పక దాని ప్రభావము పడగలదు. అందువలన బయటనుండి వచ్చిన వారు ఈ స్థానముయొక్క పవిత్ర వాతావరణ ప్రభావముచే ప్రభావితులు కాగలరు. ఈ విషయములో దివ్యేచ్ఛకు శబ్దమును తీయుడని హుజూరువారు పాఠకులకు సెలవిచ్చిరి. ఈ క్రిందిశబ్దము వచ్చినది :

రాధాస్వామీ దయా ప్రేమ ఘట ఆయా।
బంధన్ ఛూటే భరమ్ గం వాయా॥ 1 ॥

(సారబచన్-బచన్ 6—శబ్దము 16)

దీనితరువాత ఈ క్రింది శబ్దమును చదివిరి.

జరా తుమ్ హోష్ మే ఆవో హాఁసీ ఔర్ దిల్లగీ ఛోడో।
యహ గఫలత్ జహరే కాతిల్ హై
జహాఁ తక్ హో సకే బచనా ॥ 1 ॥

(ప్రేమవిలాస్—శబ్దము 42.)

ఇట్లు సెలవిచ్చిరి : పారమార్థిక మార్గము చాల సునిశితమైనది. ఈ మార్గమున నడచుటకు మానవుడు అనుక్షణమును చాల మెలకువగనుండి జాగరూకతతో ప్రవర్తించవలసి యున్నది. అట్లున్నప్పుడే పరమార్థముయొక్క ఫలితము ఇతనికి చేకూరగలదు. ఈ నియమముకూడ మీరు సత్సంగము బహు జాగ్రత్తగను మెలకువగ నుండి చేసికొన్నప్పుడే అనుసరణ సాధ్యమగును. పై శబ్దములో చాల జాగరూకతతో అడుగుపెట్టవలె ననెడి విషయము చెప్పబడినది. దానినిబట్టి కూడ సత్సంగములోనికి వచ్చిపోవునపుడు నిశ్శబ్దముగ నుండవలయునని బోధ సూచితమగుచున్నది. మీరీ విషయమును చులకనగ తీసివేయక బహుశ్రద్ధాభక్తులతో ఆ ప్రకారము ఆచరించవలసి యుండును. మహాత్మాగాంధీగారు వారమున కొకరోజు మౌన వ్రతము నెందుకు అవలంబించుచుండిరో మీరెప్పుడైన నాలోచించుకొనిరా? జనులు సామాన్యముగ వ్రతముల నెందు నిమిత్తమై చేయుచుందురో మీరెప్పుడైన తెలిసికొన ప్రయత్నించిరా? భార్యాభర్తల మధ్య అప్పుడప్పుడు వివాదములు ఎందుకు వచ్చుచుండునో ఆ విషయమును గురించి మీరెప్పుడైన శ్రద్ధగ నాలోచించితిరా? ఇందుకు సమాధానమును మీలో నెవరు ఆలోచించి చెప్పగలరో వారు చెప్పవచ్చును.

చాలమంది సమాధానము చెప్పిరి. హుజూరువారు ఇట్లు సెలవిచ్చిరి : నే జెప్పిన విషయమును కొత్వాలుగారు మహాత్ముల వచనముగ పరిగణించిరి.

కాని నే నీ విషయమును పరిశ్రమలకును వ్యవహారమునకును సంబంధించియే చెప్పియున్నాను. పే్రి. ఘా. రామ్ సహాయ్ నిగమ్ గారు చెప్పిన మాటతో నే నేకీభవించుచున్నాను. ఉపవాస వ్రతము చేసినందున పొట్టకు విశ్రాంతి కల్గును. అంతకుముందు తినబడి జీర్ణము కాకుండ ఉండిపోయిన ఆహారము అరిగిపోయి బహిర్గతమై పోయినపుడు కడుపు తేలికమైపోయి ఉపవాస వ్రతము అనంతరము కడుపులో క్రొత్త పదార్థమును తీసికొనుటకు ఖాళీ యేర్పడును. అటులనే కొంత కాలము సత్సంగమునకు వచ్చిపోవు నపుడును, సత్సంగములో కూర్చున్నపుడును నిశ్శబ్దముగ నున్నవారి మెదడునకు విశ్రాంతి లభించి వ్యర్థమైన బాహ్య విషయములనుండి తప్పించుకొని దూరముగ నుండుటచే వారి మెదడునందు పవిత్రమైన శుభాలోచనలు ఉత్పన్నమగుటకు సావకాశము కలుగును. మెదడునకు విశ్రాంతి లభించి శాంతియుతముగ నుండుటచే వారి బుద్ధిశక్తి అభివృద్ధియై, వారు బుద్ధి కౌశలము నుపయోగించవలసిన కృత్యములను ఇంతకు మునుపుకన్న నెక్కువ బాగుగ నెరవేర్చగలరు. భార్యాభర్తల మధ్య కలహము వచ్చినందు వలన కలుగు లాభమొకటి కలదు. ఏమనగ నేదైన, నొక గృహ విషయమును గురించి వారి దృష్టి తీవ్రముగ బాహ్యముగ పోవుచున్న సందర్భములో అట్లు క్రిందికి ప్రవహించి పోవుచున్నట్టి వారి శ్రద్ధాప్రవాహమున నాటంకము కలిగి అది మరొక దిశకు మరలి పోవును. అందుమూలమున చిత్తవృత్తియొక్క బహిర్ముఖ ప్రవాహమును, దాని శక్తియు నశించి పోవుటయు, కట్టువడి దానిశక్తి అభివృద్ధి యగుటయును వారికి కలుగు లాభము. మీరు చక్కగ నాలోచించుకొన్నయెడల మిమ్ములను నేను మొట్టమొదట ప్రశ్నించిన మూడు విషయములు నొకే సిద్ధాంతము మీద ఆధారపడి యున్నట్లు మీకు తెలియగలదు. ఈ సారి హుజూర్ స్వామీజీ మహారాజ్, హుజూర్ సాహబ్జీ మహరాజు వారల భండారాలు కల్పి జరిగించబడుచున్నవి. ఇపుడు మీ కిచ్చిన హితోపదేశములను మీరీ పవిత్రసమయమున సంపూర్ణముగ నమలులో పెట్టుటకు ప్రతిజ్ఞ చేసికొనుడు. అట్లు చేసినయెడల మీకు సత్సంగములో చేరినందువలన లభ్యము కావలిసిన ఫలితము సంపూర్ణముగ చేకూరగలదు.

## 22

1947వ సం॥ సెప్టెంబరు 20 వ తేదీని ఇట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు చదివిన వచనములో కొన్ని విషయములు వివరించబడినవి. అందులో మొదటి దేమనగా మనము విశ్రాంతితో నుండగోరినచో మన ఆవశ్యకతలను తగ్గించు కొనవలయు నన్న విషయము. ఆవశ్యకతలు తగ్గించుకొన్నందు వలన మనకు అనవసర విష

యములతో ప్రిసక్తి తగ్గిపోయి మన సమయము నెక్కువగ ఆవశ్యక కృత్యముల నిమిత్తమై వినియోగించుకొన గల్గుదుము. రెండవ హితోపదేశము మనము శేషించిన మన యావశ్యక విషయములను సాధించుకొను నిమిత్తమై ఒక యోగ్య వ్యక్తి ప్రవర్తించ వలసిన విధముగ ప్రియత్నము సాగించవలయుననియు, కష్ట పడి పనిచేసుకొనవలయుననియు చెప్పబడినది. అట్లు చేసినయెడల మలిన భావన లెన్నియో మనకందరికి రాకుండ పోవుటయు, మన యావశ్యకతలు యుక్తమైన వన్నియు సులభసాధ్యమై పోవుటయు జరుగును. పర్యవసాన మేమనగ, మీరు బద్ధకమును దరికి రానివ్వకూడదు. ఇట్లు సెలవిచ్చిరి: ఈ రోజులలో నెవరును పని తక్కువగ నున్నదని ఫిర్యాదు చేయుట కవకాశము లేదు. ఇచ్చటికి వచ్చిన వారందరును చేయగలిగి నంతకన్న నెక్కువపని పొలములలో పెరిగియున్నది. ఈ సమయములో ధాన్యములు చాల తక్కువగ అయిపోయినవి. ముఖ్యముగ నిచ్చటికి శరణార్థులు వచ్చినది మొదలు ధాన్య లోపము వలన కష్టములు మరింత యెక్కువైనవి. మీరు స్వల్పముగ భుజించుట అలవాటు చేసికొనుటయు రోజున కొక్కతూరియే భోజనము చేయుటగాని లేదా ఒక్కసారి భోజనమునే రెండు సమయములలోను పంచుకొని సగము సగము తినుటగాని అత్యావశ్యకము. అట్లు చేసినందువలన మీరు తగ్గించిన ఆహారము ఈ శరణార్థులకు ఉపయోగ పడును. ఇప్పుడిక రేషన్ ఎక్కువ లభ్యము కాదను విషయము నిశ్చితమై పోయినది. ఈ రేషన్‌లోనే కొంత తరుగుకూడ చేయుగలరను భయము కూడ కలుగుచున్నది. కావున భవిష్యములో మనకు కష్టములు కలుగకుండ నుండ వలయునన్నయెడల, ఇప్పుడే మన అలవాట్లను మనము సమయోచితముగ మార్చుకొనవలయును.

## 23

1947 సం॥ సెప్టెంబరు 29వ తేదీన ఇట్లు సెలవిచ్చిరి: హుజూరు సాహబ్జీ మహారాజువా రిచ్చట భూమిని కొని యుమున నుండియు, మరియొకచోట నుండియు రెండు కాల్వలను ఈ కాలనీలోనికి త్రివ్వించుటలో వారి యుద్దేశ్యము ఇక్కడ వ్యవసాయమును అభివృద్ధిచేసి కాలనీ వాసులకు తమ ఆహారమును గురించియు, పశువుల మేతను గురించియు యుక్తమైన ప్రిబంధము చేయవలయు ననియే యని మీకు బాగుగ తెలుసును కదా! మీరు ఇకముందు సుఖశాంతు లతో బ్రతుకవలయునన్నచో మీరు వ్యవసాయము అభివృద్ధిచేసి స్వయముగా కష్టపడి పనిచేయవలసి యుండును. లేనియెడల మీరు కష్టములనుండి తప్పించు కొనజాలరు.

# 24

1947వ సం॥ సెప్టెంబరు 30వ తేదీ సాయంకాలము సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి : 1940వ సంవత్సరములో రెండు ఎకరములు మాత్రమే సాగు చేయబడినవి. అప్పటి నుండియు వ్యవసాయమును మెల్లమెల్లగ పెంపు చేయుచు రాగా క్రితం సంవత్సరములో రమారమి 57 ఎకరములలో గోధుమలు పండించితిమి. మేము ఇచ్చటి నివాసులతో నీ సంవత్సరము 500 ఎకరముల భూమిలో గోధుమలు వేయవలసి యున్నదని చెప్పితిమి. కాని చాల తీవ్రముగ పనిచేసినను గూడ బహు కష్టము మీాద 300 ఎకరముల భూమిని మాత్రమే దుబ్బులు, ముండ్ల కంపలు వగైరాలు లేకుండ తీసివేసి సమతలము చేసి సాగు చేయగలిగితిమి. ఈ మాత్రపు భూమిని తయారు చేయుటలోనే మీాకు ఊపిరి సలుపకుండ నైపోయినది. కాలనీకి ఆవశ్యకమైన ధాన్యమును సంపూర్ణముగ చేకూర్చుటకు రెండువేల ఎకరములలో ధాన్యము పండించ వలసి యున్నది. ఇప్పుడు మీాలో రాబోవు సంవత్సరము రెండువేల ఎకరములుగాని, అధమము పదునైదు వందల ఎకరముల భూమినిగాని వ్యవసాయార్హముగ చేసి సాగుచేయగలమను ధైర్య సాహసములు గలవారెవరో చెప్పుడు. పంట పండించుట యనగ భూమిని మొదట కంటక రహితముగను సమతలముగను చేయుటయు, దానిని దున్ని దానిలో విత్తనములు జల్లి నీరు పెట్టుటయు, తిరిగి అందుండి కలుపు తీయుటయు, ఆ తరువాత కళ్ళమునకు జేర్చి ధాన్యమును నూర్చుటయు మొదలగు పనులన్నియు నందు జేరియున్నవి. అనగా ఒక భూమి వ్యవసాయము చేయవలెనన్నచో ఈ పనులన్నియు జరిగించవలసి యున్నది. రాబోవు సంవత్సరము అధమాధమము 1500 ఎకరములైనను సాగుచేయుటకై మీాలో నెవరెవరు స్వయం సేవకులుగ పని చేయగోరుదురో చేతులు ఎత్తుదురుగాక ! అందుపైన ఇంచుమించు అందరును చేతులెత్తిరి.

# 25

1947 సం॥రము అక్టోబరు 24వ తేదీ ప్రాతఃకాల సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : ద్వితీయ మహాయుద్ధము సమాప్తమై యీా నాటికి రెండున్నర సంవత్సరములు గడిచినవి. కాని దేశము యొక్క కష్టములు బాధలును ఇంతవరకు ఉపశమించలేదు. మహా యుద్ధము సమాప్తమైన పిదప ఇతర దేశములలో కన్న భారతదేశములో కష్టములు అభివృద్ధి యగుటచే ఆ దేశముల కష్టము లన్నియు అచ్చటినుండి భారతదేశమునకు వచ్చినవా యన్నట్లు

కనిపించుచున్నది. గత మహా యుద్ధము భారతదేశములో నెచ్చటనైన జరిగియుండిన యెడల ఇంక నెంత మహా దురవస్థ మన దేశమునకు కలిగియుండునో చెప్పజాలము. అయిన నిప్పుడు కూడ గతించిన కొద్ది మాసములలో మన దేశములో గలిగిన పరిస్థితులు, ఇతర దేశస్థులకు వారి దేశములలో యుద్ధము జరిగినప్పుడు గలిగిన ఆపత్కష్టముల కన్న నేమియు తీసిపోలేదు. 1928వ సం॥రములో మహాత్మాగాంధీగారికిని, హుజూర్ సాహబ్జీ మహారాజావారికిని దయాల్బాగులో జరిగిన సంభాషణ సందర్భములో "మీరు ఇప్పుడు స్వరాజ్యము సంపాదించుటకై గట్టి ప్రయత్నము చేయుచున్నారుగాని ఇంకను అధమాధమము ఇంచుమించు పదియేండ్ల వరకు మీకు స్వరాజ్యము లభించనేర"దని హుజూరువారు సెలవిచ్చిరి. అనగా దాని అర్థము భారతదేశమునకు స్వరాజ్యము 1938 సంవత్సరము తరువాతనే లభించగలదనియే. ఇప్పుడు 1947వ సంవత్సరము. ఇంక రెండున్నర మాసములు కాగానే 1948 సంవత్సరము ప్రారంభమగును. అనగా సాహబ్జీ మహారాజువారు ఆ మాటను సెలవిచ్చినది లగాయతు ఇంతవరకు పది సంవత్సరములకు బదులు ఇరువది సంవత్సరములు గతించినవి. కాని ఇప్పటికైనను భారతదేశములో శాంతి సుఖములు పేరునకైన గానరాకున్నవి. మాయాకాలుల శక్తులు మన దేశమునం దంతటను సంపూర్ణముగ వ్యాప్తము జేసియున్న తమ జాలమును ముడిచి మూటగట్టుకొని భారతదేశమును పూర్తిగ విడిచిపెట్టి ఈ ప్రపంచమున వానికి పారిపోవుటకు వీలుగనున్న మరెచ్చోటునకైనను అవి పారిపోవునట్లు హుజూర్ రాధాస్వామీ దయాళురు దయతో నాశక్తులను ఆజ్ఞాపించుదురు గాక యని ఆ దయాళుని చరణకమలములందు మన మందరము ప్రార్థన చేయదగిన సమయ మాసన్నమైనదని నా యభిప్రాయము. అట్లు చేసినచో మన దేశమునకు రాబోవు సంవత్సరమైనను అధమము సుఖశాంతి దాయకము కాగలదు.

## 26

1948 వ సం॥ ఫిబ్రవరినెల వసంత పంచమి రోజున హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఈనాడు భండారా దినము కాదు కాని భండారీ పురుషుని దినము. సర్వజన సామాన్యమైన సత్సంగము జారీయై ఇప్పటికి ఎనుబదియేడు యేండ్లు ఐనవి. ఈనాడు సత్సంగమునకు ఎనుబది యెనిమిదవ సంవత్సరము ప్రారంభమైనది. 'బసంత్' మీ కందరకు శుభప్రదమగుగాక !

## 27

1948 వ సం॥ ఏప్రియల్ 1 వ తేదీ ఉదయము సత్సంగములో హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : ఈ రోజున మీకు నూతన ఆర్థిక సంవత్సరము ప్రారంభమైనది. ఈ సంవత్సరము మీకందరకు శుభప్రద మగుగాక ! గత సంవత్సరములో శారీరకముగను, మానసికముగను, ఆర్థికముగను మీరు చాల కష్టముల కోర్చుకొనిరి. కాని ఇప్పుడు వాటినన్నిటిని మరచిపోవలయును. ఈ సంవత్సరము ఒక క్రొత్త శుభ సమయము ప్రారంభమైనది. నూతన జీవన విధానము, నవీన సభ్యత, నూతన పరివర్తన సరళియు నవలంబించవలసి యున్నది. కావున మీ పరివర్తన రాబోవు నూతన శుభసమయమునకు అనుకూలించి యుండవలయు నన్నచో మీరు కాలమాన పరిస్థితులను, రాబోయెడి పద్ధతులను గమనించుకొనుచు మీ ప్రవర్తన పద్ధతిని వాని కనుగుణముగ నుండు లాగున మెలకువతోను, బుద్ధి మత్త్వముతోను మార్చుకొనుటకు నిశ్చయించుకొని కలసిమెలసి జీవితమును గడుపుకొనుచు సామ్యభావ భ్రాతృభావముల సిద్ధాంతము ప్రకారము నడచుకొనవలయును.

## 28

1948 ఏప్రిల్ నెలలో ఇట్లు సెలవిచ్చిరి : ఏ యే పేటలలో రబీ పంట కోతకు తయారై సిద్ధముగ నున్నదో ఆ యా పేటలలో నివసించు స్త్రీ పురుషులు, బాలురును మాత్రమే ఆ పంటను కోయవలయును కాని పరాయి పేటల జనము అచ్చటికి వెళ్ళగూడదు.

## 29

1948 నవంబరు 3వ తేదీ సాయంకాల సత్సంగములో ఒక వచనము చదివిన పిమ్మట హుజూరువారిట్లు సెలవిచ్చిరి : నిన్న నిప్పులో కాలినందు వలన ఒక మరణము దయాల్బాగులో కూడ సంభవించినది. ఇంటిలో బాలిక ఒంటరిగ నుండెను. ఆ సమయమున రేడియో గట్టిగ మ్రోగుచున్నందువలన ఆ పిల్ల ఏడ్పులు, కేకలును ఇరుగు పొరుగు వారికి వినపడలేదు. అప్పుడు, రేడియో గట్టిగా మోగకుండిన యెడల ఆ పిల్ల యొక్క పరిస్థితి ప్రక్కయిండ్లవారికి తెలియుటకు అవకాశముండి ఆ పిల్ల ప్రాణము రక్షింపబడి యుండెడిది. రేడియో ఒకవిధముగ మంచిదే యైనను అనేక విధముల నది గర్హణీయమని చాలసార్లు చెప్పియున్నాము. ఆ కారణముల మూలముననే ఇచ్చట జనులను రేడియో

పెట్టుకొనుటకు ప్రోత్సహించుట లేదు. మీ కందరకును సత్సంగ సమయములో ఒక స్త్రీ గాని, ఒక పురుషుడు గాని అవశ్యముగ నింటివద్ద నుండిపోవలయునని, వర్షాకాలము ప్రారంభించకముందే హితబోధ చేయబడినది. ఆడవాండ్రను సత్సంగమునకు రాకుండ అడ్డు పెట్టుటకు పైన జెప్పిన విషయము కూడ నొక కారణము. అనగా అట్లు చేసి నందువలన ఇంటిలో ఒక స్త్రీ గాని, ఒక పురుషుడు గాని ఉండిపోవుటచే ఇంటిలో దొంగతనము వగైరాలు జరుగునన్న భయము ఉండదు. కావున నీ సమయములో ఆడవాండ్రను సత్సంగమునకు రాకుండ నిషేధించి నందున ఆడవాండ్రు ఇంటనే యుండిపోయి ఇండ్లలో దొంగతనము, వర్షములో జారిపడుట యనెడి ఆపత్తులు రెండింటి నుండియు కాపాడబడి యున్నారు. ఈ మధ్యన ఈ పిల్లయు, ఈమె తల్లియు సత్సంగమునకు వచ్చుటకై ప్రార్థన జేసిరి కాని ఆ పిల్లకు మాత్రమే సత్సంగమునకు వచ్చుట కనుమతి యీయబడినది. ఇల్లు ఖాళీగా ఉండకూడ దన్న యుద్దేశ్యముతోనే తల్లికి సత్సంగమునకు వచ్చుటకై అనుమతి యీయబడ లేదు. కాని తల్లి బయటి కేచ్చటికో వెళ్లి పిల్ల ఒక్కత్తియే యింట నుండి పోయినది. ఈపై అనుమతియొక్క ఉద్దేశ్యమును యుక్తవిధముగా అర్థము జేసికొని దాని లాభమును పొంది యుండినచో అనగ తల్లి ఇంట నుండి పోయినచో నీ దుర్ఘటన సంభవించకుండెడిది. లేదా ఆ పిల్ల తనకిచ్చిన యనుమతి ప్రకారము సంత్సంగమునకు ప్రతిరోజు వచ్చుచుండిన యెడలఁగూడ నీ యాపత్తు ఆమెకు జరుగకుండెడిది. కాన వచ్చిన చిక్కు యేమనగా జనులు చెప్పినమాట వినకుండ తరువాతవచ్చి ఫిర్యాదు చేయుచుందురు. ఈపై నిర్ణయములోని సదుద్దేశ్యము ఇపుడు తప్పక మీకు అవగాహన కాగలదు.

# 30

1949వ సం॥ జనవరి నెలలో శబ్దపాఠము, వచనము రెండును ఐన పిమ్మట హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు చదివిన శబ్దమును సత్సంగ్—కే—ఉపదేశ్—మూడవ భాగమునుండి చదివిన 78 వ వచనమును కలిపి సమన్వయించు కొన్న యెడల దయాల్బాగులో ప్రారంభించబడిన కృషికార్యము ఒకరిద్దరు పెద్ద మనుష్యులు చెప్పినమాట ననుసరించి చేసినది కాదనియు, వ్యవసాయ కార్యము ఇచ్చట అభివృద్ధి చేయుట సాహబ్జీ మహారాజు వారియొక్క నిశ్చిత సంకల్పమే యనియు మీ కందరకు విశ్వాసము కలుగగలదు. ఈ కారణముచేతనే వారు భూమిని కొని దానికి నీటిపారుదల నిమిత్తమై వారి సమక్షములో రెండు కాల్వలను త్రవ్వించిరి. మరియు ఉత్తర ప్రత్యుత్తరములు వ్రాయు సమయములో వారు సత్సంగ కార్యప్రణాళికలో కృషి కార్యము చేరియున్నదని సెలవిచ్చినట్లు

కూడ తెలియుచున్నది. వారు స్వయముగ నీ కార్యమునందు అభిరుచి తీసికొని ఇచ్చుట ఈ కార్యమును ప్రారంభింప జేసిరను విషయము, ఈ కార్యము వారి ప్రణాళికలో నొక భాగ మనెడి విషయమును బుజువు పరచుటకు మరింత దృష్ట ప్రమాణము. అదిగాక ఈ కార్యము వారి ప్రణాళికలో నొక భాగమనెడి విషయము కొద్దిసేపు మనము మరచిపోయినను అది ఈ సమయములో ఆవశ్యక మైన దను విషయమును మాత్రము అందరును ఒప్పుకొనవలసియే యున్నది. ఇంకొక విషయముకూడ మనము చేయవలసి యున్నది. అది యేమనగ మనకు ముఖ్యముగ నవసరమైనంతవరకు మాత్రమే పదార్థములను ఉపయోగించు కొనుచు వానిని అనవసరముగ నష్టపరచకూడదు. అట్లు చేసిన యెడల ఆ యధిక పదార్థములు ఇతరులు ఉపయోగించుకొనుట కవకాశము కలదు. మనము ఏదైన నొక పదార్థమును ఉపయోగించు కొనకుండ దాచి ఇతరులకు మిగిల్చిన యెడల అది చాల ఉత్తమ విషయమే. లేదా మనము ఏదేని పదార్థమును స్వయం కృషితో తయారు చేసినను మనకా పదార్థ మున్నంతవరకు మనము బజారునుండి అట్టి పదార్థమును కొనకుండ నుందుము. కావున దానిని మనము ఇతరుల లాభము నిమిత్తమై అట్టేవుంచినట్లే అగును. కావున ఈ రెండు విధ ములుగను ఆలోచించిన యెడల మనము ప్రస్తుతము జరిగించుచున్న వ్యవసాయ కార్యక్రమము అత్యుత్తమ మైనదే యగును. మామూలుగకూడ వ్యవసాయ కార్యము వృత్తులలో సర్వోత్తమ మైనది. వ్యాపారమునకు రెండవస్థాన మియ్య బడినది. సేవక వృత్తికి అన్నిటికన్న తక్కువ స్థాన మియ్యబడినది. మీా అంద రును కష్టపడి హృదయ పూర్వకముగ వ్యవసాయ కార్యము చేయవలసియున్నది.

## 31

1949వ సం॥ మే 25 తేదీని హుజూరువారు నంబ్యాలలో నిట్లు సెల విచ్చిరి : నేను ఇంతకు ముందు . ఆంధ్రప్రదేశమునకు వచ్చి నలుబది రెండు మాసములైనది. ఈ మధ్య కాలములో దయాల్బాగులో చాల ముఖ్య కార్య ములు జరుగుచుండుట చేతను, మేము ఆహారపదార్థములు, ఇతర పదార్థముల యొక్కయు ఉత్పాదన కార్యములో నిమగ్నమై యుండుట చేతను, ఇచ్చటికి వచ్చుటకు మాకు సమయము చిక్కలేదు. భగవంతుడు నన్ను చక్రవర్తిగ చేసినయెడల నేను ఆ యధికారమును ఇంతకు ముందెన్నడు నే చక్రవర్తియు ప్రవర్తించ జాలకుండినంత ఉత్తమ విధముగ చలాయించెదననియు, నన్ను నేల మీాద దొర్లునట్లు ఆన తిచ్చినచో ఇంతవరకు నెన్నడు నే ఫకీరును దొర్లలేనట్టి విధముగ దొర్లిపోవుదుననియు హుజూర్ సాహబ్జీ మహారాజువారు సెలవిచ్చి

యున్నారుకదా ! ఇది యొక మహత్తరమైన భవిష్యవాణి. మీరు సరిగ ఆలోచించుకొన్న యెడల ఇది పైకి చూడగ తమ్మును గురించి చెప్పుకొన్నట్లే కనిపించును కాని దాని భావార్థము చాల గంభీరమైనదని బోధపడగలదు. వారు తమపైన ఆరోపించుకొని జనులందరకును ఒక మహా విషయమును చెప్పదలచిరి. కావున ఇది ఒక్క వారికే గాని, లేదా వారి ప్రధాన శిష్యునకే గాని, లేదా ఒక్క రాధాస్వామీ సంఘమునకే గాని, వర్తించునది గాక సమస్త మనుష్య జాతికిని వర్తించునట్టి భవిష్యవాణి. ఇందు ఈ సమయమునకును, భవిష్య కాలమునకును రెండింటికిని వర్తించునట్టి సూచనలున్నవి. ఈ ఆజ్ఞయొక్క ప్రథమ భాగము సాహబ్జీ మహారాజ్ వారి సమయమునకు సరిగ వర్తించును. ఏలనన వారి వ్యక్తిత్వమే పూర్తిగ చక్రవర్తి లక్షణములతో నిండి యుండెడిది, అనియు వారు సంఘములో 'ఆరిస్ డెమో' (Aris Demo) అను సిద్ధాంతమును వ్యాపింపజేసి సంఘ సభ్యు లందరిలోను మహారాజ లక్షణముల నుత్పన్నము గావించిరనియు, మీ కందరకు తెలుసునుకదా ! వారు సత్సంగములోని పురుషులు తమ స్త్రీలను రాణి సాహబ్ అనియు స్త్రీలు తమ భర్తలను రాయ్ సాహబ్ అనియు పిలువవలెనని ఆజ్ఞాపించి యుండిరి కదా ! వారు సత్సంగులను సామాన్యముగ రాధాస్వామీ దయాళుని రాజకుమారులని పేర్కొనుచుండెడివారు. మొత్తము మీద వారి పద్ధతి యంతయు మహారాజార్హముగా నుండెడిది. ప్రపంచములో గూడ రాజులు, మహారాజులు, జమీందార్లు ఇలాకాదార్లకును ఆ కాలములో లభించిన గౌరవ ప్రతిపత్తులు భవిష్యకాలములో మరెన్నడు లభించనేరవు. ఈ దృష్టితో చూచిన యెడల ఈ భవిష్యవాణి యొక్క ప్రథమ భాగము వారి సమయమునకు సంపూర్ణముగ వర్తించునని రూఢియగుచున్నది. దాని రెండవ భాగము మన సమయమునకు సంబంధించి యున్నది. కావుననే సత్సంగాధికారి ఈ కాలములో కేవలము ఫకీరువలెను కూలివానివలెను పని చేసినప్పుడే కార్యము కొనసాగ గలదు. ఆయన స్వయముగా మట్టిలో దిగి పనిచేసి తను సంఘమునుగూడ తమతోపాటు అట్లే పని చేయించిరి. సమస్త సంఘమును బూడిదలోను మట్టిలోను దిగి పని చేయుచున్నది. సంఘములోని సభ్యు లందరు కర్షకులుగను కూలివాండ్రుగను అయిపోయిరి. లోకములో గూడ నీ సమయమున ప్రతి స్థలములోను ( Workers ) కర్షకులు, కూలివాండ్రకే ఆదర సత్కారములు లభించి వారే పైకి వచ్చుచున్నారు.

ఈ కాలములో దేశములోని గొప్ప గొప్ప మహారాజులు, రాజులును తమ రాజ్యములను గోల్పోయి సామాన్యులుగ మారిపోయిరి. వారి చేతులలో నుండి రాజ్యాధికారము తొలగిపోయి, ధన సంపత్తులు కూడ వారికి లేకుండ పోయినవి. ఇది యంతయు మట్టిలో దొర్లుటకాక మరి యేమగును ? కావున

దీనినిబట్టి ముందుకు పోవుచున్నకొలది అందరకును ఒకే విధమైన పరిస్థితి రాబోవనున్నదని తేటపడుచున్నది. భవిష్య కాలములో మహా భయంకరమైన రోజులు రాబోవుచున్నట్లు కన్పట్టుచున్నది. వ్యక్తిగత జీవనము చేయుచు నేమా నవుడు ఎక్కువ ధనసంపత్తులు సంపాదించజాలడు. దీనిని బట్టి సత్సంగులు నీతి పాఠము నేర్చుకొని మితవ్యయ జీవనము గడపుట అలవరచుకొన వలసియున్నది. మనము ఇప్పటి నుండియు కష్టములకు ఓర్చుకొని జీవితము గడుపుకొను విధా నము నలవరచుకొన వలయును. హుజూర్ వారు అందరికిని తమ జీవితములను భీమా చేయించుకొన వలయునని సలహా చెప్పిరి. హిందీ భాష విషయములో మాట్లాడుచు హుజూరువారు రాధాస్వామీ దయాళుని యొక్క సర్వ ప్రథమ వచనము హిందీభాషలోనే యున్నదనియు, మన మత గ్రంథము లన్నియు హిందీలోనే రచింపబడినవనియు, సెలవిచ్చిరి. ఇప్పుడు మన ప్రభుత్వము గూడ హిందీభాషనే రాష్ట్రభాష చేసిరి. కావున మీ రందరును అతి త్వరితముగ హిందీ నేర్చుకొనవలయును. హిందీ మాట్లాడుట వ్రాయుటయు నేర్చుకొనుటకై మీరు హిందీ ప్రేమ ప్రచారక్ చదువుచుండ వలయును. మీరు ఈ ప్రాంతము లోని బ్రాంచి సత్సంగ కార్యదర్శులందరకును వారివారి బ్రాంచీలలో సత్సంగు లందరు హిందీ తప్పక నేర్చుకొన వలయుననియు రాబోవు రెండు మాసములలో వారందరును హిందీ నేర్చుకొనునట్లు ఏర్పాటు చేయవలయుననియు ఒక సర్క్యు లరు (Circular) తయారుచేసి పంపవలయును. నన్నెవరవు నీవని యెవరైన ప్రశ్నించినచో నేను అన్నిటికన్న ప్రప్రథమముగ నేను హిందూ దేశీయుడ ననియు, ఆ తర్వాతనే పంజాబు దేశ వాస్తి ననియు చెప్పకొందును. మీలో ప్రతి వ్యక్తియుగూడ అట్లే నేను హిందూ దేశస్థుడననియే మొట్ట మొదట భావించుకొని, ఆ తరువాతనే ఆంధ్రప్రదేశ రాష్ట్రవాసినని భావించుకొలవలసి యున్నది. మీరు నాకు వ్రాసెడి ఉత్తరము లన్నియు హిందీలో వ్రాయవల యునుగాని తెలుగులో వ్రాయరాదు. నే నికముందు హిందీలో వ్రాసిన ఉత్త రములకే సమాధానము వ్రాయుచుందును. ఈ నోటీసు తెలుగు ప్రేమ ప్రచా రక్‌లో ప్రచురించవలయును. ఆ తరువాత స్టోర్సుల సామాను అమ్ముట విషయ ములో నిట్లు సెలవిచ్చిరి : మీలో నెవరు స్టోరులకు బాకీలు ఇంకను తీర్చకుండ నుండిపోయిరో అట్టివారు రాధాస్వామీ మతములో నాలుగు జన్మలలో ఉద్ధా రము అయిపోవున నెడి వాగ్దానము ఋణస్తులకు వర్తించ దనెడి విషయము బాగుగ తెలిసికొనవలయును. ఎవరెవరికి అట్టి బాకీ లుండిపోవునో వారు ఆ బాకీలు తీర్చుటకై తిరిగి జన్మ ఎత్తవలసి యుండును. ఋణస్తులకు రాధాస్వామీ ధామములో చోటులేదు. అచ్చట చోటు కావలయునని గోరువారు ఎట్టి ఋణ మును తమపైన తీర్చకుండ నుంచుకొనరాదు. అతి త్వరితముగ, కాదు కాదు, ఈ సమయమున వెంటనే మీ రా అప్పులను తీర్చివేయవలయును.

# 32

1950 జనవరి 25వ తేదీ రాత్రి సత్సంగములో హుజూరువారిట్లు సెల విచ్చిరి : మన దేశమునకు కొద్ది సంవత్సరముల క్రిందట లభించిన స్వాతంత్ర్యమును గురించి నలుదిశల ప్రతి స్థలములోను జను లందరు గొప్పగ చెప్పుకొనుచున్నారు. కాని నే నింతకు ముందే చెప్పినట్లుగ ఇంతవరకు మనకు రాజనైతికమైన స్వాతంత్ర్యమే లభించినదిగాని ఆర్థికముగా జూచినచో మన దాస్యము యథాప్రకారముగనే యుండిపోయినది. ఇప్పుడు మనము ఆర్థిక స్వాతంత్ర్యము పొందుటకై గట్టిగ ఆలోచించుకొనవలసి యున్నది. ప్రస్తుతము మన దేశములో ధాన్యము పంట చాల తక్కువగ నుండుటచే ధాన్యము పై దేశముల నుండి కొనుగోలు చేయు నిమిత్తమై, కోట్ల కొలది రూపాయల ధనము మన దేశము నుండి అమెరికా, అర్జంటైనా, ఆస్ట్రేలియా, కెనడా వగైరా పరాయి దేశములకు పోవుచున్నది. కావున నిపుడు మన ప్రభుత్వము గూడ ఆ ధనమును అట్లు పోకుండ 1951 సంవత్సరము లోపుననే ఆపుజేయ వలయుననియు భారతదేశము యొక్క ధనము భారతదేశములోనే ఉండిపోవు నిమిత్తమై మన దేశమున కవసరమున్న ధాన్యము నంతను మన దేశములోనే ఉత్పాదన చేయవలయుననియు ప్రయత్నము చేయుచున్నారు. ఈ విషయములో దయాల్బాగులో కూడ కావలసినంత పని చేయబడినది. ఒక్క వ్యవసాయము ద్వారా ధాన్యోత్పాదన మాత్రమే గాక పరిశ్రమలద్వారా ఇతర జీవితావశ్యకతలకు సంబంధించిన సామగ్రి కూడా తయారు చేయబడినది. దేశముయొక్క ధనమును బయటకు పోకుండ నడ్డుపెట్ట వలయునని భారత ప్రభుత్వమువారు నిశ్చయించుకొన్నట్లే మనము గూడ బయటనుండి దయాల్బాగులోనికి వస్తువులను కొని తెచ్చుకొనుట వీలైనంతవరకు కట్టిపెట్టి అట్టి వస్తువులను చాల తక్కువగ నుపయోగించుకొనవలయును. దయాల్బాగులో ఉత్పాదనమైన వస్తువులను మాత్రమే కార్ఖానాలలో గానిండు, పొలములలో గానిండు ఉపయోగించు కొనవలయును.

# 33

1960 జనవరి 26వ, తేదీ గణతంత్రి దినము ( Republic Day ) ఉదయము హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ నాటి శుభ దినము మాచు సౌభాగ్యము భారత దేశస్థులకు కొన్ని శతాబ్దులు గతించినపిమ్మట కదా లభించినది. ఇప్పుడు మన దేశమునకు లభించిన రాజనైతిక స్వాతంత్ర్యము స్వారాజ్యమును భగవంతుడు మనకు శాశ్వతముగ నుండునట్లు చేయుగాత! ఈ సమయమున విదేశములనుండి, మన దేశము వ్యాపారసరళిలోను మన అవసరములను బట్టియు

వస్తు సామగ్రిని కొనుగోలుచేయు విధానము కొంతవరకు యుక్తమును, సవ్యమునే అయినను, అట్లు పరాయి దేశములమీద ఆధారపడి యుండుట నిజమైన స్వాతంత్ర్యమని ఎన్నటికి చెప్ప బడజాలదు. ఈ రెండు పరిస్థితులలో నొక వ్యత్యాసమున్నది. అదేమనగా, ఒక పరిస్థితిలో మనకు నిజమైన స్వాతంత్ర్యము స్వరాజ్యమును లభించి నందువలన మనమెట్టి విధానము నవలంబించ గోరిన దానినే అవలంబించుటకు మనకు సంపూర్ణ స్వాతంత్ర్య మున్నది. రెండవ పరిస్థితిలో మనము మన పరిస్థితిని ఇతర దేశముల యెదుట పెట్టి, వారిపద్ధతి ననుసరించి మననీతిని మార్చుకొని ఆ ప్రకారమైన నడతను అవలంబించెదము. అందువలన నీ కార్యక్రమము పూర్ణ స్వాతంత్ర్యమని పేర్కొనబడజాలదు. పైగా ఇది ఒక చదరంగపు టాటయై పోవును. ఏలనన ప్రతి దేశమును ఆర్థికముగను, వ్యాపారికముగను, రాజనైతికముగను ఈ మూడు విధములుగను ఇతర దేశములు జాతులపైన గెలుపొంది, అభివృద్ధి నొంద ప్రయత్నించుచుండును. ఇందువలన పరస్పరమును ఈర్ష్యాభావము పెరుగుచుండును. ఇంతకుముందే మేము చెప్పినట్లు, మన మింకను మనోమాయలకు దాసులమై యున్నాము. మనకు రాజనైతికముగ స్వాతంత్ర్యము నిశ్చయముగ లభించి, **Interdependence** (పరస్పరాధారత) కూడ మనము అంగీకరించితిమి. అనగా, మనకు విదేశములతో ఆర్థికముగను, వ్యాపారికముగను, రాజనైతికముగను స్థిరమైన సంబంధము ఏర్పడినది. కాని, యీ రెండు విషయములును లభించినను, మనము మనోమాయలకు నిరంతరము దాసులమై యుండిపోయి, వాస్తవముగ స్వతంత్రులమని పేర్కొనబడ జాలము. కావున, మన మీరోజున హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు, ఆ దయాళురు మన ఆత్మను మనోమాయల మాలిన్యమునుండి తొలగించి నిర్మలముగను, పవిత్రముగను చేసి తమచరణములందు లగ్నము చేసికొనవలయుననియు, ఇప్పుడు చదివిన శబ్దములో చెప్పినట్లుగ మనలను తమ చరణములందు చంటిపిల్లలవలె నంటియుండిపోవునట్లు చేయుదురుగాక యనియు ప్రార్థన చేయవలయును.

## 34

1950 జూన్ 24 రాత్రి సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: ఈ దినమువంటి దినము లింతకుముందును గూడ నెన్నియో రాగలవు. మన మెట్టి కార్యక్రమ విధానము నవలంబించినందువలన మనకు పూర్వ సద్గురువుల స్మృతి మన హృదయములో నిత్యనూతనముగనుండి వారిసేవలో శ్రద్ధాభక్తుల పుష్పము లర్పించు సౌభాగ్యము కల్గునో, మన మీ నాడు ఆలోచించుకొనుట మన కర్తవ్యము. నా యభిప్రాయములో వారియొక్క సర్వోత్తమమైన స్మృతి

విధాన మెద్ది యనగా వారు తమ వచనములలో సెలవిచ్చిన విషయములును, భవిష్య కాలమునకు వారు సెలవిచ్చిన హితవాక్యములును నెరవేరునట్లు చూచుటయే. మనకు వారివచనములు పూర్తియగుచున్నట్లు చూచెడి సౌభాగ్యము లభించినందులకు మనము సంతోషముతో వారి చరణ కమలములయందు కృతజ్ఞతా పూర్వక ధన్యవాదము లర్పించవలసి యున్నది. ఇంతియేగాక మనము యథాశక్తిగా వారి కార్యమును పూర్తి చేయుటకై ప్రయత్నించవలసి యున్నది. మన మీ విధముగ వారి కార్యము పూర్తిచేయ వలయునను ప్రతిజ్ఞ బూని అందు కెవ్విధముగ నాటంకము కలుగజేయ కుండునట్లు నిశ్చయించు కొన్నయెడల వారు సెలవిచ్చిన కార్య మెద్దియు అసంపూర్ణముగ నుండిపోజాలదు. హుజూర్ రాధాస్వామీ దయాళురు మహోదయా కటాక్షములతో ఇచ్చటి జనులలోను, ఇచ్చటి శక్తులలోను, వారి కార్యము పూర్తిజేయగల పరిస్థితులు కల్పించగలరు. కావున వారి వచనములను పూర్తిచేయు నిమిత్తమై ఇచ్చటి వారందరును దిన దిన ప్రవర్ధమానముగ ముందంజ వేయుచుండవలయును. మీరిట్లు చేయుచున్నయెడల యుక్త సమయమున నా కృత్యములు పూర్తియైపోవు చున్నట్లు తెలిసికొనగలరు. మరియు మన మట్టి పరిస్థితిలోనే వారి దివ్యస్మృతి మన హృదయములందు నిత్యనూతనముగ నుంచుకొని, మన మీనాడు వారి చరణ కమలములందు శ్రద్ధాభక్తిరూప పుష్పముల నర్పించ యోగ్యతగలవార మగుదుము.

## 35

1950 అక్టోబరు 20వ తేదీ పరమగురు మహారాజ్ సాహెబ్ వారి భండారా దినమున సత్సంగ్ - కే - ఉపదేశ్ — 3వ భాగములో 77 వ వచనము సత్సంగములో చదువబడినది. అటుపిమ్మట హుజూర్ మెహతాజీ మహారాజువారు ఇట్లు సెలవిచ్చిరి : దయాల్బాగు వస్తువులను కొనుగోలు చేయవలసినదని మిమ్ముల నెందులకు ప్రోత్సహించుచున్నామో మీ కందరకు నీ వచనమును బట్టి సులువుగ బోధపడగలదు. మీరు ఇదియొక పారమార్థిక కార్యమని భావించుకొనుచుందురు. కాని మీరు కొన్న సామగ్రియొక్క మూల్యమును వెంటనే చెల్లించి మీ పద్దులో బాకీలేకుండ చేసికొనని యెడల మీకిది ఉద్ధార సాధనము కాకుండ, అనగా, ముక్తిదాయకము కాకుండ కేవలము ఋణ కార్యమే అయి మీరు ఈ ఋణమును తీర్చుకొనుటకై ఈ ప్రపంచమున తిరిగి జన్మ ఎత్తవలసియుండును. అట్లుగాక మీరు ఈ వస్తువుల మూల్యమును చెల్లించి మీ పద్దులో బాకీ లేకుండ చేసికొన్నయెడల మీరు ఉద్ధార కార్యక్రమమున

కవసరమైన షరతులు పూర్తి చేసికొన్నవా రగుదురు. మీకా పరిస్థితిలో ముక్తి లభించగలదు. అట్లే మరియొక పనిని గురించి కూడ (కృషికార్యమును గురించి యిందు సంకేతము కలదు) మేమమీతో రెట్టించి యేల చెప్పుచుంటి మనగా ఆ కార్యము కూడ మీ కట్లే లాభదాయకముగ నుండగలదనియే మీరు తెలిసికొనవలయును. భండారా సమయమున కేవలము ఆరతి నిమిత్తమై కూర్చుండుటయు, మధ్యాహ్న సమయమున అందరు కలసి భోజనము ఒకేచోట చేయుటయును చాలదు. ఈ కార్యక్రమము నిస్సంశయముగ పారమార్థికోద్దేశ్యమును సాధించు సందర్భములో ఒక అడుగు ముందుకు తీసికొని పోగలదు. కాని అంత మాత్రముతోనే సంతృప్తి పడుట సరిగాదు. మీరు రాధాస్వామీ దయాళుని ఆజ్ఞలను పాలించిన పరిస్థితిలోనే మీకు పరిపూర్ణలాభము చేకూరగలదు.

## 36

1950 డిసెంబరు 26 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వా రిట్లు సెలవిచ్చిరి : ప్రస్తుత కాలములో మొక్కజొన్నలు, సజ్జలును తినుటకు స్వాదిష్టముగ నున్నవి. నేను రెండుపూటలు నీ రెండు ధాన్యములనే ఉపయోగించుచున్నాను. ప్రతిమనుష్యుడు నట్లే అలవాటు చేసికొనవలయును. మీరు భండారా సమయమున దయాల్బాగులో పండించిన పదార్థములతోను, నేతితోను తయారుచేసిన భోజ్య సామగ్రినే తీసికొని వచ్చిన యెడల హుజూరు మహారాజు వారు ఆ పదార్థమును స్వీకరించెదరు.

## 37

1950 డిసెంబరు 27వ తేదీ ప్రాతఃకాలము ఆరతి అయిన పిమ్మట హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : "రాధాస్వామీ దయాళుని వద్దనుండి మనము ప్రార్థించవలసిన దెద్ది?" యనెడి శీర్షికగల వచనమును బహుశః డిసెంబరు 24వ తేది సాయంకాలము సత్సంగములో చదివిరి. ఆ సమయమున ఆ వచనములో హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు మన కందరకును వారు భక్తి విశ్వాసములను దయచేయుదురుగాక యని ప్రార్థించవలయునని బోధింపబడినది. ప్రపంచము అంతటిలోను సర్వాధిక శక్తిమంతుడైన అమెరికా ప్రెసిడెంటు ట్రూమన్‌గారు ఆ రోజుననే క్రిస్టమస్ సందేశము నిచ్చుచు నిట్లు సెలవిచ్చిరి : ప్రపంచములో శాంతిప్రియులైన జనులందరును తాము నిస్సహాయులు, పరాధీనులుగ నుండి పోయితిమని, ప్రస్తుతకాలములో భయగ్రస్తులయి

పోవుచున్నారు. ఈ రోజున క్రిస్టమస్ సమయములో మనమందరమును భగవంతునియందు విశ్వాసము పెట్టుకొనవలసి యున్నది. అనగా ఇంతవరకు భగవంతుని మరచిపోయి యున్నట్టి మనమందరమును తిరిగి వారిని హృదయమున జ్ఞాపకము తెచ్చుకొన వలయును. మనమందరము భగవంతుని వైపునకు ఆకర్షితమగుటయే అత్యుచిత కార్యము. మనకు ఫిరంగులు, టాంకులు, బాంబులును శక్తిదాయకములు గానేరవు. భగవంతుని యందు దృఢ విశ్వాసమును, చుట్టుప్రక్కల జాతులతో కలసిమెలసి పరస్పర సహానుభూతి గలిగి యుండుటయు భ్రాతృభావముతో ప్రవర్తించుటయునే మనయొక్క శక్తి యని యనవలయును. వీని మూలముననే మనము ప్రపంచములో శాంతిని స్థాపించగలము. నాస్తికభావము ప్రధానముగాగల కమ్యూనిజం (Communism)తో మనము యుద్ధము చేయబూనుకొన్నాము. దీని నెదుర్కొను నిమిత్తమై మనము మన బాహుబలము మీదను, ఇరుగు పొరుగు, దేశప్రజల స్నేహము మీదను, వారల శక్తి సహాయముల మీదను ఆధారపడుచు భగవంతుని అస్తిత్వము మీద విశ్వాసము పెట్టుకొని పనిచేయవలసి యున్నది. హుజూరువారిట్లు సెలవిచ్చిరి: ఒకప్పుడు వీరు తమ భౌతిక శక్తి చూచుకొని గర్వ మదాంధులై సమస్త ప్రపంచమును హీనదృష్టితో చూచుచుండిరి. ఇప్పుడు దెబ్బలు తినిన మీదట పరిస్థితి ఎట్లు మారినదనగా అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఒక్కరేగాకుండ అమెరికాలో వలెనే ఇంగ్లండులో బ్రిటిష్ చక్రవర్తిగారు కూడ తమ దేశ ప్రజలకు క్రిస్మస్ సందేశము నిచ్చుచు మనజాతివారు ఈ ప్రపంచమున నాశనముగాకుండ మృత్యువాతను బడకుండ తప్పించుకొని బ్రతకవలెనన్న ఇంతవరకు మన హృదయములలో క్రియాశీలమైయున్న ఘృణ, ఈర్ష్యాభావము, శత్రుభావములను పూర్తిగ తొలగించుకొని మనలో ప్రీతి, సహానుభూతి, భ్రాతృభావమును ఉత్పన్నము చేసికొనవలసి యుండునని చెప్పియున్నారు. ఎట్టి ఆపత్తులు కష్టములు వచ్చినను మనము బెంబేలుపడక మన బాహుబలముతో వాని నెదుర్కొనవలసి యున్నది. ఢిల్లీలో కొందరు రాజనీతిజ్ఞులు బహుశః ప్రధానమంత్రియుగూడ భగవంతుని యందు మనము విశ్వాసము పెట్టుకొనవలసి యున్నదనియు, ఆ విశ్వాసమే మనలను ఈ యుద్ధములో కలుగబోయెడి నాశనము నుండి కాపాడగలదనియు కొద్ది రోజులక్రితమే చెప్పియున్నారు. దీనినిబట్టి కాలము మారిపోవుచున్నదని స్పష్టపడుచున్నది. ఈ మహా ఆపత్సమయములో భగవచ్చరణములందు విశ్వాసము పెట్టుకొని శరణ్యము పొందుట తప్ప మన సంరక్షణకు ఉపాయ మెద్దియు లేదు. కాని ఈ దేశములు ఆటమ్ బాంబులు, హైడ్రోజను బాంబులు వగైరా అస్త్రశస్త్రములు తయారు చేయుటకై కోట్లకొలది రూప్యములను వెచ్చించుచుండుటను బట్టియు ప్రెసిడెంట్ ట్రూమన్ గారి భాషణలోని అంతిమ వాక్యములను బట్టియు వారు కేవలము ఈ ఆపద్భయము వలననే భగవంతుని స్మరణకు తెచ్చు

కొనిరి. కాని తమకు భగవంతు డొక్కడే తప్ప మరొక దిక్కు లేరనెడి ఆర్తనాదము వారి హృదయాంతరాళమునుండి బయల్వెడలుట లేదని స్పష్టమగుచున్నది. పై రెండు విషయములను బట్టి ఈ జాతులవా రింకను తమ బాహుబలము మీదనే విశ్వాసము పెట్టుకొని తమ బాహుబలము వలననే శత్రువులను ఎదుర్కొని విజయము పొందవలెనని కోరుచున్నారని తేటపడుచున్నది. ప్రపంచములోని జాతులన్నియు తమ బాహుబలమునందు విశ్వాసము పెట్టుకొనక భగవంతుని యందే విశ్వాసము పెట్టుకొని ప్రపంచములోని సమస్త సహాయములను విడిచిపెట్టి ఒక్క భగవంతుని సహాయము మీదనే ఆధారపడనంతవరకు ఈ ప్రపంచము యొక్క పరిస్థితి బాగుపడనేరదు. మన యెట్టి పరిస్థితిలోను భగవంతుని చరణములందే విశ్వాసము పెట్టుకొనవలసి యున్నదని చెప్పుటయే యుక్తము. వారు మనకు శక్తిని ఎప్పుడు దయచేయుదురో అప్పుడే మనము ఆత్మ సంరక్షణ చేసికొనగలము. మన ఆత్మ సంరక్షణకు ఉపాయ మిది తప్ప మరియొకటి లేదు. భగవంతుని మన పరమపిత యని నమ్ముకొనుట అన్నిటికన్న నెక్కువ ఆవశ్యక విషయము. అట్టి నిశ్చయము, విశ్వాసమును కలిగిన మీదట మానవులలో భ్రాతృభావము దానంతటనదియే యుద్భవించి ప్రపంచములోని కలహములు, యుద్ధములన్నియును అంతమైపోవును. అంతియేగాని భగవంతుని యందు విశ్వాసముతో బాటు మన బాహుబలమునందు కూడ సమానమైన విశ్వాసము నుంచుకొను ప్రస్తుత పద్ధతి యుక్తము కాదు. అందువలన ప్రపంచమున శాంతియు స్థాపితము కానేరదు. మన ఆపత్తులకు అంతమును గలుగనేరదు.

## 38

1950 డిసెంబరు 31వ తేదీ రాత్రి సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : సంవత్సరము చివర లోకములో అధిక సంఖ్యాకులు గత సంవత్సరము యొక్క కార్య కలాప మంతటిని సింహావలోకనము చేసికొని రాబోవు సంవత్సరములో జరుగవలసిన కార్యక్రమమును నిర్ణయించుకొను చున్నారు. ఆ పద్ధతి ననుసరించియే వ్యాపారస్తులు తమ వ్యాపారములను గురించియు, కార్ఖానా యజమానులు తమ కార్ఖానాలలోని వస్తూత్పాదనము, వస్తువిక్రయములను గురించియు, గృహస్థులు తమ గృహ కార్యములను గురించియు, ఆలోచించుకొని ముందు సంవత్సరమునకై ప్రణాళికను తయారు చేసికొను చుందురు. ఈనాటితో ఈ సంవత్సరము అంతమై పోవుచున్నది కావున మన మందరము కూడ వ్యక్తిగతముగను, సామూహిక రూపముగను గత సంవత్సరములో మనము జరిగించిన కార్యకలాపము పైనను, మనము చేసిన పొరపాట్లపైనను

ఆలోచించుకొనవలసి యున్నది. ఆ పొరపాట్లు, లోపములను పారమార్థిక కృత్యములు సాగించుటలో గానిండు, లేక ఇతర విషయములలో గానిండు మన నిర్లక్ష్యము మూలమున కలుగవచ్చును లేక, కర్తవ్య నిర్వాహణములో లోపము వలన కావచ్చును, లేదా బుద్ధి పూర్వకముగా జేసినవైనను గావచ్చును. మనము మన తప్పిదములను, అపరాధములను, అశక్తతను ఆ దయాళురు క్షమించవలసినదని హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణముల వద్ద ప్రార్థన జేసికొనుచు ఇకముందు విధాయకమైన ఉత్తమ కార్యములను చేయవలయునను దృఢ నిశ్చయము చేసికొని ప్రవర్తించ వలయును. ఉత్తమమైన కార్యమొద్దియు మనము చేతులార విడిచిపెట్ట కుండునట్లు దృఢ ప్రయత్నము చేయవలయును.

చాల మంది జనులు మా అంతర్నేత్రమును వికసింప జేయుడని యడుగుచుందురు. అంతర్నేత్రము వికసించుట యనగ మీకు సులువుగ బోధపడగల అర్థ మేమనగా మీకు బుద్ధి వికాసము కలిగి, వివేక ముత్పన్నమై మీ ప్రస్తుత పరిస్థితియు, ఆదర్శమును, నడవడియును ఉన్నత స్థాయిలో నుండుటయే. అందువలన మీరు సూక్ష్మమైనట్టియు జటిలమైనట్టియు కఠిన విషయములను సులువుగ గ్రహించుకొని రాబోవు విషయములను గురించి కొద్ది గొప్ప సూచనలు ముందుగనే తెలిసికొని దానిని గురించి ఆవశ్యకమైన కార్యక్రమమును జరిపించుకొనగలుగుదురు.

మూడవ నేత్రము లేక అంతర్నేత్రము వికసించు పద్ధతి మరొకటి యేమనగా, మీ హృదయమున చెడు తలంపు లెవ్వియును రాకుండ ఆపుచేసికొని, మీ చిత్తవృత్తి రాధాస్వామీ దయాళుని చరణములతో నెల్లప్పుడు, "సాహబ్ ఇతనీ బినతీ మోరీ— లాగ రహే దృఢ డోరీ", అని చెప్పినట్లుగ అంటియుండి, ఇతర వ్యర్థ విషయములను దూరముగ నుంచుటయే. అనుక్షణము భగవచ్చరణముల స్మరణ జరుగుచునే యుండవలయును. ఎవరి పరిస్థితి యిట్లుండునో, లేక యెవరైతే తమ కట్టి పరిస్థితి కలుగులాగున ప్రయత్నము సేయుచుందురో అట్టి వారికి సమస్త క్లిష్ట విషయములును యుక్త సమయమునగాని లేక, అంతకు ముందుగనే కాని పూర్తిగ విడిపోవుచున్నట్లు అనుభవము కలుగుచుండును. వారికి గుప్తరూపముగ నట్టి సహాయము లభించుచుండును. తమ కష్టములన్నియు నట్లు సులువుగ తొలగింప బడుచున్నట్లు వారికి అనుభవము కల్గుచున్నపుడు వారు చకితులయిపోవు చుందురు. అట్టి పరిస్థితి కల్గినపుడు ఆంతర్య నేత్ర వికాసము వలన గలుగ వలసిన హోదాయు, ఫలితమును వారికిప్పుడే లభించి పోయినట్లేకదా ?

# 39

1951 ఏప్రియల్ 1వ తేదీ ప్రాతఃకాల సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి :

1. మిలీ నర దేహ యహ తుమ కో ।
   బనావో కాజ కుఛ అపనా ॥

(సారబచన్, బచన్ 15, శబ్ద 13)

2. మన ఇంద్రీ ఆజ ఘట మేం రోక ।
   గురు మారగ చలనా ॥ టేక్ ॥

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 14, శబ్ద 9 )

శబ్ద పాఠానంతరము హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : నిన్నటితో క్రితము ఆర్థిక సంవత్సరము గతించిపోయి, యీనాడు క్రొత్త సంవత్సరము ప్రారంభమైనది. ఈ సమయమున మనము హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణకమలము లందు ప్రేమ, భక్తి, శ్రద్ధ, విశ్వాసములను వరదాన మిప్పించుడనియు మా కష్టములను నివారించుడనియు ప్రార్థన చేయవలసియున్నది. ఇప్పుడు చదివిన శబ్దముల యొక్క ప్రథమ చరణములు మీరు భావన చేసికొను నిమిత్తమై రెండవ సారి తిరిగి చదివించ బడుచున్నవి. మీ రిండ్లకు వెళ్ళిన పిమ్మట నీ శబ్దములను స్వంతముగ చదువుకొని వీని వలన పథ ప్రదర్శనము నొందవలయును. పిమ్మట పైన వ్రాసిన చరణములను తిరిగి చదివిరి. ప్రతి దినము చదువుచున్న శబ్దము లన్నియు కూడ అత్యుత్తమమైనవియు, ప్రభావ యుతములును, శిక్షాప్రదములు నైనవే కాని, యీనాడు చదివిన శబ్దములు విశిష్ట రూపమున సారగర్భితములు. మహత్వ పూర్ణములు నైనవని హుజూరువారు సెలవిచ్చిరి.

# 40

1951 ఏప్రియల్ 14వ తేదీని పరమగురు సర్కార్ సాహెబ్ వారి భండారా అయినది. ఆరతి సమయములో నీ క్రింది శబ్దములను చదివిరి:

1. గురూ సంగ ఖేలూం నిస దిన ఫాస్ ।
   కరూం మై అచరజ బిమల్ బిలాస్ ॥

( సారబచన్, బచన్ 37, శబ్ద 29 )

2. హే సంతన సిరతాజ కృపాలా, హే గురు దీన దయాలా ।
హే సమరథ దేవన కే దేవా, హే సతగురు ప్రీతి పాలా ॥

( ప్రేమ సమాచార్ )

3. సతసంగ కరత బహుత దిన బీతే ।
అబ్ తో ఛోడ పురానీ బాన్ ॥

( సారబచన్, బచన్ 18, శబ్ద 12 )

ఆరతి అయిన పిమ్మట హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : మనము సత్సంగములో కూర్చుండుటకై మనకు లభించిన యీ సావకాశము యొక్క మహత్త్వమును తెలుసుకొని దానివలన సంపూర్ణ లాభము నొందవలసి యున్నది. ఈ శబ్దములు ఈ విషయముపైన సంపూర్ణ ప్రకాశమును ప్రసరించుచున్నవి. అట్లుగాక ఈ యమూల్య సమయమును నిర్లక్ష్యముగ వ్యర్థసంభాషణ చేయుచు, దొంగ సాకులు చెప్పకొనుచు పాడుచేసుకొని, అటు పిమ్మట దొంగ క్షమాపణలు చెప్పు కొన్న యెడల మనమట్టివారిని అడ్డుపెట్ట నవసరములేదు. కాని ఈ పద్ధతి హానికరమనియు, మూర్ఖత్వ పూరిత మనియు, వారికే చివరకు బోధపడగలదు. అట్టివారు ప్రాపంచిక జీవులవలెనే, ఇటునటు తిరుగులాడి తమకు లభించిన శుభ సమయమును, ఉత్తమ సావకాశమును వ్యర్థ పుచ్చుకొనుచున్నారు. అయితే, యివ్విధముగ పోగొట్టుకొన్న సావకాశము మరెన్నడు తిరిగి రానేరాదు.

# 41

1951 మే 6వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : దయాల్బాగులో సమస్త కార్యములును పరస్పర సహకారముతో చేయబడుచున్నవి. అయినను, ఈ కాలనీ నివాసులలో కొందరు, పరస్పర సహ కార పూర్వకమైన కార్యములలో పాల్గొనకుండ నున్న వ్యక్తులు కూడ నుండ వచ్చును. అందుచే మీా కేకష్టమును లేకుండగనే పాల్గొనుటకు సాధ్యమయ్యెడి ఒక బహు సులభకార్యము నే నిపుడు చెప్పెదను. అదెద్దియనగా, చాల చిన్న చిన్న బంగాళాదుంపలు కృషి విభాగములో మిక్కుటముగ నున్నవి. ఈ దుంప లను దాచి నిల్వజేయుటకు కోల్డు స్టోరేజి (Cold Storage) లో నేమియు నేర్పాటు లేదు. కావున ప్రతి వ్యక్తియు విరివిగ నీ దుంపలను కొనుగోలు చేసిన యెడల, కొద్ది రోజులలో నివన్నియు అమ్ముడయిపోవును.

సత్సంగు లత్యుత్సాహముతో నిందు కంగీకరించిరి.

## 42

1951 మే 17వ తేదీ సాయంకాల సత్సంగములో నీ క్రింది శబ్దము చదువబడినది :

జో తుఝే చల్నా హై తో ఇస ఢంగ చల్ ।
జో ఖిజర్ హై తౌ భీ గురు కే సంగ చల్ ॥ (54)

అందులో మధ్యన యీ క్రింది చరణ మున్నది :

గురు కే తాడ్ ఔర్ మార్ సహ ధర కర్ పియార్ ।
మూరఖ ఖోం కీ అస్తుతీ పర్ ఖాక్ డార్ ॥ (62)

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 19, అశఆర్ సద్గురుమహిమా)

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : సంత సద్గురువు యొక్క శిక్షాప్రదమైన తీక్ష్ణవచనములను ధైర్యముగ సహించుకొన్న యెడల, అట్లు సహించుకొన్న వ్యక్తికి అత్యుత్తమ లాభము చేకూరును.

హుజూరువారు అందరి వైపునకు తిరిగి ఇట్లు ప్రశ్నించిరి : మీ కెవరికైనను సంత్ సద్గురువు వలన బహిరంగముగ నందరి యెదుట చీవాట్లు పొందిన అనుభవము కలిగినదా? ఆ చీవాట్లు పెట్టిన సమయములో మీ మనస్సుపైన నెట్టి ప్రభావము కల్గినది ? చుట్టు ప్రక్కల నున్న వారి మనస్సులపైన నెట్టి ప్రభావము కల్గినది ? అట్లు చీవాట్లు తిన్న పిదప మీరు మీ పని నెరవేర్చుచుండినపుడు మీకు కల్గిన శుభపరిణామము లేమి ?

కొందరు సోదరులు తమ తమ అనుభవములను చెప్పుకొనిరి.

## 43

1951 జూలై 8వ తేదీ సాయంకాలము 4 గంటలవేళ ఉపాధ్యాయినుల సభ ఒకటి జరిగినది. అందు హుజూరువారిట్లు సెలవిచ్చిరి : కళాశాలలు, పాఠశాలల యొక్కయు ఉపాధ్యాయినులును, విద్యార్థినులును ధరించు దుస్తులు నిరాడంబరముగను, రమణీయముగను ఉండి వారి జీవన విధానము పరిశుద్ధముగను, సరళముగను, ప్రేమపూరితముగను ఉండవలయును. గాఢమైన రంగు కలిగి మెరియుచున్న బట్టలను ధరించవలయును. శిరసున ముసుగు లేకుండ నుండ

కూడదు. పౌడర్లు, లిప్‌స్టిక్కులు, మరియు నితరములైన తళుకు బెళుకు సామగ్రులను ఉపయోగించకూడదు. కళాశాలలు, పాఠశాలల యొక్కయు సంఘము ఈ విధమైన సామాన్య జీవితమును గడుపుచుండిన యెడల వారిని చూచి దయాల్బాగులో నున్న ఇతర స్త్రీలు గూడ వారి ననుకరించి నడచుకొనగలరు.

## 44

1951 జూలై 8వ తేదీ ఆదివారము విద్యార్థుల సత్సంగములో హుజూరువారు ఉపాధ్యాయులతో నిట్లు సెలవిచ్చిరి : క్రితముసారి మన మందరము నిచ్చట కలిసికొన్నది మొదలు ఇంతవరకు మీకందరకు నొక సంవత్సరము వయస్సు పెరిగినది. మీరు పనిచేయుచున్న సంస్థలకు గూడ నొక సంవత్సరము గతించినది. ప్రతి మానవుడు నిట్టి సమయమున రాబోవు సంవత్సరములో నేమి చేయవలసి యున్నది అను విషయమును గురించి ఆలోచించుకొనుచుండును. ఏలనన, మీరు స్వంతముగ మీ ఒక్కరి శారీరక, మానసిక, ఆర్థిక లాభము కొరకు మాత్రమే పనిచేయుటతోనే మీ బాధ్యత అంతయు తీరిపోయినదని తలంచక, మీ బంధువులు, ఆ బంధువుల బంధువులు నూతనముగ సంబంధము గాబోయెడి బంధువుల యొక్కయు లాభమును గూడ మనసున పెట్టుకొని, మీ సంస్థకు సంపూర్ణ శ్రేయస్సు గూడ కలుగజేయవలసి యున్నది. దీని భావమేమనగా మీరు విద్యార్థుల క్షేమము నెల్లప్పుడు దృష్టిలో నుంచుకొనవలయుననియే. వారియొక్క బసలు, విశ్రాంతి, ఆహారపానీయములు వగైరాలకు తగిన యేర్పాట్లు చేయవలసియున్నది. మీ తరఫునుండి వారికి సంపూర్ణ సహాయము లభించవలయును. మీయొక్కయు, వారియొక్కయు కార్యక్రమమంతయు సంస్థకు అభివృద్ధి గలుగ జేయునట్లుండవలయును. విద్యార్థుల పరీక్షాఫలితములు బాగుగ నుండవలయును. క్రమశిక్షణ యుత్తమ విధముగ నుండి సంస్థయొక్క పేరు ప్రతిష్ఠలు వృద్ధియై విద్యార్థులు స్వాస్థ్యముగలవారును, ప్రతిభాశాలురును బాధ్యతా జ్ఞానము గలిగిన నవయువకులుగను తయారు కావలయును.

క్రమశిక్షణను దృఢతరముగ చేయు పద్ధతులు ఎన్నియో గలవు. కొందరు అందు నిమిత్తము శారీరక దండన యావశ్యకమని యనుకొనుచుందురు. మరి కొందరు అందుకు ప్రతికూలముగ నుందురు. శరీర మనస్సులకు విశ్రాంతి లేకుండ హడావిడిగ నిటునటు పరుగులెత్తి గంతులు వేయుచుండెడి చిన్న పిల్లలను శారీరక దండన చేయుట హానికరము కానేరదనియే నా అభిప్రాయము.

చాలసేపు కూర్చుండి పనిచేయునట్టి హెచ్చు వయసుగల పిల్లల విషయములో ఈ పద్ధతి యుక్తము కానేరదు. అట్టి వారితో ప్రేమ సహితముగను యుక్తముగను భాషించుటయే యెక్కువ ప్రభావకరముగ నుండును. ఇదిగాక మరొక లాభదాయక విషయ మెద్దియన వారితో సహానుభూతి ప్రదర్శించుచు ప్రవర్తించుటయే. మీరు వారితో సహానుభూతితో ప్రవర్తించినపుడు వారు మీ మాటను వెంటనే మన్నించి మిమ్ములను సంతుష్టపరచ గోరుచుందురు. ఇంజనీరింగ్ కాలేజీలో ప్రతి సంవత్సరము గత సంవత్సరము కన్న మిన్నయైన విద్యార్థులను జేర్చుకొనుటకై ప్రయత్నము చేయుచున్నారు కదా! చిన్నపిల్లల విషయములో కూడ అదియే పద్ధతి నవలంబించవలయును.

విద్యాసంస్థల కార్యకలాపమును మరొక దృష్టి కోణమును బట్టి కూడ పరిశీలించవలసి యున్నది. అది యేమనగ ఈ కాలమున కొందరు చాల సోమరితనముగను, నిర్లక్ష్యముగను కాలము వెళ్ళబుచ్చుచున్నట్లు మనము చూచుచున్నాము. అట్టి వారిలో నిరీక్షణ శక్తియు, ( Power of Observation ) ప్రేరణా శక్తియు (Initiative) బొత్తిగ శూన్యమై యుండును. అట్టివారు తమ కాలమును సోమరితనముగను, వ్యర్థసంభాషణలోను పాడుచేసికొని తత్ఫలితముగ తమ కార్యములను నెరవేర్చుకొనుటలో వెనుకబడిపోవు చుందురు. అట్లు పని వెనుకబడి పెరిగిపోవుచు రాగా చివరకు ఆ వ్యక్తికి అట్లు పెరిగిపోయిన పనిని గురించి జ్ఞాపకము కూడ నుండకుండపోవును. అట్టివారు తమకు సంబంధించిన గృహముయొక్క పరిశుభ్రతను గురించియు మరమ్మత్తును గురించియు ధ్యానము బొత్తిగ పెట్టుకొనరు. వా రట్టి అలవాట్లను విడిచిపెట్టి మొలకువగ నుండి నిరీక్షణ శక్తి కలిగి ప్రవర్తించవలయును. మీ నౌకర్ల యొక్కయు, ఉపాధ్యాయుల యొక్కయు ప్రవర్తనలో మీ కేమైన దోషములు కనబడినప్పుడు మీ రా విషయములో తగు చర్య తీసికొనవలయును. మేనేజింగ్ కమిటీ సదస్యులును, అధ్యక్షుడును అట్లు చేయవలసి యున్నది. మీరు మీ భవనములను పరిశుద్ధముగ నుంచుకొన్న యెడల, మీ ఛాత్రులకు మీ హృదయములును, మనస్సులును గూడ నట్లే స్వచ్ఛముగ నున్నట్లు భావన కలుగును. మీరు విద్యార్థులకు గూడ తమ శరీరములను వస్త్రములను, ఇతర వస్తువులను, తమ గదులను, ఆవరణాలను, స్వచ్ఛముగ నుంచుకొనవలయునని బోధించవలయును. నిరుపయోగమైన వస్తువులను ఇటునటు నిర్లక్ష్యముగ బారవేయ కూడదు. ఉపయోగకరమైన వస్తువులను వ్యర్థముగ పాడుచేసికొనగూడదు. పరిశుద్ధత ఆధ్యాత్మికతకు అతిసన్నిహిత శుభ లక్షణమని (Cleanliness is onxt to Godliness) పరిశుద్ధతను శ్లాఘించుచు నొక లోకోక్తి కూడ కలదు.

## 45

1951 సెప్టెంబరు 9వ తేదీ విద్యార్థుల సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి :

హుఈ గురు సన్ముఖ్ సురితి ప్యారీ।
వహీఁ ఘుట ప్రీతి జగీ సారీ ॥ 1 ॥
తడప్ మన్ గురు దర్శన్ కో ధాయ్ ।
ఉమంగ్ మన్ గురు సేవా కో చాహ్ ॥ 4 ॥

( ప్రేమబానీ, 1వ భాగము, 8 (2) వచనము, 15వ శబ్దము )

హుజూరువారు ఆఖరి చరణమును తిరిగి చదివించిన పిమ్మట మరొక శబ్దమును చదివించిరి : దానిలో నీ క్రింది చరణము లున్నవి.

కైసే చలూఁ రీ అధర్ చఢ్ సున్ నగరీ ॥ టేక్ ॥
గురు దయాల్ బిన కౌన్ సహాఈ ।
ఉన్ కే చరన్ మేఁ రహూఁ లగ్ రీ ॥ 2 ॥
వే దయాళ్ జబ్ దయా బిచారేఁ ।
తబ్ సురత్ చఢే అధర్ డగరీ ॥ 3 ॥

( ప్రేమ బానీ, 3వ భాగం, 13 (3) వచనము, 3వ శబ్దము. )

పాఠకుల కీ శబ్దము యొక్క భావార్థము బోధపడినదా యని హుజూరువారు అడిగిరి. ఒక పాఠకుడు ఇట్లు చెప్పెను : నా ఆత్మ అంతర్యమున పైకి ఆరోహించి ఉన్నత ధామము నెట్లు పొందగలదనియు, గురు మహారాజువారి దయా సహాయములు లేనిదే అది సాధ్యము కాదనియు, వారి దయవలననే అట్లు సాధ్యమగుననియు, నీ శబ్దార్థము. అందుపైన హుజూరువారు చాల సంతోషించి యిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములో వివరించిన విషయమును గురించి ముందు శబ్దములో గూడ కొంత వివరించబడినది. అదేమనగా, సేవ చేసినందు వలన ఆత్మ పైలోకముల కారోహించగలదని గురుమహారాజువారు సెలవిచ్చు చున్నారు. పూర్వ కాలములో లోకములో జనాభా తక్కువగ నుండుటచే జనులకు సేవచేయు సావకాశముకూడ తక్కువగ నుండెడిది. లోకములో జనాభా పెరిగిపోవుచున్న కొలది, కాలకర్మల జాలము వ్యాపించిపోవుచున్న కొలది, జనులకు కష్టములు, ఆవశ్యకతలు పెరిగిపోవుచున్నకొలది, వారి నా రప

త్తులు, కష్టములలో నుండి కాపాడి, ఆ జాలమునుండి విముక్తులుగ జేయుటకై సేవ చేయుటకు అవకాశములు పెరిగి, సేవా క్షేత్రము విస్తరించి పోవుచున్నది. అట్లే సత్సంగములో గూడ సేవా సావకాశముల క్షేత్రము మునుపటికన్న నిపు డెక్కువ పెరిగి పోయినది. పూర్వ కాలములో, సేవ యనగా, ఒక కుండెడు నీళ్లు తెచ్చి గురువుగారిని స్నానము చేయించుటయును, వారి చరణములను మర్దన చేయుటయును, లేదా, వారికి పంఖాగాని, మిఠాయిగాని అర్పించుట యును మాత్రమే. అట్లర్పించిన మిఠాయి పదార్థములో పెక్కు భాగము ఆ అర్పణ చేయువారికే తిరిగి యిచ్చివేయ బడుచుండెడిది గూడ. ఇక్కాలమునందు సత్సంగ మభివృద్ధి యైపోవుచున్నందున, దానితోపాటే సేవకు నూతన సావ కాశములు గూడ పెరుగుచున్నవి. ఇపుడు సత్సంగులకు శారీరకముగను, మాన సికముగను, సేవచేయుట కవకాశములు పలుదెసల నధికాధిక పరిమాణములో నున్నవి. ఒక్క సత్సంగులకే కాక, జీవు లందరికినిగూడ సేవచేయు సావకాశము లున్నవి.

ఈ సందర్భములోనే సత్సంగము విద్యా సంస్థలను కొన్నిటిని స్థాపించి ఇంకను స్థాపించబోవుచున్నది. వానిలో పని చేయుటకై సత్సంగి ఉపాధ్యాయు లను నియమించుట అత్యంతావశ్యకమై యున్నది. సత్సంగి ఉపాధ్యాయులు పిల్లలకు సత్సంగ పద్ధతులలో సేవాభావముతో, ప్రేమభావముతోను, సాను భూతితోను చదువు చెప్పుదురు. ఇప్పుడు దయాల్బాగ్ కళాశాలలు, పాఠశాలల లోను చదువుచున్న విద్యార్థులు సత్సంగి కుటుంబములలోని పిల్లలును, సత్సం గేతురుల పిల్లలును ఇచ్చటి వాతావరణము వలన లాభకరమైన విషయముల నెట్లు గ్రహించుకొని ఉత్తమ శీల స్వభావములను సంపాదించుకొనగలుగు చున్నారో అట్లే యీ పిల్లలు విద్యాభ్యాసము పూర్తియైన పిదప కళాశాలలు పాఠశాలలలోను పనిచేయుచున్న యెడల తమ విద్యార్థులలో గూడ అట్టి గుణ ములను, సద్వృత్తులనే పెంపొందించగలరు.

## 46

1951 అక్టోబరు 10వ తేదీన ప్రేమ పత్రిలోనుండి "యథార్థమైన భక్తులు భగవంతునికి ప్రియమైన పసిపిల్లలవంటివారు", అనెడి ఒకవచనము చదివిరి. అట్టివారిని ఆదరగౌరవములు చేయుట భగవంతుని సేవ చేయుటయే అగును. ఎవనికైనను సంత్ సద్గురువు లభించి వారిసేవ జేయు సౌభాగ్యము కలిగినచో ఆ సద్గురువు భగవంతునికి నిజముగ ప్రియుడై, సర్వకాల సర్వావస్థలయందు భగవంతునితో నైక్యముపొందియుండును. కావున అట్టి మహాపురుషునికి చేయు

సేవయంతయు భగవంతుని యొక్క సేవయే యగును. అట్టిసేవ చేసినందువలన ఆ సేవకునికి భగవంతుని చరణములయందు ప్రేమ దినదినాభి వృద్ధి నొందుచు భగవంతుని దయాకటాక్షములు అట్టివానిపై దిన దిన ప్రవర్థమానముగ వర్షించు చుండును అని ఈ వచనములో చెప్పబడినది.

హుజూర్ మెహతాజీ మహారాజువారు పై వచనములో "వారిసేవ" (ఉన్ కీ సేవా) అని ఉపయోగించబడిన పదముల కర్థ మేమి యని ప్రశ్నించిరి. ఇద్దరు ముగ్గురు సోదరులు, ఏవేవో సమాధానములు చెప్పిన పిమ్మట హుజూరువారిట్లు సెలవిచ్చిరి: 'వారి సేవ, యనగ నేమేమి కృత్యములు చేయవలసియున్నదని నే నడుగ లేదు. నా ప్రశ్న యేమనగ 'వారిసేవ' అను మాటలకు అర్థము వారు చేసెడి సేవయా, లేక వారికి మీరు చేయునట్టి సేవయా అని మాత్రమే. వారికి ఆ పరమ పితయొక్క సేవ చేయవలయుననియే కోరిక యుండును. కాని పరమ పితయొక్క నిజధార ఇచ్చటి కన్న నూర్ధ్వమున నున్నది. అనగా వారు పరమపితనుండి భిన్నులని భావము కాదు. మీరు మేమును ఇచ్చట నొకరికొకరు ఎదురుగా కనపడు విధముగ భగవంతుడు మనకు కనపడుట లేదనియే భావము అందువలన వారు భగవంతుని పిల్లలకు సేవ చేయుచున్నారు. ఏమన, ఈ వచనములో బోధితమైనట్లు, భగవంతుని పిల్లలకు సేవ చేసిన నది ఆ భగవంతునికి సేవచేసినట్లే అగును కదా. ఈ వచనములో వచ్చిన 'వారి సేవ' (ఉస్ కీసేవా) యను మాటలకు "వారు తాము స్వయముగ చేయునట్టి సేవ" యనికూడ అర్థము తీయవచ్చును. అయితే, పైపైన చూడగా, ఈ మాటల కర్థము, మొట్టమొదట సమాధానము చెప్పినదే సరియని తోచును.

ఆంగ్లభాషలో గూడ "His Orders are such and such" అను వాక్యమును రెండు విధములుగ నర్థము చేసికొనవచ్చును: (1) అతనికి ఇవ్విధమైన ఆజ్ఞ యివ్వబడినదనియు, (2) అతడు ఇవ్విధమైన ఉత్తరు విచ్చెననియు. ఒక భాషలో ఇవ్విధముగ వాక్యమునకు ద్వంద్వార్థ మున్నప్పుడు మరియొక భాషలో గూడ నట్లే ద్వంద్వార్థము తీయవచ్చును.

## 47

1952 మార్చి 2వ తేదీ సాయంకాల సత్సంగములో సాహబ్జీ మహారాజువారు 1926వ సంవత్సరములో సెలవిచ్చిన ఒక వచనము చదువబడినది. ఈ వచనములో బ్రహ్మ పురుషుడు జీవులయొక్క కర్మల ఋణము చాలవరకు తీరిపోవలయునను యుద్దేశ్యముతో అతని శక్తి సామర్థ్యములను, బుద్ధిని పూర్తిగ

వినియోగించి, జీవులకు న్యాయవిచారణ చేయు నిమిత్తమై ధర్మరాజును సృష్టించి మృత్యు విభాగము నాయన కప్పగించి రను విషయము చెప్పబడినది. ఈ కాలములో హుజూరు రాధాస్వామీ దయాళురు న్యాయవిచారణకు బదులుగ దయాకటాక్షముల ప్రసారసిద్ధాంతము నమలులో పెట్టి వారే స్వయముగ దయచేసివచ్చి ప్రసాదము మూలమున జీవుల కర్మలను నాశనము చేయునట్లేర్పాటు చేసిరనియు నీ వచనములో చెప్పబడినది. హుజూర్ మెహతాజీ మహారాజ్ వా రిట్లు సెలవిచ్చిరి: పూర్వకాలములో ప్రసాదముయొక్క మహత్త్వమును తెలిసికొనలేక దానికి తగిన గౌరవము ఇవ్వకుండ నుండిపోయిన వారు ఇప్పుడు ఆ తప్పిదమునకై ఎంత పశ్చాత్తాప పడవలసియున్నది? తాము చేసిన పూర్వపు తప్పిదమున కిప్పుడు వారు క్షమార్పణ కోరుకొనవలసియున్నది. అట్లు చేసినందువలన వారు ఇంతకుముందు గురు మహారాజువా రిచ్చినట్టి కాని, లేక వారు చూచినట్టి కాని, లేదా వారు స్పృశించినట్టి కాని యే యే పదార్థముల నుపయోగించిరో వాని వలన వారికి ఇప్పుడైనను, ఆ ప్రసాదలాభము చేకూరుట కవకాశము కలుగును. మేమీ విషయమును పరిహాసమునకు, చెప్పుటలేదు, యుక్తిగ మాటలాడవలెననిగాని చెప్పుటలేదు. ఇట్టి పొరపాటు స్వయముగ మేమే చేయుట తటస్థించినది. ఒకసారి హుజూర్ సాహబ్జీ మహారాజువారు లాహోరు దయచేసినపుడు వారి పళ్లెరములో భుక్తశేషము సత్సంగులు నాకు చెప్పకుండగ నాగదిలో నుంచివేసిరి. నేను రాత్రి పండ్రెండున్నర గంటలవరకు నా గదిలో నా ఆఫీసు కృత్యములను నెరవేర్చుకొనుచుంటిని. మరునా డుదయమే అక్కడనుండి వెడలిపోవలసి యుండెను. అంతవరకును నాకు ఆ ప్రసాదము అచ్చట నున్నట్లు యెవరును తెలుపలేదు. అందువలన దాని నచ్చటనే విడిచిపెట్టి హుజూరు వారితో మిగత ఊళ్ళకు ప్రయాణమై వెడలిపోయితిమి. ఏడెనిమిది రోజులు అయిన పిమ్మట ఆ ప్రసాద పదార్థము అన్నాళ్ళును అచట పడియున్నట్లు మాకు తెలిసినది. ఈ అజ్ఞానమునకై మా కెంత పశ్చాత్తాపము కలిగెనో మీరే స్వయముగ, నాలోచించుకొనగలరు. సాలునకు ఐదు భండారాలకు బదులు ఇప్పుడు 40–50 భండారాలు ఏర్పాటు చేయబడుటకు కారణము ఆ తప్పిదమే కాబోలు కారణము.

## 48

1952 డిశెంబరు 28 భండారా సమయములో ఆరతి జరుగుచున్నప్పుడు సత్సంగ్–కే–ఉపదేశ్–3వ భాగమునుండి 45వ వచనమును చదివిరి. అందు ప్రతి వ్యక్తికిని భగవంతుని దయ పొందు నిమిత్తమై ఈ క్రింద వివరించిన

మూడు మెట్లు దాటవలసియున్నదని చెప్పబడినది. (1) అతని పూర్వ సంస్కార ములు అతనిపైన విశేషదయ కలుగుట కవకాశము గలిగించ వలయును; (2) అతనిలో ప్రత్యేక విశేషదయ పొందవలయు ననెడి తీవ్రాసక్తి ఉండవలయును; (3) అట్టి ప్రత్యేకదయ పొందుట కతనిలో తగు యోగ్యత లేక, పాత్రతయు నుండవలయును.

హుజూర్ మెహతాజీ సాహెబ్ వారిట్లు సెలవిచ్చిరి : ఈ వచనమును బట్టి మన సంఘము ఈ సమయమున పైన చెప్పిన రెండవమెట్టు దాటుచున్న పరిస్థితిలో నున్నట్లు తేటబడుచున్నది. అనగా సత్సంగులలో నుత్తమ తరగతికి చెందిన యుత్కృష్టానుభవములను బొందవలయు ననెడి తీవ్రాసక్తి బయలు దేరుచున్నదని తేటబడుచున్నది. దీనితరువాత మనలో ఉత్కృష్టానుభవము లను పొందుటకు తగిన పాత్రతలేక యోగ్యత అంకురించవలయు ననెడి మూడవ మెట్టు పరిస్థితి రాగలదు. అందు నిమిత్తమై మనము అందు కర్హత కలుగజేయ గలిగినట్టి కార్యక్రమము నవలంబించవలసియున్నది. అట్లుచేసిన యెడలనే మనలో నట్టియోగ్యత జనించి హుజూరు రాధాస్వామీ దయాళునికి సత్సంగు లందరి వలన నెట్టి సేవ చేయించుకొన దివ్యేచ్ఛ గలదో అది పూర్తికాగలదు.

# 49

1952 డిశెంబరు 28న భండారా రోజున మధ్యాహ్నము భండారా భోజ నము ప్రారంభించుటకు ముందీ క్రిందిశబ్దమును చదివిరి :

చేతో మేరే ప్యారే తేరే భలే కీ కహూం ॥ 1 ॥

( సారబచన్, 19వ వచనము, 1వ శబ్దము )

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి :— ఈ శబ్దములో సత్సంగులు అవలంబించ వల సిన జీవితవిధానము సూచించబడినది. దానికి స్వార్థమునకు సంబంధించినట్టియు, పరమార్థమునకు సంబంధించినట్టియు పక్షములు రెండు గలవు. మన కందరకు నీ ప్రపంచములో నున్నంత కాలము సుఖశాంతులతోను, సంతోషముగను ఉండ వలయునను కోరిక యుండును. కాని మనము సుఖముగ నుండవలయునన్న ఇత రులను సుఖపెట్టుట యావశ్యక మగును. అందులోనే మీకు శ్రేయస్సు ఉన్నది. ఈ శబ్దములో నీక్రింది చరణములలో నావిషయమే చెప్పబడినది.

జీవ దయా తూ పాల్ । తేరే భలే కీ కహూం ॥ 12 ॥
దుఃఖ న దే తూ కాయ్ । తేరే భలే కీ కహూం ॥ 13 ॥

అర్థము :– జీవుల యందు దయ జూపుము. నీ మంచి కొరకు చెప్పుచున్నాను. జీవుల కెవరికిని దుఃఖము గలుగ జేయకుము. నీ మంచి కొరకు చెప్పుచున్నాను.

ఈ చరణములలో ఈ ప్రపంచములోని జీవిత విధానమును గురించి చెప్పిన మొదటి విషయ మిదియే. మీరు మీ శ్రేయస్సును కోరుచున్న యెడల ఈ క్రింది చరణములలో స్వామీజీ మహారాజువారు సెలవిచ్చిన విషయమును మన్నించవలసి యుండును.

బచన్ తాన్ మత్ మార్ । తేరే భలే కీ కహూం ॥ 14 ॥
కడువా తూ మత్ బోల్ । తేరే భలే కీ కహూం ॥ 15 ॥

అర్థము :– ఎవరిని కూడ ఎత్తిపొడుపుమాట లనకూడదు. నీ మంచి కొరకు చెప్పుచున్నాను.
ఎవరిని గురించియు దూషణ వాక్యములు పలుక గూడదు. నీ మంచి కొరకు చెప్పుచున్నాను.

ఎత్తి పొడుపు మాటలును దూషణ వచనములును చాకువలె మనస్సును కోత కోయును. ఒకని గుండెను చాకుతో కోసిన యెడల నతడు తిరిగి మీమీద తప్పక కత్తిని ప్రయోగించును. మనము జీవితములో దీనత్వముతో ప్రవర్తించుచు ఇతరులకన్న మనను అధికులుగ నెంచుకొనక వారికంటె అధములుగనే ఎంచుకొనవలయును. స్వామీజీ మహారాజు వా రిట్లు సెలవిచ్చిరి.

దీన గరీబీ ధార్ తేరే భలే కీ కహూం ॥42॥

అర్థము : నీవు పేదవానివలె దీనత్వముతో మసలు కొనుము. ఈ మాట నీ మంచికొరకే చెప్పుచున్నాను.

చేతితో పనిచేసిన యెడల హస్తములు మలినమై పోవుననియు అట్టి మానవుడు హరిజనుడు, కూలి లేక నౌకరు క్రింద నై పోవుననియు అందుచే చేతితో పని చేయకూడదనియు పూర్వకాలములో జనులు భావించుచుండిరి. స్వామీజీ మహారాజ్ వా రిట్లు సెలవిచ్చిరి :

లీక్ పురానీ ఛోడ్ తేరే భలే కీ కహూం ॥42॥

పురాతనపు టలవాట్లను విడిచిపెట్టుము నీమంచికొరకై చెప్పుచున్నాను. ॥42॥

స్వామీజీ మహారాజ్ వారు పురాతనపుటాలోచనలు విడిచిపెట్ట వలయునని సెలవిచ్చుచున్నారు. కావున మీ రావిషయమును మన్నించవలసి యున్నది.

ప్రతి చరణమునందును ఒక్కొక్క హితోపదేశము మీ శ్రేయస్సు కొరకై చెప్పబడియున్నది. కావున మీరు మీ శ్రేయస్సును గోరుచున్న యెడల హుజూరు స్వామీజీ మహారాజ్ వారు సెలవిచ్చిన ప్రకారము నడచుకొన వలయును. ప్రతి సత్సంగి సోదరియు, సోదరుడును ఈ శబ్దమును ప్రతిదినము నొక్కసారి పఠించవలయునని హుజూర్ మహారాజ్ వారు హితబోధ చేసిరని ఇప్పుడే రాయబహదూర్ గారు చెప్పిరి కదా!

# 50

1953 జనవరి 1 వ తేదీ ఉదయము హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: సభ యొక్క పంచవర్షీయ పారిశ్రామిక ప్రణాళికను గురించి సాహబ్జీ మహారాజ్ వారి స్మృత్యర్థమై అచ్చువేసిన స్మారక పత్రిక (In Memorium)లో ప్రారంభములోనే నేను హుజూరు సాహబ్జీ మహారాజ్ వారు 1933 వ సంవత్సరములో పంజాబు దేశము దయచేసిరని వ్రాసియుంటిని. అప్పుడు నేనును, ఇంకొక మిత్రుడును కలసి హుజూరువారి కొక చిన్న ప్రార్థన చేయదలచుకొని వారి సన్నిధానమునకు వెళ్ళితిమి. కాని కొన్ని కారణాంతరములచే నా సమయములో నా ప్రార్థనను నేను విన్నవించుకొనలేదు. కాని 1934వ సంవత్సరములో పూర్తిగ యావత్సంవత్సరము సత్సంగులకును, ఇతరులకును గూడ జీవితము నిశ్చింతగ గడుపుకొనుట కవసరమైనంత ఆహారము, వస్త్రధనములు వారి కిప్పించవలయునని రెండుపూటల భోజనమునకు ముందు ప్రార్థన చేయుచుంటిని. 1937వ సంవత్సరము తరువాత పరిస్థితులు కొంత మారినందువలన మొదటలో వారిచరణములందు యే ప్రార్థనను నేను చేయదలచుకొంటినో దానిని కార్యరూపముగ మార్చుటకై ప్రయత్నము చేయ దొడగితిని. ఈ సందర్భములోనే అమృతసర్‌లో నొకబట్టల మిల్లును, జనులకు అవసరమైనన్ని వస్త్రములు లభ్యమగునట్లు చేయునిమిత్తమై కొనియుంటిమి. తరువాత నిచ్చట పశువులకు తగినంత పచ్చిక లభ్యపరచుటకును, దయాల్బాగు నివాసులకును, బయట నుండి వచ్చెడి సత్సంగులకును తగినంత శుభ్రమైన ఆహారము లభ్యమగునట్లు చేయుటకును కృషికార్యము గూడ నిచ్చట ప్రారంభించిరి. ఈపని పది పండ్రెండు

సంవత్సరములనుండి ఇచ్చట జరుగుచున్నది. కాని గత రెండు సంవత్సరములలో సత్సంగులకు ఈ కృషికార్యమునందు శ్రద్ధ తీసికొనుట భారమగుచున్నట్లు కన బడుచున్నది. అందువలన నీ సంవత్సరము గోధుమలపంట తగ్గించి వేసితిమి. 225 ఎకరములకు బదులు 171 ఎకరములలోనే గోధుమలు వేసితిమి. గృహ నిర్మాణ విషయములో అటులనే 1938వ సంవత్సరములో రమారమి 60 క్రొత్త యిండ్లు కట్టించితిమి. అందువలన నిప్పుడు కొన్నియిండ్లు ఖాళీగ నుండిపోయినవి. కావున ఈ మూడు విషయములలోను ముందడుగు వేయుటకు బదులు ఒక విషయములో పురోభివృద్ధి నిలచిపోయి మిగతరెండు విషయములలోను వెనుకంజ వేయుట జరుగుచున్నది. అసలు అభిప్రాయమును ఉద్దేశ్యమును సమస్త జను లకు కష్టములు తగ్గించ వలయుననియే. అందరి జనులకును ప్రస్తుతము కలుగు చున్న కష్టములను చూడగ నాకు దుఃఖము కలుగుటచే ఈ అడుగు వేసితిమి. మీరిప్పుడు మీ నిజమైన లాభమును నిజమైన ఉద్దేశ్యమును మీ తెలివి తక్కువ వలన నర్థము చేసికొనజాలక తాత్కాలిక విశ్రాంతినే ప్రధానముగ నెంచు కొని ఈ కార్యక్రమమును జరిపించుట కిష్టపడక ఇప్పుడున్నట్లే నడచిపోవలయు నని కోరుచున్నయెడల మీ రట్లే చేసుకొనవచ్చును. ఆ విషయము మీ యిష్ట మునకే విడిచిపెట్టెదను. అట్లుగాక మరియొక విధముగ నడచుకొనుటకు, అనగా మీరు ఈ కార్యక్రమములో తోడ్పడుట కిష్టపడినయెడల మీకు 1953 నూతన సంవత్సరము శుభావహ మగుగాక!

# 51

1953 మార్చి 4, 5వ తేదీలనుండి పంజాబు పర్యటనము చేయ నారంభిం చిరి. ఆ పర్యటనములో నీలోఖేరి ( Nilokheri ) గ్రామములో నొక సోదరు డీక్రింది శబ్దమును చదివెను :

బినతీ కరూం పుకార్ పుకారీ ।
తీన్ తాప్ మేం జీవ దుఖారీ ॥

(ప్రేమబానీ, 1 వ భాగం. 6వ వచనము, 5 వ శబ్దము 42.)

హుజూరువారీ శబ్దమును మరియొకసారి చదివించి ఇట్లు సెలవిచ్చిరి : ఐదు సంవత్సరముల క్రితము శరణార్థి సోదరుల పరిస్థితి ఎట్లుండెనో, ఆ పరిస్థితియే సరిగ నీ శబ్దములో వర్ణింపబడినది. ఆ సమయములో వారు ఎట్టి మొరలు, ప్రార్థనలు చేయుచుండిరో నవియే ప్రార్థనలు, మొరలు నీ శబ్దములో వివరించ బడినవి. చాలకాలమునుండి ఈ క్రొత్తవలస పట్టణమును చూడవలయు నను

ఆస_క్తితో నుంటిని. ఇప్పుడు ఆ సావకాశము లభించి ఇచ్చటి సంస్థలు చూచుట జరిగినది. ఈ సమయములో నున్న కఠిన పరిస్థితుల ప్రభావము ఇచ్చటి కార్యస్థానాల పైన కనబడుచున్నది. అయినను, ఇచ్చట జరుగుచున్న కార్యక్రమము చాల ఉపయోగకరము, శుభప్రదముగనే యున్నది. ప్రతి మానవుడును ఈ సంస్థవలన పరిపూర్ణ లాభము పొందవలయును.

## 52

1953 జూలై 12 వ తేదీ విద్యార్థుల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు మీ కందరకును క్రొత్త విద్యా సంవత్సరము ప్రారంభమైనది. మీ వయస్సుకూడ ఒక సంవత్సరము ముందుకు సాగినది. మీలో నధమము నూటికి తొంబది తొమ్మండుగురు విద్యార్థులు ఒకతరగతి పైకి వెళ్ళిరి. వయసుతోపాటు నియమానుసారముగ మీ బాధ్యతలు పెరుగుచున్నవి. మీరీ క్రింది మూడు విషయములను గమనించుకొనవలసి యున్నది:

1. చదువు విషయములో మీకు ఉన్నసమయములో అధికాధిక భాగము విద్యా వ్యాసంగములోనే వెచ్చించ వలయును.

2. శారీరక వ్యాయామమును గురించి పూర్తి శ్రద్ధ వహించవలయును. అందు లోప మెంత మాత్రము చేయగూడదు.

3. పాఠశాలలలోను, కళాశాలలలోను జేరి చదువు సాగించుకొనగోరు విద్యార్థులు సమాజసేవ ( Social Service ) లో పాల్గొనవలయుననియు, అట్లు పాల్గొనని విద్యార్థులను విద్యాలయములలో జేర్చుకొన గూడ దనియు, చేర్చుకొన్న యెడల వారిని వేరు పరచవలయుననియు, ప్రభుత్వము వారి శిక్షా విభాగము నుండి ఉత్తరువు వచ్చియున్నది.

దయాల్బాగులో సామాజిక సేవా కార్యము కొంతకాలము నుండి జరుగుచు బాల బాలికలును, స్త్రీ పురుషులును, వయోవృద్ధులు, యువకులు అందరును అందు పాల్గొనుచుండిరి. మీ రందరును ఇచ్చట జరుగుచున్న సమాజసేవకు సంబంధించిన కార్యక్రమములో తప్పక పాల్గొనవలయును. మన దేశమున కిది చాల ఆవశ్యక విషయము.

## 53

1956 ఫిబ్రివరి 5వ తేదీ: హుజూరువారు ఫిబ్రివరి 4వ తేదీన లూధియానా చేరుకొనిరి. అక్కడ ప్రాతఃకాల సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి: పంజాబు దేశములో ముఖ్యముగ స్త్రీలు విదేశీ వస్త్రములను కొనుచు పొడుగైన అంగీలను ధరించుచుందురు. అందువలన వ్యర్థముగ ధనవ్యయ మగుచున్నది. ఢిల్లీలో జరిగిన వస్తు ప్రదర్శనము వలన హిందూ దేశములో చాల మంచి వస్త్రములు తయారగుచున్నట్లు తేట పడుచున్నది. దృఢమైనట్టియు, అందమైనట్టియు బట్టలు తయారు చేయుటలో దయాల్బాగు ఇతర స్థలములకన్న నేమియు తీసిపో లేదు. ఐనను గూడ మన స్త్రీలు బయట నుండి వచ్చుచున్న బట్టలనే కొనుచు వ్యర్థవ్యయము నెందుకు జేయుచున్నారో కారణము తెలియుటలేదు. సత్సంగ ప్రబంధకులను దూషించుచు వివిధ దోషారోపణలు చేయుచు ఆకాశ రామన్న ఉత్తరములు వ్రాయుచున్నారు. ఇది చాల అయుక్తమైనపని. వారు తమ సంతకముతో నట్టి ఉత్తరములను వ్రాసి ఆ విషయములను పరిశీలన చేయుటకు వీలుగ నుండునట్లు చేసిన యెడల పౌరుషముగ నుండును. తిరిగి హుజూరువారు అందరను తమ ఆదాయమునకు మించకుండ ఖర్చు పెట్టుకొనవలయుననియు, సాదా వస్త్రములనే ధరించవలయుననియు, తమ ఆదాయము నుండి నెల నెలకు కొంత నిలువ చేసికొనవలయుననియు సెలవిచ్చిరి.

## 54

1957 జూన్ 24వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి: సత్సంగు లెవరు నీ తేదీని మరచిపోజాలరు. ఇదే రోజున 1937వ సంవత్సరములో రాత్రి 8—30 గంటలకు సాహబ్జీ మహారాజు వారు తమ దేహ స్వరూపమును విడిచి వెడలిపోవు దివ్యేచ్ఛ ధరించిరి. ఈ రోజున మనమందరము వారి పవిత్ర స్మృత్యర్థమై సత్సంగము చేయుచున్నాము. ఆ దయాళుని పవిత్ర స్మారక చిహ్నముగ నీ సమయమున వారు రచించిన 'యథార్థ ప్రకాశ్' అనెడి పవిత్ర గ్రంథము యొక్క తృతీయ సంపుటములోని (ఈ గ్రంథములో సాహబ్జీ మహారాజువారు వివిధ మతములను గురించి తమ యభిప్రాయములను ప్రకటించిరి.) కొంత భాగము యొక్క ఆంగ్లానువాదమును ఇప్పుడు మీ యెదుట ప్రస్తుత పరచుచున్నాము. ఈ భాగములో ఆర్య సమాజ మతమునకు సంబంధించిన విమర్శ యున్నది. యథార్థ ప్రకాశ్ తృతీయ భాగములో చివర అనుబంధ రూపములో వ్రాసియున్న ప్రశ్నోత్తరముల ఆంగ్లాను

వాదమును ఈ భాగములో చివర అనుబంధించబడినది. ఈ సంపుటము యొక్క అవశిష్ట భాగములో శిక్కుమతము సనాతన ధర్మమును గురించియు విమర్శ యున్నది. దానిని ఈ తర్వాత అనువదించి అచ్చొత్తించెదము.

పిమ్మట హుజూరువారు ఈ గ్రంథముయొక్క ఆంగ్లాను వాదమును సాహబ్జీ మహారాజువారి చరణములపైన సమర్పణ చేయుచు వ్రాసిన పంక్తు లను చదివి వినిపించిరి.

'ఉత్తమోత్తములు, పరమోదార మూర్తియు ఆధ్యాత్మిక మండలము లలో ఉదారోద్యమములను ప్రోత్సహించు మహోత్తేజ ప్రదాతయు నైన 1937 జూన్ 24వ తేదీన మదరాసులో నిర్యాణమైన పవిత్ర స్వరూపులు సాహబ్జీ మహారాజ్ సర్. ఆనందస్వరూప్ Kt (నైట్) వారి చరణ కమలములకు ఈ యథార్థ ప్రకాశ్ ఆంగ్లానువాదము కృతజ్ఞతా సూచకముగ అతి దీనత్వ ముతో పూర్ణ శ్రద్ధా భక్తులతో ప్రేమ సహిత పావన స్మృతి సూచకముగ నంకిత మీయబడినది' వారి దివ్య సందేశము.

పిమ్మట నా పుస్తకముల నన్నిటిని సత్సంగులు వెనువెంటనే కొనుగోలు చేసిరి. హుజూరు వా రిట్లు సెలవిచ్చిరి :

మీలో దయాల్బాగు సత్సంగమునకు సంబంధించిన వారుగాని, దయా ల్బాగు నివాసులుగాని, ఎవరు గలరో వారు 1937 వ సంవత్సరములో తమ యాంతర్యపరిస్థితి ఎట్లుండెనో, ఇరువది యేండ్లైన పిమ్మట నిప్పుడు గూడ అది అట్లే యున్నదా లేక అందులో ఆంతర్య బాహ్యములలో నేమైన ఉత్తమ పరి వర్తన కల్గినదా యనెడి విషయమును ఎప్పుడైన నాలోచించుకొనిరా ? మీ యొక్క ఆచార వ్యవహారములు, భక్తి విశ్వాసములు నిపుడు గూడ మొదటలో వలెనే యున్నవా? లేక వానిలో మార్పేమైన కలిగినదా? మీకీ విషయము లలో లోపము కలుగుచున్నట్లు తోచినయెడల మీరిక్కడనుండి మూట ముల్లె కట్టుకొని మీకు విశ్వాసము, నమ్మకము నెచ్చట హెచ్చుగనున్నదో అట్టి స్థల మునకు వెడలిపోవుట శ్రేష్ఠము. మీ రిచ్చటనుండుచు మీ అభిమానము, విశ్వాసమును మరొక స్థలమున పెట్టుకొనుట యుక్తమైన పద్ధతికాదు. మీకు అభిమానము, విశ్వాసమును మరొకస్థలమున నున్నపుడు మీ రిచ్చటనుండుట నిరర్థకము. మీ శరీరమును గూడ తీసికొని అచ్చటకు వెడలిపోవుటయే శ్రేష్ఠము. మీ రిక్కడ యుండవలసి యున్నచో చక్కగ నాలోచించుకొని మీరు దయా ల్బాగు నందు దృఢ విశ్వాసముగల సత్సంగియై యిచ్చట నివసించవలయును. అంతియే కాని మీ కిక్కడ దయాల్బాగులో నేదేని గృహమునందు నివాసపు

హక్కు లభ్యమైనదనిగాని, ఇచ్చట బ్యాంకులలో మీకు ఫిక్సెడ్ డిపోజిట్లు ఉండిపోయినవనిగాని, లేదా ఆ బ్యాంకులలోగాని మరియొక కంపెనీలోగాని మీకు షేర్లున్నవని గాని, లేదా మీ పిల్లలు ఇక్కడ విద్యాలయములలో చదువుకొను చున్నారని గాని యోచించుకొని ఆ కారణమువలన నిచ్చట నివాసముండుట బొత్తిగ అయుక్తము. బయటనున్న సత్సంగులకు నివాసముండువారిని దృఢ విశ్వాసముగల సత్సంగులని అభిప్రాయముండును గావున అట్టి విశ్వాసము లేకుండ పైన చెప్పిన బంధనముల మూలముననే దయాల్బాగులో నెవరైన ఉన్న యెడల వారిమూలమున ఇతరులపైన చాల గొప్ప దుష్ప్రభావము కలుగగలదు. కావున మీలో నీ విధమైన చోరు డెవరైన దాగి యున్న యెడల ఆ చోరుని బయటకి పంపివేయవలయును. అట్లు చేసినందువలన జనులందరి పైనను సత్ప్రభావము కలుగుటయే గాక మీకును ఆ పద్ధతి నవలంబించినందువలన శ్రేయస్కరముగ నుండును.

## 55

1957 జూలై 18వ తేదీ సాయంకాల సత్సంగమైన తరువాత దయాల్బాగు నివాసుల సామాన్య సమావేశమొకటి ( General Meeting )వివాహ విషయములను గురించి జరిగెను. కొందరువక్తలు మాట్లాడిన పిమ్మట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: సత్సంగి నవయువకులు, సత్సంగేతరుల ఆడపిల్లలను వివాహమాడ గూడ దనెడి ప్రస్తావము జరిగిన పిమ్మట అట్టి వివాహములు సత్సంగేతరులతో చేసికొంటిమనిగాని చేసుకొనదలచుకొంటిమనిగాని మా కెవరైన తెలియపరుచుచు ఉత్తరములు వ్రాసినయెడల మేము వానిని చిత్తుకాగితముల బుట్టలో పారవేయుదుమే గాని అందుకు సమాధానమేమియును వ్రాయజాలము.

## 56

1957 ఆగస్టు 17వ తేదీ సాయంకాల సత్సంగమైన పిమ్మట ప్రే. భా. డి, సుబ్బారావుగారి సుపుత్రుడైన అమృతస్వరూపుయొక్క వివాహ నిశ్చయ కార్యక్రమము జరిపించబడినది. ప్రే. భా. సుబ్బారావు గారు మాట్లాడిన పిమ్మట హుజూరు వా రిట్లు సెలవిచ్చిరి. నేను ఈ వివాహనిశ్చయ కార్యక్రమములో పాల్గొనవలయునని మీరందరు గోరుచున్నారు. నే నట్లు పాల్గొనుట వలన ఇక ముందు సత్సంగ బాల బాలికలకు వివాహములును, వివాహనిశ్చయ కార్యక్రమములును ఇదేవిధముగ జరిగిపోగలవని తీర్మానమైనచో నే నతి సంతోషముగ నిందులో పాల్గొనుటకు సిద్ధముగ నున్నాను. అట్లుగాక ఈ వివాహము

లేక ఈ వివాహ నిశ్చయ కార్యమును ఐపోయిన పిమ్మట మరియొక వివాహ మెద్దియు నివ్విధముగ గాకుండ నుండిపోయినచో నే నిందులో పాల్గొనుట వ్యర్థము. మీ అందరును ఈ సమయమున నాకు సత్సంగ బాల బాలికల వివాహము లికముందుకూడ నివేవిధముగ సత్సంగ సంఘములో నయి పోవుచుండ వలెనని విశ్వాసము కలిగించినయెడల నేను వానిలో నతి సంతోషముగ పాల్గొందునని వాగ్దానము చేయుచున్నాను. అంతట అచ్చటనున్న సమస్త సోదరీ సోదరులును చేతులెత్తి హుజూరు వారి యాదేశమును పాలించెదమని వాగ్దానము జేసిరి.

# 57

1958 డిసెంబరు 31వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ సంవత్సరము సమాప్తమగుటకు కొద్దిగంటలు మాత్రమే మిగిలియున్నది. కావున మీరీ సంవత్సరములో జరిగించిన కార్యకలాపమును పునర్విమర్శ చేసుకొని అది యెట్లున్నదో ఆలోచించుకొన వలయును. మీలో నెవరెవరు తమ కర్తవ్యములను యథాయోగ్యముగ పాలించుకొనలేదో లేక ఎవరెవరు అయుక్త కార్యములను జరిగించిరో వారందరును అట్టి కార్యక్రమమున కై తమ హృదయములలో పశ్చాత్తాపబడి దుఃఖించుచు రాబోవు సంవత్సరములో సక్రమముగ ప్రవర్తించుటకై ప్రతిజ్ఞ చేసికొనవలయును. ఈ సంవత్సరములో మీరు మంచి కార్యములనే జేసియుండినయెడల హుజూర్ రాధా స్వామీ దయాళుని చరణముల యందు అందులకై ధన్యవాదము లర్పించుచు రాబోవు సంవత్సరములో నంతకన్న నెక్కువ మంచి కార్యక్రమములు జరిపించుటకు ప్రయత్నించవలయును.

# 58

1959 ఏప్రియల్ 30వ తేదీ సాయంకాల సత్సంగములో ఒక స్త్రీ తన ఆప్తులలో నొకరికి చాల జబ్బుగ నున్నట్లు అప్పుడే ఒక తంతి వచ్చెనని హుజూరువారితో మనవి చేసికొనెను.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : మానవులకు జబ్బులు వచ్చుచునే యుండును. ప్రతి మానవునకును జీవితములో నిట్టి దుర్గ్రతావస్థలు కలుగుచునే యుండును గావున గాబరా పడిపోకూడదు. దివ్యేచ్ఛపైన ఆధారపడి యుండవలయును. అంతట నా సత్సంగి సాహబ్జీ మహారాజ్ వారు దుర్గ్రత భగవంతుడు పంపిన ప్రసాదమనియు, కావున దానిని ప్రసాద భావముతో తీసికొనవలయు

ననియు, అట్లు చేసిన యెడల దాని బాధ యొక్క తీవ్రత మనసునకు కలుగనేర దనియు సెలవిచ్చిరని నుడివెను.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ రోజులలో ప్రేమపత్రికను ఆంగ్లాను వాదము చేయుచున్నాము. అందొకచోట, సత్సంగి కెవరికైన నిట్టి అసాధ్యమైన కఠిన రుగ్మత కలిగి అతని మనస్సు బహు దుఃఖా క్రాంతమైన యెడల అతనికి అందు మూలమున చాల తీవ్రమైన చిత్త శుద్ధి కలుగు నేర్పాటు జరుగుచున్నట్లును, బహు నికృష్టమైన కర్మలు నాశనమైపోవుచున్నట్లును తెలిసికొనవలయునని వ్రాయబడినది. కావున రుగ్మతను భగవంతుని వైపునుండి పంపించబడినట్లే భావించుకొని అందువలన నెక్కువ గాబరా పొందనవసరములేదు. దివ్యేచ్ఛకు లోబడి యుండవలయును. ఏలనన నీ రుగ్మత ఆ సత్సంగి యొక్క లాభము కొరకే పంపించబడినది.

# 59

1959 జూలై 19వ తేదీ ఆదివారము విద్యార్థుల సత్సంగములో నీ క్రింది శబ్దమును పఠించిరి :

ఐ సతగురు పితా ఔర్ మాలిక్ మేరే।
మైం చరణోం పై కురబాన్ హార దమ్ తేరే ॥ 1 ॥

[ ప్రేమ బిలాస్, శబ్దము 138 ]

హుజూరువారీ శబ్దమును తిరిగి చదివించి అందరి దృష్టిని దీని ఆఖరు రెండు చరణముల అర్థము మీది కాకర్షించుచున్నట్లు సెలవిచ్చిరి : విద్యార్థులందరును అనగా ప్రతి విద్యార్థియు, "నేను సజీవముగ నున్నంతకాలము, నడుచుచున్నను, తిరుగుచున్నను, లేక పనిపాటలు చేసికొనుచున్నను, ఇతరులతో సంభాషణ చేయుచున్నను, వ్రాత కోతలు చేసుకొనుచున్నను యేపని చేయుచున్నను కూడ, మా సద్గురువుని దివ్యేచ్ఛకుగాని వారి ఆజ్ఞలకుగాని ప్రతికూలముగ నుండు పని యెన్నడు నా వలన జరుగ గూడదనియే నా అభిలాష" అని ప్రార్థన చేసుకొనవలయునని యీ శబ్దములో సూచించబడినది. కావున వారి ఆజ్ఞకు బద్ధులై మీరందరు శ్రద్ధగ చదువుకొనుచు, మీ ధనముగాని, సమయము గాని వ్యర్థ కృత్యములు హాని కారక విషయములలోను పాడుచేసుకొనకుండ నుండవలయును. అట్లు చేసిన యెడల ప్రతి విద్యార్థియు సద్గురు ప్రసన్నత సంపాదించుకొని వారికి దయాపాత్రులై జీవితమును సఫలము చేసికొనగలడు.

అభివృద్ధి నొందగలడు. తరువాత హుజూరువారు విద్యార్థు లందరి తరఫున నీ శబ్దములో సూచించిన ప్రార్థన ప్రకారము ఆచరించుటకు మీలో నెవరు సిద్ధముగ నున్నారని, విద్యార్థుల నడిగిరి. సమస్త విద్యార్థులు చేతులెత్తి తమ అంగీకారమును ప్రకటించిరి.

# 60

1959 అక్టోబరు 27వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరు సాహబ్జీ మహారాజువారి వచన మొకటి చదువబడినది. అందులో నీ క్రింది శబ్దము కూడ నుండెను.

ఆజ్ మేరే సతగురు ఆయే మేరీ జాన్ ।
నైనా దరస కో తరస రహే ॥ టేక్ ॥

(ప్రేమబానీ, భాగము 1, వచనము 6, శబ్దము 1)

హుజూరు సాహబ్జీ మహారాజు వారి శబ్దమును తిరిగి చదివించి యిట్లు సెలవిచ్చిరి : 1930 వ సంవత్సరము కన్న (ఈ వచనము ఆ సంవత్సరములో సెలవీయబడినది) మనదశ యిప్పుడు ఎక్కువ పతితమై పోయి జనులు అప్పటికన్న నిక్కాలములో నెక్కువ దుఃఖా క్రాంతులు వ్యాకులచిత్తులునై పోయిరి. కావున వారందరికి సహాయము చేయవలసిన సమయమిది. సాహబ్జీ మహారాజువారి ఈ వచనము ఇప్పటి పరిస్థితుల కెక్కువ సరిగ వర్తించును. ఇందులో సత్సంగులకు భేంట్లు యిచ్చుట కష్టమని యనిపించుచున్నచో వారు అందునుగురించి చింతపడ నక్కర లేదని సెలవివ్వబడినది. ఆ వచనమును పూర్తిచేయు నిమిత్తమే సత్సంగుల ఆర్థిక కష్టములను మనసున పెట్టుకొని భేంట్లు కట్టిపెట్టబడినవి. ఐనను గూడ భగవత్కృపవలన యావత్కార్యక్రమము ముందుకన్న నెక్కువ శ్రేష్ఠముగనే జరిగిపోవుచున్నది. చిట్ట చివర హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : రాధాస్వామీ దయాళుని దివ్యేచ్ఛ ఉన్నయెడల త్వరలోనే అందరును నడుము కట్టుకొని గట్టిగ పనిచేయవలసి వచ్చును.

# 61

1959 డిశంబరు 26 వ తేదీ భండారా సమయములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ప్రతి స్థలములోని సత్సంగులును వారి వారి బ్రాంచీలలోను, జిల్లాల

లోను, ఇద్దరిద్దరు కంఠములు కలిసిన పాఠకులను ఒక్కొక్కసారి ఎనిమిది, పది శబ్దములను నియమపూర్వకముగ మంచిస్వరముతో పాడగలిగిన వారిని ఒక్కొక్క జట్టుగ జేసి అట్టి జట్లను ఒకటిగాని అంతకన్న నెక్కువ సంఖ్యగాని తయారుచేసి ఉంచుకొన్న యెడల చాల బాగుగ నుండును. అట్లు చేసినందువలన అవసరము వచ్చినపుడు పాత పాఠకులు ఏ కారణము వలననైన రాలేని సమయమున వీరు శబ్దపాఠము చేయగలరు. ధ్యానము చక్కగ చేయుటకును, సత్సంగములో ఆనందము పొందుటకును, శబ్ద పాఠము సరియైన పద్ధతిన చేయుట యత్యావశ్యకము. కావున ప్రతిస్థలములోను సమానస్వరముతో పాడునట్టి పాఠకుల జట్లు అధమాధమము రెండైనను సిద్ధము చేసికొని యుంచుకొనుట చాల యుక్తమును అత్యావశ్యకమును అయియున్నది.

## 62

1959 డిశంబరు 31 సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు ఈ సంవత్సరము పూర్తియై పోవుచున్నది. ఇక కొద్ది గంటలు మాత్రమే ఈ సంవత్సరము పూర్తి యగుటకు శేషించి యున్నవి. కావున మనము ఈ సమయమున గత సంవత్సరముయొక్క కార్యకలాపముపైన నిరీక్షణ చేసికొని ఆ సంవత్సరములో మన యుద్దిష్ట కార్యము నెంతవరకు సఫలముగ నెరవేర్చ గలిగితిమో చూచుకొనవలయును. సత్సంగమునకును హుజూర్ రాధాస్వామీ దయాళునికిని మనమేమి సేవ జేయగలిగితిమి? మనకా దయాళుని చరణములందు భక్తి విశ్వాసము లెంతవరకు పెంపొందినవి? ఈ సంవత్సరములో మనము చేసిన తప్పిదములకును, పాపములు, అపరాధములకును, భక్తి రహితముగ జరిగించిన కార్యములకును మనము పశ్చాత్తాప పడి దుఃఖించ వలసి యున్నది. ఇప్పుడు మనము ఆ తప్పిదములు, అపరాధములకును పశ్చాత్తాప పడుచు, రాబోవు క్రొత్త సంవత్సరములో న్యాయముగను, విశ్వసనీయమైన పద్ధతిగను, జాగరూకతతో నడుచుకొనుటకు సంపూర్ణ ప్రయత్నము చేయుద మనియు, మన కర్తవ్యముల నన్నిటిని అత్యుత్తమపద్ధతిని పాలించు కొందమనియు, ప్రతిన చేసుకొనవలయును. అట్లు చేసినందువలన ఈ సంవత్సరములో మనవలన అత్యుత్తమ పద్ధతిని సేవ సాగించబడి మనకు హుజూరు వారి చరణములందు భక్తిశ్రద్ధలు ఇతః పూర్వముకన్న నెక్కువ దృఢతరమునై పోగలవు.

## 63

1960 ఏప్రిల్ 10 వ తేదీ విద్యార్థుల సత్సంగములో హుజూర్ వారిట్లు

సెలవిచ్చిరి : మీరు గత సంవత్సరములో చదువు ఎట్లు చదివితిరను విషయమును గురించి, అనగా మీరు కష్టపడి చదివితిరా లేక కాలము వ్యర్థపుచ్చి వీధుల వెంబడి తిరుగుచుంటిరా, ఈ సంవత్సరము మీరు పరీక్షలలో నుత్తీర్ణులు కాగలరా లేదా—అను విషయములను గురించి మేము ఇప్పుడు మీతో నేమియు ప్రస్తావన చేయదలచుకొనలేదు. కాని మీరు ఇకముందు ఏమి చేయదలచుకొనిరి అనెడి విషయము మాత్రమే మీరిపుడు ముఖ్యముగ ఆలోచించి తేల్చుకొనవలసియున్నది. ఈ విషయమును మీరు మీ తల్లి దండ్రులతోను, కుటుంబ సభ్యులతోను ఆలోచించుకొని, పిమ్మట మీ ప్రధానోపాధ్యాయులతోను, కళాశాల ప్రధానాచార్యులతోను కలిసి విమర్శించుకొనుట యుక్తము. మీ యోగ్యతా యోగ్యతల విషయము వారికి సంపూర్ణముగ తెలిసియుండును. కావున వారితో చర్చించి నిర్ణయించుకొనుట మీకు ఉపయోగకరముగను లాభకరముగను ఉండును. మీరు ఏమియు నాలోచించుకొన కుండ గుడ్డివాని వలె పురాతనపు బాటలలో బడిపోవుటయు మీ యోగ్యతను గమనించుకొనకుండ ఒకతరగతి తరువాత మరియొక తరగతి చొప్పున ఆలోచన లేకుండ చదువు కొనుచు పై తరగతులలోనికి పోవుటకు ప్రయత్నించుటయు సరియైన పద్ధతి కానేరదు. అనగా మీకు ఏ కార్యము లేక ఏ పద్ధతి సాఫల్య దాయకముగ గన్పట్టునో దానినే అవలంబించుచు అసాఫల్యము గలుగు శంక గలిగిన వైపునకు అడుగిడ రాదు.

# 64

1960 జూన్ 24 వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు డయిరీలోనుంచి తీసి చదివిన వచనము ఎక్కువ దీర్ఘమైనది కాదు. కాని ఆ వచనములో ఒక విషయము మాత్రము మనకు చాల ఉపయోగకరము మహత్త్వ పూర్ణము మహత్త్వమైనట్టిది కలదు. ఏలనన జీవితము నిక ముందెట్లు గడుపుకొనవలసి యున్నదో ఆ పద్ధతి యిందులో సూచితమైనది. సత్సంగము హుజూర్ రాధాస్వామీ దయాళునికి అర్పణమైనదై ఒడలు వంచి తన సమస్త కర్తవ్యములను పాలించనైన పాలించవలయును. లేదా, అట్లు చేయక, సత్సంగ శిక్షణకును, సేవకును దూరమై పతితులైనట్టి పరిస్థితిలో ఇతర శ్రేష్ఠ పురుషులు మనకు బదులు పని సాగించుటకు క్షేత్రమును ఖాళీ చేయు నిమిత్తమై, మనమందరము నశించిపోవలయునని భగవంతుని చరణముల ముందు ప్రార్థించనైన ప్రార్థించవలయును. అయితే, దయాళ్బాగులో నున్న స్త్రీ పురుషులు, వివిధ వయస్సుకలైన పిల్లలు పెద్దలును, చాలమంది యీ కాలములో అతి ప్రేమోత్సాహ పూరితులై పనులు చేయుటకు సిద్ధ

మగుచు ప్రతిదినము సత్సంగ సేవలో శూరులవలె పాల్గొను చున్నట్లు మన కగుపించుచునే యున్నది. కదా! కావున మనకు సంఘ మంతయు నాశనమైపోవునేమో యను భయము లేదు. అయినను, యిప్పుడు కూడ కొందరు పురుషులవలె కాక, ఆడమనిషిపాటి కూడ చేయక కేవలము పిరికి పందలవలె పనిపాటలు చేయకుండ తప్పించుకొనుచున్నా రనుట నిజమే. అట్టివారు ఆ విధముగ భయభీతులు కావచ్చును. అట్టి వ్యక్తుల విషయములో, నేను వారి ప్రీతి, ప్రతీతులలో లోపముండుటచే నట్లు నిరుత్సాహు లయిపోయి రనుట దప్ప మరేమియు చెప్పదల్చు కొనలేదు. వారు త్వరలోనే తమ వైఖరిని మార్చుకొని ఇతర సోదర శూరులవలెనే శ్రమపడి పనిచేయుట ఉత్తమమని నా అభిప్రాయము. అట్లువారు పద్ధతి మార్చుకొన్న యెడల ఆ మార్పు వారికిని సమస్త సంఘమునకును లాభకరము సుఖప్రదముగను ఉండును.

## 65

1960 జూలై 17వ తేదీ విద్యార్థుల సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: గత సంవత్సర పరీక్షలలో మీలో కొందరు పిల్లలు త్తీర్ణులై, కొందరు నిర్లక్ష్యముగ కాలమును నష్టపరచుకొన్నారు. ఆ అను త్తీర్ణులైన పిల్లలు తమ అశ్రద్ధను, మందమతిని గుర్తించుకొని గత సంవత్సరము కన్న నిప్పుడు వారి కొక సంవత్సరము వయసు వృద్ధియైనదని జ్ఞానము తెచ్చుకొనిన యెడల వారు ఈ సంవత్సరము ప్రారంభము నుండియు శుభ శ్రేయస్సంకల్పము ఉత్సాహావేశములను మనసున నెలకొల్పుకొని కఠిన పరిశ్రమ చేసి చదువుకొనవలయును. అట్లు చేసిన యెడల వారీ సంవత్సరము తమకు తమ సంఘమునకు తమ దేశమునకు ఉపకారము జేసినవారై ఉత్తమమైన దేశపౌరులుగ రూపొందగలరు.

## 66

1961 అక్టోబరు 19వ తేదీ వివాహ పంచాయతీ సంఘము అక్టోబరు 18, 19 తేదీలలో చేసిన సమావేశమునకు ఫలితముగ ఈ సాయంకాలము సత్సంగములో వివాహ యోగ్యమైన ఆడపిల్లలు, మగపిల్లలు వచ్చి యున్నారు. హుజూరువారీ క్రింది శబ్దమును దివ్యేచ్ఛకు తీయించి చదివించిరి.

జక్త్ భావ్ భయ లజ్జా ఖోవో ।
సున్ ప్యారే తూ కర్ భక్తి ॥

జాతి బరన్ భయ లజ్జా త్యాగో ।
సున్ ప్యారే తూ కర్ భక్తి ॥ 2 ॥

( సారబచన్, వచనము 12, శబ్దము 2 )

హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : ఈ శబ్దములో "ప్యారా" అను మాటకు బదులు "ప్యారీ" అను శబ్దమును పెట్టిన యెడల ఈ శబ్దమంతయు ఈ రోజు వివాహము లకు పూర్తిగ వర్తించును. ఈ శబ్దమును "ప్యారా" స్థానములో "ప్యారీ"అను పదమును పెట్టి దీనిని తిరిగి సాకీలు రెండవసారి చదివిరి. హుజూరువా రిట్లు సెల విచ్చిరి : సత్సంగములో జాతులు, వర్ణములను గురించిన ఆలోచనలను విడిచిపెట్టి భక్తి భావమును ప్రధానముగ జేసికొని వివాహములు చేసికొనివలయునని ఈ శబ్దములో చెప్పబడినది. కావున తల్లి దండ్రులు, భార్య పిల్లలు, సోదరులు, అత్తమామలును, బంధుమిత్రులును అంగీకరించని యెడల వారిని సరకు చేయక, వారి వలన భయపడిపోకుండ సత్సంగములో వివాహము చేసికొనుట భక్తి ఫలదాయకమని తెలిసికొని మీరు అట్టి వివాహములకు వెంటనే అంగీకరించ వలసి యున్నది. ఏలనన వారందరికిని సత్సంగములో వివాహము చేసికొనుట కెంత మహత్త్వమున్నదో తెలియదు. కావున మీరు నిర్భయముగ సద్గురుని యొక్క సహాయమునే బలముగ నెంచుకొని వారి చరణములందు పూర్ణ విశ్వాసముతో ఆ మార్గమున ముందంజ వేయవలయును. వాస్తవములో లోప మంతయు మీలోనే యుండును. కావుననే మీకు ఇతరులు విరోధించెదరేమో యనెడి భయము కలుగుచున్నది. అందువలన మీరు మీ దౌర్బల్యమును విడిచి పెట్టి యథార్థమైన భక్తి పద్ధతిని అవలంబించుడు.

## 67

1961 అక్టోబరు 31వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరుసాహబ్జీ మహారాజువారి వచనముల నుండి రెండు వచనములను అనగా (1) 1920వ సంవత్సరము సెప్టెంబరు 4వ తేదీ గల 167వ నెంబరు వచనమును, (2) 1920వ సంవత్సరము సెప్టెంబరు 13వ తేదీ గల 175వ నెంబరు వచనమును చదివిరి. అందు మొదటి వచనములో మహా ఆపత్కాలము ఇప్పుడు రాబోవుచున్న దనియు, ఇక 30, 35 సంవత్సరములలో దీని యొక్క సంపూర్ణ ప్రభావము తప్పక కనిపించగలదనియు చెప్పబడినది.

రెండవ వచనములో సత్సంగుల మీదకు గూడ నొకసారి ఆపత్తులు కష్ట ములును రాగలవనియు కాని సత్సంగులకు భగవంతుని సహాయ సంరక్షణ లుండుటచే వారికి ఇసుమంతయు హాని కలుగనేర దనియు చెప్పబడినది.

అట్టి సమయములలో సత్సంగులు ఈ క్రింద చెప్పిన మూడు హితోపదేశముల ప్రకారము ప్రవర్తించిన యెడల వారికి అధిక సహాయము లభించగలదు.

1. యథాశక్తిగా స్మరణ, ధ్యాన భజనలను చేసికొనవలయును.

2. సత్సంగులు పరస్పరము గాఢమైన ఐకమత్య ప్రేమలతో మసలుకొనుచు నొండొరులకు సహాయము చేసికొనవలయును.

3. అట్టి సమయము నందు సంత్ సద్గురువు వారి దగ్గర నున్న యెడల వారి యాజ్ఞానుసారము నడచుకొన వలయును. లేదా సత్సంగులలో అధిక సంఖ్యాకుల అభిప్రాయము ప్రకారము నడచుకొనవలయునే గాని ఎవరికి తోచినట్లు వారు నడచుకొనరాదు.

అటు పిమ్మట హుజూర్ మెహతాజీ మహారాజువా రిట్లు సెలవిచ్చిరి: ఈ వచనములో మనము శ్రద్ధగ గమనించవలసిన విషయములు రెండున్నవి.

1. ప్రతి సత్సంగి నోటినుండియు సత్సంగేతరుని నోటినుండియు "హుజూర్ రాధాస్వామీ దయాళురు ఇంకొక గంటసేపు మమ్ములను కనిపెట్టకుండ నుండినచో మేము హతమై పోవుదుము" అనెడి ఆర్తనాదము స్వతస్సిద్ధముగ బయల్వెడలునని సాహబ్జీ మహారాజ్ వారు మొట్టమొదట సెలవిచ్చిరి. దీనిని బట్టి మీరు హుజూర్ రాధాస్వామీ దయాళురు ఎంత బాధ్యతాయుతమైన కార్యక్రమమును జరిపించవలసి యున్నదో ఊహించుకొన వచ్చును.

2. దేశములో మహా విపత్తులు వచ్చినందువలన సత్సంగులు, సత్సంగేతరులు సమస్త జనులును కూడ "ఓ భగవంతుడా! మమ్ములను కాపాడుము. లేనిచో కొద్ది సేపటిలోనే మేము పూర్తిగ నాశనమై పోయెద"మనెడి మొరపెట్టుకొను నంత యధికముగా గాబరా చెందిపోగలరు.

దీని భావమేమనగా ఆ సమయమున భగవంతుని దృష్టి సత్సంగులు, సత్సంగేతరులు అందరి వైపునకు ఆకృష్టమై వారు వీరి నందరిని సంరక్షించి, కాపాడి, సహాయ మొనరించెదరనియే.

కాని ఆశ్చర్యమేమనగ ఈ వచనములో రాధాస్వామీ దయాళుడు సమస్త జీవులను రక్షించెదరన్న వాక్యము చదివినప్పుడు మీరందరును రాధాస్వామీ ధ్యానములతో ఆ మాటకు స్వాగత మిచ్చిరి కాని సత్సంగుల రక్షణ సందర్భములో మీరు నిర్వహించవలసిన కర్తవ్యముల విషయము చెప్పినపుడు మీరందరు చల్లగ నూరకుండి ఒక్కమాట గూడ మీ నోటినుండి రాలేదు. దీనిని బట్టి మీకు స్వయముగ మీ కర్తవ్య ధర్మములను పూర్తి జేయుట కిష్టము లేదనియు, మీ రక్షణ భారము యావత్తు రాధాస్వామీ దయాళుని పైననే వేయ దలచుకొన్నారనియు తేలుతున్నది. మీరు అవలంబించిన ఈ పద్ధతి పొరపాటు. ప్రతి వ్యక్తియు తన బాధ్యతను, కర్తవ్యమును సంపూర్ణ పరిశ్రమ చేసి నెర వేర్చుట చాల ఆవశ్యకము. రెండవది మీరందరును కలిసి మీ కార్యములను నెరవేర్చుకొనవలయును. మూడవది మీరందరును నొండొరులకు బహు సంతోషముగ తోడ్పడుటకు సిద్ధముగ నుండవలయును. అట్లు చేసినందువలన మీరు హుజూర్ రాధాస్వామీ దయాళుని కార్య భారమును తగ్గించి వారి సంరక్షణ సహాయమువలన లాభాన్వితులై వారి సంరక్షణ సహాయ ప్రణాళిక నతి సులభముగ నమలులో పెట్టగలరు.

## 68

1961 డిశంబరు 10వ తేదీ ముజఫర్‌పూర్‌లో సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ప్రతి సత్సంగి సోదరియు, సోదరుడును అనుక్షణము స్మరణ ధ్యానములను జేయుచుండవలయును. అదిగాక నీ క్రింది విషయములు గూడ సత్సంగ సోదరీ, సోదరులకు బోధచేయబడినవి :

1. మీ పుత్రులకును, పుత్రికలకును ఉత్తమ శిక్షణ గరపవలయును.
2. వారి వివాహములు సామాన్య రీతిని సత్సంగములోనే సాగించవలయును.
3. సోదరీమణులు పొడుగైన రవికలను కుట్టించుకొని ధరించవలయును.
4. ప్రతి కార్యమును చక్కగ విమర్శించి చేసికొనవలయును. సంపూర్ణమైన పరిశ్రమతో చేసికొనవలయును. కాని దాని పర్యవసానము భగవంతునిపైన విడిచిపెట్ట వలయును.

## 69

1961 డిశంబరు 31న తేదీ రాత్రి హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : ఇంక

ఐదు గంటలలో ఈ సంవత్సరము అంతమైపోవుచున్నది. మీరు ఈ సంవత్సరము పొడుగునా మీ అక్కౌంట్లు తిరిగి మరొకసారి చూచుకొని ఏదో బాకీలు ఇంకను తీర్చవలసి యున్నవో పరిశీలించుకొన వలయును. అందులో మొదటి పద్దు బిజినెస్ సెక్రెటరీ గారి బాకీకి సంబంధించినది. అనగా మీరీ సంవత్సరములో కొన్న సరకునకు ఖరీదు పూర్తిగ చెల్లించితిరా లేదా అను విషయము చూచుకొనవలయును. రెండవ అక్కౌంటు సోషల్ సర్వీస్ అనగా సంఘసేవకు సంబంధించి యున్నది. అనగా, మీ పిల్లల పెండ్లిండ్లను ఇతర సామాజిక విషయములలోను సత్సంగ శిక్షణ ననుసరించి మీరు ప్రవర్తించితిరా లేదా అను విషయము. మూడవది హుజూర్ రాధాస్వామీ దయాళునికి సంబంధించిన అక్కౌంటు. అనగా మీరు ఈ సంవత్సరములో నిరంతరము వారి పవిత్ర నామము స్మరణచేసి వారిని ధ్యానము చేసికొనుచుంటిరా లేదా యను విషయము. మీరు ఈ రాత్రి ఇంటికి వెళ్ళి భోజనము చేయక మునుపే ఈ మూడు విధములైన అక్కౌంట్లును పరిశీలించుకొని మీరు యే యే అక్కౌంట్లలో బాకీ పడి యున్నారో చూచుకొనవలయును. ఈ సంవత్సరములో మీరు ఆ అక్కౌంట్లలో బాకీ పడి అపరాధము చేసియున్న యెడల మీరు హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములందు క్షమార్పణకై ప్రార్థన చేయుచు ఇక ముందు సంవత్సరములో ఆ లోపములను పూర్తి చేసెదమని దీక్ష పూన వలయును. మీరీ సంవత్సరములో నేదైన మంచి కార్యము చేసియున్న యెడల దానిని హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములం దర్పించి ఇంతకన్న నెక్కువ శ్రేష్ఠతరమైన కార్యమును రాబోవు సంవత్సరములో జరిపించ వలయునను గట్టి పూనిక పెట్టుకొన వలయును. ఇప్పుడు అన్నిటికన్న ముఖ్యమైన విషయమేమనగా మీరు అనుక్షణము స్మరణ చేయుచు రాధాస్వామీ దయాళుని సంపూర్ణ నిష్ఠతో ధ్యానము చేసికొను చుండవలయును. అపుడు దివ్యేచ్ఛకు ఈ క్రింది శబ్దము తీసి చదువ బడినది :

> కౌన్ కరే ఆరత్ సతగురు కీ ॥ టేక్ ॥
> బహ్మాదిక సబ్ తరస్ రహే హై ॥
> మిలీ నహీం యహ పదవీ ॥ 1 ॥

(సారబచన్, వచనము 28, శబ్దము 6 )

## 70

1962 ఫిబ్రవరి 1వ తేది హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ప్రస్తుతములో చాల చెడ్డరోజులు రాబోవుచున్నట్లు కనబడుచున్నది. కావున మీరు అనుక్షణము

స్మరణ ధ్యానములు నిరంతరము చేయుచు నుండవలయు నను హితబోధ మీకు చాలసార్లు చేయబడి యున్నది.

## 71

1962 అక్టోబరు 3 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ మధ్యన కొద్దిరోజులనుండి నా ఆరోగ్యము చెడిపోయి నాకు చాల నీరసముగ నున్నట్లనిపించుచుండెను. ఈ మధ్యన సత్సంగములో హుజూరు సాహబ్జీ మహారాజువారు సోయాబీన్సు, శనగలను నానబెట్టి తిను చుండవలయు నను సలహా చెప్పియున్న వచనమును చదివి ఆ వచన ప్రమాణము మీద శనగలు నానబెట్టుకొని తినుట ప్రారంభించితిని. అందువలన నా ఆరోగ్యము బాగుపడినట్లు తోచుచున్నది. మీలోగూడ బలహీనముగ నున్న వారు ఈ విధముగ జేసికొన వలయును. కాని నీ క్రింది విధముగ నుపయోగించు కొనవల యును. సోయాబీన్సు లభించుటలేదు కనుక శనగలు ఇరువదిఐదు గింజలు మొదటి రోజున నీటిలో నానబెట్టి అవి మొలకెత్తుచున్నప్పుడు వానిని మరి కొంచెము నీరు పోసి ఉడికించిన యెడల అవి తినుటకు మృదువుగ నై పోవును. పిమ్మట వానిని బాగుగ నమలి తినవలెను. ఈ విధముగ 25 గింజల నుండి క్రమ క్రమముగ 50 గింజల వరకును పెంపుజేయ వచ్చును. అట్లు సేవించి నందు వలన మీకు శరీరబలము తప్పక వృద్ధి యగుచున్నట్లు తెలియగలదని నాకు పూర్ణ విశ్వాసమున్నది.

## 72

1963 జూన్ 2వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరు వారు పాలక్ అను ఆకు కూరయు, గుమ్మడికాయ, టిండాలు, బీరకాయ, ఆనపకాయ, వంకాయలు కలిపి ఒక ప్రెషర్ కుక్కరులో కొంచెము ఉప్పువేసి ఉడికించి తయారు చేసిన కూరను రక్తపోటు (Blood pressure) గలవారికి పెట్టించిరి. పిమ్మట మీ కిప్పుడు పెట్టిన మిశ్రిత శాకము మీరు కొన్నాళ్లు ప్రతిదినము తిను చుండిన యెడల భగవత్కృప వలన మీ రక్తపోటుబాధ తప్పక నివృత్తియై పోగలదని నే నాశించుచున్నానని హుజూరు వారు సెలవిచ్చిరి.

## 73

1963 జూలై 21వ తేదీ ఆదివారం విద్యార్థుల సత్సంగములో హుజూరు

వారిట్లు ప్రశ్నించిరి : ఈ సంవత్సరము పరీక్షలలో నుత్తీర్ణులు గాని పిల్ల లెవరున్నారో చేతులెత్తుడు. హుజూరు వారు ఒక్కొక్క విద్యార్థిని విమర్శగ ప్రశ్నించి వారిలో ఎవరెవరు ఎన్నెన్ని పాఠ్య భాగములలో ఏయే భాగములలో నుత్తీర్ణులైరో తెలిసికొని పిమ్మట నిట్లు సెలవిచ్చిరి : మీరీ సంవత్సరము చాల కష్టపడి చదివిన యెడల రాబోవు సంవత్సరము మీరు పరీక్షలలో తప్పక ఉత్తీర్ణులు కాగలరు. క్రిందటి సంవత్సరము నాలుగు పాఠ్య భాగములలో అనుత్తీర్ణులైన విద్యార్థులను తిరిగి శిక్షణాలయములో చేర్చుకొనలేదు. ఈ సంవత్సరము మూడు పాఠ్య భాగములలో అనుత్తీర్ణులైన వారిని కూడ శిక్షణాలయములలో తిరిగి చేర్చుకొనుటలేదు. రాబోవు సంవత్సరము రెండు పాఠ్య భాగములలో అనుత్తీర్ణులైన వారిని తిరిగి శిక్షణాలయములలో నదే కక్షలో జేర్చుకొనజాలరు. అనేక విశ్వవిద్యాలయములలో కేవలము ప్రథమ ద్వితీయ శ్రేణులలో నుత్తీర్ణులైన విద్యార్థులకు తప్ప తృతీయ శ్రేణిలో నుత్తీర్ణులైన విద్యార్థులకు ఎవ్విధమైన ప్రవేశము నిచ్చుటలేదు. ఇక్కడ కూడ ఇక మూడేండ్ల తరువాత నూటికి నలుబది మార్కులకన్న తక్కువ మార్కులతో నుత్తీర్ణులైన విద్యార్థులను శిక్షణాలయములలో జేర్చుకొనజాలరు. మాకు ఇచ్చట నెక్కువ కష్టపడి శ్రద్ధగ చదువుకొనెడి విద్యార్థులే కావలయును. బలహీనముగనున్న పిల్లలను తమ ఆరోగ్యము విషయమై శ్రద్ధ వహించవలయునని హుజూరువారు హితోపదేశము జేసిరి. డాక్టరు కళ్ళజోడు ధరించవలయునని సలహా చెప్పిన విద్యార్థులను కళ్ళజోళ్ళు కొనుగొని వాడుకొనవలయుననియు, పయోరియా రోగము గలవారిని తగిన డాక్టర్లచే దంత చికిత్స చేయించుకొనవలయుననియు, ఇందాలస్య మేమి జేసినను ప్రమాద కరమనియు సెలవిచ్చిరి. పయోరియా రుగ్మతకు హుజూరువారు దయాల్బాగు స్పెషల్ మంజన్ వాడుకొనవలయుననియు, దానిని నియమపూర్వకముగ నుపయోగించిన యెడల ఆ రోగము బాగుపడిపోవుననియు సెలవిచ్చిరి. పిల్లలకు కండ్లపరీక్ష ఉచితముగ చేయబడును గాని కండ్ల అద్దములు వారే కొనుగొనవలసి యుండునని కూడ సెలవిచ్చిరి. పిమ్మట హుజూరు వారు చిన్న పిల్లలతో నిట్లు సెలవిచ్చిరి. మీరు మీ ఆరోగ్యమును గురించి ఎందుకు జాగ్రత్త పడరు? మీకు మూడు మాసముల గడువు ఇచ్చుచున్నాము. ఈ గడువులోపల మీరు మీ ఆరోగ్యమును బాగుచేసికొనుడు. లేదా మిమ్ములను పాఠశాలనుండి తీసివేయుదుము. దుర్బలులైన పిల్లలు మాకు అవసరము లేదు. పరిశ్రమ జేయు పిల్లలే కావలయును. అపుడు హుజూరువారు ప్రధానోపాధ్యాయుని పిలిచి ఈ పిల్లలు తమ ఆరోగ్యమును బాగుచేసి కొనకుండిన యెడల వీరిని పాఠశాలనుండి పంపించి వేయవలయునని సెలవిచ్చిరి.

# 74

1964 జనవరి 19వ తేదీ పవిత్రమైన వసంత పంచమీ సుదినము. మధ్యాహ్నము స్పెషల్ సత్సంగములో నొక వచనము చదివిన పిమ్మట హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: హుజూర్ సాహబ్జీ మహారాజువారి యీ వచనములో నెన్నియో లాభకరమైనట్టియు, మహోపకారక మైనట్టియు విషయములను మీరు వినియున్నారు. ఇంతకుముందు కూడ వానిని మీరు చదువుకొనియే యుందురు. కాని మీలో నావిషయముల నాచరణలో నెంతమంది పెట్టిరి? మీరు ఆచరణలో పెట్టని యెడల నావిషయములను వినుటయు వ్యర్థము. ఇప్పుడిపుడే 3,4 మాసములనుండి ప్రేమ ప్రచారక్ పత్రికలో నొక ప్రకటన ప్రచురించబడుచున్నది. దానిని మీలో నెంతమంది చదివితిరి? అట్లు చదివిన వారు చేతులెత్తుడు.

అందుపైన చాలమంది చేతులెత్తిరి. కాని హుజూరువారు మీరేమి చదివితిరని యడిగినపు డెవరును సరియైన సమాధానము చెప్పలేదు. ఇట్లు సెలవిచ్చిరి: సత్సంగులు వ్యర్థమైన యుత్తరములను మాటిమాటికి వ్రాయుచుండ వలదని ప్రేమ ప్రచారక్‌లో ననేకపర్యాయములు ప్రచురింపబడినది. కాని ఆ మాట నెవరు మన్నించుటలేదు. చాల మామూలు విషయములను గురించి అనగా, ఇంటిపైన గ్రద్ద కూర్చుండుటచే నా యిల్లు మార్చుట, పిల్లవానికి పేరు పెట్టుట, ఇంటి పశువులు పాలు సరిగ నివ్వకుండుటయు, దొంగతనము జరుగుటయు, పిల్లలు చనిపోవుటయు, కోర్టు వ్యాజ్యములలో (వాస్తవములో తానే అపరాధియై యుండియు) గెలుపొందుటయు, పిల్లవానికి పరీక్షలోగాని ఇంటర్వ్యూలోగాని జయము కల్గుటయు, ఇత్యాది విషయములను గురించియే సామాన్యముగ ఉత్తరములు వ్రాయుచున్నారు. ఈ ప్రకటన ప్రేమప్రచారక్‌లో చాల సార్లు పడినది కాని సత్సంగులు దానిని బొత్తిగ చదివినట్లే కనపడదు. పత్రిక చూచి ఒక మూల పారవైచుచున్నట్లు అనిపించుచున్నది. లేక నెవరైన చదివినను దాని ప్రకార మాచరించుటయే లేదన్నమాట. అట్లైనచో నాచదువుట వలన ఫలితమేమున్నది?

జనులు తరచుగ చాల చిన్నవిషయములనే వ్రాయుచు, వాని నొక పోస్టుకార్డులోనో లేదా, ఇన్లాండు పత్రములోనో వ్రాయుటకు బదులుగ 15 పైసలు ఖరీదుగల కవరులో వ్రాసి పంపుచున్నారు. మొదటి 4,5 పంక్తులను గౌరవ మర్యాదల సూచించు మాటలతో నింపి, ఆ తర్వాత ఒకేమాటను త్రిప్పి త్రిప్పి రెండుమూడుసార్లు వ్రాయుచుందురు. అందువలన అసలు విష

యము కష్టపడి పోవుటయు, సమయము వ్యర్థమై పోవుటయు, ఆరు పైసల పోస్టు కార్డుతో అయిపోవలసిన పనికి 15 పైసలు ఖర్చు అగుటయూ జరుగుచున్నది. కొందరు తమ చిరునామా కూడ వ్రాయుట మరచిపోయి సమాధానము తమకు అందలేదని రిమైండర్లు కూడ వ్రాయుచున్నారు. హుజూర్ సాహబ్జీ మహారాజు వారి హితోపదేశము వీరికి జ్ఞాపక మున్నయెడల సత్సంగులు చాల సామాన్య విషయములు, కష్టములను గురించి సద్గురువునకు ఉత్తరములు వ్రాయరాదను విషయము గుర్తు ఉండెడిది. నిజముగ వారి కేదైన సహాన శక్యముగాని ఆపత్తు వచ్చినయెడల వారు గురువుగారికి ఒక చీటి, సంక్షిప్తముగ తమకష్టమును ఆపత్తును గురించి వ్రాసికొనవచ్చును. రెండవ ఉపాయ మేమనగా, అట్లు వ్రాసికొన్న చీటీని మీరు మీ తలపైపున పెట్టుకొనవలయునని సెలవిచ్చిరి. అది అత్యావశ్యక విషయమైనచో మీకు దానికి సమాధానము అదే రాత్రి స్వప్నములో లభించి పోవును. అంత యావశ్యకమైన విషయము కానిచో మీకు సమాధానము రాదు.

హుజూరు వారు సంఘము నందరిని యిట్లు ప్రశ్నించిరి : మీలో నెవరెవరు ఈ హితోపదేశమును ఆకర్ణించి యున్నారు?

అందుపైన చాలమంది చేతులెత్తిరి. ఇట్లుకూడ సెలవిచ్చిరి : మీరు ఆ వచనము ప్రకారము నడచుకొనవలయును. ఇకముందు మాకు ఎవరైనను వ్యర్థమైన ఉత్తరములు వ్రాసిన యెడల వానికి జవాబు వ్రాయబడ నేరదు. చాలమంది ఉపదేశము తీసికొన్నరోజు నుండియూ తమ ఆధ్యాత్మికాభివృద్ధిని గురించియు, పరమార్థవిఘ్నములను గురించియు నుత్తరములు వ్రాయుట ప్రారంభించుచున్నారు. అందుచే ఉపదేశార్థులకు తాము సంవత్సరమునకు ఒక ఉత్తరమునకన్న నెక్కువ యెన్నడు వ్రాయము, అను ప్రతిజ్ఞ చేయవలయు ననెడి మరొక షరతుకూడ నిర్ణయించబడినది. ఉపదేశము కొరకై సిఫారిసు చేయువారు, అట్లు సిఫారిసు చేయునపుడు ఉపదేశార్థులకీ విషయము గట్టిగ బోధపరచి ఉపదేశార్థులచే అప్లికేషను ఫారములో నీషరతు వ్రాయించి క్రింద సంతకము చేయించవలయును. మరొక విషయము కూడ సెలవిచ్చిరి. జనులు ఆలోచించుకొనకుండ వారి ఇష్టము వచ్చినచోట తమ బాలబాలికలకు వివాహములు చేసి, ఆ తర్వాత చిన్నిచిన్ని విషయములకై తగవులాడుకొని మమ్ముల నిబ్బంది పెట్టుచుందురు. ఒక ఆసామీ (అతని పేరు చెప్పుట నాకిష్టము లేదు) ముందుగ ఆడపిల్ల కొకచోట సంబంధము చేసికొనెను. ఆ తర్వాత వారిలో వారికి తగాయిదాలు వచ్చినందున, మొట్టమొదట ఆడపిల్ల నాతో ఫిర్యాదు చెప్పుకొనబోగా నేను అడ్డుపెట్టితిని. పిమ్మట నామె తండ్రి నాతో మాట్లాడ గోరగా,

అతనిని గూడ అడ్డుపెట్టితిమి. ఆ తర్వాత నా పిల్లతల్లి నాకొక ఉత్తరము వ్రాసి నది. అందుపైన నామెను దయాల్బాగునుండి బయటకు వెడలి పోవలయునని ఉత్తరువు ఇచ్చితిమి. జనులు తమ ప్రవర్తనను సరిగ నుంచుకొనవలయును. లేనిచో వారి విషయములో గూడ నట్లే కఠినముగ ప్రవర్తించవలసి వచ్చును.

నేను మీ కందరికి మరొక ఆవశ్యక విషయము చెప్పవలసి యున్నది. యూనియన్ హోమ్ మినిస్టరు గుల్జారీలాల్ నందాగారు, గవర్నమెంటు ఉద్యోగస్తులకును, వ్యాపారస్తులకును, మిల్లుల యజమానులకును, వారు తమ ప్రవర్తన పద్ధతిని మూడు మాసములలోపున సరిచేసుకొన వలయుననియు, అట్లు చేసి కొనని యెడల వారి మీద నేదైన అక్రమ ప్రవర్తన చేసినట్లు ఫిర్యాదు వచ్చిన యెడల చాల కఠిన శిక్ష వారి కివ్వబడగలదనియు నొక నోటీసు ఇచ్చి యున్నట్లు మీ కందరకు తెలిసియే యుండును. వారికేమియు జాలి చూపించ బడనేరదు. లంచము లిచ్చెడి వారికిని, పుచ్చుకొన్న వారికిని శిక్ష సమానముగ నివ్వబడును. ఇట్లు సెలవిచ్చిరి: ప్రభుత్వము తమ ఉద్యోగస్తులకు నోటీసు యిచ్చినట్లే, సభ ప్రెసిడెంటుగారు కూడ సత్సంగుల ప్రవర్తనను సరిచేసి దిద్దుబాటు చేయవలయు నని నేను ప్రెసిడెంటుగారితో మనవి చేసెదను. తమ ప్రవర్తనను సరిగ సంస్కరించుకొనకుండ నుండిన సత్సంగులు చాల కష్టము లనుభవించవలసి యుండును.

## 75

1964 ఫిబ్రవరి 27వ తేదీ హోలీ రోజున మధ్యాహ్నము స్పెషల్ సత్సంగ సమయమున హుజూరువారు సత్సంగ హాలులోనికి వచ్చిన వెంటనే "మీ రందరు నిచ్చట నేల పోగయిరి? హోలీ ఆడుట కేనా?" అని సెలవిచ్చిరి. తర్వాత సత్సంగ హాలులోనికి విచ్చేసిరి.

ఈ క్రింది 5 శబ్దములును చదువబడినవి :

1. అబ్ ఖేలత రాధాస్వామీ సంగ హోరీ ।
   ధరన గగన బిచ శోర మచోరీ ॥ 1 ॥

[ సారబచన్, బచన్ 39, శబ్ద 5 ]

2. హోలీ ఖేలన ఆయే సతగురు జగ మే ।
   హిల మిల కే అబ్ సరన పకోరీ ॥ 1 ॥

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 16, శబ్ద 8 )

3. హోలీ ఖేల న జానే బావరియా ।
సతగురు కో దోష లగావే ॥ 1 ॥

( ప్రేమబానీ, భాగ్ 3, బచన్ 16, శబ్ద 12 )

4. ఆజ హోలీ కా ఖేల ఖేలా ఉం ।

( ప్రేమ బిలాస్, శబ్ద 12 )

5. సఖీ ఆజ దేఖో బహార నఈ ।

( ప్రేమ బిలాస్, శబ్ద 29 )

పిమ్మట హుజూరువా రిట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములలో చెప్పబడిన విషయమేమి? ఎవరును సమాధాన మేమియు చెప్పనందున వారే యిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములలో మరొక విధమైన హోలీ ఆట ఆడవలసినదని చెప్పబడినది. వరుసగ నన్ని శబ్దములలో నొకే విషయము బోధించ బడినది. మీరు శబ్దములను శ్రద్ధ వహించి వినుటలేదు. అందుచే మీరు వాని సారాంశమును గ్రహించు కొనలేక పోవుచున్నారు. పిమ్మట హుజూరువారు వచనములు చదువు నట్టి మిశ్రాజీగారిని పిలచి ఇప్పుడు చదివిన శబ్దములను గద్యపాఠము చేయుచున్నట్లుగ చదివి వినిపించవలయునని సెలవిచ్చిరి. అప్పుడు ఆయన "ఇపుడు ఆత్మ రాధాస్వామీ దయాళునితో హోలీ ఆట ఆడుచున్నది" యని చెప్పుచు గద్య రూపమున చదువ నారంభించగా, హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: ఇందులో హుజూర్ రాధాస్వామీ దయాళునితో హోలీ ఆటను గురించి వర్ణించిరి కాని, సద్గురువుతో హోలీ ఆడమని చెప్పలేదు. కావున మీరు అంతరంగికముగ హుజూర్ రాధాస్వామీ దయాళునితో హోలీ ఆడుకొనవలసి యున్నది. ఈ పంక్తులలో సూర్య, చంద్రులు తారాగణము, శేషనాగ బ్రహ్మాదులు హోలీ ఆడుటకై వచ్చి యున్నారని చెప్పబడినది. సరిగ నట్లే, ఇచట కార్ఖానాలోను, కార్యాలయములలోను, పొలములలోను పనిచేయువారును, బయట స్థలములలోని సత్సంగులును, అందరు వచ్చి యిచ్చట కలిసి యున్నారు. ఇట్లు అయిదు శబ్దములను గద్యము చదివినట్లు చదివిన పిమ్మట, హుజూరువారు యీ అయిదు శబ్దములలో నొకే విషయము మొదటినుండి చివరివరకు వరుసగ వర్ణించబడినదని సెలవిచ్చిరి కాని మీరు శబ్దములను సంపూర్ణమైన ఏకాగ్రతతో వినరు. ప్రక్కనున్న మనుష్యు డెవరైనను కొద్దిగ కదలినచో నాయనవైపే చూచుచుందురు. కొద్దిగ అలికిడి కలిగినచో నా వైపునకే మీ ధ్యాస మంతయు తిరిగిపోవు చుండును. లేదా యెవ్వియో అసంగతాలోచనలు చేయుచుందురు. అందువలన మీకు వాని అర్థము గోచరము కాదు. ఆ శబ్ద స్వారస్యము ఆసం

దము యొక్క అనుభవము మీకు కలుగనేరదు. మీరు సంపూర్ణమైన ఏకాగ్రతతో శబ్దములను విని, వాని భావార్థమును గ్రహించుకొని, ఆ ప్రకార మాచరించ వలయును,

## 76

1964 జూలై 14వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: మీలో కుటుంబ నియంత్రణ ప్రణాళిక ననుసరించి నడచుకొను వారికి ఒక్కొక్కరికి రు. 25/- బహుమానము క్రింద ఇప్పించవలయునని నేను రాధాస్వామీ సత్సంగ సభాధ్యక్షులకు శిఫారసు చేయగోరు చున్నాను. మీలో నెవరెవరు ఈ కార్యక్రమము నవలంబించుటకు సిద్ధముగ నున్నారు?

అందుపైన చాల మంది చేతులెత్తిరి.

హుజూరువారు వారందరి నొక్కొక్కరినే పిలిచి ఒక్కొక సీమబాదము గింజ ప్రసాదముగ నిచ్చిరి.

## 77

1964 ఆగస్టు 26వ తేదీ ప్రాతఃకాల సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: మీరు సత్సంగమునకు వచ్చునపుడు త్రోవలోగాని సత్సంగము నకు వచ్చిన పిమ్మట సత్సంగ హాలులోగాని కబుర్లు చెప్పుకొనుచు మీకును ఇతరులకును పరమార్థ హాని ఎంతమాత్రము కలుగచేసికొన రాదు. ఈ నియ మమును పాలించని మనుజుడు సత్సంగము నుండి బహిష్కరింప బడును. అట్టి వానిని సత్సంగము లోనికి రానివ్వము. తిరిగి ఈ రోజు సాయంకాలము సత్సం గము ప్రారంభించుటకు ముందు హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడే స్త్రీల కందరకు నిచ్చట తయారుచేసిన చెప్పుల జతలు చూపించబడినవి. రేపు పురుషుల కిచ్చట తయారైన జోళ్లు తెప్పించి చూపింపబడును. దయాల్బాగ్ చెప్పులు, జోళ్లును ఆగ్రాపట్టణములోని సరకు కన్న గట్టిగను, చౌకగను ఉండును. బ్రిటను, అమెరికా దేశములవారు తమ తమ స్వదేశములలో తయారైన వస్తువులనే కొని ఉపయోగించుకొను చుందురు. మీరు కూడ నట్లే ఇచ్చటి వస్తువులను ఉపయోగించుకొన వలసి యున్నది. అట్లు చేసిన యెడల బ్రిటను, అమెరికా, దేశములలో పరిశ్రమ లెట్లు వృద్ధి పొందినవో అట్లే ఇచ్చటి పరిశ్రమలు కూడ అభివృద్ధి చెందగలవు. మీరును అట్లే కొనుగోలు చేసి ఉపయోగించు కొందురా? అందరును చేతులెత్తి తమ అంగీకారమును ప్రకటించిరి. తిరిగి ఇట్లు కూడ సెల

విచ్చిరి: ఈ సంవత్సరము ప్రేమ విద్యాలయపు విద్యార్థినులకు జోళ్లు దయాల్బాగ్ కార్ఖానాలో తయారు చేయబడినవి. అవి చాల బలవత్తరమై చూచుట కందముగ నున్నవి. ఈ సంవత్సరము వానిని విద్యార్థినులకు యూనిఫారమ్‌తో పాటు ఉచితముగ నిచ్చెదము. వారిక ముందునుంచి దయాల్బాగులో తయారైన జోళ్ళనే కొని ధరించవలయును. ఇచ్చటి వారందరును వారి కవసరమైన ఇతర వస్తువుల నన్నిటిని ఇచట తయారైన వస్తువులనే కొని ఉపయోగించుకొన వలయును. అట్లు చేసిన యెడల ఇచ్చటి పరిశ్రమలన్నియు అభివృద్ధి నొందగలవు.

# 78

1964 అక్టోబరు 3వ తేదీ సాయంకాలము సత్సంగములో వస్త్రధారణ విషయమును గురించి హుజూర్ సాహబ్జీ మహరాజ్ వారు సెలవిచ్చిన వచన మొకటి చదువ బడినది. ఆ వచనములో హుజూర్ సాహబ్జీ మహరాజువారు "సోదర భావమును, సమభావమును మనకు ప్రధాన లక్షణములై యుండ వలయును. ఏక సంఘీయ భావము మన జాతీయ గానమై యుండ వలయును. మన మందరము, మన వేష భాషలను బట్టియు, ఆచార వ్యవహారములను బట్టియు చూచినచో, వీరికి శరీరములు మాత్రమే భిన్నముగాని, అందరితీరు నొకే రీతిగ నున్నదని కన్పట్ట వలయు"నని సెలవిచ్చిరి.

ఈ వచనానంతరము హుజూరువారు చిరునగవుతో (ఆ వచనము చదువు చుండిన) మిశ్రాగారితో నిట్లు సెలవిచ్చిరి. మీ రీ వచనము సెప్టెంబరు 22వ తేదీకి ముందేల చదువలేదు? మీ రట్లు చదివి యుండిన యెడల, నేను ఆడ వాండ్ర దుస్తులను (అనగా వారు సల్వారు కుర్తాలను ధరించవలయునను విషయము) గురించి యిన్నిసార్లు చెప్పనక్కరలేక పోయెడిది కదా! ఆయన "హుజూర్. నాదే తప్పిదము" అని చెప్పుకొనెను. తిరిగి హుజూరువా రిట్లు సెల విచ్చిరి: సంతుల మాటలలోని మహత్త్వమును భావమును గ్రహించుకొనుట చాల కష్టము. వా రేదైన వచనము సెలవిచ్చినపుడు వారు దానిని ఆ వెంటనే ఆచరణలో పెట్టదల్చుకొన్నట్లు అర్థము చేసికొన నవసరము లేదు. హుజూర్ సాహబ్జీ మహరాజువారు వివిధ సమయములలో వివిధములైన వచనములను సెలవిచ్చిరి. వానిలో నీ విషయముల నన్నిటిని అప్పటికప్పుడే ఆచరణలో పెట్ట వలెనని వారి యుద్దేశ్యము కాదు. వానిని ఆచరణలో పెట్టవలసిన ఆవశ్యకత కొంతకాలమైన పిదప కలుగవచ్చును అట్టి తరుణము వచ్చినపుడే అది ఆచర ణలో పెట్టబడు చుండును.

తిరిగి యిట్లు సెలవిచ్చిరి : జనులకు వ్యయమును పెంచుకొనుట సులువే కాని, తగ్గించుకొనుట చాల కష్టమైనపని. పిల్లలు ప్యాంట్లు ధరించి పొలములకు తరుచుగ వచ్చి, ప్యాంటుతో నున్నపుడు కూర్చుండుట కష్టమగుటచే నచ్చుట పట్టుపట్టి పనిచేయకుండ నుండి పోవుచున్నారు. వారు పైజామా కట్టుకొని వచ్చి నచో వారికి కూర్చుండుటకు కష్టముండదు. పని చురుకుగను చేయగల్గుదురు. అదీగాక పైజామా ధరించి నందువలన ఆర్థిక లాభముకూడ నున్నది. ప్యాంటుకు కుట్టుకూలి రెండున్నర, మూడు రూపాయిలు అగును కాని, పైజామా కుట్టుకూలి నాల్గు అణాలు మాత్రమే. ప్యాంటుకన్న పైజామాకు తక్కువ గుడ్డ సరిపోవును. ఆ గుడ్డ కూడ, ప్యాంటు గుడ్డకన్న పైజామాగుడ్డ ఎక్కువ చవుకగ లభ్యమగు చున్నది. పిల్లలు, పెద్దలును పైజామా ధరించ వలయుననియే నేను చెప్పుదును. పాత ప్యాంటులు ఇదివరలోనే కుట్టించి పడి యున్నచో అట్టిప్యాంటులను ఉప యోగించుకొనవచ్చును. కాని, క్రొత్తగా కుట్టించుకొనరాదు. అయితే కాలేజీ లకు ఆఫీసులకు వెళ్లినపుడును ఇతర విశిష్ట సమయములలోను ఉపయోగార్థమై ఒకటి, రెండు ప్యాంటులు కుట్టించుకొనవచ్చును. కాని ఇతర సమయములలో పైజామాలనే ధరించ వలయును.

# 79

1864 అక్టోబరు 18 వ తేదీన సాహబ్జీ మహారాజువారి డైరీ నుండి ఒక వచనము చదువ బడినది.

ఆ వచనములో ఆఖరున "మన కాల్వలు నిస్సంశయముగ సఫలను కాగలవు" అనెడి వాక్యము చదివిన పిమ్మట హుజూర్ మెహతాజీ మహారాజు వారు ఆ వచనము చదివిన మిశ్రాజీగారిని దీని కేమేమి ఫలితములు కలుగ గలవు అని ప్రశ్నించిరి. ఆయన ధాన్యములు, కూరగాయలు చాల సమృద్ధిగ బండు ద్దేరి, ఆహార పదార్థములు అధికముగ లభ్యము కాగలవని సమాధానము చెప్పిరి. అంతట హుజూరువారు తమ దివ్యహస్తముతో సంకేతము చేయుచు "తినుటకు కొద్ది కొద్దిగ లభించును." అని సెలవిచ్చిరి.

బినతీ పఠనా నంతర మిట్లు సెలవిచ్చిరి : హుజూర్ సాహబ్జీ మహారాజు వారు సెలవిచ్చినట్లుగనే, యీప్రణాళిక యొక్క లాభములను బట్టి చూచినచో దీని నిమిత్తమై ఒకలక్ష రూప్యములు ఖర్చుపరచినను అది పెద్ద ఖర్చు కాదు. అది ఖర్చు చేయుటగూడ అయిపోయినది. అయితే, దీనిలో నా దయాళుని ముఖ్యో

ద్దేశ్యము, వెనుకపడి పోయి యున్న మానవులకు పాటుపడి పరిశ్రమలలో పాల్గొనుట కుత్సాహము గలుగజేసి వారిని అందుకొరకై ప్రోత్సహించుటయే. కావున భూమిని వ్యవసాయపూర్వముగ చేయు కార్యమును యుక్త సమయ మాసన్నమైన తోడనే చేబూనితిమి. నందలకొలది సత్సంగులు అత్యుత్సాహావేశములతో పాటుపడి పనిచేయు చున్నందున పొలములలో వరి, చెరకు, వేరుశనగ మొదలగు వివిధ సస్యములు భిన్న భిన్న శాకములును బయలుదేరు చున్నవి. కాని మీకు మేము వాని నెంత చౌకధరల కిచ్చుచుంటిమో అంత చౌకగనే అవి పొలములలో నుత్పాదిత మగుచున్నవని మీరు అనుకొనవలదు. ఈ పదార్థములు దయాల్బాగులో హెచ్చు ఖర్చుమీద తయారగు చున్నవి. కాని అందు కొంతభాగము ఖర్చు సభవారు భరించి నందు వలననే అవి మీకు చౌకధరలకు సప్లైచేయ సాధ్య మగుచున్నది. ఈ పదార్థముల యుత్పాదనఖర్చు మీకు సప్లై అగుచున్న ధర లకు ఒకటిన్నర రెట్లు అధికముగ అగుచున్నది.

హుజూరువారు ఇట్లుగూడ సెలవిచ్చిరి :

అటులనే క్షీరశాలలో పశువులపాలు మీకు లభించుచున్నంత చౌకగ నవి ఉత్పాదన అగుట లేదు. వెనుక చౌకరోజులలో గూడ ఒక ఆవునుగాని గేదెనుగాని మేపుటకు రోజునకు ఒకటిన్నర రూపాయి ఖర్చు అగు చుండెడిది. వాని కిపుడు కుడితి పెట్టుటకు, పచ్చికమేత వేయుటకు అధమాధమము రెండు న్నర, మూడు రూపాయిలు రోజునకు ఖర్చు అగుచున్నవి. అందువలనన వాని పాలకు చాల హెచ్చుధర పడుచున్నది. కాని ఛారిటబుల్ సొసయిటీవారు ఆ ఖర్చునకు చాలసొమ్ము సహాయము చేయుచున్నారు. అందువలననే దయాల్బాగ్‌లో మీకు పాలు అంతచౌకగ లభించుచున్నవి. చుట్టుప్రక్కల నెచ్చటను ఇంతచౌకగ లభ్యమగుట లేదు.

## 80

1964 డిసెంబరు 18వ తేదీని హుజూరువారు సత్సంగములో పేఠామిఠాయి పంచిపెట్టించిరి. హుజూరువారు సత్సంగులను బజారులో మిఠాయిధర హెచ్చుగ నుండుటచే ఆ హెచ్చుధరలకు బజారులో కొనుగొన వలదని సలహా చెప్పిరి. మీకందరకును పేఠామిఠాయి నచ్చినదా మీరు దీనిని తిరిగి కొనుగోలు చేసె దరా యని అందరిని ప్రశ్నించిరి. ఈ మిఠాయి నచ్చి తిరిగి దీనిని కొనవలెనని గోరు వారిని చేతులెత్తుడని వారు సెలవివ్వగ నందరును చేతులెత్తిరి. ఆ సమయ మున కరస్పాండెన్సు హాలులో పేఠామిఠాయి తూచి సంచులతో నింపుచుండు

టచే నచ్చటనుండి కొద్దిగ సువాసన వచ్చుచుండెను, హుజూరువారు "ఈ అల జడి ఎచ్చట జరుగుచున్నది. ఈ సువాసన ఎచ్చటినుండి వచ్చుచున్న" దని ప్రశ్నించిరి.

హుజూరు వారికి జరుగుచున్న విషయము తెలిసిన మీదట వారు అతి ప్రసన్నులై ఈ మిఠాయి ఇపుడు వెంటనే ఏల పంచకూడదని సెలవిచ్చిరి. కార్య కర్త లీమాట విని పేఠామిఠాయి వెంటనే పంచిపెట్ట నారంభించిరి. ఒక పెద్ద మనిషికి మిఠాయి పొట్లము లభించినచో మరొక పొట్లము అతని ధర్మపత్నికి ఇవ్వకూడదు. అనగ ఒక్కొక్క యింటికి ఒక్కొక్క పొట్లము మాత్రమే ఇవ్వ వలయునని తీర్మానించబడినది. ఒక సత్సంగీ సోదరుడు మిఠాయి తీసికొనుటకై వచ్చిన వెంటనే హుజూరువారు చిరునగవుతో ఫలానావారి భార్య రాకూడదని సెలవిచ్చు చుండిరి. ఈ విధముగ విలాసము జరుగుచుండెను.

# 81

1965 ఏప్రియల్ 3వ తేదీని స్వామీజీ మహారాజువారి వచన మొకటి చదువబడినది. ఆ వచనములో కొందరు మూర్ఖులు మహమ్మదీయులు సద్గురువైన మహాపురుషుడు ఏ వ్యక్తి చేతను ప్రణామములు తనకు చేయించుకొనకూడ దనియు, సద్గురువునకు ఆ వ్యక్తిలో భగవంతుడు కనపడుచుండును గావున భగ వంతుని వలన ప్రణామము చేయించుకొనుట అయుక్తమనియు" ఆక్షేపించు చుందురనియు, కాని ఆ యభిప్రాయము చాల పొరపాటనియు చెప్పబడియున్నది.

హుజూరు మెహతాజీ మహారాజు వారిట్లు సెలవిచ్చిరి : సామాన్య మానవులు కూడ ఒకరినొకరు కలిసికొన్నపుడు ఒకరికొకరు చేతులు జోడించి నమస్కారముగాని, సలాముగాని చేయుచుందురు. సత్సంగులు ఒకరి నొకరు కలిసికొన్నపుడు చేతులు జోడించి 'రాధాస్వామీ' యని అభివందనము చేయు చుందురు. సద్గురువునకు అందరిలో భగవంతుడు కనిపించును. ఆయనకు ప్రణా మము చేయు శిష్యుడు కూడ సద్గురువును భగవంతునిగనే భావించు చుండును కదా! కనుక భగవంతుడు భగవంతునికి సలాముచేయుటలోగాని లేదా భగ వంతుని యెదుట ప్రణామము చేయుటలోగాని అపరాధ మేమున్నది? అట్టి మహమ్మదీయుల ఆక్షేపణలో సార మేమియు లేదు. తిరిగి హుజూరువారు చిరు నగవుతో నిట్లు సెలవిచ్చిరి : అయితే స్వయముగ నాకు ఈ విషయము అట్లు గోచరించుటలేదు. కావున నాకెవరైనను తిరిగి తిరిగి వంగి నమస్కారములు చేసినప్పుడు నేను అందుకు అంగీకరించుటలేదు. వచనము చెప్పిన పిదప హుజూరు

వారు నిన్నటిరోజున సేవనుగురించి చదివిన వచనమును జ్ఞప్తిచేసి తిరిగి చదువ వలయునని ఆనతిచ్చిరి. అప్పుడా వచనమును తిరిగి చదివిన మీదట హుజూరు వారు, సేవ చేసినందువలన మనస్సు నిర్మలమగునా లేదా యని ప్రశ్నించిరి.

అందరును "తప్పక యగు" నని సమాధానము చెప్పిరి. ఇట్లు సెలవిచ్చిరి: మనస్సును నిర్మలము చేసికొనుటకు సర్వోత్తమోపాయము సద్గురు భక్తి. సద్గురు భక్తియనగ వారి ఆజ్ఞలను పాలించుటయే. సేలనను, గురుభక్తి చేసి ఆజ్ఞలను పాలించుటలో మనస్సు యొక్క అహంకారము పోయినట్లే గురుమహారాజువారి ప్రసన్నతయు సంతుష్టియునే ప్రధానముగ నుండును. అందువలన మనస్సు బహు ప్రసన్నముగ నైపోవును. చూడుడు! ఈ కాలములో ఉదయము పొలములలో పనిచేయ వలయునని చెప్పినపుడు ఎవ్వరైనను పొలమువచ్చి పని చేసినందువలన అట్టివానికి మనస్సు పరిశుద్ధినొంది శారీరక బలము చేకూరి ఆరోగ్యము కూడ బాగుపడుచున్నది కదా! మీలో ఒకరి నొకరు కలిసికొనుటవలన సంతోషము కలుగుచున్నది. గురువుగారు 'శాబాష్' అని నుడివినపుడు మరింత అధిక సంతోషము కలుగుచున్నది.

సత్సంగము ఆఖరున హుజూరువారు మహా ప్రసన్నతతో నిట్లు సెలవిచ్చిరి: హుజూరు సాహబ్జీ మహారాజువారు శరీరత్యాగమును గురించి ఒకటి రెండు రోజులు ముందుగనే సంకేతముగ సూచించి యున్నారు. మద్రాసులో సముద్రపు టొడ్డునకు వెళ్ళినపుడు అక్కడ కూడ స్పష్టముగ నిట్లు చెప్పి యున్నారు.

హుజూర్ రాధాస్వామీ దయాళుడు నన్ను చక్రవర్తిగ చేసినయెడల ఇంతవరకే చక్రవర్తియు నెన్నడు కూర్చుండ నంతటి మహాశోభ, వైభవము లతో నేను ఆ సింహాసనముపైన కూర్చుండెదను. వారు నన్ను బూడిదలో పొర్లుమన్నయెడల ఇంతవరకు నే బైరాగియు నెన్నడు దొర్లనట్టి విధముగ బూడిదలో బడి దొర్లి పోవుదును. ఈ సూచనను జనులు సరిగ నర్థము జేసికొనలేక పోయిరి. వయోవృద్ధులైన పెద్దలును, బుద్ధిశాలురును తమకన్న చిన్న వారికి తమ యనుభవ విషయములను చెప్పి వారికి లాభము కలుగజేయ గోరు చుండవలెనని కూడ హుజూరు సాహబ్జీ మహారాజవారు సెలవిచ్చిరి. కాని తెలివి తక్కువ మానవులు అందువలన లాభము నొందక తమ అశ్రద్ధ నిర్లక్ష్యముల మూలమున శక్తి దివ్యసావకాశమును కోల్పోవుచుందురు. హుజూర్ సాహబ్జీ మహారాజవారు తమ జీవితకాలములో సత్సంగమునకై చాల భూమిని సంపా

దించి రెండు కాల్వలనుగూడ త్రవ్వించి కావలసినంత శ్రామిక దళమును గూడ తయారుచేసి యుంచిరి. కాని కొందరు ఈ సంకేతమును అర్థము చేసికొనలేక పైగా మనకీ భూమి యెందుకనియు, ఈ కాల్వలు దేనికొరకనియు, ఈ పని యెవరు చేసిరనియు ప్రతికూలవాదము చేయుచుండిరి. కాని ఇప్పుడు యుక్త సమయము వచ్చినందున ఆ శ్రామికదళము నుపయోగించి భూమిని వ్యవసాయార్హముగ జేసితిమి. రెండు కాల్వలనుండియు నీరు భూమిని తడుపుట కుపయోగించబడినది. భూములలో ధాన్యము పండించి హుజూర్ రాధాస్వామీ దయాళుని పిల్లలకు సేవ చేయబడుచున్నది. అయినను ఇంతవరకు శ్రామికదళము యొక్క ఉపయోగము మనము పూర్తిగ జేసికొనలేక పోయితిమి. కావున మీలో అధికాధిక సంఖ్యలో జనులు కృషి కార్య విషయములో అధికాధిక సేవ చేయవలసియున్నది. ఆ సేవమూలమున హుజూర్ రాధాస్వామీ దయాళుని దయాపరిభావముచే మీహృదయములు తప్పక నిర్మలమై పోగలవు.

# 82

1965 మే 10 సాయంకాల సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: మద్రాసు ప్రాంతపు పిల్లలు ఈ కాలములో నిచ్చట చాలమంది నివసించుచున్నారు. వారికి తెలుగు రాదు. వారు తప్పక తమ భాష నేర్చుకొనవలసియున్నది. తెలుగు భాష పిల్లలెవరైనను నేర్చుకొనగోరినచో ఇక్కడ ఒక క్లాసు వారలు చదువుకొను నిమిత్తము యేర్పాటు చేయబడగలదు.

# 83

1965 డిశంబరు 31 వ తేదీ సాయంకాల సత్సంగము తరువాత హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ నాడు డిశంబరు 31 వ తేదీ కావున ప్రతి వ్యక్తియు 1965వ సంవత్సరములో తాను గావించిన సమస్త కార్యకలాపమును గురించి నిరీక్షణ చేసికొనవలసియున్నది.

# 84

1967 జనవరి 7వ తేదీన చదివిన వచనములో ఈ క్రింది అంశమును హుజూరువారు మరొకసారి చదివించిరి. భగవంతుడు ఎవని యందైన దయా కటాక్షములు చూపదలచుకొన్నపుడు అతనికి దుఃఖమును గలుగజేయును. ఏల

నన దుఃఖము వలన బంధనములు శిథిలమై పోవును. భగవంతుడు సమస్త జనుల యందు దయవర్షించునపుడు క్షామము, కలరా, ప్లేగు, యుద్ధములు, మొదలగు బహువిధ కష్టములను ప్రసాదించును. ఆ దుఃఖములు, కష్టముల మూలమున జీవుల కర్మలు నశించి నిర్మలత్వము కలిగినపుడు భగవంతుడు పరమార్థదానము ననుగ్రహించును.

పరమపూజ్యులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: అయితే మనము అపుడు భగవంతునికి ధన్యవాదము లర్పించవలసియున్నది. కరువు భత్యముగూడ ఇవ్వనే కూడదు.

## 85

1967 జూలై 1వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరువా రిట్లు సెలవిచ్చిరి: ఆంగ్లేయులు భారత దేశమును విడిచి వెళ్ళిపోయిరి. కాని భారత దేశ వాసులకు నెక్ టై పంట్లాము అనెడి వృధావ్యయ కారకములైన రెండు విషయములను నేర్పి వెడలిపోయిరి. నెక్ టై కట్టుకొను అలవాటు రోజు రోజు తగ్గిపోవుచునే యున్నది. ఏలనన రాష్ట్రీయ ప్రభుత్వము యొక్క ఆజ్ఞల ననుస రించి జనులు మెడవరకు బొత్తాములు పెట్టుకొను కోట్లను ధరించు చున్నారు. అందుచే నెక్ టై కట్టుకొనుటకు సావకాశమే లేకుండ పోయినది. కాని పంట్లాము కట్టుకొను అలవాటు మాత్రము రోజు రోజు తీవ్రముగ పెరిగిపోవు చున్నది. విద్యార్థులును, యువకులును, సామాన్యముగ పంట్లాములనే తొడుగు చున్నారు. చిన్న చిన్న పిల్లలు, ముసలివాండ్లును గూడ పంట్లాములను ధరింప నారంభించిరి. పంట్లాముల వాడుక ఇంత ఎక్కువగ పెరిగిపోవుటను బట్టి ఆలో చించగా ఆ పంట్లాములు ధరించి నందువలన వీరికేమి ఆనందము లేక శోభ గలుగు చున్నదో బోధపడుట లేదు.

సరిగ ఆలోచించి చూచినచో పంట్లాము కట్టు కొనుటలో ప్రత్యేకమైన సౌఖ్యమేమియు లేదు సరికదా పైగా పంట్లాము తొడుగుకొని కూర్చుండుటయే కష్టమగుచున్నది. దాని కుట్టు కూలి గూడ చాల యెక్కువ. సామాన్యముగ దాని కుట్టుకూలి నాలుగు మొదలు ఆరు రూపాయిల వరకు తీసికొనుచున్నారు. దీనికి బదులు పైజామా కట్టుకొన్న యెడల చాల సుఖముగ నుండును. పను లన్నియు చాల సులువుగ చేసికొన వీలగును. మొట్ట మొదటి సంగతి యేమనగ దానిని ఇంటనే సులువుగ కుట్టుకొన వచ్చును. దర్జీచేత కుట్టించినను నాలుగైదు అణాలలో కుట్టుపని యైపోవును. కావున ఈ కరవు రోజులలో మీకు సలహా ఏమనగ మీరు పైజామా ధరించుట అలవాటు చేసికొన వలయును. కుట్టు

కూలిలో మిగిల్చిన డబ్బు ఇతర ఆవశ్యక కృత్యములకు ఉపయోగించుకొన వలయును.

హుజూరువారిట్లు సెలవిచ్చిరి : దీని కర్థము మీ వద్ద పాత పంట్లాము లున్నయెడల వానిని పాడుచేసికొనుడని కాదు. వానిని మీరు తప్పక ఉపయోగించుకొన వలసినదే. మీరు వానిని కార్యాలయములలో వాడుకొనవచ్చును. కాని క్రొత్త పంట్లాములను కుట్టించు కొనవలదు. అవసరమైనచో క్రొత్త పైజామాలను కుట్టించు కొనుడు. అందులో మీకు బట్ట తక్కువ పట్టును. కుట్టు కూలి తగ్గిపోవును. సౌఖ్యమెక్కువ కలుగును.

## 86

1967 జూలై 31వ తేదీ సాయంకాల సత్సంగములో హుజూరువారిట్లు సెలవిచ్చిరి : ఈ సంవత్సరము నలుబది యొకటిన్నర ఎకరములలో వేరు సెనగ వేయబడినది. అందులో పనికిరాని చెత్త మొక్కలు, గడ్డియు చాల పెరిగిపోయి, వేరుసెనగ మొక్కలను అణగత్రొక్కి వేసినవి. ఆ చెత్త మొక్కలు, గడ్డియు, ఒక కలుపు తీతతో నిర్మూలముగాక తిరిగి వృద్ధియగు చుండుటచే మరొకసారి కలుపుతీత తీయుట ఆవశ్యక మగుచున్నది. క్రితము సంవత్సరము కూడ రెండు సార్లు కలుపుతీత అవసరమయ్యెను. ఈసారి గూడ రెండు కలుపుతీతలు తీయవలసి యున్నది. కాని ఇప్పుడు జరుగుచున్న పని యొక్క వేగమును బట్టి చూడగ అది చాల కాలము పట్టగలదనియు, అందుచే వేరుసెనగ మొక్కలు ప్రబలముగ పెరగజాలవనియు తోచుచున్నది. అందువలన స్త్రీలు, పురుషులు, వయసు వచ్చిన బాల, బాలికలును అధిక సంఖ్యాకముగ పొలములలో పనిచేయవలసి యున్నది. అట్లు చేసిన యెడల రోజునకు అధమాధము మూడు ఎకరముల భూమి కలుపుతీత అయి పదునాలుగు రోజులలో ఈ పని అంతయు పూర్తి అయిపో గలదు. మీరు అధికాధిక సంఖ్యలో పొలమునకు వచ్చి కష్టపడి పని చేయ వలయునని నా నివేదన.

## 87

1967 డిశెంబరు నెల 31వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : చూడుడు, ఈ నాటితో 1967వ సంవత్సరము పూర్తియై పోవు చున్నది. మన మందఱము నీరాత్రి నిద్ర పోకముందే మన మీ సంవత్సరములో, తమంతట తమకును, తమ కుటుంబమునకు, తమ దేశ

ప్రజలకును నెరవేర్చవలసి యున్న కర్తవ్యములను పూర్తిగ నెరవేర్చితిమా లేదా యని మనలో మన మాలోచించుకొన వలసి యున్నది. అట్లు పూర్తిగ నెర వేర్చనిచో అంతర్యమున పశ్చాత్తాప పడి విచారించుచు నికముందైనను మనము వీరి అందరికి నెర వేర్చవలసిన కర్తవ్యములను పూర్తిగ నెర వేర్చెద మని దృఢ సంకల్పము చేసికొన వలయును.

# 88

1968 మార్చి నెల 31వ తేదీ సాయంకాలము ఆగ్రాఫోర్టు మహా భవనములో సత్సంగము చేయుట కేర్పాట్లన్నియు, ప్రె. భా. యస్. పి. ధీర్ గారు చేయించిరి. సుమారు 6000 మంది వచ్చిరి. అందరికిని కూర్చుండుట కొరక పెద్ద గుడారమును వేయించిరి. హుజూర్ మెహతాజీ సాహబ్ వారు ఆ గుడార ములో ప్రవేశించినంతనే రాధాస్వామీ నామధ్యానములు కెవ్వున ప్రతిధ్వనించ దొడగెను. హుజూర్ వారు, "నన్ను కూర్చుండనిండు ముందు" అని సెలవిచ్చిరి. హుజూరువారు ప్రశ్నించిన మీదట, దయాల్బాగువారే గాక, ఆగ్రాపట్టణము నుండియు బయట ఊళ్ల నుండియు వందలకొలది సత్సంగు లచ్చటకు వచ్చిరని తేటపడినది. కోత్వాలు (ప్రె. భా. సర్దారీలాల్) యొక్క అధికారక్షేత్రము నుండి వచ్చిన వారుగాక బయట నుండి వచ్చిన వారిని చేతులెత్తుడని హుజూర్ వారు ఆజ్ఞాపించగా చాలమంది చేతులెత్తిరి. హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : ఈ రోజున నేను మీ కొరక చిన్నదేయైనను మహత్త్వ పూర్ణమైన విషయమును చెప్పదలుచుకొన్నాను. అదే మనగా, 1857వ సంవత్సరములో ప్రథమ స్వాతంత్ర్యా యుద్ధము మీరట్, ఆగ్రా పట్టణములలో జరిగెను. ఈ ఫోర్టులో నుండియే ఆంగ్లేయ సైనికులు ఆగ్రా పట్టణములోని జనుల మీదను, భవనముల మీదికిని తుపాకీలు ప్రేల్చు చుండిరి. హుజూరు మహారాజువారు పీపల్మండీలో నుండిరి. తుపాకీ గుండు పోగల ఆవరణకు లోపలనే వారి దివ్యభవనము ఉండెను. కావున ఇరుగు పొరుగు పెద్దలు హుజూర్ మహారాజు వారిని అచ్చటి నుండి దూరముగ వెళ్లుడని సలహా చెప్పిరి. కాని వారా మాటను లెక్కసేయక ఆ భవనమునందే ఉండిపోయిరి. ఫోర్టు, కోట చాల యెత్తుగనున్న స్థలమున నుండెను. మధ్యన యెన్నియో సందులు గొందులును, చాలమజిలీలును ఉన్నవి. భవనములు కూడ చాలయెత్తైనచోట్లనే యున్నవి. సమాన తలమైన స్థలము నుండి గుండ్లు ప్రేల్చిన యెడల, నంత యెక్కువ ప్రమాద ముండ నేరదు, కాని ఒక బహూన్నతమైన స్థలమునుండి గుండ్లు ప్రేల్చినపుడు తప్పక దెబ్బతగుల గలదు.

అటుపిమ్మట శబ్దపాఠమైనది. మొదటి శబ్ద మిట్లు వచ్చెను.

1. రోమ రోమ మేరే తుమ ఆధార।
   రగ రగ మేరీ కరతే పుకార ॥

( సారబచన్, బచన్ 7, శబ్ద 2 )

రెండవ శబ్దము చదువుటకు ముందు హుజూరు వారు "ఆగుము. దివ్యేచ్ఛకు తీయుము" అని సెలవిచ్చిరి. ఈ క్రింది శబ్దము వచ్చెను.

2. గురు దరియావ చలో సుత్రి సజనీ।
   మన కీ లహార్ సహ్లార్ ॥

( సారబచన్, బచన్ 18, శబ్ద 10 )

అపుడు ఆడవారిని చదువమని ఆనతి ఇచ్చిరి. ఈ క్రింది శబ్దమును చదివిరి :

3. పంచమ కిలా తఖ్త సుల్తానీ।
   బాదశాహ సచ్చా హమ జానీ ॥

( సారబచన్, బచన్ 26, శబ్ద 5 )

అంతట హుజూరు వారిట్లు సెలవిచ్చిరి. ఈ శబ్దములో మూడు విషయములు, అనగా తఖ్తసుల్తానీ (అనగా చక్రవర్తి సింహాసనము) కిలా (అనగా కోట) సచ్చాబాదుశాహ (అనగా నిజమైన చక్రవర్తి) యను మూడు విషయములు చెప్పబడినవి. తిరిగి మరొక శబ్దమును చదువుమని చెప్పగా యీ క్రింది శబ్దమును చదివిరి.

4. సరన పడే కీ లాజ,
   ప్రభు రాఖో రాఖనహార్ ॥

(ప్రేమవిలాస్, శబ్ద 80)

తిరిగి యిట్లు సెలవిచ్చిరి : 1857వ సంవత్సరంలో జరిగిన ప్రథమ స్వతంత్రతా యుద్ధములో నీ కోటనుండి తుపాకి గుండ్లు బహుశా రాత్రివేళనే పేల్చబడి యుండునని నే ననుకొనుచున్నాను. అయితే ఆ సమయములో శిరస్త్రాణము (Helmet) పెట్టుకొన్నవారు తమ శిరములపైన ఇనుప టోపీలు చాల మెత్తగ ధరించి తుపాకి గుండ్లు పేల్చిరి. ఇప్పుడైతే, తలమీద నేమియు ధరించనట్టి,

మగవాండ్రు మాత్రమేగాక, ఆడవాండ్రును చాల మందియు, ముఖ్యముగ నవ యువకులైన ఆడ మగపిల్లలును తలమీద ఆవరణ లేకుండగనే, పగటివేళ, లౌడ్ స్పీకరు ద్వారా (Loud Speaker) శబ్దధ్వానము లనెడి గుండ్లను నలు వైపులకు ప్రసరింప జేయుచున్నారు. అప్పుడు తిరిగి "Go on" (అనగా "ముందుకు వెళ్ళుడు") అని సెలవిచ్చిరి.

అంతట మిశ్రాజీగారు వచనము చదువుట మొదలు పెట్టబోయిరి. హుజూరువారు "ఏమి చేయుచున్నావు? వచనము చదువవలదు. మన మిచ్చ టకు వచ్చినది శబ్దములనెడి గుండ్లు ప్రేల్చుటకే కావున శబ్దములను చదువుడు. దివ్యేచ్ఛకు తీసి చదువుడు" అని సెలవిచ్చిరి : ఈ క్రింది శబ్దము వచ్చినది.

5. ఇంద్రీ ఉలట లాఓ అబ్ తన మేం।
మన కో ఖైంచ చఢాఓ గగన-మేం॥

( సారబచన్, బచన్ 36, శబ్ద 10 )

తిరిగి యీ క్రింది శబ్దము వచ్చెను.

6. సఖీ ఆజ దేఖో బహార నఈ।

[ ప్రేమ విలాస్, శబ్ద 29 ]

ఈ శబ్దములో యీ క్రింది చరణము ఉన్నది.

హాంస కిలే పర దేఖన ఆయే,
శోభా అద్భుత ఆజ నఈ॥

హుజూరువారు దీనిని మరల రెండవసారి చదివించి ప్రస్తుతమున కిది సరిపోవు చున్నదా" యని ప్రశ్నించిరి. అందరును "చిత్తము. సరిగనే యున్న"దని సమా ధానము చెప్పిరి.

తరువాత హుజూరువారు ఆడ వాండ్రను దివ్యేచ్ఛకు శబ్దము తీసి చదువ వలయునని సెలవివ్వగ నీ క్రింది శబ్దమును తీసి చదివిరి.

7. చహుఁ దిస ఆగ లగీ, జగ జీవ బిచారే,
కర్మోం కే మారే, రహే జగ ధార్ బహాఈ రే।
రాధాస్వామీ, రాధాస్వామీ, రాధాస్వామీ ప్యారే
రాధాస్వామీ రే॥

( ప్రేమ విలాస్, శబ్ద 16 )

శబ్ద పఠనమైన తర్వాత హుజూరువారు "మీ రీ శబ్దమును మీ కొరకై పాడు కొనిరా, లేక అందరి నిమిత్తమై పాడిరా," యని పాఠకులను ప్రశ్నించిరి. "అందరి నిమిత్తమైయే" అని సమాధానము వచ్చెను.

"అందరు విను నిమిత్తమా"యని హుజూరువారు అడిగిరి. సమాధానము: అందరి మీద దయ చూపవలయుననియే. హుజూరువారు, "దయాకా?" అనగ దయ కావలయునా? అని యనుచు, "మిమ్ములను మూడు లోకములనుండి పైకి లాగి నాల్గవలోకము చేర్చితిమి. మూడు సింహ ద్వారములు దాటితిమి. నాల్గవ సింహ ద్వారమునకు వచ్చితిమి. మీకు మరేమి కావలయును?" అని సెలవిచ్చిరి.

హుజూరువారి ఆజ్ఞానుసారము ప్రసాదము పంచిపెట్టు చున్నప్పుడు హుజూరువారు తమ యెదుటనున్న సాహబ్జీ మహారాజువారి ఫొటో వైపునకు చూచుచు, "హుజూర్ సాహబ్జీ మహారాజువారు తమ దృష్టిని రెప్ప వాల్చ కుండ మన వైపునకు త్రిప్పి చూచుచున్నట్లు నాకు అనిపించుచున్న"దని సెలవిచ్చిరి.

తర్వాత నిట్లు సెలవిచ్చిరి: చూడుడు. మీరు సత్సంగము చేసికొను టకై కోటలోనికి వచ్చిరి. కావున మీరు సైనిక దళము యొక్క శిక్షారీతిని (Military Discipline) అవలంబించవలసి యున్నది. మీరు పంక్తికి ఆరు గురు చొప్పున పంక్తులు కట్టుకొని వెడలవలయును. ఒక్కొక్క సింహద్వారము వద్ద నిరువురు మనుష్యులు చొప్పున ప్రతి ద్వారము వద్ద నిలుచుండి పోవు చున్నట్టి మనుష్యులను లెక్కపెట్టుచుండవలయును. అట్లు చేసినచో నిచ్చటకు వచ్చిన జనుల మొత్తము సంఖ్య తెలియగలదు.

## 89

1968 ఆగస్టు 11 ఆదివారము విద్యార్థులు, విద్యార్థినులయొక్కయు సత్సంగము జరిగెను. శబ్దపాఠమైన పిదప హుజూరు వా రిట్లు సెలవిచ్చిరి: గత పరీక్షలలో అసఫలురైన పిల్లలు నిలబడుదురుగాక. కొందరు నిలబడిరి.

అప్పుడు హుజూరువారు ఆ పిల్లలను ఇట్లు ప్రశ్నించిరి: మీ రెందుకు అసఫలులైరి? మీరు శ్రమపడి చదువలేదా, లేక మీ ఉపాధ్యాయులు మీకు సరిగ చెప్పలేదా?

కొందరు పిల్లలు "మేము పరీక్షలకై సరిగ సిద్ధము కాలేదు" అని చెప్పిరి

హుజూరు **వారు** : ఎందుచేత సిద్ధము కాలేదు? ఆటలాడు చుండిరా? ఏమి కూ సమాధాన మెవరును చెప్పనందున హుజూరు వారు స్కూలు ప్రధానాచార్యునితో నిట్లనిరి : ఈ పిల్లలు తిరిగి పరీక్షలలో అసఫలురైనచో వీర్లను స్కూలులో నుండి బయటకు పంపివేయుము.

హుజూరు **వారు** డాక్టర్లు ఏ పిల్లలకు దుర్బలముగ నున్నారని చెప్పి వెన్న తిన వలయునని సలహా యిచ్చిరో అట్టి పిల్లలను లెండని ఆనతిచ్చిరి. అట్టి పిల్లలందరు లేచిన పిమ్మట హుజూరు వారొక్కొక్కరినే దగ్గరకు పిలిచి వారికి వెన్న రోజు లభించుచున్నదా యని ప్రశ్నించగా, వారందరును ముట్టుచున్నదని చెప్పుకొనిరి.

## 90

1968 ఆగస్టునెల 18 వ తేదీ సాయంకాలము హుజూరు సాహబ్జీ మహారాజు వారి వచన మొకటి చదివిరి. అందులో ఆ దయాళువు "రాధాస్వామీ దయాళువు దయాల్బాగులో రాధాస్వామీ నామముయొక్క ఫిరంగులను స్థాపించిరి. ఇచ్చటనుండి రాధాస్వామీ నామముయొక్క ఫిరంగి గుండ్లు నలు దెసలకు విసరబడగల"వని సెలవిచ్చిరి.

వచనానంతరము, హుజూరు మెహతాజీ మహారాజు వారిట్లు సెలవిచ్చిరి : నేను ఆగ్రాఫోర్టులో శబ్దములనెడి ఫిరంగి గుండ్లు ప్రేల్చుట విషయములో చెప్పినమాట పొరపాటు కానట్లే. హుజూరు సాహబ్జీ మహారాజువారు దీనిని గురించి భవిష్యవాణి చాలకాలము ముందే చెప్పియున్నారు. అందువలననే యిపుడు శబ్దముల రూపమైన గుండ్లు భారతదేశములోనేగాక, యూరోపా, అమెరికా, కెనడా వగైరా పశ్చిమ దేశములలోనికి గూడ ప్రేల్చి పంపుట కేర్పాటు అయిపోయినది. ఇంక నితర దేశములలోనికి గూడ ఆ గుండ్లను ప్రేల్చి పంపుట కేర్పాట్లు జరుగుచున్నవి.

## 91

1968 ఆగస్టు 25 ఆదివారము విద్యార్థుల సత్సంగములో విద్యార్థిను లీ క్రింది శబ్దమును చదివిరి.

సావన మాస సుహాగిన ఆయా!
రోమ రోమ అంగ అంగ హరషాయా॥
(ప్రేమ బిలాస్, శబ్ద 2)

ఆ శబ్దమైన తర్వాత హుజూరు వారి శబ్దములో విశేషమేమిటో మీకు తెలియునా, యని అడిగిరి. తర్వాత వారే స్వయముగ నిట్లు సెలవిచ్చిరి: ఈ శబ్దములో చాలమంది పేర్లు చేర్చబడినవి. అదియ దీనిలోని విశేషము. ఆ తర్వాత మరొక శబ్దము చదువబడినది.

# 92

1968 అక్టోబరు 5వ రోజున హుజూరు వారు కమీజు సల్వారు తొడుగుకొని వారివద్దకు పదార్థములను ప్రసాదము చేయించుకొనుటకై వెళ్ళిన స్త్రీలను, ఒక్కొక్కరినే ఆ బట్టల ఖరీదు ఎంతైనదని అడిగిరి. మీటరు 1కి మూడున్నర లేక నాల్గు రూపాయిలు ఖరీదని చెప్పిరి. హుజూరువారు అప్రసన్నత ప్రకటించి, దయాల్బాగుబట్ట ఇంతకన్న చాల గట్టిగనుండి, ఖరీదు మీటరు 1కి రెండున్నర రూపాయీలు మాత్రమే ఉండును. దానిని తొడుగుకొని చక్కగ కాలక్షేపము చేయవచ్చును కదా! ఇంత ఖరీదైన బట్టకొని కట్టుకొనవలసిన అవసర మేమున్నదని సెలవిచ్చిరి. ఇంత ఖరీదైన బట్ట కట్టుకొని ఒకరు వచ్చినయెడల ఇతరులకు గూడ అట్లే ఖరీదైన బట్టలు కట్టుకొన వలయునను ఆసక్తి కలుగును. కావున ఇకముందు బయటనుండి ఖరీదైన బట్టలు కట్టుకొని దయాల్బాగు వచ్చెడి స్త్రీల నిచ్చటికి రానివ్వము. ఇచ్చటికి వచ్చువారు స్వచ్ఛమైనట్టి, ఉతికిన తెల్లబట్టలు మాత్రమే ధరించవలయును.

# 93

1968 అక్టోబరు 7 వ తేదీ సాయంకాల సత్సంగములో వచనముల గ్రంథము రెండవ భాగములోని హుజూరు సాహబ్జీ మహారాజువారు 1921వ సం॥ రము మే నెల 19 వ తేదీని సెలవిచ్చిన 3వ నంబరు వచనమును రెండవ సారి తిరిగి చదివించిరి. అందులో "సత్సంగములో నెవనికైన గౌరవము చేయబడినచో, నది నిజమున కొక గొప్ప చిహ్నముకాదు. అట్టి సత్సంగి విచారించి పశ్చాత్తాప పడవలయును. ఆ సత్సంగి అట్టి ఆదరగౌరవముల వలన తన మనస్సు ఉప్పొంగినదేమో చూచుకొనవలయును. అట్లుప్పొంగిన యెడల, అది హాలాహలవిష సమానమనియు అట్లుగాక నతని మనస్సు ఆ ఆదరగౌరవములను నిరాకరించి లజ్జితమైపోయినచో నది యుక్తమనియు తెలుసుకొన వలయును. కావున సద్గురువు పరమార్థ దాన కెవ్వనికి ఇవ్వదలచుదురో, అతడు గురుముఖుడు కానిండు లేదా మరొక సత్సంగి కానిండు, అతనిని, గోప్యముగనుంచి, ఆ వ్యక్తికి

గూడ గుప్తముగ నుండి పోగల శక్తి నొసంగి, అతనికి ఇతరుల దృష్టిదోషము తగులకుండ కాపాడుచుందురు. గురుముఖుడు ఈ విధముగ రక్షణ చేయబడును అని సెలవిచ్చిరి. మహారాజ్ సాహెబ్ వారు, సర్కార్ సాహెబ్ వారును ఒకప్పు డిట్లే జరిగించిరి. తిరిగి ఇట్లు సెలవిచ్చిరి. సత్సంగ శిక్షణ ఒక్కొక్కమెట్టు చొప్పున పైకి అభివృద్ధి కావలసియున్నది. అనుభవము కలుగుచున్న కొలది ఈ పరిజ్ఞానము క్షణ క్షణమునకు మార్పునొందుచు సరి అయిపోవుచు ఆఖరికి పరిస్థితి అంతయు మారిపోగలదని వ్రాయబడినది.

హుజూర్ మెహతాజీ మహారాజ్ వారు "మహారాజ్ సాహెబ్ వారు, సర్కార్ సాహెబ్ వారి కేవిధముగ సంరక్షణ గావించిరో మీకు తెలుసునా" అని అడిగిరి. సమాధాన మెవరును చెప్పనందున హుజూరువారు తామే స్వయముగ నిట్లు సెలవిచ్చిరి. సర్కార్ సాహెబ్ వారు గురుముఖులు అనెడి విశ్వాసము సత్సంగులకు గలుగ నారంభించినప్పు డొకసారి మహారాజ్ సాహెబ్ వారు ఒక అడుగు అప్పుడే గోరీలో పడియున్న వ్యక్తి గురుముఖుడెట్లు కాగలడని సెలవిచ్చిరి. ఆ మాట వినగానే సత్సంగులకు సర్కార్ సాహెబ్ వారిని గురించి అభిప్రాయము మారిపోయినది. తిరిగి వారు ఇట్లు ప్రశ్నించిరి.

సాహబ్జీ మహారాజు వారుగూడ తమ గురుముఖుని అట్లు సంరక్షించిరా?

డాక్టర్ బ్రిజిలాల్ గారు "వారు తమ గురుముఖుని పేరు బాహాటముగ ప్రకటించిరి" అని సమాధానము చెప్పిరి.

హుజూరు వారు అట్లెందుకు ప్రకటన చేసిరని తిరిగి ప్రశ్నించిరి. డాక్టర్ బ్రిజిలాల్ గారు ఆసమయ మట్టిదని సమాధాన మిచ్చిరి. హుజూరు వా రిట్లు సెలవిచ్చిరి. సాహబ్జీ మహారాజువా రట్లు బాహాటముగ ప్రకటించి యుండనిచో పార్టీలు చాల యెక్కువగ బయలుదేరి యుండును.

# 94

1969 మార్చి 7 : కొద్దిరోజుల క్రిత మొకనాడు సాయంకాలము సత్సంగమైన తరువాత పరమపూజ్యులైన హుజూరువారు తమ సింహాసనమునుండి దిగి కరెస్పాండెన్సు హాలులో కొంతదూరము నడిచివెళ్ళి తిరిగి వెనుకకు వచ్చి ఇట్లు సెలవిచ్చిరి. మీరందరును సత్సంగమైన తరువాత వెంటనే బాతాఖానీ చేయుచున్నందువలన మీరు సత్సంగ సమయములో మీకు లభించిన ఆధ్యాత్మిక

లాభము నంతను ఒక్క పెట్టున కోల్పోవుచున్నారు. ఈ నాడు గూడ నట్లే హుజూర్ వారు సింహాసనమునుండి దిగుచున్నప్పుడే పురుషులను సంబోధించుచు "సత్సంగమైన వెనువెంట నివ్విధముగ కబుర్లు చెప్పుకొనుచున్నందు వలన సత్సంగ సమయములో మీకు సత్సంగము వలన లభించిన ఆధ్యాత్మిక లాభము నంతను నష్టపరచుకొనుచున్నారని సెలవిచ్చిరి.

# 95

1969 జూలై 10 : నిన్నటి రోజున సత్సంగములో చదివిన 1921 సెప్టెంబరు 25 వ తేదీగల హుజూరు సాహబ్జీ మహారాజు వారి వచనమును పరమ పూజ్యులైన హుజూరువారీనాడు తిరిగి చదువుమని ఆనతిచ్చి ఇప్పుడు రెండవ సారి చదివించుచున్న ఈ వచనములో సత్సంగులు మూడు తరగతులుగ విభజింప బడినట్లు వర్ణించిరనియు, అందుచే మీరందరు నా వచనమును శ్రద్ధగ విని మీలో నొక్కొక్కరు తామే తరగతికి చెందుదురో ఆలోచించుకొని అంతకన్న ఉత్తమ తరగతిలోనికి వెళ్ళుటకై ప్రయత్నించుకొన వలయునని సెలవిచ్చిరి. పిమ్మట ఆ వచనము చదువబడినది.

సంత్ సద్గురువు యొక్క దర్శనము ఆంతర్యమున ఒక్కసారి యైనను లభించిన సత్సంగులు మహాభాగ్యశాలురు. ఏదైన నొక స్థానాధిపతి రూపము గాని శబ్దముగాని ఆంతర్యమున ప్రకటమైన సత్సంగులు పై తరగతికన్న నొక మెట్టు క్రింద గణనలో వత్తురు. సంత సద్గురుని దేహ స్వరూపమును ప్రేమ ప్రీతులతో భక్తి భావముతోను దర్శనము చేసికొనునట్టి సత్సంగులు ఇంకొక మెట్టు క్రిందుగ లెక్కకు వత్తురు. ఈ గతులలో నెద్దాని నైన పొందుటకై సేవ చేయుట అత్యావశ్యకము. సేవ చేసిగాని, శ్లాఘు చేసిగాని లేక మరి యెవ్విధముగగాని యెవరైన నొక్కసారి ఈ తరహా గతిని సంపాదించుకొన్న యెడల ఆత డటుపిమ్మట, స్మరణ ధ్యానములను విడిచిపెట్టినను కూడ, లేదా ప్రపంచములో నెట్టి దెబ్బలు తిన్నను ప్రాపంచిక వ్యవహారములలో నెట్టి దుస్థితిలో పడిపోయినను గూడ అతని యుద్ధారము సిద్ధించినట్లే తెలిసికొనవలయును.

పిమ్మట హుజూర్ మెహతాజీ మహారాజ్ వారిట్లు సెలవిచ్చిరి :గురు మహారాజ్ వారికి శ్లాఘు చేత సంతోషించెడి దౌర్బల్యమొకటి గలదు. కాని దానితోబాటు వారికి సత్సంగుల సమస్త లోపముల నెంతమాత్రము చూడకుండ వారి కాంతర్యమున దర్శనమిచ్చెడి అద్భుత మహిమ కూడ కలదు,

# 96

1969 జూలై 21వ తేదీని ఉదయ సత్సంగ సమయము మొదలుకొని ముసలాధారగ వర్షించ నారంభించెను. పొలము పనికి సెలవివ్వవలసి వచ్చెను. హుజూర్ వారు ప్రే. భా. ఇంద్రసింగు గారిని బిలిచి, మీరు ఇంద్రదేవుని కివ్విధ ముగ చెప్పుడని సెలవిచ్చిరి: "ఇంద్ర దేవుడా, మీరు చాల అయుక్త సమయ ములో వర్షించుచున్నారు, అందువలన పొలము పనులకు ఆటంకము కలుగు చున్నది. మీ రిట్లు సమయముకాని సమయములో వర్షములు వర్షించుట విడిచి పెట్టవలయును లేదా, నేను మీ స్థానము నాక్రమించి పనిచేయుదును."

సర్దారుగారు ఆ విధముగ బిగ్గరగ చెప్పిరి. కొద్ది సేపటికి వర్షము ఆగి పోయినది కాని పొలములో పనిచేయ సాధ్యము కాలేదు.

# 97

1969 అక్టోబరు 19వ తేదీభండారా రోజున హుజూవారు పిల్లవాండ్రను పిలచి, మీలో నెవరెవరు ముప్పది ఏండ్ల ప్రాయములోపున వివాహము చేసి కొనకుండ నుండుటకు సిద్ధముగ నున్నారని ప్రశ్నించిరి. చాలమంది పిల్లలు చేతులెత్తిరి.

ఆ తరువాత ఆడపిల్లల వైపున ఎవరెవరు ఇరువది ఐదేండ్ల లోపున పెండ్లి చేసికొనకుండ నుందురని హుజూర్ వారు ప్రశ్నించిరి.

చాల మంది ఆడపిల్లలు చేతులెత్తిరి. అపుడు హుజూర్ వారు చిరునగవు నవ్వుచు మీ కందరకు అసలే పెండ్లి కాకుండ నైపోవదు కదా ! యని పరి హాసము చేసిరి.

# 98

1970 మార్చి 26వ తేదీని లక్నోలో సాయంకాల సత్సంగములో పరమ పూజ్యులైన హుజూరువా రిట్లు సెలవిచ్చిరి : మీరందరును ఉన్ని పంట్లాములను ధరించుట వెంటనే ఆపుచేయుడు. ఏలనన ఉన్ని పంట్లాముల కుట్టుకూలి పదు నారు రూపాయిలును, నూలు పంట్లాముల కుట్టుకూలి నాలుగైదు రూపాయి లును అయి యున్నవి. కేవలము కుట్టుకూలిలోనే ఎన్నియో పైజామాలు

తయారై పోవునుగదా ! అందువలన చాల పొదుపు చేయవచ్చును. పంట్లాములు ధరించుటలో ప్రత్యేక లాభ మెద్దియు గూడ లేదు.

ఇట్లు సెలవిచ్చిరి : మీ రందరును పిల్లలను తక్కువ మందిని కనవల యును. అప్పుడే మీరు వారి పాలన పోషణలు చక్కగ చేయగలరు. అందువలన వారికి మంచి ఆరోగ్యము కలిగి వారి విద్యాభ్యాసమునకు గూడ మీరు తగిన ఏర్పాటు చేయగలరు. అందుచే వారి జీవితము సుఖావహముగ గడచిపోవును. మీకు గూడ తగిన తిండి, బట్ట సదుపాయము కలుగును. మీ ఆరోగ్యము గూడ అందువలన బాగుండి మీ గృహములు సుఖ సంపత్తులతో కూడి యుండును. కావున మీరు ఒక్కొక్క గృహమున కిరువురు, ముగ్గురుకంటె నెక్కువ సంతానమును కనగూడదు. అట్లు చేయుటకై మీరు కుటుంబ నియంత్రణ ప్రణాళికలో జెప్పిన ఉపాయముల నవలంబించవలయును.

# 99

1970 ఏప్రియల్ 3వ తేదీని పరమ పూజ్యులైన హుజూర్ వారు కొడవలి చేతబట్టి గోధుమ పంటను స్వయముగ కోయ నారంభించి ఇట్లు సెలవిచ్చిరి: ఉత్సాహము ప్రదర్శించుడు. గోధుమ కోత కోయుటలో మీరందరును ఉత్సాహమును చూపుడు.

# 100

1970 ఏప్రిల్ 16వ తేదీ సాయంకాల సత్సంగములో నీ క్రింది శబ్దమును చదివిరి.

గురూ సంగ జాగన కా ఫల భారీ ॥ టేక్ ॥
సేవా మిలే దరసపుని పావే ।
బచన సునత గుల్ జారీ ॥

[ సారబచన్, వచనము 41, శబ్దము 11 ]

హుజూరువారి చరణములను తిరిగి చదువుడని పాఠిలకు చెప్పిరి గాని వారికి ఆ శబ్దమును తిరిగి తీయుటలో చాల ఆలస్యమైనది. అప్పుడు హుజూరువా రిట్లు సెల

విచ్చిరి : సరే! గురువును, ఈ శబ్దమును విడిచిపెట్టుము. మీరు ఈ శబ్దములను వరుసగ చదువటలేదా యని అడిగిరి. ఇంతలో నా శబ్దము వచ్చినందున వారు దానిని చదివిరి.

హుజూరువారు సుప్రసన్నులై ఇట్లు ప్రశ్నించిరి: మీలో నెవ రెవరు నిర్ణీత సమయమునకు ముందుగ సత్సంగమునకు వచ్చి సత్సంగము పూర్తియైన తోడనె చీకటిలో పొలమునకు వెళ్ళి తగినంత పంట సస్యము అచ్చట కోతయై అచ్చటినుండి కళ్ళములోనికి గొనుపోవువరకు విడువకుండ పొలములలోనే యుండి పనిచేయుచున్నారు? చాలమంది చేతులెత్తిన మీదట హుజూర్ వారు "ఏప్రిల్ 14వ తేదీని ఉదయము ఒక్క పూటలో కోసిన సస్యముతోనే పదునారు ట్రక్కులు నిండిపోయి కళ్ళమునకు పంపించబడుట కిదియే కారణ"మని సెలవిచ్చిరి.

# 101

1970 నవంబరు 1వ తేదీని హుజూర్ సాహబ్జీ మహారాజువారి క్రింది వచనమును చదివిరి. గాఢమైన ఆపత్తుల మేఘములు మీ మీదకు విరివిగ వచ్చి పైన క్రమ్మి పైపైకి చూడగ వానినుండి తప్పించుకొనుట కుపాయ మెద్దియు మీకు కానరాకుండు పరిస్థితి కలుగుచుండును. కాని రాధాస్వామీ దయాళుని రక్షణ హస్తము మీ శిరమున నున్నది. కావున ఆ మేఘము లన్నియు ఒకటి రెండు చినుకులు మాత్రము రాల్చి మాయమైపోవు చుండును.

హుజూర్ మెహతాజీ మహారాజువా రిట్లు ప్రశ్నించిరి. ఈ వచనాను సారము మీ మీదకు వచ్చి రెండు మూడు చినుకులు మాత్రము రాల్చి మాయమైపోయిన గాఢాపత్తుల మేఘము లెవ్వి? సంఘములో నెవరును సమాధానము చెప్పనందున హుజూర్ వారు మరొకసారి అదే ప్రశ్నను వేసిరి గాని అప్పుడు గూడ నెవరును మాటలాడ నందున హుజూర్ వారు రాయబహదుర్ సుందర్ దాస్ ఖుంగడ్, పద్మభూషణ్, భాఖ్రానంగల్ డామ్ రిటైర్డ్ జనరల్ మేనేజరు గారిని ఖుంగడ్ గారూ! మీరు చెప్పుడు. భాఖ్రాడామ్ మీరు కట్టించు చుంటిరి గదా! అప్పుడు మహా తీవ్రమైన వర్షము లప్పు డప్పుడు కురియుచుండెనుగదా!" యని అడిగిరి. ఖుంగడ్ సాహబ్ గా రిట్లు సమాధాన మిచ్చిరి. భారత్ పాకిస్తాన్ల మధ్య 1947 లో జరిగిన దేశ విభజన సమయములో నించుమించు ఇట్టి పరిస్థితియే కలిగెను. ఆ మాట విని హుజూర్ వారు ఇదియె అయి ఉండవచ్చునని సెలవిచ్చిరి.

# 102

1973 ఏప్రిల్ 15వ తేదీ: ఈనాడు పరమగురు సర్కార్ సాహెబ్ వారి భండారా అయినది. భండారా మొదలు పెట్టుటకు ముందు హుజూర్ వారు స్వల్పముగ భుజించి మీరందరును తక్కువ తినుట అలవాటు చేసికొనుడని సెలవిచ్చిరి.

# 103

1973 ఏప్రిల్ 24వ తేదీ సాయంకాల సత్సంగము ప్రారంభము గాక ముందు సత్సంగములోనున్న సోదరీ సోదరులందరి మీదను గులాబి అత్తరువు కలిపిన జలమును వెదజల్లించిరి. అందరి బట్టలు తడిసిపోయినవి. హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : బట్ట తడిసిపోవుటను గురించి మీకు నేనొక కథను చెప్పెదను. సాహబ్జీ మహారాజువారు తమ పర్యటన సందర్భములో ఒకసారి అంబాలా దయ జేసిరి. అంబాలా నుండి తిరిగి దయాల్బాగు వెడలిపోవుటకై స్టేషనుకు వారు దయచేసినపుడు, ఆకాశ మంతయు నొక్క పెట్టున మేఘములు క్రమ్ముకొని జోరుగ వర్షము కురువ నారంభించెను. నేను గూడ వారి ప్రక్కన నిలుచుంటిని. దైవవశమున నావద్ద గొడుగు కూడ గలదు. నే నా గొడుగు తెరచి హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారికి వేసితిని. తత్ఫలితముగ సాహబ్జీ మహారాజ్ వారి బట్టలు తడువకుండ నుండిపోయినవి కాని నా బట్టలు తడిసిపోయినవి.

ఆ తరువాత ట్రైను రాగా, హుజూరువారు దానిలో నెక్కి ఢిల్లీ వెళ్ళి పోయిరి. నేను లాహోరువైపు వెళ్ళు బండిలో నెక్కి మరొకవైపు వెళ్ళిపోయి తిని. అప్పుడు రెండు నిముషములలో నాతడి బట్టలన్నియు నారిపోయినవి.

కొద్ది సేపు ఊరకుండిన పిమ్మట హుజూర్ వారు తిరిగి ఇట్లనిరి. అట్లే ఈ రోజున మీ బట్టలు గూడ రెండు నిముషములలోనే ఆరిపోయి యుండునని నే ననుకొను చున్నాను.

# 104

1973 మే నెలలో రాజపూర్ లో హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి : రోజు రోజుకు జనాభా పెరిగిపోవుచున్నది. కావున ఇకముందు కాలములో వెన్న, నెయ్యి లభించుట చాల కష్టమైపోవును. పాడి పశువులైన ఆవులు గేదెలును, తగ్గిపోవు

చున్నవి. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు ముందు ముందు వెన్న, నెయ్యియు డాక్టర్లు రోగగ్రస్తులకు మాత్రమే మందు చీట్లలో నిర్ణయించవలసి వచ్చునంతగ అరుదు అయిపోవు రోజులు రాబోవుచున్నవని, యే రోజుల నుద్దేశించి తరుచు సెలవిచ్చెడివారో ఇపు డిక నట్టి రోజులే రాబోవుచున్నట్లు కనబడు చున్నవి.

తిరిగి యిట్లు సెలవిచ్చిరి : వెన్న నేతులను ఆహారమునుండియే చూపించెడి సమయము వచ్చుచున్నట్లు కనబడుచున్నది. రాబోవు తరము వారు వెన్న నేతుల గురించి అవి మా తండ్రి తాతల కాలములో నుండెడివని చెప్పుకొందురు.

# 105

1974 జనవరి నెల 1వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : చూడుడు పాల్ బ్రంటన్ (Mr. Paul Brunton) వ్రాసిన " The Inner Reality" అనెడి పుస్తకమును నేను చదివితిని. దానిలో మీకు ఒక జ్ఞానదాయకమైన విషయమును ఇప్పుడు చదివి వినిపించెదను.

ఆ భాగముయొక్క తెనుగు అనువాదము :

హాంప్‌షైర్ అనెడి యుద్ధ నౌక అతిరహస్యమయ విధమున ముంచివేయ బడినపుడు ఫీల్డ్ మార్షల్ లార్డ్ కిచనర్ గారికి ఘోరమరణము జరిగి చాల సంవత్సరములు గతించినవి. కనుక నేను ఇపుడు వారిని గురించి, ఆ మహా ప్రఖ్యాత యుద్ధ సైనికుడు హిందూ దేశముల సేనలకు దీర్ఘకాలము కమాండరు పదవి నధిష్ఠించి పనిచేయుచునే ప్రాచ్యదేశ సంబంధమైన యోగాభ్యాసము యొక్క గుప్త రహస్యములను తెలిసికొని ఉపదేశము పొందుట కెన్నడు వెనుదీయలేదను విషయమును తెలియజేసినచో అదేమియు నొక రహస్యమును బయలు పర్చినట్లు లెక్కించబడనేరదు.

'అస్వాన్' అనెడి విచిత్ర ప్రాచీన పట్టణమునకు దగ్గరగ నైలు నదీ ప్రాంతమున ఆయన పేరుతో నామకరణము జేయబడ్డ చిన్నద్వీప మొకటి గలదు. అచ్చట కిచనర్ గారొక మనోరంజకమైన ఆధ్యాత్మ కాశ్రమమును తయారు చేయించి, ఆయన ఈజిప్టు, సూడాన్ దేశములకు ఒక నియంతరూపమున అధికారము చలాయించు కాలములో ఆ యాశ్రమమును తన ఒక్కని ప్రత్యేకోపయోగమునకై వేరుగ నుంచుకొనెను. అచ్చట నాయన భారత దేశమునుండి

ప్రధానముగ తెప్పించుకొన్న చిన్ని అనువైన ఉష్ణదేశీయ వృక్షములను, విశాల పత్రములుగల తాళవృక్షములను ఒక తోట రూపమున నాటించి కల్పించుకొని దాని నొక గోప్యమైన యాశ్రమముగ చేసికొనెను. ఆయన నొక చిన్న మండపమును కట్టించుకొనెను. ఆయన తన దైనిక కార్యకలాపములను పూర్తి చేసికొన్నతర్వాత నొక నావపై నెక్కి తానొక్కడు తన కాపుదల నిమిత్తమై ఒక్క సైనికునైన తీసికొని పోకుండగనే ఈ సుందర ప్రశాంతాశ్రమమునకు ఏకాంతముగ చడి చప్పుడు లేకుండ వెళ్ళిపోవుచుండెడివాడు.

తలపైన దక్షిణ ఈజిప్టు దేశపు గంభీర ప్రశాంత నీలాకాశముతోను, క్రింద అగణిత కీటక సమూహముల సంగీతనాదములతోను నిలిచియున్న యా స్థలమున ఆయన తన భారీ చింతా వ్యాపారములను పూర్తిగ మనస్సునుండి మరచిపోయి, చిత్తవృత్తిని అంతర్యమున నేకాగ్రము చేసికొనుచు ధ్యాన నిమగ్నుడై యుండెడివాడు.

లార్డు కిఛనర్ భారత దేశములో నుద్యోగము చేయుచున్నప్పుడు హిమాలయ పర్వత భాగములలో సిమ్లా పట్టణము పరిసరములలో నివేదించి ఒక ఆశ్రమమును ఏర్పాటు చేసికొనెను. ఆ యాశ్రమ పరిసరముల వాతావరణము దృశ్యములును బహు మనోరంజకముగ నుండెను. ఆయన ఆ యాశ్రమమునకు "Wild flower Hall" అరణ్యక పుష్ప భవన మని పేరిడెను. ఆయన తన యంతరాత్మయొక్క గంభీరాహ్వానమును వినిపించుకొని ఆ ప్రకారము ఆచరించగల ఉచ్చ వివేకశాలురైన అల్ప సంఖ్యాక మహాభాగ్యశాలురలో గణింపదగిన వ్యక్తి. హిందువులలో త్రాటక మని పేర్కొనబడు యోగాభ్యాసము ఆయనకు ప్రియమైన అభ్యాసములలో నొకటి. ఈ గ్రంథకర్త తాను వ్రాసియున్న 'Secret Path' అను గ్రంథములో 142వ పుటయందు లార్డ్ కిఛెనరు గారిని గురించి ఉదహరించిన సందర్భములో నీ యభ్యాసమును గురించి క్లుప్తముగ వ్రాసియుండెను. కిఛెనరుగారు తన చిత్తవృత్తి నేకాగ్రము చేయు నిమిత్తమై తదేకదృష్టితో చూచూట యనెడి సాధన నభ్యసించుచు తన యాంతర్యమున ప్రవేశించి, బాహ్యజగత్తును పూర్తిగ మరచిపోవుచుండెను. ఆయన యెల్లపుడు నేకాంత ప్రియుడై, యుద్ధ సైనిక రూపమున తన కర్తవ్యములను నెరవేర్చు సందర్భములో గూడ నెప్పుడు ఒంటరిగనే యుండెడివాడు. ఈ ప్రశాంతద్వీపమున ఆయనకు గంభీర ప్రశాంతైకాంతము ప్రత్యక్ష గోచర మయ్యెను.

ఆయన కచ్చట సంప్రాప్తమైన ఆధ్యాత్మిక శక్తి యెంత యధిక పరిమా

ణాములో నుండెనో 1914–18 సం॥రముల విశ్వ మహాయుద్ధముయొక్క ప్రారం భిక సంవత్సరములలో ఇంగ్లాండు దేశముయొక్క సమస్త యుద్ధ సేవ యొక్క వ్యవస్థాపన కార్యభార మంతయు నాయన ఒక్కరిపైననే మోసియుండె నను విషయమును బట్టి స్పష్ట పడగలదు.

# 106

1975 ఫిబ్రివరి 4వ తేదీ సాయంకాలము నాలుగున్నర గంటలకు పరమ పూజనీయులైన హుజూరు వారు కారుమీాద బయల్దేరి దయాళు నగరము చూచుటకై వెడలిరి. అప్పుడింకను నిర్మాణమగు చున్నట్టియు, నంతకుముందు పూర్తిగ కట్టబడి యున్నట్టియు భవనములను చూచుచు, మద్యమాంసములు తినునట్టి సత్సంగేతురలకు అచ్చటి భవనములను అద్దెకెన్నడు నీయవలదని సెలవిచ్చిరి.

# పరమగురు హుజూరు మెహతాజీ మహారాజు వారి దివ్య భాషణములు

# 107

1937 అక్టోబరు 11 వ తేదీన రాధాస్వామీ సత్సంగ సభా సమావేశము జరిగెను. హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి:

ఉపాధ్యక్షా, రా.స్వా. సత్సంగ సభాసభ్యులారా, సోదర సోదరీమణులారా,

ఇతః పూర్వము నేనెన్నడు నెరుగనంతటి మహత్త్వ పూర్ణమైన సభా సమావేశ మొకటి 42 రోజుల క్రితము జరిగినది. నన్నపుడు సభకు అధ్యక్షునిగ నెన్నుకొనిరి. అప్పటినుండియు నా మనమున కొన్ని యాలోచనలు పొడము చున్నవి. వానిని మీ యెదుట పెట్టుట యావశ్యకమని నాకు తోచుచున్నది. అందువలన నేను నామనస్సును దిట్టపరచుకొని ఈ రోజున మీ సభయొక్క అవశ్యక సమావేశమును తొందరగ చేయించ సాహసించితిని. నేను వివరించ దలచుకొన్న విషయములు అత్యావశ్యకమైన వగుటచే నేను మూడు ప్రాంతముల అధ్యక్షులను, కార్యదర్శులను, పంజాబ్ అసోసియేషన్ యొక్క కమిటీ మెంబరులను గూడ ఈ సమావేశములో వచ్చి చేరవలయునని కోరి పిలిపించితిని. వీరికి (Moffussil) ఆయా ప్రాంతముల సత్సంగులతో నెక్కువ పరిచయముండి వారి పరిస్థితులు, అవశ్యకతలను గురించి వారి కెక్కువ పరిజ్ఞానముండును. కావున నేను చెప్పబోవు విషయములను విమర్శించి తేల్చుటకై వారు మీ కెక్కువ సహాయపడగలరు. కావున నేను ఆ విషయముల నీ సంయుక్త సమావేశములో నా దృష్టి కోణము ననుసరించి ప్రస్తుత పరచుటకు మీ అనుజ్ఞ కోరుచున్నాను.

గతించిన కొద్ది సంవత్సరములనుండియు విద్యావంతులైన యువకులలో ముఖ్యముగను, తదితరులలో సామాన్యముగను నిరుద్యోగుల సంఖ్య ప్రతిరాష్ట్రములో పెరిగి పోవుచున్నది. ఇటీవలనే కొన్ని రాష్ట్ర ప్రభుత్వములు ఈ నిరుద్యోగ పరిస్థితికి కారణములను పరిశీలించి ఆ పరిస్థితిని నివారించుటకై తగు ఉపాయములను ప్రతిపాదించు నిమిత్తమై నిరుద్యోగ విచారణ సమితులను (Unemployment Enquiry Committees) ఏర్పాటు చేసిరి. కొద్ది మాసముల నుండి నావద్దకు వచ్చుచున్న ఉత్తరములను బట్టి ఈ నిరుద్యోగులైన నవ యువకుల పరిస్థితి చెప్పనలవికానంత శోచనీయముగ నున్నట్లు తేటపడుచున్నది. కొందరు తమ ప్రస్తుత పరిస్థితిలో జీవించుటకంటె మరణించుటయే శ్రేష్ఠ తర

ముగ తోచుచున్నదనియు, మరికొందరు తమకు వెంటనే సహాయము చేకూర నిచో తాము ఆత్మహత్య బలవంతముగ జేసికొనవలసి వచ్చునని వ్రాయు చున్నారు. ఈ విషయములో నీషణ్మాత్రముకూడ సందేహించుట కవకాశము లేదనువిషయము మీ కందరకును తెలుసుననియే నా అభిప్రాయము. కావున నేను ఇపుడా ఉత్తరములు వ్రాసినవారి పేర్లుగాని, సంఖ్యగాని చెప్పవలసిన అవస రము లేదు. ఈ సమస్య ఒక్క మన సంస్థకే గాక ఇతర సమాజములకు గూడ వ్యాపించి యున్నది. ముఖ్యముగ నీ సమస్యను తేల్చు నిమిత్తమై మిమ్ములను ఇచ్చటకు పిలిపించితిని. కావున మీరు ఈ అత్యావశ్యక విషయమును గురించి మీ సంపూర్ణ శ్రద్ధను సమయమును వినియోగించి ఆలోచింతెదరని ఆశించుట అయుక్త మెట్లగును? ప్రభుత్వమువారి కిపుడు నౌకరీ కొరకై మనుష్యులు అవసరములేదు. వ్యవసాయము, పరిశ్రమలలోను నౌకరీలు చాల తక్కువగ ఉన్నవి. విద్యావంతులైన యువకులు ఆ రెండింటి విషయములోను శ్రద్ధ బొత్తిగ వహించుటలేదు. పెట్టుబడిదార్లు ధనమును పెట్టుబడి పెట్టుటకై ఇష్ట పడలేదు. హిందూదేశస్థులలో పరస్పర విశ్వాసము ఇంచుమించు శూన్యముగ నున్నందున సామూహికముగ పనిచేయుట వారికి సరిగ సాగకున్నది. గతించిన కొన్ని సంవత్సరములనుండియు మనము ఇట్టి ఇక్కట్లతోనే పాటు పాడు చున్నాము. కావుననే పరమపూజ్యులైన హుజూర్ సాహబ్జీ మహారాజు వారు— ఏ మహాపురుషుని శారీరక వియోగము మనల నందరిని ఇప్పటికింకను మహా దుఃఖపూరితములుగ చేయుచున్నదో — కొద్ది సంవత్సరములకిత్రము మోడల్ ఇండస్ట్రీస్ స్థాపించి పనిచేయ నారంభించి అచ్చట అనేకమంది సత్సంగులకును, వారితోపాటు అంతకన్న నెక్కువ సంఖ్యగల సత్సంగేతరులకును జీవికా నిర్వ హణమును చేసికొనుటకై నౌకరీలను కలుగజేసిరి. కాని అసలు విషయ మేమనగ మనము ప్రస్తుత పరిస్థితులలో తగినంతమంది యధిక సంఖ్యాకులైన నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించి సమస్తమానవకోటికి సర్వోత్తమ రీతిగ సేవ చేయవలయునన్నయెడల ప్రస్తుత కార్ఖానాలను చాలయెక్కువగ బలపరచి వృద్ధి చేయవలసియున్నది.

ఈ విషయముల నన్నిటిని తెలసికొనియే హుజూర్ సాహబ్జీ మహా రాజ్ వారు 1935 సంవత్సరము డిసెంబరు నెలలో పరిశ్రమల నభివృద్ధి చేయు విషయమును గురించి మనతో సంప్రదించిరి. వారి నాయకత్వము క్రిందనపుడు సభవారు మోడల్ ఇండస్ట్రీస్‌లో సాలుసరి వస్త్రోత్పాదన ఐదేండ్ల కాలములో నొక కోటి రూప్యముల వరకు పెంచవలయు ననెడి తీర్మానమును ఏకగ్రీవముగ ప్యాస్ చేసిరి.

హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు ఆర్. యి. ఐ. లో ప్రస్తుతము జరుగుచున్న ఆర్ట్సు తరగతులను కట్టిపెట్టి వానికి బదులు టెక్నాలజీ తరగతులను తెరువవలసి యున్నదని యెన్నోసార్లు సెలవిచ్చిరని మీకు జ్ఞాపకముండియే యుండును. కాని ఆ రోజులలో అట్టి ప్రబంధము సాగించుట బహుశః అప్పటి ప్రభుత్వము వారికి ఇష్టముగ నుండక పోవుటచే ఆ కార్యము అక్కాలమున పూర్తి కాజాలకుండెను. కాని ఇప్పటి ప్రభుత్వము యొక్క రూపు మారిపోయి హిందూదేశపు మంత్రుల చేతులలోనికి వచ్చినది. ఆ మంత్రులు కాలేజీలలో ఆర్ట్సు తరగతులు పెట్టుట విషయములో ప్రతికూల అభిప్రాయము గలిగిన వారై పాఠ్యాంశములలో మార్పు చేసి పరిశ్రమలను అభివృద్ధి చేయవలయు ననెడి తలంపుతో నున్నట్లు తెలియుచున్నది. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి యిచ్ఛను అమలులో పెట్టుటకు ఈ ప్రస్తుత సమయము చాల యుక్తమైనదిగ తోచుచున్నది. "సప్రూ నిరుద్యోగ విచారణ సమితి" తమ రిపోర్టు ప్రభుత్వము వారికి పంపించిన పిదప క్రితము సంవత్సరము వేసవి కాలములో యు.పి. గవర్నరు గారైన **Sir Harry Haig** (సర్ హేరీ హైగ్) గారు ఆర్. యి. ఐ. హాలులో సెలవిచ్చిన మాటలను నేను మీకీ సందర్భములో జ్ఞాపకము చేయుచున్నాను. వారు సెలవిచ్చిన మాట నిజముగ మనకు సంతోషము కలుగజేయుచున్నది. ఏలనన ప్రభుత్వము వారిపుడు సప్రూ కమిటీ యొక్క ప్రతిపాదనలను తీవ్రముగ పరిశీలించుచున్నారనియు, అందుకు పరిణామముగ ప్రభుత్వమువారు పాఠ్యాంశములలో మార్పు చేయుటకు ఒప్పుకొనగలరనియు, కావున రాధాస్వామీ సత్సంగ సభవారు ఆర్. యి. ఐ. లోని తరగతుల పాఠ్యాంశములలో విశేష రూపమున మార్పులు చేయుటకై యేమైన ప్రతిపాదనలు పంపించినచో ప్రభుత్వము వారు వానిని ప్రప్రథమమున విచారించ గలరనియు ఆయన సెలవిచ్చిరి.



కావున మీ అనుమతితో నేను మీ కొక విషయమును చెప్పదలచుకొన్నాను. మనము ప్రస్తుతము రెండు క్లిష్ట సమస్యలలో చిక్కుకొని యున్నాము. అవి యేవనగ 1. చెప్పనలవి కాకుండ నున్నట్టి నిరుద్యోగ పరిస్థితి. ఇది నిరాహార పరిస్థితికన్న నేమియు తీసిపోదు. మృత్యుసమానమైనది.



2. 1935 డిసెంబరు నెలలో రాధాస్వామీ సత్సంగ సభవారు మోడల్ ఇండస్ట్రీస్ యొక్క సాలుసరి వస్త్రోత్పాదన కోటి రూప్యముల వరకును వృద్ధి చేయవలయునని ఏకగ్రీవముగ ప్యాస్ చేసిన తీర్మానము.

కావున మీ రిపుడు ఈ విషయమును అన్నివైపుల నుండియు పరిశీలించి నిరుద్యోగుల యొక్క కష్టపరిస్థితిని తొలగించుటకై సంసిద్ధులై యున్నారా లేదా యను విషయము తెల్చవలయును. అట్లు సంసిద్ధులై యున్న యెడల వారి కష్టము మీరెట్లు నివారించ దలచుకొన్నారు? మన మిపుడు పరమ పూజ్యులైన సాహబ్జీ మహారాజ్ వారిని తమ పూర్వ పవిత్ర శరీరమును తిరిగి ధరించి వచ్చి వారి తేజోమయ నాయకత్వము క్రింద మనకు పథ ప్రదర్శనము చేయవలయు నని ప్రార్థించుట అసాధ్యము. కావున ఈ ఆవశ్యక తీర్మానమును మీ రిపుడు తిరిగి అవలంబించి సమర్థించుటకు సిద్ధముగ నున్నారాయనియు, మరియు హుజూర్ వారి ఈ బాహ్య వియోగ పరిస్థితిలో నా తీర్మానము పూర్తి చేయుటకు తగుచర్య జరిపించగలరా యనియు నీ రెండు విషయములను ఆలో చించుకొన వలసి యున్నది. హుజూర్ రాధాస్వామీ దయాళుకు ఈ నిరుద్యోగు లైన నవ యువకులందరిని మీరు మీ పిల్లలుగ భావించుకొందురని ఆశించు చున్నారనెడి ఒక్క రహస్యమును మీరు పూర్తిగ అవగాహన చేసికొనిన యెడల ఈ నవ యువకుల నిరుద్యోగ పరిస్థితి యనెడి కష్టమును నిర్మూలించ వలయును అని తీర్మానించుటలో కష్టముండజాలదు. మీరు మీ పూర్వపు తీర్మానమును తిరిగి అవలంబించి దానిలోని ప్రత్యుత్తరమును పూర్తి చేయుట కవసరమైన కార్యక్రమమును వెంటనే అవలంబించుటకు సిద్ధముగ నున్నచో ఈ క్లిష్ట పరిస్థితిని మీరు సులభముగ తొలగించగలరు. మీరు మీ పూర్వపు తీర్మా నమును తిరిగి అవలంబించెదరనెడి నమ్మకము పైన ఈ క్రింది ప్రతిపాదనలు మీ యెదుట పెట్టబడుచున్నవి.

1. ఐదు సంవత్సరములలో నొక్కొక్క సంవత్సరము అమ్ముడు కావల సిన సరుకు మొత్తములు ఈ క్రింద వివరించిన ప్రకారము నిర్ణయించబడినవి.

1935-36 ఏడు లక్షల రూపాయలు
1936-37 పది లక్షల రూపాయలు.
1937-38 ఇరువది లక్షల రూపాయలు.
1938-39 ఏబది లక్షల రూపాయలు.
1939-40 ఒక కోటి రూపాయలు.

ఐనను ఈ పై మొత్తములలో మీరు విమర్శచేసి తీర్మానించుకొన్న ప్రకారము మార్పులు చేసికొనవచ్చును.

2. ప్రతి సత్సంగియు హుజూర్ రాధాస్వామీ దయాళునికి, వారి సంస్థ

లకును, వారి యధికారులకును, సంపూర్ణమైన ఆజ్ఞానువర్తియై ఆత్మ సమర్పణ భావముతో ప్రవర్తించ వలయును.

3. ప్రతి సత్సంగియు 'మోడల్ ఇండస్ట్రీస్'లో తయారైన వస్తువులను అమ్ముటకై ఇతరులతో కలిసి హృదయ పూర్వకముగ సహకరించ వలయును.

4. ప్రతి సత్సంగీ సోదరుడు, సోదరియును తమ సత్సంగేతర స్నేహితులను (ఆడవారిని, మగవారిని) దయాల్బాగు వస్తువులు కొనుటకై ప్రోత్సహించ వలయును.

5. నిరుద్యోగ నివారణ సమితిని ఏర్పాటు చేయవలయును.

6. ప్రతి రాష్ట్రములోని ప్రభుత్వపు శాఖ లన్నిటిలోనికి వెళ్ళి ఆయా శాఖలయొక్క అవసరములను బట్టి వారి కావశ్యక మైనంత దయాల్బాగు వస్తువులను మోడల్ ఇండస్ట్రీస్‌లో వారు ఇండెంటు చేయునట్లు ప్రయత్నము చేయ వలయును.

7. ప్రతి రాష్ట్రములో నొక్కొక్క ప్రావిన్షియల్ అసోసియేషన్ నేర్పాటు చేయవలయును.

8. దయాల్బాగులో తయారైన వస్తువులు ఎంత మొత్తము ఏ రాష్ట్రము కొనగలదో తెలియ గలందులకై ప్రతి రాష్ట్రము వారును తమ రాష్ట్రముయొక్క అవసరములకు తగినట్లు ఎంత సరుకు కొన సాధ్యమగునో నిర్ణయించుకొని తెల్పవలయును.

9. ఒక్కొక్క రాష్ట్రము ఖరీదు చేయుటకు నిర్ణయించబడిన సరకు మొత్తమును ఆ రాష్ట్రములోని జిల్లాలకు పంపకము చేయునిమిత్తమై జిల్లా సత్సంగ సంఘముల నేర్పాటు చేయవలయును.

10. జిల్లా సత్సంగ సంఘము తన భాగమును తిరిగి ఆ జిల్లాలోని బ్రాంచి సత్సంగములకు పంపకము చేయవలయును.

11. మన వస్తువిక్రేతలు పేటలు, వీధులలోనికి వెళ్లి మన సరకులను ప్రతిగృహము వద్దకు తీసికొని వెళ్ళి అమ్ము చుండవలయును.

12. దయాల్బాగులో తయారైన వస్తువులను విక్రయించు బాధ్యతను వహించుచున్న సంఘములు, వ్యక్తులును, అట్లుచేయుట వలన సత్సంగమునకే లాభకరమగుచున్నదను విషయము తెలుసుకొని అందరును ఆ సంఘములకు వ్యక్తులకును సమస్తమైన యుక్త సౌకర్యములను కలుగజేయవలయును.

13. మన ప్రస్తుత పరిశ్రమల నభివృద్ధిచేసి, క్రొత్త పరిశ్రమలను ప్రారంభించుటకు సహాయము చేయగలిగిన సమర్థత నైపుణ్యమును గల్గినట్టి సొంత వ్యక్తులు కావలయును. సంపూర్ణారోగ్యము కలిగినట్టియు, కష్టపరిశ్రమ చేయు నట్టియు విశ్వసనీయులు బుద్ధిమంతులునైన నవయువకు లెవరైనను తమ ఖర్చు మీద పరాయి దేశములకు వెళ్ళి చదువుకొనుటకు సిద్ధముగనున్న యెడల అట్టి వారిని ( ప్రప్రథమములో ముగ్గురు మాత్రమే చాలును. ) జపాను వగైరా పరాయి దేశములకు కొద్దికాలము చదువుకొనుటకు పంపించ వలయును. అటు పిమ్మట నావశ్యకమైనచో మరికొందరిని పంపించవచ్చును.

'శరణాశ్రమ్ కా సపూత్' అనునాటకమును హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు ఒక విశిష్టోద్దేశ్యము లేకుండ వ్రాయలేదు. బాహ్యదేశములకు పరిశ్రమలు నేర్చుకొనుటకై వెళ్లెడి మన నవయువకులకు అచ్చట తప్పక కష్టములు సహించ వలసి వచ్చును. కాని, వారిలో కొందరైనను హుజూర్ రాధాస్వామీ దయాళుని దయాకటాక్షముల వలన తప్పక ప్రేమ్‌బిహారీలాల్ వలె నిపుణత సంపాదించుకొని జయప్రదముగ వెనుకకు తిరిగి రాగలరని మనము నమ్మకొనవలయును.

ఇప్పుడు నేను చెప్పిన విషయములకు మీరంగీకరించి ఆ ప్రకారము నడచుకొన నారంభించినయెడల హుజూర్ వారి ఉద్దేశ్యము కొద్ది సంవత్సరముల లోపుననే పూర్తియైపోవుచున్నట్లు హుజూర్ రాధాస్వామీ దయాళుని పిల్లలందరికిని తేటపడ గలదని నాకు పూర్తిగ నమ్మకమున్నది.

మీరు 1935 వ సం॥ డిసెంబరు తీర్మానమును ఈ సమయములో తిరిగి అవలంబిచెదరను విశ్వాసముతోనే మేము మోడల్ ఇండస్ట్రీస్ మేనేజరుగారిని జెనరల్ సూపరింటెండెంటుగారిని, వస్తూత్పాదన త్వరలో తీవ్రముగ వృద్ధిజేయ వలయుననియు, భవనములను, ( మెషినరీని ) యంత్రములను వృద్ధిచేయుటకు అంచనాలు ( Estimates ) తయారు చేయవలయుననియు ఆదేశించి యున్నాము.

ఇప్పుడు నేను మరియొకవిషయమును గురించి చెప్పదల్చుకొన్నాను. నిరుద్యోగ నివారణ ప్రణాళికనుగురించి ఆలోచించినపుడు అందుకు కావలసిన మూలధనమెట్లు ప్రోవుచేయగలమను విషయముగూడ ఆలోచించ వలసియున్నది. కాని ఆ విషయములో కష్టమేమియు నుండగూడదనియే నా అభిప్రాయము. ఏలనన, ప్రస్తుత కాలపరిస్థితులను బట్టి ధనము తక్కువ వడ్డీమీద తెచ్చుకొనగల సావకాశముండుటచే కొనవలసిన ధనము కొద్ది మాసములలోనే పోగుకాగలదు. ఈ సందర్భములో సభవారి కార్యకారిణీ సమితి ( Executive Committee ) ఈక్రింది విషయముల నాలోచించుకొని తేల్చుకొనవలయును.

1. తిరిగి సభవారు ఫిక్సెడ్ డిపోజిట్లు ( Fixed Deposits ) తీసికొనుట మొదలుపెట్ట వలయునా, లేక

2. రాధాస్వామీ జనరల్ అండ్ అస్యూరెన్స్ బ్యాంకే అట్టి డిపోజిట్లు తీసికొన మొదలిడ వలయునా, లేక

3. జీవనోద్ధార ఫండులో నింక నెక్కువ మొత్తములను తీసికొన వలయునా, లేక

4. ఒక భీమాకంపెనీని పెట్టి ఆ కంపెనీ ధనమును పరిశ్రమల అభివృద్ధి నిమిత్తమై ఉపయోగించవలయునా ? ఇదిగాక మరియొక విషయము కూడ నే నిపుడు మీకు జ్ఞాపకము చేయగోరుచున్నాను. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు దయాల్బాగులో రోగగ్రస్తులకు చికిత్స ఉచితముగ చేయవలయుననియు, ఫీజులు పుచ్చుకొను పద్ధతి కట్టిపెట్టవలయు ననియు నెన్నియోసార్లు సెలవిచ్చి యున్నారు. అదంతయు మన కార్ఖానాలు చక్కగ పనిజేసి లాభములు కలిగినపుడే సాధ్యమగునని కూడ వారు సెలవిచ్చి యున్నారు.

కావున నిపుడు ఈ విషయములలో మన పరమపిత హుజూర్ సాహబ్జీ మహారాజు వారి ఉద్దేశ్యమును పూర్తి చేయుటకై ప్రయత్నము జరిగించవలసిన బాధ్యత మీపై నున్నది. ఈ కార్య కలాపములో నే కృత్యము నెప్పుడు చేయవలయునో ఆ కార్యము నెంతవరకు చేయవలయునో, ఇత్యాది వివరములను నే నిపుడు తేల్చి చెప్పవలసిన సమయము కాదు. అయినను 1939వ సంవత్సరము జనవరి మొదటి తేదీ నుండియు దయాల్బాగు శరణాశ్రమ ఆసుపత్రిలో రోగుల వద్ద మందుల ఖరీదు వసూలు చేయరాదని మాత్రము నేను సభవారి కిపుడు సిఫార్సు చేయుటకు సంకోచించను.

ఇపుడు ఈ విషయములను రాధాస్వామీ సత్సంగ సభ యెదుటను, మూడు రాష్ట్రముల సత్సంగులు, సత్సంగ అసోసియేషన్లు, బ్రాంచి సెక్రెటరీల ఎదుటను గూడ యెందు నిమిత్తమై పెట్టుచున్నా మనగా, నిపుడు హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు తమ దివ్య శారీరక రూపమున మనకు తమ నిరంతర పథ ప్రదర్శనము నిచ్చెడి యవకాశము లేనట్టి యీ మహా క్లిష్ట సమయములో, మన అందరి పైన నెంత యధిక బాధ్యత పడిపోయినదో మీ కందరికిని చాల గట్టిగ, బోధపడ వలయుననియే యని మీ అందరి అనుమతి యున్నచో, నేను రెట్టించి చెప్పగోరుచున్నాను.

నేను నా కర్తవ్యమును నెరవేర్చితిని. ఇపుడు మీరు మీ కర్తవ్యమును గురించి ఆలోచించుకొన వలయును. మీరు మీ కర్తవ్య పాలనలో లోటేమియు చేయరని నాకు పూర్ణ విశ్వాసమున్నది. అదిగాక మీ రీ విషయములను గురించి యెంత ఎక్కువ శ్రద్ధ వహించి యెంత ముందు జాగ్రత్త తీసికొన్నను అదే మియు నెక్కువ కానేరదు, కాజాలదు కూడ.

నే నిపుడు హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములయందు, ఆ దయాళురు మన కీ విషయములను గురించి ఆలోచించుకొని తీర్మానము చేసికొను సందర్భములో నాయకత్వము వహించి, పరిపూర్ణ పరిజ్ఞానము గలుగజేసి, జయప్రదముగ కార్యము సాధించుకొనులాగున అనుగ్రహించ వలయునని హృదయపూర్వకముగ ప్రార్థన జేయుచున్నాను. మరియు మన జీవితముయొక్క ఈ కఠిన సంఘర్షణలో వారి దయా కటాక్షములను సహాయమును, అధికాధికముగ పొందుటకు మనను పాత్రులుగ జేయవలయునని గూడ ప్రార్థించుచున్నాను. మీ రందరును ఈ ప్రార్థన చేయుటలో నాతో కలిసి యున్నారను విషయమును గురించి నా కించుకైన సందియము లేదు.

# 108

1938 మే 9వ తేదీని సత్సంగ హాలులో సత్సంగుల సాధారణ సమావేశ మొకటి జరిగినది. నవ యువకులను ముఖ్యముగ సంబోధించుచు హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ప్రతి జాతి యొక్కయు ఔన్నత్యాభి వృద్ధులు అందలి నవ యువకుల త్యాగ సమర్పణ భావముల మీద ఆధారపడి యున్నవి. ఏ దేని యొక పని లేక పరిశ్రమలో గాని నిపుణత నొంది అందుకు సంబంధించిన సభ యొక్క విభాగములలో పనిచేయుట కుపకరించునట్టియు రానురాను భవిష్యకాలములో ఆ విభాగముయొక్క బాధ్యత నంతను తమ భుజముల మీద భరించుటకు

సమస్థ లైనట్టియు, నవ యువకులు ప్రస్తుత సమయములో సభయొక్క యించు మించు సమస్త విభాగములలోను అవసరమై యున్నారు. నా సలహా యేమనగ పూర్వ విద్యార్థి సంఘము (Old Boy's Association) ను పునర్వ్యవస్థాపన జేసి నూతన విద్యార్థులను, పూర్వ విద్యార్థులను కలిపి ఒకే సంఘముగ తయారుచేసి వారిని యెవరెవ రేయే పనులలో విశిష్ట యోగ్యత సంపాదించు టకు ఉత్సుకులై యున్నారో అడిగి వారి దగ్గర నుండి దరఖాస్తులు తీసి కొన వలయును. అట్లు చేసినందువలన ఆ నవయువకులను ఆయా పరిశ్రమలకు ఎన్ను కొని వారికి ఆయా పనులు, నేర్చుకొనుటకు తగిన ఏర్పాట్లు చేయ సాధ్యమగును.

దయాల్బాగులోని వివిధ విభాగములలోనే గాకుండ అమృతసర్ లోను, మద్రాసులోను గూడ పని చేయుటకు నవ యువకుల ఆవశ్యకత యెక్కువగ నున్నది. ఏలనన, యెవరైన నొక పెద్ద ఆఫీసరునకు సెలవు అవసరమైనపుడు అతని స్థానే పని చేయుటకు మరియొక అర్హతగల వ్యక్తి లేకపోవుట వలన చాల ఇబ్బంది కలుగుచున్నది. కావున మీ రొక అసోసియేషన్ తయారుచేసి ఒక సమావేశముచేసి మీ సభ్యులలో నుండి యోగ్య నవయువకులను ఎన్నుకొన వలసి యున్నది.

## 109

1938 జూలై 16వ తేదీని హుజూర్ వారు బ్రాంచి సెక్రిటరీలకును ప్రొవిన్షియల్ అసోసియేషన్ల సభ్యులకును ఒక ఘోషణ నిచ్చుచు ఇట్లు సెల విచ్చిరి : ఇతర సంఘములకన్న వెనుకబడి పోకుండ నుండి హుజూర్ దాతా స్వామీ దయాళురు ఇతర సంఘములకు మీరు పథ ప్రదర్శనము చేయుటు నిమి త్తమై మీకు ఎట్టి యున్నత స్థానము నివ్వదలచిరో అట్టి యుత్తమ స్థానమును మీరు అలంకరించుచు మానవ జాతికి, తన యాదర్శమును అది సాధించుకొను నిమిత్తమై పథ ప్రదర్శనము గావించ గోరుచున్న యెడల మీరు మీ ప్రస్తు తావశ్యకతలను, భవిష్యావశ్యకతలను, మీ సంఘముయొక్క ఆవశ్యకతలను గమనించు కొనుచు నిర్వ్యాజముగ పని చేయవలయును. మీరు దయాల్బాగులోను అమృతసర్ మిల్స్‌లోను తయారైన వస్తువుల అమ్మకములు జనులలో వృద్ధి చేసి వందల కొలది యున్న మన నిరుద్యోగులైన యువకులకు జీవనాధారము కల్పించుటకై ముందంజ వేయవలెను. అందువలన సభవారికి ఈ కార్య క్రమము మూలమున లాభము కలుగు సందర్భములో సభవారు వందల కొలది పేద సత్సంగీ సోదరీ సోదరులకు సహాయము చేయగలరు.

ఈ మధ్యననే సభవారు ఈ సందర్భములో తాత్కాలికోపయోగము నకై కొన్ని నిబంధనలు తయారు చేసిరను సంతోషవార్త మీకు తెలుపు చున్నాము. ఇదిగాక సభవారు 1938 జూన్ 22వ తేదీనుండి సాధారణ ఫిక్సెడ్ డిపాజిట్ల మీద వడ్డీరేటు హెచ్చించి స్టోరులు పెట్టదలచుకొన్న సత్సంగులవద్ద నుండి కూడ డిపాజిట్లు తీసికొనుటకు సిద్ధముగ నున్నారు. కేన్వాసర్లుగ (Canvassers)పని చేయదలచుకొన్నవారిని దరఖాస్తులు పెట్టుకొనుమని గూడ సభవారు హెచ్చరించిరి. ఈ పరిస్థితు లన్నిటినిబట్టి చూడగ మీరు దృఢ నిశ్చ యము చేసికొని మనము తయారుచేసిన సరకులను అత్యుత్సాహముతో బజారు లోనికి కొనిపోయి, అమ్మకములు అధికముగ చేయుట కిది అత్యంత యుక్తసమయ మని తేటపడగలదు.

ఇకనిపుడు పనిచేయుటకు యోగ్యమైన మనుష్యులను ఎన్నుకొనుట ఆవశ్యకమై యున్నది. ప్రతిరాష్ట్రములోను ప్రసిద్ధ పట్టణములన్నిటిలోను ఒక్కొక మనిషిని ప్రధాన వ్యక్తిగ ఎన్నుకొని అచ్చటి స్థానిక సత్సంగి సోదరులతో ప్రధాన విషయములు సంప్రదించుకొని, ఒక్కొక్క పట్టణములో ఒక్కొక్క స్టోర్సు తెరుచుటయు, ఆ స్టోర్సు వ్యాపారము వృద్ధిచేయు నిమిత్తమై బజారుల లోను, సందులు, గొందులలోనికి సరకు తీసికొనివెళ్లి అమ్ముటయు అతియుక్త మైనపని. మద్రాసులోను, రావల్ పిండిలోను సత్సంగులు కార్యక్రమమును సాఫల్యముతో సాగించుచున్నారు. పని వృద్ధియైపోయినపుడు సరకును ఇతర దుకాణములలో గూడ నుంచవచ్చును. లేదా క్రొత్త ఏజన్సీలను పెట్టుకొన వచ్చును.

మీరు జనరల్ స్టోర్సు పెట్టుకొని అందులో జోళ్లను, ఇతర చర్మసామగ్రిని, ఉంచి అమ్ముచున్నయెడల ఆ చర్మసామగ్రియు జోళ్లును, చాలసులభముగ అమ్ముడైపోయి వానివలన తగినంత లాభము కూడ కలుగును. కావున మీరు అట్టి స్టోర్సు ఖర్చులు చాలవరకు కలిసివచ్చును. దయాల్బాగు టేనరీ యొక్కయు తాజ్ టేనరీ యొక్కయు చర్మముల విక్రయము వృద్ధిచేయు విషయములో గూడ విశేషశ్రద్ధ తీసికొనవలసియున్నది. ఏలనన తయారై పోయిన చర్మములు త్వరిత ముగ బయటకు విడుదలైపోవుట యత్యంతావశ్యకము.

సాలునకొక కోటి రూప్యముల సరకును తయారుచేసి అమ్మవలయునన్నచో రోజున కించుమించు ముప్పది మూడువేల రూప్యముల సామగ్రిని అమ్మవలసి యున్నది. ఈ విషయమెంత గొప్ప బాధ్యతాపూరితమైనదో మీరు అవగాహన చేసికొనగలరని నేను ఆశించు చున్నాను. ఈ విషయము మీ కర్థమైన నాడు

మీరు కర్మచారులయొక్కయు విక్రేతలయొక్కయు కార్యము అత్యంత క్లిష్టతరమైనదని ఒప్పుకొన వలయును. బజారులో సరకులను చలామణి చేయుటపై రెండు పనులకన్న గూడ బహుకఠినమైన పనియని అందరకు తెలిసిన విషయమే. ఈ ఎండల కాలములో మిమ్ములను దయాళ్వాగు రప్పించి మీకు కష్టము కలిగించుటకు కారణమిదియే. ఇప్పుడు మీరు ఈ కఠిన విషయమును గురించి గట్టిగ నాలోచించి దీనిని సాధించి అతి త్వరితముగ అమలులో పెట్టగలిగినట్టి ఉపాయమేదైన ఆలోచించి ఇప్పుడు తయారైయున్న సత్సంగ సామగ్రి గోదాములలో నిల్వయుండి మీ ధనము ఆ సరకుల రూపమున కట్టుపడి పోకుండ నుండులాగున చేయవలసి యున్నది.

# 110

1940 ఫిబ్రవరి 13వ తేదీ మధ్యాహ్నము కుటీరపరిశ్రమల యుద్ఘాటన చేయుచు హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి. ఈ సమయమున చదివిన శబ్దమును (నా జానూ సాహబ్ కబ్ మిలిహో రే) ప్రస్తుత పరిస్థితులనుబట్టి విమర్శించినచో మన మిప్పుడు హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి చరణములందు వారెచ్చట గోప్యముగ దాగి యున్నను మనమధ్యకు దయచేసి రమ్మని ప్రార్థించవలయునను బోధ గోచరమగుచున్నది. వారి నాయకత్వమును హితోపదేశమును లేనిదే మన కార్యము సాగనేరదు. మీ రిపుడు చదివిన ప్రార్థనలో నొక చరణ మీ క్రింది విధముగ నున్నది.

యహ కామ్ జో హమ్ నే హై సిర్ లియా ।
కరేఁ మిల్ కే హమ్ తేరే బాల సబ్ ॥

ఈ చరణములో మన కందరకును కలిసి పని చేయవలయు ననెడి హితోపదేశము చేయబడినది. కావున మీరు ప్రస్తుతము సాగించుచున్న కుటీరపరిశ్రమ ప్రణాళికను జయప్రదముగ సాగించ వలయునన్న యెడల మీరందరు గూడ కలిసి పని చేయవలసి యున్నది. పరిశ్రమల విషయములో ముఖ్యముగ అందరు కలసి సహకారముతో పనిచేయుట యత్యావశ్యకము. మీలో పెద్దలు పిన్నలును అందరు కలిసి పరస్పరము సహకారము చేసికొను చుండవలయును. పెద్దలు, పిన్నలకు ప్రస్తుత పరిస్థితిలో పరిశ్రమల నభివృద్ధి జేయుట యత్యావశ్యకమను విషయము బోధపరచి పిన్నలతో కలసి పనిచేయ వలయును. పిన్నలు: పెద్దల

మాటను గౌరవముతో చూచి ఆచరణలో పెట్టవలయును. చిన్నపిల్లలు పెద్ద మెషీనులపైన పనిచేయలేరు కాని చిన్నచిన్న మెషీనుల మీద సులువుగ పని చేయగలరు. కావున కుటీర పరిశ్రమలకు చిన్నపిల్లలు చాల తగి యుందురు. మీ రందరును ఈ పనిని కలిసి మెలిసి సాగించుచున్న యెడల మీకు హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు అవశ్యముగ సహాయముననుగ్రహించెదరు. మీకు అట్టి పరిస్థితిలో కార్యసిద్ధియు తప్పక చేకూరగలదు.

# 111

1940 ఏప్రిల్ 7వ తేదీని హుజూర్ వారు మద్రాసులో సెల విచ్చిరి: మీరందరు సింత అధిక సంఖ్యాకులుగ వచ్చుటకు వచ్చి యుండుట వలన మీ హృదయములలో భగవత్ప్రేమ నిండి యున్నదని తెలుపడు చున్నది. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వా రందువలననే మీ యందు అంత ప్రేమ ప్రీతులు చూపుచుండెడివారు. 1937 జూన్ 23వ తేదీని హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు దివ్యేచ్ఛ ధరించి మన కిచ్చిన అంతిమ సందేశము మీ కందరకును బాగుగ జ్ఞాపకముండి యుండునని యే నమ్ముచున్నాను. కావున మీరందరు మీ బాధ్యతలను గమనించుకొని మీ కర్తవ్యములను నెరవేర్చవలసి యున్నది. మీ అందరి యొక్క కార్య నిర్వహణ యోగ్యతను గురించి రాధాస్వామీ సత్సంగ సభవారికిని స్వయముగ నాకును గూడ పూర్ణ విశ్వాసమున్నది. మద్రాసు రాష్ట్రపు సత్సంగు లందరును ఈ పవిత్ర సేవను శక్తివంచన లేకుండ పూర్తి చేయుదురని మాకు దృఢ విశ్వాస మున్నది. ఇతర రాష్ట్రములవారు మన వస్తువుల క్రయ విక్రయ కార్యమునకు అంత అధికముగ తోడ్పడ జాలకున్నను మద్రాసీ సోదరులు మాత్రము తప్పక ఈ కార్యములో సహాయము చేయ గలరు. గతించిన రెండు మాసములలోను అనగ ఫిబ్రవరి నెల ఆఖరు వరకును మద్రాసు రాష్ట్రము యొక్క క్రయ విక్రయములు ఇంచుమించు తొంబది ఆరు వేలును, ఏబది రెండువేలు రూపాయిలును అయి ఉన్నవి. మొత్తము సాలుసరి విక్రయములు ఇంచుమించు రెండు లక్షల పండ్రెండువేల రూపాయిలు అయి నది. మీరు గతించిన రెండు నెలలలో నెంత గొప్ప క్రమబద్ధముగను, పట్టుదల ప్రయత్నములతోను ఈ కార్యమును సాగించిరో చూచిన పిమ్మట మీరు సాలు మొదటి నుండియు నిదే యుత్సాహము పట్టుదలతోను పనిచేసి పాటుపడిన యెడల ఈ సంవత్సరములో మీ రాష్ట్రము వంతున కేర్పరచబడిన క్రయ విక్రయముల కోటా నాలుగు లక్షల రూపాయిలును బహు సులభముగనే పూర్తియై యుండిపోయెడిది.

హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి రాష్ట్రమునకు ఆసుసాన్నికవన నెక్కువగనే దయజేసిరి. దీనిని బట్టి మదార్సీల యందు వారి హృదయమున్న విశేష ప్రేమ యున్నట్లు స్పష్టమగు చున్నది. వీరి యొక్క భక్తి సేవల వలననే వారు వీరి యెడల ప్రసన్నులుగ నుండిరి. అందువలననే ఆ దయాళుదు ఈ ప్రసంగము నుండి వెడలిపోవుటకు కొద్ది కాలము ముందు మదార్సీలు చేయు చున్న భక్తికి మంచి బహుమానము వారికి లభించుగాక అని సెలవిచ్చిరి. గడిచిన మూడు సంవత్సరములలోను వారు మీకు వాగ్దానము చేసిన బహు మానము లభించినదా లేదా యని ఇపుడు మిమ్ములను నేనడగ దలచుకున్నాను. మీరు ఒక నిముషము సేపు మనసున ఆలోచించుకున్న యెడల మీలో ప్రతి సత్సంగీ సోదరునకు, సోదరికిని ఈ సత్య విషయమును ఋజువుచేయు అనుభవ ములు కొన్ని జ్ఞాపకము వచ్చి వారు మన కిపుడు చెప్పగలరు. కొంత మంది వృద్ధ సత్సంగుల కట్టి యనుభవములు కలిగి యుండని యెడల నూతన సత్సంగులు హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణము లందు ప్రార్థన చేయవలయును. అట్లు చేసినచో హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణముల యందు ప్రార్థన చేయుటకు అశక్తులై యున్న ఆ వృద్ధ సోదరులకు తగిన ఉత్సాహ వృద్ధి కలుగ గలదు.

మదురై స్టోర్సు ఇప్పుడు ప్రైవేట్ లిమిటెడ్ స్టోరుగ రిజిస్టరై పోయినది. ఆ రిజిస్టరీ అయి రెండు మాసములు మాత్రమే అయినది. ఇంతవరకు ఇంకను ఆ స్టోర్సులో సరకు ఎక్కువగ లేదు కాని ఆ స్టోర్సులో నున్న సరకు లన్నియు క్రమబద్ధముగా రమణీయమైన విధమున అమర్చబడి యుండుట చూడగ మాకు చాల సంతోషమైనది. మదురైలో డెబ్బదియైదు పేర్లు అమ్మబడె వాని సొమ్ము వసూలు గూడ సంతోషకరముగ నున్నది. ఇపుడు మీరు మొదటి వాయిదా వసూలు చేయవలసి యున్నది. పిమ్మట మీరు మూడు, నాలుగువేల రూపాయిలు అప్పు చేయవలసి యున్నది. దయాల్బాగులోని కార్యకర్తలును, అమృతసర్ కార్యకర్తలును మీకు అంత మొత్తము సరకు మాత్రమే అప్పు ఈయగలరు. ఈ విధముగ రమారమి పదివేల రూప్యముల విలువగల సామాను మీ స్టోర్సునకు రాగలదు. అపుడు మీరు మీ విక్రయములను బాగుగ అభివృద్ధి చేయగలరు. మీ స్టోర్సు ఇన్‌ఛార్జిలో నున్న వ్యక్తులు అమ్మబడిన సరకునకును అమృతసర్, దయాల్బాగుల కార్యకర్తల కిచ్చిన మొత్తములకును యథాక్రమ మైన అక్కౌంట్లు వ్రాయవలయును. అట్లు చేసినచో నెట్టి తగవు లేకున్న నుండును. సత్సంగులు, డైరెక్టర్లును ఎపుడు కావలెనన్న అపుడు ముందు సూచడ లేమియు చేయకుండగనే రిజిష్టరు స్టోర్సులను ఆకస్మిక పరీక్ష చేసి, అక్కడనున్న స్టాకును, అకౌంట్లను పరిశీలన చేయుచుండ వచ్చును, ఈ పని జరిపించు నిమిత్తమై

తయారుచేసిన స్పెషల్ మెమోరాండమ్‌లోని ఆదేశములను పూర్తిగ అనుస రించవలయును. అమ్మకము చేయువారు (సేల్సు మెన్) స్టోర్సు యొక్క పను లన్నియు పాటుపడి విశ్వసనీయమైన విధముగ జరిపించు చున్నట్లు జనులందరికి నమ్మకము పుట్టులాగున పనిచేయవలయును.

# 112

1940 ఏప్రిల్ 11వ తేదీ హుజూర్ మెహతాజీ మహారాజ్ వారు మద్రాసు రాష్ట్రి పర్యటన చేయుచున్నపుడు భీమవరములో ఈ క్రింది విధముగ భావణ నిచ్చిరి. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు సర్వజ్ఞులు సర్వదృష్టలును, మన సంఘముయొక్క ఆవశ్యకతలన్నియు పూర్తిగ తెలిసిన సర్వజ్ఞులును. మన సంఘముయొక్క ఆవశ్యకత లన్నియు తీరిపోయి, సంఘమునకు పారమార్థికాభి వృద్ధి గలిగించుటకును మనలో నిరుద్యోగులుగ నున్నవారికి, (విద్యావంతులకు, విద్యావిహీనులకును కూడ) అన్నవస్త్రములు లభించులాగున చేయుటకును తగిన కార్యక్రమ సుద్దియో వారికి పూర్తిగ తెలియును.

తిరిగి ఇట్లు సెలవిచ్చిరి: అన్నవస్త్రములు లేకపోవుటచే కొందరు మద్రాసీ ప్రాంతీయులు తమ మతమును విడిచిపెట్టి ఇతర మతములలో జేరిపోవుచున్నారని కొందరు ఈ ప్రాంతపు సోదరులును సోదరీలును వారికి 1935వ సం॥లో మనవిచేసి కొని, వారినట్లు తమ మతమునుండి బయటకు పోకుండ చేయవలయునని ప్రార్థించగా వారు ఆ ప్రార్థనను బహుశ్రద్ధగ వినిరి. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు సర్వజ్ఞులు, సర్వదృష్టలు, సర్వశక్తిమంతులును. వారా ప్రార్థనలోని సారాంశ మును వెంటనే అవగాహన చేసికొనిరి. వారే ప్రపంచమున సమస్త మానవజాతి యొక్క శ్రేయోభివృద్ధుల నిమిత్తమయ్యే అవతరించిరి. కావున ఈ ప్రార్థన చేయుటకై ప్రేరేపణ కూడా వారే ఆ సోదరీ సోదరులలో పుట్టించి యుందురని కూడ భావించ వచ్చును.

ఈ ప్రాంతములో పారిశ్రామిక సంస్థలను వ్యాప్తిచేయుటకై యొక నిధిని (Fund) కూడ ఆ దయాళువు ఏర్పాటుచేసిరి. ఏలనన, జనులకు అన్నవస్త్ర ములకై తగిన యేర్పాటు చేసినయెడల వారికి తమ మతమును మార్చుకొను అవసరముండ నేరదని వారు భావించిరి. ఈ రాష్ట్రపు సోదరీ సోదరులు (Uplift-Fund) అప్లిఫ్టుఫండను పేరుగల ఈ నిధికి తమ నిలవ ధనమునుండి కొంతభాగ మును నెలనెలకు జమకట్ట మొదలిడిరనియు, నింతవరకు పరిశ్రమలను జారీ

చేయించు నిమిత్తమై ఆ నిధిమొత్తము పెరుగు చున్నదని యును తెలిసి నాకు చాల సంతోషమైనది.

1935 వ సం॥ లో హుజూర్ సాహబ్జీ మహారాజు వారు అప్పటిలో దయాల్బాగు వస్త్రోత్పాదన సాలుకు 5½ లక్షల రూప్యములు మాత్రమే యుండగా, దానిని రాబోవు 5 సం॥ రములలోపున సాలుకు ఒకకోటి రూప్యముల వరకు పెంపుచేయ వలయు ననెడి ప్రతిపాదన సభవారి యెదుట పెట్టి దానిని సభవారిచే తీర్మానింప జేసిరి. వారు 1936, 1937 వ సంవత్సరములలో రుగ్మతతో నున్నందున మన పరిశ్రమల వస్త్రోత్పాదన యభివృద్ధి నిమిత్తమై వారు స్వయముగ నెక్కువ ప్రయత్నము చేయలేక పోయిరి.

1937 వ సం॥ రము ఫిబ్రవరి నెలాఖరుకి సాలుసరి యుత్పాదన సరుకు 7 లక్షల రూపాయిలు మాత్రమే అయ్యెను. ఇప్పుడు దానిని వృద్ధిచేసి సాలున కొక కోటి రూప్యముల వరకు తీసుకొని రావలయును. మన ఆధ్యాత్మిక ప్రభువు ఇప్పుడు మనమధ్య లేరు. కొందరు సోదరులిందుకు ఆటంకములు కలుగజేయుచు, ప్రతికూల పక్షముగ నున్నారు కూడ. ఈ పరిస్థితులను బట్టి ఈ విషయ మెంత క్లిష్టతరమై పోయినదో మీరే సులువుగ ఊహించు కొనగలరు.

అమృతసరులో నొక మిల్లు క్రయమునకు వచ్చినదని తెలిసి కొద్దిగంటల లోనే సభవారా మిల్లును కొనవలయునని తీర్మానము చేసిరి. వెంటనే సభవారి తరఫున నేను సభాధ్యక్ష హోదాలో ఆ మిల్లును కొనుటకై కరారు నామా వ్రాసి యిచ్చితిని.

హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు భౌతికశరీరములో నిచ్చట లేనందున, వారిస్థానే బడే భాఈ సాహబ్ గారు 1938 జనవరి 28 వ తేదీని యీ కార్ఖానా ఇంజన్‌లో నిప్పునంటించి దానిచే పనిచేయించుట ప్రారంభించిరి. అందులో వడికిన నూలు మచ్చు చూపించుటకై దయాల్బాగునకు వసంత పంచమీ పవిత్ర దినమున పంపించబడినది. ఈ విధముగ వస్త్రోత్పాదన నలువైపుల నుండియు నభివృద్ధియగుట ప్రారంభించి 1938 వ సం॥ రము ఫిబ్రవరి నెలాఖరుకి 14 లక్షల వరకును 1939 సం॥ రము ఫిబ్రవరికి 22 లక్షల వరకును 1940 ఫిబ్రవరి నెలాఖరుకు 31 లక్షల వరకును పెరిగినది.

1937 వ సం॥ రము అక్టోబరు నెలలో సభాధ్యక్షులు ప్రతిజిల్లాలో నొక్కొక్క డిస్ట్రిక్టు అస్సొసియేషనును ఒక డిస్ట్రిక్టు స్టోర్సును ఏర్పాటుచేయ వలయునని కూడ మనకు చెప్పియున్నారు. వస్త్రోత్పాదన చాల పెరిగిపోయి

నందున వస్తువుల నమ్మకము చేయుటకై అట్టిస్టోర్సుల సంఖ్య పెంచవలసిన అవసర మున్నట్లు మనకు 1939 సం॥ రము ఫిబ్రవరి నెలలో విదితమయ్యెను. అందుచే 1939 సెప్టెంబరు నెల నుండియు అందు విషయమై గట్టి ప్రయత్నము చేయబడినది. ఇప్పుడు హిందూ దేశ మంతటిలోను 70 స్టోర్సు ప్రైవేటులిమిటెడ్ కంపెనీలుగ రిజిస్టరు అయి యున్నవి. ఒక్క మదరాసు రాష్ట్రములోనే 30 స్టోర్లు ఈ విధముగ రిజిస్టరు అయినవి. ఈ దృష్టికోణముతో చూచిన మదరాసు ప్రాంతము మిగత ప్రాంతము లన్నిటి కన్న నెక్కువగ ముందంజ వేసినది.

పైన వివరించిన ఔన్నత్యాభి వృద్ధులను బట్టి ఆలోచించగా మనకు సహాయము నలువైపుల నుండియు లభించగలదని పూర్తినమ్మకము కల్గుచున్నది. నిరుద్యోగ పరిస్థితిని తొలగించుటలో మనకు తోడ్పడి సహాయము చేయగోరు సత్సంగేతరులను మనము ఈ కార్యక్రమములో పాల్గొనుటకై ప్రోత్సహించి, ఈ బాధ్యతను కొంతవరకు వారు కూడ సిరమున బెట్టుకొనులాగున ప్రోత్స హించుట చాలయుక్తముగ నుండునని నా అభిప్రాయము. మనము వారికి త్రోవమాత్రము చూపిన చాలును. మీరు అంతమాత్రము చేసిననే మీకు హుజూర్ రాధాస్వామీ దయాళుని దయాకటాక్షములచే కార్యసాఫల్యము చేకూరుచున్నట్లు తేటపడగలదు. మన దేశమువంటి పెద్ద విశాలమైన దేశము నకు సాలుసరి ఒక కోటిరూప్యముల వస్త్రోత్పాదన ఎంతమాత్రము సరిపోదు. ఈ దేశముయొక్క అవసరములను పూర్తి చేయు నిమిత్తమై సాలుకు ఎన్నియో వేలకోట్ల రూపాయిల వస్త్రోత్పాదన కావలయును. మనము సత్సంగేతరులను గూడ పరిశ్రమలను తెరచునట్లు చేసిన యెడల మన విక్రయముల మొత్తము అంతహెచ్చుగ పెరిగి పోగలదు. ఇందువలననే హుజూర్ సాహబ్జీ మహారాజు వారు మన పరిశ్రమలకు మోడల్ ఇన్డస్ట్రీస్ (ఆదర్శ పరిశ్రమలు) అని పేరిడిరి. వారు లోకమందరికిని హిందూ దేశస్థులు సకల విధములైన శ్రేష్ఠవస్తువులను ఉత్తమ వస్తువులను తయారుచేయ గలరను విషయము బోధపడవలయునను నుద్దేశ్యముతోనే యెన్నియో విధములైన పరిశ్రమలను జారీచేయించిరి.

ఈ విధముగ మీరొక్క సత్సంగులకు మాత్రమే గాక సత్సంగేతరులకు గూడ సహాయమొనరించ గల్గుదురు. ఈ యుద్దేశ్యముతోనే హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు మన సంఘము మానవ జాతికి గొప్ప పరిమాణములో సేవ చేయునిమిత్తమై యెన్నుకొనబడినదని సెలవిచ్చి యున్నారు.

ఈ ప్రాంతపు సోదరులు మనసరుకు విక్రయములను చాలవిస్తారముగ పెంపొందించుచు హుజూర్ సాహబ్జీ మహారాజు వారి పై ఆదేశమును పాలించి పూర్తి చేయు చున్నారని మాకు తెలిసినది.

మనలో ఈ ప్రణాళిక విషయములో మనతో నంగీకరించని కొందరు సోదరీ సోదరులు గూడ నున్నారు. అట్టివారు ఉండుటకూడ చాల మంచిదే. ఏలనన వారుండుట వలననే మనకు ఈ ప్రోగ్రాముకు ప్రతికూల పరిస్థితులు గూడ బోధపడు చున్నవి.

మన ఈ ప్రణాళికను తప్పుపట్టి ఆక్షేపణ చేయుచున్న వారందరును గూడ తమ భావములను దిద్దుకొని మనతో నేకీభవించు సమయము గూడ సన్నిహితమగు చున్నది. వారు తమ ఆక్షేపణలను హుజూర్ సాహబ్జీ మహారాజువారు నిర్దేశించిన అయిదు సంవత్సరముల గడువు లోపుననే మార్చుకొన్న యెడల మాకు ఇంక నెక్కువ సంతోషముగ నుండును. అట్లు చేసిన యెడల వారు హుజూర్ సాహబ్జీ మహారాజు వారి నిజభక్తులమని యనిపించుకొని, ఆ దయాళుని ఆదేశములను ప్రోగ్రామును పూర్తి చేయుటలో పాల్గొంటిమని నిస్సంకోచముగ చెప్పుకొనవచ్చును.

మీరు ఒక్క మీ సొంత ఉపయోగార్థమైయే గాక సత్సంగేతరులకు అమ్ముడు చేయునిమిత్తమై వారి కుపయోగించు సరుకులను గూడ కొని అమ్ముచుండవలయునని నాఅభిప్రాయము. అవ్విధముగ ప్రవర్తించి మీరు వారికిని సకల మానవులకు నెట్లు సేవజేయుచున్నారో మఱియు సత్సంగేతరులు గూడ మానవ జాతికి శ్రేయస్సు గలుగజేయు నిమిత్తమై యేమి చేయవచ్చునో, యీ విషయములను వారికి విశద పర్చవలయును. రాధాస్వామీ సత్సంగము కేవలము ఒక ప్రత్యేక సంఘమునకు లేక ఒక ప్రత్యేక జాతి ప్రజలకును మాత్రమే లాభము గలుగజేయు నుద్దేశ్యముతో జారీ చేయబడలేదు. రాధాస్వామీ సత్సంగము యొక్క ఔన్నత్యాభివృద్ధుల ప్రణాళికలో ఒక ప్రత్యేక సంఘము లేక దేశము యొక్క జనులు మాత్రమే ఉద్దేశించబడి సమస్త సృష్టియు నా ప్రణాళికలో చేరియుండని యెడల అది రాధాస్వామీ సత్సంగమని పేర్కొనబడ నర్హమే కాదు. జగత్తుయొక్క ఔన్నత్యాభివృద్ధుల కార్యక్రమమును సాగించు నిమిత్తమై హుజూర్ రాధాస్వామీ దయాళుడు మహా దయతో రాధాస్వామీ సత్సంగ సంఘముమీద పెట్టిన ప్రత్యేక కర్తవ్యతా భారమును మీరు నిర్వహించ గలరను పూర్ణవిశ్వాసమును మీరు మీ నడవడి, ప్రవర్తనలను బట్టి అందరకును కలుగుజేయవలయును.

# 113

1940 ఏప్రిల్ 28వ తేదీని ఆగ్రాలో బేసిక్ ట్రైనింగ్ సెంటరులో హుజూర్ వారిచ్చిన ఉపన్యాసములో నిట్లు సెలవిచ్చిరి :

శ్రీమాన్, శర్మ సాహబ్, సోదరీమణులారా, మహాశయులారా ! శ్రీ శర్మసాహబ్ గారికిని, వారి స్టాఫ్ మెంబర్లకును, వారు నన్నీ యుత్సవమున కాహ్వానించి నందుకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతను తెలుపుకొను చున్నాను. నేను చాల ఎక్కువగ నిరాకరించినను వారు నా మాట నెంత మాత్రము వినక పట్టుపట్టి నందున నేను ఇందు కంగీకరించవలసి వచ్చినది. హిందూ దేశములో నిరుద్యోగుల సంఖ్య అందులో ముఖ్యముగ విద్యావంతులైన నిరుద్యోగుల సంఖ్య చాల సంవత్సరములనుండి ఏటేటా పెరిగిపోవుచున్న దను విషయము మనము చూచుచునే యున్నాము. ఇందుకు కారణము దేశములో పాఠశాలలు, కళాశాలల యొక్క సంఖ్య పెరుగుచు నవ యువకులకు విద్యాభ్యాసమునకై సావకాశము లెక్కువగ లభ్యమగుటయే. తత్పరిణామముగ మన అవసరమునకు మించిపోయిన సంఖ్యలో జనులు చదువుకొను చున్నందున వారి కందరికిని ప్రభుత్వ శాఖలలోగాని ప్రైవేటు కంపెనీలలోగాని ఉద్యోగములు లభించుట అసాధ్యమైపోయినది. మరియొక విషయ మేమనగ నిరక్షరాస్యులైన నౌకర్ల స్థానములో విద్యావంతులైన వారే గతిలేక నౌకరీ చేయుటకు ఒప్పుకొనవలసి వచ్చుచున్నది. అవ్విధముగ నిరు విధ సంఘములలోను నిరుద్యోగము పెరిగిపోయినది. అదిగాక ఈ నిరుద్యోగ పరిస్థితికి మరియొక కారణము గూడ గలదు. అదేమనగా 1930వ సంవత్సరము ప్రాంతములో దేశములోని రాష్ట్రీయ ప్రభుత్వము లన్నియు తమ ఆర్థిక క్లిష్టదశ మూలమున తమ తమ స్టాఫ్‌ను చాల వరకు తగ్గింపు చేసిరి.

ఇట్టి భయానక పరిస్థితి కలుగగ జనులందరును కాలేజీలలోను స్కూళ్ళలోను నేర్పుచున్న పాఠ్య భాగములును, విద్యాభ్యాస విధానమును, నేర్పు చుండెడి భాషయును ప్రస్తుతకాలమున కనుకూలముగ లేవని సర్వ సమ్మతిమైన తీర్మానమునకు వచ్చిరి. విద్యాలయములలో చెప్పెడి చదువు కేవలము పుస్తక జ్ఞానమే యనియు, వారికి నేర్పెడి భాష మాతృభాష కాదనియు మొదలగు ఆక్షేపణలను చేయుచు అందువలననే విద్యావంతులైన నవ యువకులు జీవిత సంగ్రామములో పరాజితులగు చున్నారనియు ప్రజలు అభిప్రాయ పడుచున్నారు.

చాల రాష్ట్రములలో ఈ నిరుద్యోగ సమస్యను పరిశీలనజేసి తమ నివేదికను తెల్పు నిమిత్తమై కొన్ని సమితులను గూడ నియమించిరి. అవ్విధముగ నీరాష్ట్రములో గూడ సర్ తేజ్ బహదూర్ సప్రూగారిని అధ్యక్షునిగను, దయాల్బాగునుండి గూడ హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి నొక సభ్యునిగను చేసి ఒక సమితి యేర్పాటుచేయ బడినది. ఈ సమితివారు ప్రభుత్వమువారికి తమ రిపోర్టును పంపించి యుండిరి. పిమ్మట ప్రభుత్వమువారు మరొక సమితిని

విద్యావిధాన ప్రణాళికలోని లోపములను సవరించు నిమిత్తమై యేర్పాటు చేసిరి. కాని ప్రభుత్వములో మార్పులు వచ్చినందున ఆ సమితి పని చేయలేక పోయి నది. దానికి బదులు కాంగ్రెస్ ప్రభుత్వమువారు మరొక సమితిని యేర్పాటు చేయగా ఆ సమితి చాలపాటుపడి పనిజేసి, ప్రభుత్వము వారికి 'Basic System of Education' (బేసిక్ విద్యా విధాన ప్రణాళిక) ను అమలులో పెట్టు నిమిత్తమై శిఫారస్ చేయుచు నొక నివేదికను పంపిరి. పిల్లలకు ఒక చేతి పరిశ్రమకు సంబంధించిన విద్య గూడ నేర్పవలయుననియు, ఆ చేతి పరిశ్రమ ఆ పిల్లలుండెడి స్థానవాతావరణమున కనుకూలముగ నుండవలయుననియు ఆ సమితి వారు అభిప్రాయము వెలిబుచ్చిరి. అట్టి విద్యా విధాన సందర్భములో పిల్లలు తమ కండ్లు, చేతులును ఉపయోగించవలసిన పని ఎక్కువగ నుండును. కావున వారికి ప్రయోగాత్మక శక్తితోబాటు వివేచన శక్తి కూడ సమానాభివృద్ధి నొందు నావకాశము కలదు.

కొంత కాలము అనుభవ రూపముగ చూచిన పిదప విద్యావిధాగ అభిమాను లందరును పిల్లవానికి హస్త పరిశ్రమ ద్వారా విద్యాభ్యాసము గరపి నందువలన వాని అంతశ్శక్తులు చాల యధికముగ బలవత్తర మగుననియు, కేవలము పుస్తక పాఠముల బోధకన్న నెక్కువగ పిల్లవానికి బుద్ధి వికాసముకలుగు ననియు నంగీకరించిరి. కావున ఇట్టి విద్యాభ్యాస విధానము వలన గొప్ప గొప్ప ఫలితములు చేకూరగలవని ఆశించబడు చున్నది. కాని ఇందులో కఠిన సమస్య యేమనగ ఇట్టి విద్యను నేర్పుటకై చాల సామర్థ్యము గల ఉపాధ్యాయుల అవసరమున్నది. చేతి పరిశ్రమ ద్వారా విద్య గరపుట ఒక గొప్ప కఠిన విషయము. ఇట్టి విద్య గరపు నిమిత్తమై ఉపాధ్యాయులు నూతనావిష్కారములు చేయుటకు శక్త్యుత్సాహములు గలవారును, వృత్తులకు సంబంధించిన విద్యలలో భావికాలావశ్యకతలను గమనించుచు సంపూర్ణ ప్రదర్శనము జేయగల సమర్థత గలవారును కావలసి యున్నది.

నేను ఇంతకుముందు ఈ క్యాంపునకు రెండుసార్లు వచ్చి యుంటిని. ఇంత వరకు నామట్టుకు నాకు ఈ విద్యా ప్రణాళిక యందు విశ్వాసము కలుగ లేదని సాహసించి చెప్పుచున్నందుకు మీ క్షమార్పణ గోరుచున్నాను. విద్యా ప్రణాళికలో ఇట్టి మార్పు చేయుటలో నుద్దేశ్యము చదువు పూర్తియైన పిల్లలకు వెంటనే ఉద్యోగములో జేరుట కర్హత కలుగవలయుననియు; వారి విద్యాభ్యాసము పొందిన పిదప ఉద్యోగములో ప్రవేశించి తమకును తమ కుటుంబమునకును, అవసరమైనంత ధనార్జన చేసికొనగల్గుదురనియు నమ్మకము కలిగించవలయుననియే.

ఈ విషయమును గురించి ప్రమాణము లభించినపుడే ప్రతి మాసవృడును ఈ విద్యా పరీక్షకను పెంచుకొని ఈ పరీక్షకా విధానమును జారీ చేయుటకు బాధ్యత వహించిన సజ్జనులకు ధన్యవాదము లర్పించగలను.

# 114

1940 మే 21వ తేదీని ధన్‌బాద్‌లో స్టోర్సు నుద్ఘాటన చేయు సమయములో హుజూర్ మెహతాజీవారు ఉపన్యసించుచు నివ్విధముగ సెలవిచ్చిరి: ఈ స్టోర్సును ఈ రోజు సాయంకాలము ఉద్ఘాటన చేయు నిమిత్తమై నన్ను ఆహ్వానించిన ధన్‌బాద్ దయాల్బాగు స్టోర్సు లిమిటెడ్ కంపెనీ సభ్యులకును డైరెక్టర్లకును నా కృతజ్ఞత తెలుపుచున్నాను. మీరందరును వారి యాహ్వానము నంగీకరించి ఈ కార్యక్రమమును దర్శించు నిమిత్తమై శ్రమ తీసికొని నందులకు మీ కందరకును గూడ ధన్యవాదము లర్పించుచున్నాను. ఇప్పుడు కొద్దిసేపు క్రితమే నన్ను గురించి రాధాస్వామీ మతము యొక్క ఆరవ సద్గురువని చెప్పిన పొరపాటు మాటకు నేను మీ అందరి క్షమార్పణ కోరుచున్నాను. నేను రాధాస్వామీ మతము యొక్క ఒక తుచ్ఛానుయాయినై యుండుటయే నా సౌభాగ్యము. నేను అట్టి సౌభాగ్యమునకై గర్వించుచున్నానని నిస్సంకోచముగ నొప్పుకొనగలను.

హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు సర్వజ్ఞులు. వారికి భారత దేశము యొక్క ఆర్థిక వ్యవస్థ యొక్క లోపాలోపము లన్నియును, అట్లే తమ సంఘము యొక్క ఆర్థిక వ్యవస్థలో లోపములును సంపూర్ణముగ తెలుసును. అందువలన ఆ దయాళురు సింహాసనమున నధిష్ఠితులైన రెండు మూడు సంవత్సరముల పిదపనే దయాల్బాగులో పరిశ్రమలను జారీ చేయించు దివ్యేచ్ఛను ధరించిరి. అప్పటి నుండియు ప్రతి సంవత్సరము నిచ్చట కార్ఖానాలలో కొన్ని క్రొత్త మెషీనులు పెట్టుటయు, క్రొత్త క్రొత్త సరకులు తయారు చేయుటయు జరుగుచుండెను. వారు తమ వచనములలో గూడ సత్సంగులు సాధ్యమైనంత వరకు దయాల్బాగులో తయారైన వస్తువులనే యుపయోగించి అవ్విధముగ సంఘముయొక్క ధనము సంఘములోనే యుండిపోవునట్లు చేయవలయుననియు, సత్సంగులలో గాని, సత్సంగేతరులలో గాని నిరుద్యోగులుగనున్న వ్యక్తులు అధికాధిక సంఖ్యలో ఉద్యోగము సంపాదించుకొని జీవికోపార్జన చేసికొనుచు సుఖముగ జీవితము గడుపుకొనగలుగునట్లు చేయవలయుననియు చాలాసార్లు ప్రభావ పూరిత వాక్యములలో గట్టిగ బోధ చేయుటలో నెన్నడు లోపము చేయలేదు. కొన్ని

యేండ్లు గడచిపోయినవే గాని మన పరిశ్రమలలో నిరంతరాభివృద్ధి గలుగు చున్నను కూడ మన సంఘములోని నవయువకులలోను, బాహ్య ప్రజలలోను కూడ నిరుద్యోగ పరిస్థితి తీవ్రముగ హెచ్చిపోవుచునే యున్నది.

1935 డిసెంబరు నెలలో హుజూర్ వారు దయాల్బాగ్ కార్ఖానాల యొక్క వస్తూత్పాదన అప్పుడున్న ఐదున్నర లక్షల రూపాయిల మొత్తము నుండి సాలీనా కోటి రూప్యముల మొత్తమునకు ఐదు సంవత్సరముల గడువులో పెంచివేయవలయునని సభవారికి హితోపదేశము చేయ దివ్యేచ్ఛ ధరించి అవ్వి ధముగ నొక తీర్మానమును కూడ ప్యాస్ చేయించిరి.

అప్పటిలో హిందూదేశములోని కొన్ని పట్టణములలో సత్సంగులు సాలునకు ఐదువందల రూపాయిల లోపున విక్రయములు చేయుచున్న ప్రైవేట్ స్టోర్సులు కొద్దిగ పెట్టుకొని యుండిరి. అందుచే సత్సంగులు ఇంక నెక్కువ స్టోర్సులను తెరవవలసిన యవసరము కలిగినది. ఈ ప్రైవేట్ స్టోర్సులకు మూల ధనము తక్కువగ నుండుటచే రెండు సంవత్సరముల పిమ్మట అనగా 1930 అక్టోబరు నెలలో దయాల్బాగ్ స్టోర్సు అను నామకరణముతో లిమిటెడ్ కంపెనీలను తెరువ వలయునని తీర్మానించబడినది. అప్పటి నుండి ఇప్పటి వరకు దేశ మంతటిలోను ఇట్టి కంపెనీలు డెబ్బదికన్న నెక్కువ సంఖ్య రిజిస్టరైనవి. ధన్‌బాద్ దయాల్బాగ్ స్టోర్సు కూడ అందొకటి యైయున్నది. ఈ స్టోర్సు ఉద్ఘాటన విషయము మీ కిపుడు క్లుప్తముగ చెప్పితిని. మీ రందరును నాకు ఈ స్టోర్సు తెరచుటకును, మీ అందరి పరిచయము చేసికొనుటకును అవకాశ మిచ్చినందుకు మీ అందరికిని నేను తిరిగి ధన్యవాదము లర్పించుచున్నాను.

# 115

1940 జూన్ 15వ తేదీని హుజూర్ మెహతాజీ మహారాజ్ వారికి హాథరస్ వాస్తవ్యులొక (address) నివేదన పత్రమును సమర్పించిరి. అందుకు సమాధానముగ హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి: ఆదరణీయ అధ్యక్ష మహాశయా! నాకు మీ అందరిని కలిసికొను శుభ సావకాశమును కలుగ జేసినందుకు నేను మీకు కృతజ్ఞుడను. మీరు మీ తరఫునను, హాథరస్‌లోని ఇతర వాస్తవ్యుల తరఫునను నా విషయములో ప్రకటించిన ప్రేమ భావమునకు కూడ నా ధన్యవాదములు అర్పించుచున్నాను. నేను రాధాస్వామీ మతముయొక్క ఒక తుచ్ఛఅనుయాయిని మాత్రమే. అంతకన్న విశేషమేమియు నాలో లేదు. మీ హాథరస్ పట్టణము మథురకు దగ్గరగ నుండి తులసీ సాహెబ్ వారి జన్మ

భూమి అయిన కారణముచే నది యొక మహా సౌభాగ్యవంతమైన పట్టణమైనది. ఇచ్చటకు **హుజూర్** స్వామిజీ మహారాజ్ వారును, వారి యనంతరము హుజూర్ సర్కార్ **సాహబ్** వారును హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారును దయజేసి యుండిరి. దయాల్బాగ్ కాలనీ సర్ **సాహబ్జీ** మహారాజ్ వారి ఉత్సాహ పూరిత ప్రయత్నముల యొక్క ఫలితమని మీరు చెప్పిన విషయము పూర్తిగ యుక్తమే. కావున నేను ఈ కాలనీ విషయములో నెక్కువ వ్యాఖ్యానము చేయవలసిన యవసరము లేదు. హుజూర్ **సాహబ్జీ** మహారాజ్ వారు 1917 సంవత్సరము నుండియు హిందూ దేశములోని విద్యావంతులైన నవయువకులు అధికాంశలో ఉద్యోగ విహీనులై యుండిపోవుచున్నారను విషయమును గమ నించి దయాల్బాగులో వాణిజ్యమును, చేతి పరిశ్రమలను ప్రారంభించిరి. ఈ సందర్భములో వాణిజ్య కార్యక్రమము ఇంకను అధికముగ వృద్ధిచేసి విద్యా వంతులైన జనులకు జీవనోపాధిని కలుగజేయు నిమిత్తమై దయాల్బాగులో 1937 వ సంవత్సరము ఆఖరు నుండియు ప్రయత్నములు జరుగుచున్నవి. వ్యాపారము, పరిశ్రమలును వృద్ధి జేయుట ఒక విషయమును, తయారైన వస్తువులను అమ్ముడుజేయుట మరియొక విషయమును. ఆ రెండవ పని సాగించు నిమిత్తమై తగిన యేర్పాటు లేనిదే మొదటి కార్యక్రమము ఎక్కువ కాలము నిలబడ నేరదు.

ఆహార పానీయముల కవసరమైన సామగ్రినిగాని, ధనముగాని యేమియు లేనట్టి రమారమి ఒక నూరు మంది స్త్రీలు ఇక్కాలమున దయాల్బాగులో నీ ప్రబంధ విషయములో పని చేయుచున్నారను సంగతి మీకు బహుశః తెలిసి యుండదు.

కార్ఖానాలలో తయారైన వస్తువులను బజారులలో జన సామాన్యము నెదుట విక్రయమునకై పెట్టుట నే నిపుడు చెప్పినట్లుగ నొక వేరు విధమైనపని. దయాల్బాగులో నివసించువారు ఆ విషయములో నెక్కువ తోడ్పడజాలరు. కావున మీరు దయాల్బాగులో తయారైన వస్తువులను చూచి వాని చౌక ధర లను, ప్రశస్త్యమును గురించి కేవల శ్లాఘ చేయుట మాత్రమేగాక వానిని విరివిగ కొనుగోలుజేసి మీ రిపుడు చదివిన ఎడ్రెస్‌లో ప్రకటించిన మీ ఆర్థిక భావములను ఆచరణ రూపమున ప్రకట పర్చు నిమిత్తమై **'Taste of the pudding lies in the eating thereof'** (ఒక తినుబండారమును జనులు అధికముగ తిన్నపుడే దాని మాధుర్యము రుజువు కాగలదు గదా!) అను ఆంగ్లభాషలోని సామెతలో చెప్పినట్లుగ నీ సరుకులను మీరు స్వయముగ కొను గోలు చేసి, మీ మిత్రులచే గూడ విరివిగ కొనిపించి వాని ఉత్తమత్వము,

చవుక ధరల వలన లాభము నొందవలయు నను యుద్దేశ్యముతోనే వీని నిపుడు మీ యెదుట పెట్టుచున్నాము. ఈ ప్రదర్శనములో పెట్టిన సరకుల మొత్తము నా యభిప్రాయములో నంత ఎక్కువగ లేదు. ఈ సమావేశము చేసి ఈ భాషణ చేయుటలో మా ముఖ్యోద్దేశ్యము మీరు ఈ సరకులను పరికించి చూడవలయుననె మాత్రమే. ఇందులో మీకే సరుకైనను కావలసినంత లేని యెడల మీరు దాని నిమిత్తమై ఆర్డరు చేసికొనవచ్చును.

దయాల్బాగు నందు మీకున్న ప్రేమాభిమానములు చూచిన పిమ్మట మీరు ఈనాటితోనే దయాల్బాగును మరచిపోనేరరనియు, మీ ప్రేమ దిన దిన ప్రవర్ధ మానముగ పెరిగిపోవుచు, అందుకు నిదర్శనముగ మీరు ముందు ముందు ఇంకనధికముగ దయాల్బాగ్ సరకులను కొనగలరనియు, నాకు సంపూర్ణ విశ్వాసమున్నది. ఇంత మండు వేసవికాలములో మీరందరును శ్రమపడి ఇచ్చట సమావేశమై, నేను మీకు దయాల్బాగును గురించియు, దయాల్బాగ్ సరకులను గురించియు వివరించి చెప్పు సావకాశము నాకు కలుగజేసి నందులకు నేను మీకు మరొకసారి తిరిగి ధన్యవాదము లర్పించుచున్నాను.

# 116

జోధపురములో 1940 ఆగస్టు 3, 4 తేదీలలో సాయంకాల సత్సంగములో హుజూర్ వారు కొన్ని ప్రశ్నలకు సమాధానము చెప్పుచు నిట్లు సెలవిచ్చిరి: జోధపురములో కొందరు సత్సంగీ సోదరులకు దయాల్బాగ్ సత్సంగమును గురించి కొన్ని తప్పు అభిప్రాయములు ఉన్నవని నాకు తెలిసినది. వారు రెండు ఆక్షేపణలు చేయుచున్నారు. 1. దయాల్బాగ్‌లో ఇండస్ట్రీస్ అభివృద్ధిని గురించి యెక్కువ పట్టుదల నేల పట్టవలయు నని మొదటి యాక్షేపణ 2. ఈ కాలములో దయాల్బాగ్‌లో వచనముల నేల చెప్పుట లేదని రెండవది. పరమ పూజ్యులైన హుజూర్ వారు మొదటి ఆక్షేపణను గురించి ఇట్లు సెలవిచ్చిరి: ఇండస్ట్రీస్ అభివృద్ధి విషయములో మీ ఆక్షేపణ మా మీద సరియైనచో ఆ యాక్షేపణ హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు దయాల్బాగ్‌లో ఇండస్ట్రీస్ 1916-17 సంవత్సరములో ప్రారంభించినపుడు వారిమీదనే ప్రవర్తించ వలసి యుండెను. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు 1935వ సంవత్సరములో జరిగిన సభాసమావేశములో దయాల్బాగ్‌లో సాలీనా సరకుల ఉత్పాదన మూడు సంవత్సరముల లోపున సంవత్సరమున కొక కోటి రూప్యముల యుత్పాదన వరకు హెచ్చిపోవునట్లు చేయవలెననెడి తీర్మానము ప్రవేశ పెట్టించిరి. అందు

పైన రెండవ మూడు సంవత్సరముల వ్యవధి చాల తక్కువ యని చెప్పుచు ఏడు సంవత్సరముల వరకు గడువు కావలయునని మొరపెట్టుకొనగ కొంత ఆలోచన చేసిన పిమ్మట మూడు సంవత్సరములకు బదులు ఐదు సంవత్సరముల గడువు పెట్టి ఆ గడువు లోపల సాలున కోక కోటి రూప్యముల యుత్పాదన చేయవలయునని నిశ్చయించబడినది. రాధాస్వామీ దయాళునిచే నీ సృష్టి యంతకును సేవ చేయు నిమిత్తమై మన సంఘము ఎన్నుకొన బడినదనెడి మహా సందేశమును హుజూరువారు 1936 డిసెంబరు నెలలో ప్రకటన చేసిరను విషయము మీ కందరకు తెలుసును గదా! దానిని బట్టి ఏ మహాసేవ చేయు నిమిత్తమై మన సంఘ మెన్నుకొనబడినదని వారు సందేశమిచ్చిరో ఆ సేవలో నీ ప్రోగ్రామును పూర్తి చేయుట మొదటి మెట్టు అను విషయము రూఢియగుచున్నది. కావున వారి అనంతరము మన సంఘము యొక్క ముఖ్య కర్తవ్యమేమనగా, మన సంఘము ఏ సేవ చేయు నిమిత్తమై యెన్నుకొనబడి ఆ సందర్భములో జరిగించవలసిన కార్య కలాపములో ప్రిప్రథమమున చేయవలసిన సేవ యనుచు ఏ ప్రణాళిక నిర్ణయించబడినదో ఆ ప్రథమ ప్రణాళికను సంఘమంతయు శరీర మనోధనములను సర్వ విధముల వెచ్చించి కొనసాగించుటయే. కావున దయాల్బాగ్‌లోని ఇండస్ట్రీస్‌కి ప్రతికూలముగ మాట్లాడదలచుకొన్న ఆక్షేపకు లందరును హుజూర్ సాహబ్జీ మహారాజువారు పైన ఉదహరించిన వచనములను అవగాహన చేసికొనవలసి యున్నది. వారు నిష్పక్షపాత బుద్ధితో గమనించిన యెడల ప్రస్తుత పరిస్థితులలో మేము జరిగించుచున్న విధానమంతయు హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి అంతిమ దివ్యేచ్ఛను, ఆఖరి ఆజ్ఞకును పూర్తిగ అనుకూలించియే యున్నదని వారు తెలిసికొని మన్నించవలసి యున్నది.

రెండవ యాక్షేపణ విషయములో నా మనవి ఇంతియు మాత్రమే. ఏమనగ, వచనములు విన్నంత మాత్రముననే ఉద్ధారము లభించగలదని నే నెచ్చటను చదువలేదు, వినలేదు, కాని గురు మహారాజ్ వారి ఆజ్ఞాపాలన రూపముగ నే కార్యక్రమము జరిపించబడునో అదియ గురుభక్తి ఫలితముగ గలిగించు నని మాత్రము నేను తప్పకుండ గ్రంథ పఠనము ద్వారాను, వినికిడి వలనను గూడ తెలిసికొన్నాను.

హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు జీవుల ఉద్ధారము నిమిత్తమై ఈ ప్రపంచమునకు దయచేసిరి. కావున తమ పిల్లల స్వార్థ పరమార్థ లాభము నిమిత్తమై భవిష్య కాలములో నడపించవలసిన ప్రణాళికను వారు తప్పక ముమ్ముందుగనే తయారు చేసికొని యుందు రను విషయము నిస్సంశయము. వారు

అంతర్యామి పురుషులు ముందు రాబోయెడి కాలము యెట్టిదో వారికి ముందు గనే తెలుసును. కావున ఆకాలమునకు యోగ్యముగ నుండు విధముగనే వారేర్పాటు చేసియుందురు. ఇప్పుడు మన అందరి లాభ క్షేమముల నిమిత్తమై వారు తయారు చేసిన ప్రణాళికను మనము సడుము కట్టుకొని పూర్తి చేయుటకై గట్టి ప్రయత్నము చేయుటయే మన అందరి కర్తవ్యము.

మీలో నెవరైనను గతించిన మే, జూన్ నెలలలో అచ్చువేసి ప్రకటించిన రెండు Foolscap (ఫూల్‌స్కేప్) పేజీల కరపత్రమును చూచితిరా, లేదా? అందులో నన్ను గురించి ఆక్షేపణ చేసిన విషయములు చాల యున్నవి. వాని సారాంశమేమనగ నేను కుర్చీలోనుండి తొలగి పోవలయుననియే. మొదటి విషయ మేమనగ ఈ కుర్చీయే గాక Foot Stool (ఫూట్‌స్టూల్) గూడ నాస్వంతమే. రెండవది నాకు కుర్చీలో కూర్చుండుట అలవాటనుట నిశ్చయమే కాని నాకు అట్టి ఆసక్తి ఎన్నడు లేదు. నేను గృహములో గూడ కుర్చీలోనైన మంచము మీదనైన కూర్చుందును.

సాహబ్జీ మహారాజు వారి అనంతరము రెండు వర్గములు తయారై నవనియు ఆరెండు వర్గములు ఏకము చేయు విధాన మెద్దియు తేల్చబడలేదనియు చేసిన ఆక్షేపణకు సమాధానముగ హుజూర్ మెహతాజీ మహారాజు వారిట్లు సెల విచ్చిరి: వివిధ వర్గములైతే స్వామీజీ మహారాజు వారు, హుజూర్ మహారాజ్ వారు, మహారాజ్ సాహబ్ వారు, సర్కార్ సాహబ్ వార్లు అందరి అనంతరము కూడ నేర్పడుచునే యుండెను. మీరు చెప్పినట్లు సాహబ్జీ మహారాజ్ వారి అనంతరమైతే రెండు వర్గములు మాత్రమే ఏర్పడినవి. సాహబ్జీ మహారాజ్ వారు తమ యనంతర మిట్టి గడబిడలు చాల తక్కువగ నుండుననియు, సభాసభ్యులు అధిక సంఖ్యాకులు అట్టి పొరపాటులో పడనేరరనియు సెలవిచ్చు చుండెడివారు.

అందరు దయాల్బాగులోనే కలిసి సత్సంగము చేసికొనవలయు ననియు, సంత్ సద్గురువైన పురుషుడు దయాల్బాగులోనికే స్వయముగ ఏతెంచెదరనియు, వారికొరకై తిరుగాడ నవసరముండదనియు, వారు సంఘమును విడిచి బయటకు పోనేరరనియు సాహబ్జీమహారాజ్ వారు సెలవిచ్చియే యున్నారు. ఇండస్ట్రీస్ పరమార్థమునకు లాభకరమగునా? కాదా? యనెడి రెండవ ప్రశ్నకు సమాధానముగ హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి. నాకు సత్సంగుల వద్దనుండి వచ్చెడి ఉత్తరములలో చాలామట్టుకు సత్సంగులు తమకు ఆహారపానీయములకు ధనము

లేదనియు, తమ పిల్లలు పనిలేకుండ కూర్చుండిరనియు, లేనిపోని ఆలోచనలు మనసున తరచుగ బయలుదేరుచు స్మరణ, ధ్యాన, భజనలు సాగనిచ్చుటలేదనియు, అందువలన తాము సేవయు, సత్సంగమును గూడ చేయలేకుంటిమనియు వ్రాయుచున్నారు. అట్టి వారికి ఇండస్ట్రీస్ వృద్ధిచేసి పనులు చేసికొనుటకు సావకాశము కలిగించి వారికిని, వారిపిల్లలకును అవ్విధముగ జీవనోపాధి కలిగించినచో వారికి అట్టి లేనిపోని ఆలోచనలు బయలుదేరకుండనుండి వారు స్మరణ, ధ్యాన, భజన సేవా సత్సంగములను తప్పక చేసికొనగల్గుదురు. ఈ పరిస్థితిలో వారికి ఇండస్ట్రీస్ వలన పారమార్థిక లాభము చేకూరుచున్నదో లేదో మీరే తేల్చి చెప్పుదురుగాక.

చెప్పవచ్చిన దేమనగ ఉద్ధారమనగ బంధనముల విచ్ఛిత్తియే. ఆ బంధన విచ్ఛేదము భగవంతుడు ఏరీతిని చేసినను చేయవచ్చును. అందువలన, మీకు నష్ట కష్టములు కలుగుచున్నట్లు బాహ్య దృష్టిలో కనిపించినను, వాస్తవములో మీకు అసలైన నష్టమేమియు కలుగనేరదు.

సత్సంగములో నష్టమును గురించి యెన్నడు ఆలోచించరు. ఆదాయమును గురించి కూడ ఆలోచించుకొనరు. భేంట్ మొదలైనవి పుచ్చుకొనుటలో రూపాయిలు ప్రోగుచేయవలయు నను నుద్దేశ్యముండదు.

గురు నహిం భూఖా తేరే ధన్ కా।
ఉన్ పై ధన్ హై భక్తి నామ్ కా ॥ 43 ॥
( సారబచన్, వచనము 16, శబ్దము 1 )

మహారాజ్ సాహబ్ వారు బిజినెస్ ప్రారంభించిరనియు, సాహబ్జీ మహారాజ్ వారాపనినే పెద్ద పరిమాణములో చాలాబాగుగ సాగించిరనియు మీకందరకును తెలిసియే యుండవలయును. సత్సంగము వృద్ధియగుచున్నకొలది సత్సంగము ఖర్చు పెరిగిపోవుచుండుటచే ఆ ఖర్చుల నిమిత్తమైన సంపాదనకు క్రొత్త విధానములు అవలంబించవలసి యుండును. సాహబ్జీ మహారాజ్ వారు రానురాను భేంటుద్వారా ధనసంపాదన చేయుట కట్టిపెట్టెదమని చెప్పిన విషయము మీకు బహుశః జ్ఞాపకములేదు కాబోలు! సత్సంగేతరుల వద్దనుండి ధనమేమియు సత్సంగము తీసికొనదు. కావున సత్సంగము యొక్క ఖర్చులను భరించు నిమిత్తమై బిజినెస్ ఇండస్ట్రీస్ ద్వారా ధనసంపాదన చేయుట ఆవశ్యకమైనది. ఇప్పుడు మీరు ఈ విధమైన సంపాదన పద్ధతిని గురించి ఉత్తమ భావములను పెట్టుకొనెదరని ఆశించుచున్నాను.

బిజినెస్‌లో పడినందువలన ఆత్మకు ఊర్ధ్వముఖముగ అంతర్యమున ఆరోహణ కలుగ నేరదని కొందరుచేయు ఆక్షేపణకు సమాధానముగ హుజూరు వారిట్లు సెలవిచ్చిరి : మీరు కొద్దిసేపుముందే ఇండస్ట్రీస్ వలన పారమార్థిక లాభము చేకూరగలదా యని ప్రశ్నించితిరి కదా ! ఆ ప్రశ్నకు మేమింతకు ముందు చెప్పిన సమాధానమే ఈ ఆక్షేపణకు కూడ సరిగ సరిపోవును. భుక్తి లభించినచో తిండి, బట్టనుగురించి చింతలు తగ్గిపోయి అనవసరపుటాలోచనలు కూడ తగ్గిపోవును. జనులు వ్రాయుచున్న ఉత్తరములలోని విషయములు యథార్థమును, సత్యమును అయినయెడల వారికి జీవనోపాధి లభించినచో వారి ఆత్మలు సహజముగ అభ్యాస సమయమున ఊర్ధ్వముగ ఆరోహించగలవని ఆ విషయములను బట్టియే తేటపడుచున్నది.

అవ్వలమ్ తుఆమ్ బాద్ హూ కలామ్ ।

( "తిండి ముందు, తరువాత ఉపన్యాసము" )

అను ఒక సామెత యున్నది. రెండవది ఇట్లు గూడ చెప్పబడియున్నది.

కబీర్ ఖుధ్యా కూకరీ, కరత్ భజన మేఁ భంగ్ ।
తాకో టుకడా డాల్ కర్, భజన కరో నిస్సంగ్ ॥

(ఆకలి యనెడి కుక్క భజనాభ్యాసమునకు విఘ్నము కలుగజేయు చున్నది. దానికి ఒక రొట్టెముక్క పడవేసి నిర్విఘ్నముగ భజన చేసికొను మని కబీరు వారు సెలవిచ్చుచున్నారు.

# 117

1940 ఆగస్టు 13వ తేదీని తేజః స్వరూపులైన హుజూరువారు మద్రాసులో ఒక సభలో వారి కర్పించిన గౌరవ పత్రమునకు సమాధానముగ మాట్లాడుచు నిట్లు సెలవిచ్చిరి :

మహిళామణులారా ! సజ్జనులారా ! గణేశ్వరరావుగారు ఇప్పుడిప్పుడే నన్ను గురించి మీకు పరిచయము చేయుచు నన్ను రాధాస్వామీ మతము యొక్క షష్ఠమాచార్యులుగ వివరించి యున్నారు. నేను ఆ వివరణకు అంగీకరించను. నేను హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి సేవకులలో నొక తుచ్ఛ సేవకుడను. మదరాసు ప్రెసిడెన్సీలో నున్న మన సత్సంగీ సోదరులు, 1934వ

సంవత్సరములో హుజూర్ సాహబ్జీ మహారాజువారి చరణ కమలముల వద్ద, మదరాసీ సోదరులు తమ మతమును విడిచి ఇతర మతములలో జేరిపోవుచున్నారనియు, వారి మీాద మహా దయజూపి వారట్లు మత భ్రష్టులు గాకుండ జేయు దివ్యేచ్ఛ ధరించవలయుననియు ప్రార్థన చేసిరి. ఆ సోదరులు అందు నిమిత్తమై కొంత ధనమును కూడ అర్పణ చేసిరి. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు సత్సంగులు చేసిన ప్రార్థనను విని యుక్త సమయము, సావకాశము కలుగు వరకును వేచి యుండవలసినదని సెలవిచ్చిరి. అటుపైన నొక సంవత్సరము తరువాత 1935 డిశంబరు నెలలో హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి ప్రేరేపణపైన దయాల్బాగు రాధాస్వామీ సత్సంగ సభవారు అప్పటిలో దయాల్బాగ్ మోడల్ ఇండస్ట్రీస్ వారి సాలుసరి వస్త్రోత్పాదన ఐదున్నర లక్షల రూప్యములు మాత్రమే అయి యుండగ దానిని రాబోవు ఐదు సంవత్సరములలో సాలీనా ఒక కోటి రూప్యముల వస్త్రోత్పాదన యగునట్లు పెంపుచేయవలసినదని ఒక తీర్మానమును ప్యాస్ చేసిరి. మన సంఘమును మనుష్యజాతి యొక్క సేవ చేయు నిమిత్తమై భగవంతు డెన్నుకొనిరని హుజూర్ వారు 1936 డిశంబరు నెలలో సందేశమును ప్రకటించిరి. మన దురదృష్టము వలన హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు 1937 జూన్ 24వ తేదీని ఈ మద్రాసు పట్టణములోనే శరీర త్యాగము చేయ దివ్యేచ్ఛ ధరించిరి. మన సభ యొక్క నియమముల ప్రకారము ప్రెసిడెంటు నొకరిని ఎన్నుకొనుట ఆవశ్యకమై యుండెను. హుజూర్ వారు శరీర త్యాగము చేసిన సమయమున పరిస్థితులు చాల సునిశితముగ నుండి యున్నందున మనలో నొకరిని ప్రెసిడెంటుగ నెన్నుకొనుట అత్యంత ఆవశ్యకమయ్యెను. ఏలనన హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారే అంతవరకు ప్రెసిడెంటు హోదా నలంకరించి యుండిరి. సభయొక్క కార్య నిర్వాహక వర్గమువారు ఈ విషయము నంగీకరించి ప్రెసిడెంటు నెన్నుకొనుటకై 1937 ఆగస్టు 28వ తేదీని ఏర్పాటు చేసిరి. నా యదృష్టము వలన నేమి దురదృష్టము వలన నేమి ఈ పని బాధ్యత నాపైననే పడిపోవునని జ్ఞానము నాకు అప్పుడు కలుగలేదు. ఎట్లైన నేమి సత్సంగులు ప్రెసిడెంటు పదవిలో పని చేయు నిమిత్తమై నన్నే సర్వసమ్మతితో నెన్నుకొనిరి. ఇక ముందెవరైన నెక్కువ సమర్థుడైన వ్యక్తి ఈ పదవికి లభించిననాడు నేను పదవిని విడిచి పెట్టుటకు అభ్యంతరము పెట్టకుండ నుండు షరతునకు లోబడి నేను అప్పటిలో ఆ తీర్మానమును అంగీకరించుట తప్పనిసరియైపోయెను.

సత్సంగులు 1935 సంవత్సరములో ఇండస్ట్రీస్‌ను వృద్ధి చేయుటను గురించి ప్యాస్ చేసిన తీర్మానమును తిరిగి అంగీకరించుచు అందు విషయములో వారివలన నెట్టి త్యాగములు కోరినను వారు చేయుటకు సిద్ధముగ నున్నట్లు

దృఢముగ చెప్పిరి. అందుచే నేను మన యొక స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్లు (Spinning and Weaving Mill) నేర్పాటు చేసికొనవలసి యున్నదని సలహో యిచ్చితిని. ఒక పెద్ద బట్టల బజారు అని పేరొందదగిన అమృతసర్ పట్టణములో ఒక స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కార్ఖానా అమ్మకమునకు రాగా 1937 డిశంబరు 16 రాత్రి దానిని కొనుగోలుచేయు నిమిత్తము బేరము ఖాయ మైనది. ఆ బేరమును సభయొక్క కార్య నిర్వాహక వర్గము దయతో సంగీక రించిరి. ఈ మిల్లు ఐదు సంవత్సరముల నుండి మూసివేయబడి యుండెను. కాని మన టెక్నికల్ కాలేజీ విద్యార్థుల సహాయము వలన అది ఒక నెలలోనే తిరిగి పనిచేయ నారంభించి దారము వడికెడిపని చేయ మొదలిడెను. ఇంకొక నెల పోయిన తరువాత బట్టలనేత పని గూడ నారంభించినది.

ఆ మిల్లు నడిపించుటలో అనుభవ జ్ఞానము లభించిన తోడనే తొందర తొందరగ క్రొత్త మెషినరీ దానికి అమర్చుటకు నిశ్చయించితిమి.

1938 సాలాఖరుకు మన సకల వస్త్రోత్పాదన పదిలక్షల వరకు పెరిగినది. 1939 ఫిబ్రవరి నెలాఖరుకు ఇరువది రెండు లక్షల వరకును, 1940 ఫిబ్రవరిలో ముప్పది ఐదు లక్షల వరకును పెరిగిపోయినది. ఈ సాలాఖరుకు మొత్తము వస్త్రోత్పాదన దాదాపు నలుబది లక్షల రూప్యముల వరకు పెంపొంద గలదని ఆశించుచున్నాము.

వస్తువుల యొక్క ఉత్పాదన కన్న వాని విక్రియము చాల కఠినము. కావున మా కాలము చాల మట్టుకు విక్రియములకు సంబంధించిన యేర్పాటు చేయుటలోనే గడచిపోవు చున్నది. ఇప్పటి కొక సంవత్సరము పై కాలము నుండియు హిందూదేశ మంతటిలోను వివిధ స్థలములలో ఇరువదివేల రూప్య ముల స్వీకృత మూలధనముతో (Authorised Capital) ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీల ద్వారా మనము మన యుత్పాదన సరకులో చాల భాగము సుఖ ముగ అమ్మివేయ గలము. మీలో కొంత మందికి ఈ పట్టణములోనే జార్జి టౌన్‌లో ఫ్రూట్ మార్కెట్టున కెదురుగ మన దయాల్బాగ్ వస్తువుల డిపో యొకటి యున్నదనియు, ట్రిప్లికేన్‌లో ట్రిప్లికేన్ దయాల్బాగ్ స్టోర్సు ఒకటి తెరువబడినదనియు బహుశా తెలిసియే యుండును. ఈ విషయము లన్నియు దృష్టిలో నుంచుకొని మీరందరును మీకు దిన దినము అవసర మయ్యెడి వస్తువులన్నియు ఈ స్టోర్సులలో నుండియే కొని వారికి మీ సహాయ సహకార ముల నందజేయవలయునని నా అభిప్రాయము. అథమాథమము నే నట్టి ఆశ మీ వలన పెట్టుకొని యుంటిని.

సత్సంగులకు నేనొక విషయము మనవి చేసికొనవలసి యున్నది. అదే మన ఇండస్ట్రీస్‌కు సంబంధించినంతవరకు ఏ రాష్ట్రమున కారాష్ట్రము సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగి ప్రవర్తించుటయే నాకు సమ్మతము. అనగా ప్రతి రాష్ట్రమును దాని హద్దులలో నున్న మన సత్సంగ్ ఇండస్ట్రీస్ యొక్క పూచీ అంతయు తానే వహించవలయునని నా అభిప్రాయము మన ఇండస్ట్రీస్ దేశము నందంతటను అతి వేగముగ వ్యాపించిపోవుట నిశ్సంశయము. మరియు దయాల్బాగ్ వంటి వలసలను ఒక్కొక్క రాష్ట్రము ఒక్కొక్క వలస చొప్పున స్థాపించ గోరవచ్చును. అందులో కొన్ని రాష్ట్రములు ఆరేడు సంవత్సరముల లోపుననే ఇట్టి వలసలను స్థాపించ గలగవచ్చును.

సాహబ్జీ మహరాజ్ వారు మద్రాసు ప్రెసిడెన్సీకి ఆరేడుసార్లు దయచేసి యుండిరి. వారు ఇచ్చటనున్న సమయములో చాల భాగము కుర్తాలములోనే గడుపుచుండెడివారు. కాని వారికి మద్రాసునందే అత్యధిక ప్రేమ యుండెడిది. ఆ దయాళురు తమ భౌతిక శరీరమును విడిచిపెట్టుటకు ఈ స్థానము నెన్నుకొనుటకు కారణ మిది యనియే అర్థమాధమము స్పష్టపడుచున్నది. కావున మద్రాసులోని మాననీయ ప్రజలందరు అత్యోదార్యముతో నీ కార్యములో తోడ్పడవలయునని మనము ఆశించుట బహు యుక్తము. ఏలనన ఈ రాష్ట్రములోని విద్యావంతులు, విద్యా విహీనులునైన ఇరు విధముల జనులలో వ్యాపించియున్న నిరుద్యోగ నిరుపాధి పరిస్థితులను తొలగించి ఆ మహా సమస్యను పరిష్కరించుటలో వీరు మనకు సహాయభూతముగ నుండుటకు ఇదియ విధానము.

# 118

1940 ఆగస్టు 26వ తేదీని జరిగిన సభా సమావేశములో తేజః స్వరూపులైన హుజూరువారు సత్సంగము యొక్క భవిష్య ప్రణాళిక, పోలసీని గురించియు, అందులో ప్రధానముగ మద్రాసులో కాలనీ స్థాపించెడి ప్రణాళికను గురించియు సభా సభ్యులకు చెప్పుచు ప్రతి మహా కార్యమును సాధించుటకై మూడు విషయములు అనగా మొదట కార్యకర్తలును, రెండవది మూలధనమును, మూడవది సామగ్రియును తప్పక యుండవలెనని సెలవిచ్చిరి. ఐతే మూలధనమును, తగిన సామగ్రిని ప్రోగుచేసికొనుటలో నంత యెక్కువ కష్టము లేదు గాని విశ్వాస పాత్రులై నట్టియు, పాటుపడి పనిచేయునట్టియు సమర్థమైన కార్యకర్తలు లభించుట యెక్కువ కష్టము. కావున మీలో నీ పనులు తెలిసి వాని విషయములో బాధ్యత వహించగల సమర్థతగల వారు వారంతట వారే

వాలంటీర్ల రూపమున ముందుకు రావలయుననియు, మీ యిరుగు పొరుగులలో గాని మీకు తెలిసిన వారిలోగాని నిరుద్యోగులైనటువంటి సత్సంగులలో నీ పనులు చేయగల సమర్థులెవరైన యున్న యెడల సభవారికి వారిని గురించి తెలియజేయ వలయుననియు నేను మీ కందరకు మరియొకసారి విన్నవించు కొనుచున్నాను. మన ఇండస్ట్రీస్‌లో కేవలము సత్సంగులు మాత్రమే పనిచేయు చున్న యెడల మన కార్ఖానాలలో సమ్మెకట్లు జరుగు భయముగాని మరియొక అనిష్ట పరిస్థితులు కల్గు సావకాశము కాని ఉండనేరదు. పైగా అందువలన సత్సంగ ధనము సత్సంగుల వద్దనే యుండిపోవును. అందువలన సత్సంగులకు ఉదర పోషణ జరిగి సత్సంగ మండలిలో నిరుపాధి పరిస్థితి నిర్మూలమైపోవును.

ఇంతవరకును సభవారి పోలసీ ఒక్క కేంద్ర స్థలమున మాత్రమే తమ ఇండస్ట్రీస్, వ్యాపారము, సంస్థలను పెంపొందించు విధముగ నుండెను. దయాల్బాగ్‌లో ఇండస్ట్రీస్ 1916వ సంవత్సరములో ప్రారంభించబడి 1935వ సంవత్సరము వరకు నిరంతరాభివృద్ధి నొందుచుండెను. సభవారు ఆ సంవత్సరములో ఒక మహత్త్వపూర్ణమైన తీర్మానమును అనగ ఐదు సంవత్సరముల గడువులోపల తమ సాలీనా వస్త్రోత్పాదనను ఒక కోటి రూప్యములవరకు పెంపుచేయ వలయునను తీర్మానమును ప్యాస్ చేసిరి. ఆ తీర్మానమును ఆచరణలో పెట్టుటకై మొదటి అంజ 1937వ సంవత్సరములో తీసికొనబడెను. ప్రస్తుత కాలములో ఇండస్ట్రీస్‌ను జారీ చేయుటకన్న ఆ ఇండస్ట్రీస్‌లో తయారైన వస్తువులను అమ్మకము చేయుట ఎక్కువ క్లిష్ట తరముగ నున్నది. నాకు మొదటి నుండియు ఇండస్ట్రీస్ ప్రారంభించక ముందే ఆ సరకు అమ్మకము చేయుటకు సక్రమమైన ప్రబంధము చేసికొన వలయు ననెడి అభిప్రాయము ఉండెను. ఇప్పుడు హుజూర్ రాధాస్వామీ దయాళుని దయా కటాక్షములవలన దేశమంతటిలోను సేల్సును గురించిన యేర్పాట్లు రోజు రోజు అత్యుత్తమ విధముగ వృద్ధి నొంది క్రమబద్ధమగుచున్నవి. మన కేంద్ర స్థానము కూడ (Headquarters) సమస్త విధముల తయారై పోయినది. కావున ఇపుడిక మనము ఇతఃపూర్వము తల్పుకొనియున్న ఏక కేంద్రీకరణ విధానమును (Centralisation Policy) మార్చుకొనవలసిన సమయము వచ్చినది. నా యభిప్రాయ మేమనగ మన ఇండస్ట్రీస్ అన్నియు ఒకే స్థలమున పెట్టుకొని వస్తువులను తయారు చేయుటకన్న భిన్న భిన్న స్థలములలో ఆయా స్థలముల పరిస్థితుల కనుకూలముగ నున్న ఇండస్ట్రీస్‌ను స్థాపించిన యెడల మన వస్తువులు తప్పక చౌకగ తయారై ఇతర స్థలములలోని వస్తువులతో నెక్కువ బాగుగ పోటీ చేయగలవు. కావున నెట్లు యోచించినను సభవారు ఇండస్ట్రీస్‌కు సంబంధించిన తమ ప్రస్తుత విధానమును వికేంద్రీకరణము (Decentralisation) చేసి రాష్ట్రీయ సంఘము (Provincial Associations) లకు

తమ రాష్ట్రములలో పరిశ్రమలు జారీచేసి కొనుటకు అధికార మిచ్చి అవసరమైన సహాయము చేయుట యుక్తమని తోచుచున్నది.

# 119

1941 ఫిబ్రివరి 9 వ తేదీని దయాల్బాగులో జరిగిన ఒక సర్వసాధారణ సమావేశములో హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ఇంతవరకును శిరోమణి నగర్ కమిటీ సభ్యుల యెన్నిక మొహల్లాలోని పంచాయతులు చేయుచున్నవి. క్రొత్త పంచాయతులకు ఇప్పుడు క్రొత్తగ ఎన్నికలగుచున్నవి. కావున శిరోమణి నగర్ కమిటీ సభ్యుల యెన్నికలు గూడ ఆ క్రొత్త పంచాయతులేచేయుట యుక్తము. రాబోవు ఆదివారములోపున మొహల్లాలలో నూతన పంచాయతుల యెన్నికలు పూర్తియైపోవలయును. పిమ్మట ఆ క్రొత్త పంచాయతీల సభ్యులు వచ్చెడి ఆదివారము శిరోమణి నగర్ కమిటీ సభ్యులను ఆ కమిటీ అధ్యక్షుని యెన్నుకొనవలయును. అన్ని మొహల్లాల నోటీసు బోర్డులలోను ఆ విధముగ నోటీసులు పెట్టవలయును.

మృతకళేబరములను శ్మశానభూమికి కొనిపోవుటకై తగినబండి నొకటి తయారుచేయించుట ఉత్తమముగ నుండునని హుజూర్ వారు సెలవిచ్చిరి. అటులనే మృతకళేబరములను విద్యుచ్ఛక్తితో భస్మీకరణముచేయు విషయమును గూడ హుజూర్ వారు సంఘమునకు సూచించిరి. కాని హుజూర్ వారి అభిప్రాయానుసారము ఈ రెండు ప్రస్తావనలు ప్రస్తుతము అనిశ్చితముగ నిలిచిపోయినవి.

# 120

1941 మార్చి 30 వ తేదీని సత్సంగ్ పెండాల్ లో సత్సంగ సోదరీ సోదరుల యొక్కయు, విద్యార్థుల యొక్కయు, సమ్మిళితసమావేశ మొకటి జరిగెను. దివ్యేచ్ఛ కీ క్రింది శబ్దము తీసి చదివిరి :—

సంత్ దాస్ కీ ఆరతీ సునో రాధాస్వామీ ।
మైం అతి దీన అధీన హమాం సేవక్ బిన దామీ ॥ 1 ॥

( సారబచన్, బచన్ 34, శబ్దము 4 )

శబ్ద పాఠానంతరము హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: రేపు మార్చి 31 వ తేదీతో ఆర్థిక సంవత్సరము సమాప్తమైపోవుచున్నది. సత్సంగము యొక్క ఆర్థిక పరిస్థితి సందర్భములో నేనిపుడు మీకు కొద్దిగ విన్నవించుకొనవలసియున్నది.

గతించిన సంవత్సరములో మీ ఆర్థికపరిస్థితిని గురించి సింహావలోకనము చేసికొని మీకు ఈ సంవత్సరములో రాధాస్వామీ దయాళువు సహాయమేమైనను చేసిరో లేదో చూచుకొనినచో మీకు ఆ దయాళువు ఈ విషయములో దయచూపినట్లు తెలియగలదు. పైనుంచి వచ్చిన సత్సంగులకైతే నేమి, ఇక్కడ నివసించువారికేమి చాలమందికి ఆదాయములో మంచి యభివృద్ధి కలిగినది. సమస్తనవయువక సత్సంగులకు నేను రాబోవు సంవత్సరమును గురించి చెప్పెడి హితబోధ యేమనగ వారు బ్యాంకులలో అకౌంట్లు తెరచి తమ ఆదాయమునుండి తగినంత భాగమును నిలువ వేసికొను చుండవలయును. ఈ సందర్భములోనే సత్సంగములో జీవితభీమా ప్రణాళిక యొకటి ఏర్పాటు చేయబడినది. మీలో భీమా చేయించుకొన దలచుకొన్న వారందు నిమిత్తమై తనుపేర్లు నిచ్చి సభవారు కలుగజేసిన సౌకర్యమువలన లాభము నొందవలయును. మనలో ప్రతివ్యక్తియు సంఘమంతయును కలిసియు ఈ విధముగ పట్టుపట్టి పని చేసిన యెడల మనప్రయత్నములు సఫలము కాకపోవుటకు గాని, హుజూర్ రాధాస్వామీ దయాళువు మన ప్రార్థనను అంగీకరించక పోవుటకు గాని తావు ఉండనేరదు. మన సంఘ సోదరుల ఉత్సాహావేశములను బట్టియు, ప్రెసిడెంట్ గారి ఆజ్ఞననుసరించియు నాకీరోజున ఈ క్రిందివిషయములు మీకు నివేదించు సావకాశము లభించినది. (1) గతించిన ఆర్థిక సంవత్సరములో, పాఠశాలలలోను, కళాశాలలలోను చదువుకొనుచుండిన సత్సంగి విద్యార్థులకు ఆర్థిక సహాయము చేయవలయును. (2) ఇండస్ట్రీస్‌లో పనిచేయు వారికి బోనస్ ఇవ్వవలయును. ఈ విషయములో నొకజాబితా తయారు చేయబడినది. రేపు వారందరికిని బోనస్ ఇవ్వబడును. (3) హుజూర్ సాహబ్జీ మహారాజ్ **వారు** 1936 వ సం॥ డిశంబరు నెలలో సత్సంగ సోదరుల నందరిని నెలవారీ భేంట్ ఇచ్చుచుండవలయునని సెలవిచ్చిరి. అందుకు బాహ్యముగ చూడగ కారణము వారికి వారి అనంతరము కార్ఖానాలు అభివృద్ధి చేయవలయుననెడి యుద్దేశ్యమున్నదనియు, కాని వారియనంతరము సభయొక్క ఆదాయము క్షీణించిపోవునేమో యనెడి సందేహము కూడ నున్నదనియు తోచుచున్నది. ఈ కారణములవలననే వారు నెలవారీ భేంటు నేర్పాటుచేసిరి. కాని ఇపుడు సామూహిక రూపముగ సత్సంగ సంస్థల పరిస్థితి సంతోషదాయకముగ నున్నది. కావుననే రాబోవు సంవత్సరము ఆసుపత్రి భవనము వృద్ధిచేయుటకై ఇరువది వేలు ఖర్చుపెట్టుచున్నాము. డెయిరీ ఫారమ్‌లో గతించిన కొద్ది మాసములలో పశువులశాలల నభివృద్ధిచేసి కొన్ని క్రొత్తపశువులను కొనుటకు గూడ అంగీకరింప బడినది. మన కార్ఖానాలు గూడ విశేషప్రయత్నము చేయనక్కరలేకుండ వానంతటనవి అభివృద్ధి నొందుచున్నవి. అందువలన ఈ సంస్థలన్నియు దేనికది తన స్వంత ఆదాయముతో నడిచి పోవు

చున్నందున మీ వద్దనుండి నెలవారీ భేంటు పుచ్చుకొనుట ఆపుచేయవలయునని తీర్మానించబడినది. ఈ భేంట్ మొత్తములు పుచ్చుకొనుట ఆపుచేసిన పిమ్మట మీరు వ్యర్థవ్యయము చేయకుండ దాచి నిలవచేయవలయును. అనగ, నా అభిప్రాయము మీరు కూడబెట్టుకొను ధోరణిలోపడి అందులోనే మునిగిపోవలయునని కాదు. మీరు ఆ రూపాయిలను సురక్షితముగ నుంచుకొని మీకు ధన సంకటముకలిగిన సమయములో వానివలన ఉపయోగము పొందవలయుననియే. మనమందరమును హుజూర్ రాధాస్వామీ దయాళుని మన సత్సంగులు తమ ఉత్తరములలో తరుచుగ వ్రాసికొనుచున్న చింతలు, వ్యాకులముల నన్నిటిని (వ్యాజ్యములు, సంతానము, జబ్బులు, నిరుద్యోగ, నిరుపాధిపరిస్థితులు వగైరాలకు సంబంధించినవి) తొలగించి, మనకు అందరకు వానినుండి విముక్తికలిగించవలయునని వారి చరణములందు ప్రార్థన చేయవలసియున్నది. ఇప్పుడు చదివిన శబ్దమును బట్టి చూడగ మన ఈ ప్రార్థన స్వీకృతమైనట్లు విశ్వాసము కల్గుచున్నది.

పిమ్మట హుజూర్ వారు పై శబ్దముయొక్క ఆద్యంత చరణములను తిరిగి చదివించిరి.

సంత్ దాస్ కీ ఆరతీ సునో రాధాస్వామీ ।
మైం అతి దీన అధీన్ హూం సేవక్ బిన్ దామీ ॥ 11 ॥
బిరహా జోత్ జగ్‌మగ్ హు ఈ ఔర్ కాల్ నికాలా ।
దయా కరీ రాధాస్వామీ అగమ కర్ దియా నిహాలా ॥ 12 ॥

ఈ చరణములలోని పదములనుబట్టి మీరు హుజూర్ రాధాస్వామీ వారి చరణములందు క్రితం సంవత్సరం చేసిన ప్రార్థన వారికి చేరినదనియు, ఆ దయాళురు దానిని అంగీకరించి మిమ్ములను కష్టవిముక్తులను చేసి సంతృప్తి పరచిరనియు పూర్ణవిశ్వాసము గలిగి యుండవలయును. (సంఘమందరును ఈ విషయమునకు రాధాస్వామీ ధ్వానములతో అంగీకారమును సూచించిరి.)

తిరిగి హుజూర్ వారు నెలవారీ భేంటు ఆపుజేసినందువలన ఎవరెవరికి సంతోషముగ నున్నదో వారు చేతులెత్తవలయునని చెప్పిరి. కాని, ఒక్కరు గూడ చేతులెత్తలేదు. దీనిని బట్టి మీ కీ నెలవారీ భేంట్ ఇంకను అమలులో ఉంచవలయుననియే కోరిక యున్నట్లు తేటపడుచున్నదని హుజూర్ వారు సెలవిచ్చిరి. మీరు ఈ భేంట్ మొత్తమును ప్రస్తుతము మీవద్దనే నిస్సంకోచముగ నుంచుకొనుడు. మరెప్పుడైన అవసరము కలిగినపు డది తిరిగి తీసికొనబడగలదు.

ధన సహాయము చేసినందువలన నెంతమంది సత్సంగి తలిదండ్రులకు (దయాల్బాగ్‌లోని వారికిగాని, ఇతర స్థలములలోని వారికిగాని) లాభము కలుగునో తెలిసికొను నిమిత్తమై హుజూర్ వారక్కడ నున్నవారిని తమతాలూకు పిల్లలెంతమంది దయాల్బాగ్ పాఠశాలలలోను, కళాశాలలలోను చదువుచున్నారో చెప్పవలయునని ప్రశ్నించిరి. అందుపైన నచ్చట కొందరు సత్సంగుల పిల్లలు ఒక్కొక్కరికి ఆరుగురేసి ఆడ, మగపిల్లలు చదువుకొనుచున్నట్లు తేటపడెను.

పిమ్మట హుజూరు వారు మీకు దయాల్బాగులో నున్న కిరాణా దుకాణమును నిలుపవలయునని యున్నదా, లేక దానిని తీసివేయవలయునని యున్నదా యని ప్రశ్నించిరి.

ఒక సోదరుడు దయాల్బాగు కిరాణా కొట్టులోని ధాన్యముల ఖరీదులు, నాణ్యమును గురించియు తప్పులెంచుచు, పట్టణములో కొనుగోలు చేసినందువలన నా రెండు విషయములలోను ఎక్కువ లాభకరముగ నుండగలదని చెప్పెను.

కాని హుజూర్ వారు దయాల్బాగ్ కేబినెట్ సభ్యుల ముఖములను అచ్చటనున్న జనులందరి ముఖములను చూచి వారందరికిని, కిరాణాకొట్టును ఉండ నిచ్చుటయే యుక్తముగ నున్నట్లు తెలిసికొనిరి. కాని యెవరైనను పట్టణము నుండియే ధాన్యము వగైరాలను కొనితెచ్చుకొన గోరినయెడల అందు కభ్యంతరమేమియు ఉండదని తీర్మానించిరి. ఆ తరువాత జీవితభీమా చేయదల్చుకొన్న వారి పేర్లు వ్రాసికొనగా షుమారు నూరుమంది పేర్లు వచ్చినవి. చిట్ట చివరకు హుజూర్‌నా రొక శబ్దమును చదువుడని చెప్పగా ఈ క్రింది శబ్దమును తీసి చదివిరి.

మగన హుఆ మన గురు భక్తి ధార్ ॥ టేక్ ॥
రాధాస్వామీ చరణ బసే అబ్ హియ మే ।
నిత్త రహూం మైం చరణ సమ్హార్ ॥ 5 ॥

(ప్రేమ బానీ భాగ్ 111, బచన్ 12, శబ్ద 9)

ఆఖరు చరణమును ఈ క్రింది విధముగ మార్చి చదివిరి.
'నిత్త రహూం మైం శుకర గుజార్'

# 121

1941 ఏప్రియల్ 10వ తేదీని సాయంకాలము సత్సంగము ప్రారంభించక ముందు హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ఏ మనుష్యుని కైన నేదైన నొక కఠిన సమస్య మీదపడి, అతడు దానిని వెంటనే పరిష్కరించుకొనవలసిన యావశ్యకత గల్గినపు డతని కాసమస్య పరిష్కరించుకొనుట సులభసాధ్యము కాకుండిన యెడలను, లేదా ఆ సమస్య సాధించు నిమిత్తమై తనకు తట్టిన విధానము యుక్తమో అయుక్తమో అతడు తేల్చుకొన లేకుండినను, అట్టి వ్యాకుల పరిస్థితిలో నతనికి హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణములందు ప్రార్థన చేయుటయే యుక్తమైన పద్ధతి. అట్లు చేసినచో నతనికి సర్వసామాన్యముగ తగు పథప్రదర్శనము లభించును, లేదా సరియైన జవాబు రాగలదు. దివ్యేచ్ఛకు శబ్దమును తీసి చదువుకొన్న యెడల ఆ శబ్దముద్వారా అతనికి ఆ కష్ట నివారణకు తగిన సలహా లభించగలదు. కావున మనకీ సమయములో నున్నట్టి క్లిష్ట పరిస్థితిలో ఈ నాడు ఉదయము సత్సంగములో చదివినట్టియు, ఇప్పుడు తిరిగి పఠింప బోవునట్టియు శబ్దముల వలన మనకు పథ ప్రదర్శనము లభించ గలదు.

మొదటి శబ్దములో మన క్లిష్ట పరిస్థితిని నివారించవలయునని గురు మహారాజ్ వారికి ప్రార్థన చేయబడినది. రెండవ శబ్దములో ఆ ప్రార్థనకు సమాధానమున్నది.

1. స్వామీ సునో హమారీ బినతీ।
మైఁ కరూఁ తుమ్హారీ బినతీ ॥ 1 ॥
మేరే ఔగున మత్ కరో గినతీ।
మైఁ తన్ మన్ అపనా హానతీ ॥ 2 ॥
రోగ్ సోగ్ దుఖ రహూఁ సహంతీ।
దూర్ కరో మేరీ మాన మహంతీ ॥ 9 ॥

(సారబచన్, బచన్ 7, శబ్దము 4)

2. గురు ముఖ్ సురత్ ప్రేమ్ భర పూరీ।
సతగురు చరనన సదా హుజూరీ ॥
తన్ మన్ ధన్ సబ్ సత్‌గురు అర్‌పన్।
కరమ్ భరమ్ సబ్ దూర్ బిడారన్ ॥ 3 ॥
ఐసా జోగ్ మేహర్ సే పాఊఁ।
రాధాస్వామీ పై బలి బలి జాఊఁ ॥ 5 ॥

హియ మేం ఉమంగ్ ఉఠీ అబ్ భారీ ।
ఆరత్ సతగురు కరూం సమ్హారీ ॥ 14 ॥
ఉమంగ్ ఉమంగ్ కర్ ఆరత్ గా ఊం ।
దృష్టి జోడ్ మన్ సురత్ చఢా ఊం ॥ 16 ॥

(ప్రేమ బానీ, భాగ 2, వచనం 1, శబ్ద 46)

ఇప్పుడూ మనము జీవిత భీమాలోను, వ్యాపారములోను లక్షల కొలది రూపాయలు పెట్టబడి పెట్టుచున్న విషయము యుక్తమే యని స్పష్ట పరచుటకై పైన ఉదహరించిన చరణముల కన్న నెక్కువ స్పష్టతరమైన చరణములు పవిత్ర గ్రంథములో మరెచ్చటను లభించుటయే సందేహాస్పదము. అటులనే సత్సంగ సేవారకై మన హృదయములలో నుప్పొంగుచున్న ఉత్సాహావేశములు రెండవ శబ్దముయొక్క చరణములలో ప్రకటింప బడినవి.

శబ్ద పాఠానంతరము హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: కుటుంబములో జీవికోపార్జన చేయు వ్యక్తికి అకాల మరణము హఠాత్తుగ కలిగి నందున పరిశిష్ట కుటుంబ సభ్యులకు ఆర్థిక కష్టములు కలిగిన పరిస్థితులు ఒకటి, రెండు దయాల్బాగ్‌లో ఈ మధ్యననే కలిగినవి. అందుచే ఒక మానవునికి అకాల మరణము కలిగినపుడు కుటుంబము లోని ఇతర సభ్యులకు ఆర్థిక కష్టములు కలుగకుండ తప్పించు నిమిత్తమై ఒక యుక్త ప్రబంధము చేయుట యావశ్యకమని తోచినది. అందుచే మార్చి 30, ఏప్రియల్ 6 వ తేదీలలో నిచ్చట జరిగిన సర్వజన సమావేశములలో ఈ విషయమును గురించియే చర్చజరిగి చివరకు దయాల్బాగు లోని కార్యకర్త లందరికిని భీమా చేయించ వలయునని నిశ్చయింప బడినది. అనగా ఇక్కడ పనిచేయుచున్న వ్యక్తులందరికిని భీమా చేయించు కొనుట యావశ్యకమనియు, పెండ్లికి పూర్వము పెండ్లికొడుకునకు గూడ జీవితభీమా చేయించుకొనుట యావశ్యకమనియు, నిశ్చయింప బడినవి. అందువలన నిరు పేదల వారికిని భవిష్యత్కాలములో ఆర్థిక పరిస్థితి దృఢతరముగ నుండగలదు. ఇకముందు దయాల్బాగ్‌లో పనిచేయుటకై నియోగించబడు ప్రతివ్యక్తియు గూడ నౌకరీలో ప్రవేశించుటకు ముందే తనజీవిత భీమా చేయించుకొనవలసి యుండుననెడి షరతుగూడ యేర్పాటు చేయబడినది.

## 122

1941 ఏప్రియల్ 12 వ తేదీ రాత్రి తేజః స్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ఈ మధ్యన కొంతకాలమునుండి దయాల్బాగులో కంపెనీలు

సంవత్సరము దీని అమ్మకములు 3 లక్షల రూపాయిలు. ఇప్పుడు మీరు దీనిని లిమిటెడ్ కంపెనీగా మార్చవలెనని కోరుచున్నారు. అట్లు మార్చిన పిమ్మట దాని మూలమున నింక నెక్కువ పని సాగించవచ్చును. ఈ విధముగ నీ స్టోర్సుకు ఇంతకు ముందుకన్న నెక్కువ సేవ చేయుట కవకాశము కలుగును. గతించిన ఏప్రియల్ భండారాకు ఇచ్చటకువచ్చి తిరిగివెళ్లిన మదరాసు సత్సంగులు పైన చెప్పిన యుద్దేశ్యముతో నీ ప్రావిన్షియల్ స్టోర్సును లిమిటెడ్ కంపెనీ రూపము లోనికి మార్పించు ప్రతిపాదనను అచ్చటి సత్సంగులకు తెలియబర్చిరి. వారు వేసుకొన్న పద్ధతి ననుసరించి యీ కంపెనీ యొక్క స్వీకృత మూలధనము ( Authorised Capital ) రెండు లక్షల రూపాయిలుగ నుంచి అందుండి సత్సంగులకు ఒక లక్ష రూపాయీలషేర్లు ఇచ్చుటకు ఏర్పరచుకొనిరి. కాని ప్రస్తుతవిషయమును వినినమీదట వారు స్వీకృత మూలధనమును రెండు లక్షలకు బదులు ఐదు లక్షలుచేసి అందుండి ఒకలక్షకు బదులు రెండులక్షల రూపాయిల షేర్లు సత్సంగులకు ఇచ్చెదరని ఆశించుచున్నాము. మొదటలో ఒక్కొక్క షేరు యొక్క విలువ రెండువందల ఏబది రూపాయిలు పెట్టుటకు ఏర్పరచుకొనిరి. కాని ఇప్పుడు దానిని నూరురూపాయిలకు తగ్గించిరి. షేర్లకు దరఖాస్తుతో సహా షేరు ఒక్కటికి పదిరూపాయిలు కట్టి షేర్లు అంగీకరించిన మీదట షేరు ఒక్కంటికి నలుబది రూపాయలు ప్రారంభములోనే ఇవ్వవలసి యుండును. మిగత మొత్తము కాల్ ఒక్కంటికి ఇరువది రూపాయిల చొప్పున ఆ తరువాత వసూలు చేయబడును. ఈ విధమైన డిపోలను లిమిటెడ్ కంపెనీల రూపముగ మార్చుటకై క్రితం సంవత్సరమునుండియే ఆలోచనలు జరుగుచు ఇప్పటి వరకు వాని విషయమై తగినంత విచక్షణ జరుగుచునే యున్నది. కావున క్రితం సంవత్సరం పంజాబు పర్యటన సమయములో అచ్చటి వారికి గూడ ఇవ్విధమైన డిపో పంజాబుప్రాంతములలో గూడ స్థాపించవలయునని సలహా ఇచ్చి యున్నాము. దానిలో షేర్లునిమిత్తమై ధరఖాస్తులు గూడ జనులు పెట్టుకొనిరి. ఇవ్విధముగ ప్రావిన్షియల్ అసోసియేషన్ల యొక్క అధికారము క్రింద సమస్త దేశమును భాగములుగ చేసి గాని, లేదా పైన చెప్పిన ప్రావిన్షియల్ కంపెనీ అధికారము క్రింద పెట్టిగాని విభజింపవలయు ననెడి ఆలోచన యిపుడు చేయుచున్నాము. ఇదివరలో నిచ్చట ఈస్ట్ ఇండియా కంపెనీ అనుపేరుతో ఒక కంపెనీ ఎట్లుండినదో అట్లే మీరు ఇష్టపడిన యెడల దేశమందంతటను వేర్వేరు ప్రాంతములలో అదే విధమైన పేర్లతో, అనగ మద్రాసు వగైరా దక్షిణ భారత ప్రాంతములలో **South India Satsang Stores** (సౌత్ ఇండియా సత్సంగస్టోర్సు)ను బెంగాల్, బీహార్, ఒరిస్సా, అస్సామ్ ప్రాంతములలో **East India Satsang Stores** (ఈస్టిండియా సత్సంగ స్టోర్సు),ను బొంబాయి, సింధు, రాజపుటానా ప్రాంతములలో **West India Satsang Stores** (వెస్టు

ఇండియా సత్సంగ స్టోర్సు) ను, యు.పి. సి.పి. ప్రాంతములు, మధ్య భారత రాజ్యములలో Central India Satsang Stores (సెంట్రల్ ఇండియా సత్సంగ స్టోర్సు) అను పేర్లతో వివిధ స్థలములలో వివిధస్టోర్సు ద్వారా సత్సంగ వ్యాపారము స్థాపించి అభివృద్ధి చేయునిమిత్తమై ఏర్పాటు చేసికొనవచ్చును. ఆంగ్లేయ ప్రభుత్వము వారు పూర్వకాలములో వ్యాపారము ద్వారానే భారత దేశములో నెట్లు అభివృద్ధి నొందిరో అట్లే సత్సంగముగూడ, **Business, Industries** మూలముననే దేశములో అభివృద్ధి నొందగలము. అనగ ప్రపంచములోని మాయిక పదార్థములపైన మనము అధికారము సంపాదించవలయునని నా అభిప్రాయము గాదు. ఈ విధముగ సత్సంగముయొక్క మహోత్తమ ప్రభావము భారత దేశవాసుల హృదయములమీద అంకితమై పోయినయెడల నది ప్రపంచికాధికారముకన్న నెంతయు శ్రేష్ఠతరమేగదా! హృదయముపైన అధికారము, ప్రభావమును పడినయెడల శరీర మనోధనములే గాక సర్వస్వమును లభించగలవు. మీరు ఈ విషయమును గురించి బాగుగ ఆలోచించుకొనవలయును. ఇకముందు మన దేశములో పైన ఉదహరించిన పేర్లతోనే అయిదు కంపెనీలు అనగా ఒక్కొక్క ప్రావిన్షియల్ కంపెనీగాని స్థాపితమై, అందుమూలమున సాహబ్జీ మహారాజు వారి ఆజ్ఞానుసారము దయాల్బాగులో నున్నట్టియు, దయాల్బాగునకు సంబంధించినట్టియు పరిశ్రమ సంస్థలయొక్క వస్త్రోత్పాదన సాలున కొక కోటి రూపాయలవరకు పెరిగిపోయి యుద్ధానంతరము గూడ ఆ సంస్థలట్లే స్థిరముగ నుండిపోవుట అసంభవమేమియు కానేరదు. ఈ వస్త్రోత్పాదనను, కోటిరూపాయలు కానిండు, లేదా అంతకన్న కొద్దిగ హెచ్చుతగ్గులుగ నుండనిండు, యుద్ధానంతర మా స్థాయిలో నిలబెట్టుట కఠినమై పోవును గావున పరిశ్రమ లన్నిటికిని యుద్ధానంతరము గలుగబోయెడి ఆఘాతములు మన ఇండస్ట్రీస్‌కు బొత్తిగ తగులకుండు లాగున గాని లేక చాల తక్కువ తగులునట్లుగాని చేయుటకై మన మిప్పటినుంచియు ప్రయత్నములు చేసికొనవలసియున్నది. కావున మనము మన డిపోలను ఒకటిన్నర సంవత్సరములలోపుననే దృఢ తరముగ చేసికొనుట బుద్ధిమత్వ మనిపించుకొనును. ఈ ఆలోచనాను సారము మద్రాసు ప్రావిన్షియల్ డిపోలో పేర్లు కొనదలచుకొన్నవారు వెంటనే తమపేర్లను వ్రాయించుకొనవచ్చును. ఈ కంపెనీయొక్క నియమముల చట్టము తయారై ఇప్పుడు అచ్చులో నున్నది. ఈ డిపోలో ఇప్పుడు పని చేయుచున్న సభతాలూకు కార్మిక సంఘమంతయు ఈ క్రొత్త కంపెనీకి లోబడి పనిచేయుచు ఆ విధముగ వారందరును మద్రాసు అసోసియేషన్ యొక్కగాని ఆ కంపెనీయొక్కగాని నౌకర్లుగ అయిపోవలయునని గూడ ఈ కంపెనీ స్థాపించుటలో మరియొక యుద్దేశ్యమైయున్నది.

## 124

1941 వ సం॥ ఆగస్టు 10 వ తేదీని హుజూరు మెహతాజీ మహారాజు వారు దయాల్బాగ్ ఇండస్ట్రీస్‌ను వృద్ధిచేయుటను గురించి ఇట్లు సెలవిచ్చిరి. ఇండస్ట్రీస్ నిజముగ సత్సంగముచే నాటబడిన వృక్షమే. మొదటలో ఈ వృక్షము చాలసున్నితముగ నొక చిన్న మొలక రూపములో బయలు దేరినది. కాని ఈ వృక్షము పెరిగి పెద్దదగుచున్న కొలది దీనికి సంరక్షణ చేయు నిమిత్తమై చాలమంది మనుష్యులు సేవ చేయవలసిన యవసరము కలుగుచున్నది. ఈ విధముగ సంఖ్య పెరిగిపోవుచు సత్సంగముయొక్క పరిశ్రమల వ్యాపారము విస్తరించి పోయినది. సేవచేయ గోరిక గల జనులు చాలమందికి ఈ ప్రబంధము సాగించుటలో సేవా సావకాశము లభించుచుండెను. సభయొక్క నాయకత్వ నిరీక్షణల క్రింద దయాల్బాగ్ ఇండస్ట్రీస్ అభివృద్ధి నొందుచు వచ్చినవి. రాను రాను ఈ మొలక శోభాయమానమైన విశాలవృక్షముగ పెరిగిపోయినది. ఇప్పుడీ చెట్టునుండి పదునారు మొలకలు బయలు దేరినవి. అనగ మొదటలో ఈ వివిధ పరిశ్రమలన్నియు ఒకే యాజమాన్యము క్రింద (అనగా సభయొక్క యాజమాన్యము క్రింద) పనిచేయుచు ప్రస్తుతములో ఒకచెట్టునుండి పదునారు మొలకలు బయలుదేరినట్లుగ దయాల్బాగ్ ఇండస్ట్రీస్ అన్నియు వేర్వేరు యాజమాన్యముల క్రింద పదునారు లిమిటెడ్ కంపెనీల రూపముగ విడిపోయినవి. ఇంతవరకును వీని కన్నిటికిని పాలన పోషణల నిమిత్తమై కావలసినంత నీరు లభించు చుండుటచే నీ వృక్షము చాల యధికముగ వృద్ధి వికాసముల నొందుచుండెను. ఇప్పుడు క్రొత్త మొలకలు బయలుదేరు చున్నందువలన ఆ మొలకలన్నియు అధిక వికాసముగ నుండునిమిత్తమై వానికి నీటి సరఫరా ఎడతెరపి లేకుండ చేయవలసి యున్నది. కిమ్మత్తైన ఉత్తమ జాతి మొక్కలు పాతినపుడు తోటమాలి ఆ మొక్కల అభివృద్ధి నిమిత్తమై వాని చుట్టుప్రక్కలనున్న పనికి మాలిన ఆకులను, గడ్డి మొలకలను యేరి పెరికివేసి, పశువులు దరిజేర కుండునట్లు గట్టి ఏర్పాటు చేయుచు కాపలాకాయుచుండును కదా! ఆ మొక్కలు కాయలు కాచి పండ్లు ఫలించు సమయము వచ్చినపుడు, ఆ పండ్లు చక్కగ పండువరకును వాని కెవ్విధమైన హాని కలుగకుండునట్లు పూర్తి జాగ్రత్త తీసికొనుచుండును. ఏలననగా, ఆ పండ్లు పండిన తర్వాత తోటమాలి వానిని ఆ తోటయజమానివద్దకు తీసికొనివెళ్ళి యిచ్చి, అవ్విధముగ నా యజమాని యనుగ్రహమును సంపాదించుకొనగోరును. అట్లే యీ పదునారు కంపెనీల యొక్క ఔన్నత్యాభివృద్ధుల బాధ్యత వహించుచున్న ఈ కంపెనీల డైరెక్టర్లు ఆ యా కంపెనీల లాభములను దృష్టిలో నుంచుకొని, ఆ కంపెనీల జమాఖర్చు లెక్కలను జాగ్రత్తగ కనిపెట్టి చూచుకొనవలసి యున్నది. తమ కంపెనీ కార్య

క్రియములోను, అక్కౌంట్ల లోను ఎట్టి లోపములు, తప్పిదములును లేకుండు నట్లుగ వారు యథాశక్తిగ ప్రయత్నించ వలయును.

# 125

1942 జనవరి 25వ తేదీని సాలుసరి స్పోర్ట్సు (Sports) ఉత్సవసమయములో ప్రిన్సిపాలు రిపోర్టు చదివినపిమ్మట దేదీప్యమానస్వరూపులైన హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి. మన మీ రోజు అపరాహ్నమున వివిధములైన ఆటలలో ఆఖరి పోటీలు చూచునిమిత్తమై ఇచటకు వచ్చితిమి. ఈ సమయమున వేర్వేరు జట్లు, వ్యక్తులును ఈ ఆటలలో చేసిన పోటీలను అందు వారు చూపించిన ప్రజ్ఞావిశేషములను ఇచ్చటసమావేశమైన సభ్యులందరును చూచి సంతోషించి యుందురనియే నా నమ్మకము.

పోటీలలో పాల్గొన్న జట్లన్నియు ఈ సమయములో వేర్వేరు ఆటలాడుటలో ప్రకటించిన రీతిని పాఠశాల, కళాశాలవిద్యార్థులు చూపించిన సామ్యభావమును, ఉత్సాహముతో గూడిన ప్రవర్తనయును, మీరందరు చూచి, నిస్సంశయముగ ప్రభావితమై యుందురు. ఈ విద్యార్థులక్షేమమును గోరి వీరి అధ్యాపకులు బహుప్రేమతోను, అభిమానముతోను, క్రమశిక్షణా భావముతోను, వీరిలో నిట్టి సామ్యభావమును, ఉత్సాహమును పెంపొందించిరి. క్రితము సంవత్సరము దయాల్బాగులో జరిగిన స్కౌట్ క్యాంపు (Scout Camp) స్కౌట్ ర్యాలీలలో (Sccut Rally) నేను పాల్గొనలేక పోయితిని కాని ఆ రెండును చాల జయప్రదముగ జరిగినవని తెలిసి చాల సంతోషించితిని. క్రితము నవంబరులో ఇచ్చటకు వచ్చి, స్కౌట్ క్యాంపు, స్కౌట్ రాలీలను జయప్రదముగ సాగించిన మన హెడ్ క్వార్టర్సు కమీషనరుగారైన జానకీశరణ్ వర్మ గారికి నేను కృతజ్ఞుడను. ప్రస్తుతకాలములో జరుగుచున్న సంఘటనలను బట్టియు, దేశముయొక్క వర్తమాన క్లిష్టపరిస్థితులను బట్టియు కొద్ది మాసముల నుండి విద్యార్థులు పౌర రక్షణ కార్యక్రమములలో పాల్గొని అనుభవమును సంపాదించుట యవసర మైనది. ఈ విషయములో మొదటి నుండియు శిక్షణ పొందు చున్నట్టి బాలభటులు ఇతరులకన్న ముందంజ వేయగల్గుదురని నాకువిశ్వాసము కలదు.

కాలనీలోని ఇతర జనులతో బాటు మన విద్యార్థులు గూడ మామూలుగ సంతోషముతో వచ్చి వ్యాయామములో పాల్గొనుచున్నారని తెలిసి నాకు సంతోషమగుచున్నది. ఏ రీ విధముగ వ్యాయామము చేయునలవాటును

దృఢము జేసికొన్న యెడల, నిది వారికి జీవితకాలమంతయు మహోపయోగ కరము, లాభకరముగ నుండుటయేగాక రాబోవు కొద్ది సంవత్సరములలోనే వారికి దీని మహాలాభము, మహోపయోగము నవగాహనకు రాగలవు.

1928వ సంవత్సరములో హుజూర్ సాహబ్జీ మహారాజు వారు ప్రపంచ ములోని సమస్త ప్రజలలోను సామ్యభావము సోదరభావముల ఉత్తమాదర్శ ములు స్థాపితము కావలయునని ఆ భగవంతుని దివ్యేచ్ఛ యున్నదని సెల విచ్చిరి. వారు ప్రపంచములోని సమస్తప్రజలు నీసిద్ధాంతములను అవలంబించ నంత వరకు నీ ప్రపంచములో సుఖశాంతు లుండ నేరవని కూడ సెలవిచ్చి యున్నారు. కావున భారత దేశవాసులు సుఖజీవితము గడుపవలయుననియు, మీరు ఇతర జాతులకన్న మీశిరముల నున్నతముగ నుంచుకొని జీవింపవలయు ననియు మీకున్న యెడల మీరు భగవచ్చరణములందు మీశిరముల నందరి కన్న నెక్కువ క్రిందికి వంచుకొన వలయును. ఆ యుత్తమ పరిస్థితి గల్గు నిమి త్తమై విద్యార్థులు యీశాశ్వత సత్యపాఠమును తమ హృదయములలో స్థిర ముగ జ్ఞాపక ముంచు కొనవలయును. మీరు చిన్న వయసునుండియు సమస్త మానవ కోటిలో సామ్యభావ భ్రాతృభావ సిద్ధాంతముల నుత్పన్నము చేసుకొన వలయు ననెడి ఆదర్శమును మీలో దృఢముగ నాటించు కొన వలయును. మీ రీ పాఠమును జ్ఞాపకముంచుకొని మనసున పట్టించుకొనుటయే గాక, మీ జీవిత ములో మీ రితరులతో కలిసిమెలిసి తిరిగెడి అవసరము గలిగినపుడు ఈ భావ ములను క్రియాత్మకరూపమున ప్రకటించ వలయును. ఇంతియగాక, మీరు కలుసు కొనుటకు గాని చూచుటకు గాని, అవకాశముులేని వారును ఎందరో యుందురు కదా! అట్టి వారి విషయములోగూడ మీరు సహాను భూతి పూరిత మైన భ్రాతృభావమును ప్రదర్శింప వలసియున్నది. బ్రిటిష్ సామ్రాజ్య చక్ర వర్తిగారు ఈ మధ్యననే 1941వ సం॥ క్రిస్మస్ ఉత్సవసందర్భములో తమప్రజ లకు చేసిన బోధ యిది యు. ఆ చక్రవర్తిగారు అంత ప్రభావ పూరితముగ బోధించిన ఈ శాశ్వత సత్య విషయమును దయాల్బాగ్‌లో ఉన్నట్టి జనులు, విద్యార్థులును 1928వ సం॥లోనే అవగాహన చేసికొని అప్పటి నుండియు నింత వరకు అట్టి ఆదర్శ జీవితమును నిరంతరముగ గడుపుచుండిరని ఆ చక్రవర్తికి ఎప్పుడైన తెలిసినచో వారు తప్పక బహుసంతోషపూరితులు కాగలరు.

## 126

1942 సం॥ మార్చి 2 వ తేదీ సాయంకాలము దయాల్బాగ్ నివాసుల సాధారణ సమావేశ మొకటి జరిగినది. దేశములో అంతఃకలహములు, పోట్లా

టలును లేకుండ జేయవలయునని యెడి విషయముపైన చర్చజరిగినది. హుజూర్ మెహతాజీ మహారాజ్ వారిట్లు సెలవిచ్చిరి: ఈ సమయమున గాని, ఇకముందు గాని, ప్రమాదపరిస్థితులు తటస్థించినపుడు దేశములో నందరును పూర్తిగ నియమబద్ధులై ప్రవర్తించుట యత్యావశ్యకము. ఎ. ఆర్. పి. ఆఫీసర్లును, సివిల్ గార్డు ఆఫీసర్లు, ఉద్యోగులును జారీచేయించు సలహాలను మీరందరు పూర్తిగ పాటించవలసియున్నది. ఒకప్రక్కనుండి ఆ ఆఫీసర్లు, ఉద్యోగస్తులును, వారి వారి కర్తవ్యములను జరిపించుచుండగ వేరొవైపునుండి మీరు నియమబద్ధముగ ప్రవర్తించి వారికి పూర్తిసహకార మిచ్చి పనిజేయవలయును. కార్ఖానాలలో పని చేయు కార్మికులు, తమ ఆఫీసర్లయొక్క ఆజ్ఞలను మారుమాట ఆడకుండ పాలించవలయును. నేను చెప్పవలసిన రెండవ విషయము మితవ్యయమును గురించియే. నేను విద్యార్థులకు ఈ సంవత్సరము ప్రారంభములోనే కాగితముల నుపయోగించుటలో చాల పొదుపుగ ప్రవర్తించవలయునని బోధించి, అందును గురించిన బాధ్యత అధ్యాపకులు వహించవలయునని చెప్పితిని. ఇప్పుడు విద్యాశాఖవారు గూడ కాగితములను పొదుపుగ వాడుకొనవలయునని చెప్పుచున్నారు. ఇదిగాక మీరు నీరు వాడుకొనుటలో చాల పొదుపుగ నుండవలయు. ఇందు విషయములో మీరు నీటివాడుక ఇప్పటికన్న సగమువంతు తగ్గించవలసియుండు నను సూచన మీకు రెండుమాసములు ముందుగ తెలుపుచున్నాము. ఇంటి ప్రాంగణములు, పూలమళ్లు, ఇంటిగదులు వగైరాలలోను పోయునిమిత్తమై మీకిక నీరు బొత్తిగ లభించనేరదు. నీటిసరఫరా సమయము గూడ తగ్గించబడ గలదు. చాకలికి బట్టలు గూడ చాల తక్కువగనే వేయవలయును. నెలకు రెండు సార్లు కన్న నెక్కువ చాకలికి బట్టలు వేయకూడదు. మీలో ప్రస్తుతము రోగు లెంతమంది ఉన్నారు? అట్టివారందరు తమ తమ గృహములకుగాని లేదా రాజ బరారీకి గాని వెడలిపోవలయును. రాజబరారీ టిమర్నియును సురక్షిత స్థలములే. అచ్చట అందరికి నాహారపానీయముల కేర్పాటు చేయబడును. ఇవిగాక మీకు మరొక సురక్షిత స్థానమున్న యెడల నచ్చటికే మీరు వెడలిపోవచ్చును. విద్యుచ్ఛక్తి పొదుపుగ వాడుకొనవలయునను విషయము గూడ మీరు జ్ఞాపక ముంచుకొనవలయును. విద్యుచ్ఛక్తి కేంద్రములు ఎప్పుడైన పనిచేయకుండ ఆగి పోవచ్చును. కావున అట్టి అవసరములకై మీరు కిరసనాయిలు వెలిగించుకొను టకు ల్యాంపులు, ప్రమిదలు, దీపపువత్తులు, ఆవనూనె సిద్ధముగ నుంచుకొనవల యును. ప్రతిగృహములో నిప్పును ఆర్పునిమిత్తమై రెండు బాల్చీలతో ఇసుకను నింపి ఉంచుకోవలయును. అట్లు చేసినందు వలన అవసరము గలిగినపుడు ఒక్క పంక్తి ఇండ్లలో నుండి యెన్నియో బాల్చీల ఇసుక లభించగలదు. ఇండ్లమధ్య సందులు కంకరరోడ్లు వేయకుండ మట్టి సందులుగనే యుంచబడినవి. కావున ఆ సందులనుండి గూడ అవసరమైనంత ఇసుక లభ్యము కాగలదు. సాయంకాలము

వేళ ఇండ్లలోని బిందెలు వగైరా పాత్రలన్నింటిని నీటితో నింపి యుంచుకొన వలయును. దయాల్బాగ్‌లో హిందూముస్లిమ్ తగాయిదాల భయము లేదు. ఏలనన, ఇచ్చటనున్న వారెవరును హిందువులుగాను, మహమ్మదీయులును గాను. ఇచ్చట నివసించుచున్న వారు అందరును సత్సంగులే. అయితే కొద్ది సత్సంగేతరులు గూడ నున్నారు. ఇచ్చట ఖాద్యపదార్థములు తక్కువగనే యున్నవి. మీరందరు మీకు కావలసిన ధాన్యములను తప్పక జాగ్రత్తపెట్టు కొన వలయును.

మీకు సత్సంగ చరిత్ర పరిశీలించిన యెడల సత్సంగము యొక్క నీతి సదా శాంతి ప్రియముగ నున్నట్లు అంగీకరించవలసి యుండును. మొదటి నుండియు నాకు ఎవరితోను తగాయిదా పెట్టుకొన కుండ నుండుటయే అలవాటు. కొందరు విరోధులు నేను చేసిన పనులకు తప్పుడర్థము తీసి సోధన చేసినప్పుడు గూడ నేను పైన చెప్పిన నా అలవాటు ప్రకారమే వారి పనులను గురించి ఉపేక్షాభావముతో ప్రవర్తించుచుంటిని. ప్రతి మానవునితోను, ప్రతి సంస్థ తోను ప్రేమభావము, కలిసి కట్టుతనముతోను ప్రవర్తించవలయు ననియే నా అభిప్రాయము.

# 127

1942వ సం॥ మే నెల 18వ తేదీ టెక్నికల్ కాలేజీ యొక్క వార్షిక డిన్నర్ (విందు)లో దేదీప్యమాన స్వరూపులైన హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి. టెక్నికల్ కళాశాల 1927వ సం॥రములో స్థాపింపబడినది. ప్రస్తుతవిద్యా సంవత్సరము కొద్ది రోజులలోనే అంతమై పోవుచున్నది. ఈ సంవత్సరము యొక్క సంతోషవర్ధకమైన వృత్తాంతము వినినమీదట మాకు చాల ఆనందమైనది. కాని మీ యొక్క భవిష్యమును గురించియే నాకెక్కువ అభిరుచికాని మీ పూర్వపు వృత్తాంతములతో పనిలేదు. యు. పి., పంజాబ్, బొంబాయి మొదలగు అనేక రాష్ట్రములు మన టెక్నికల్ కళాశాలలో ఉత్తీర్ణులైన విద్యార్థుల యొక్క అర్హతను ఇంతకు ముందే అంగీకరించి, ఆ యా రాష్ట్ర ప్రభుత్వములలో వారికి ఉద్యోగము లిచ్చుటకు ఒప్పుకొని యున్నారు. మోడల్ ఇండస్ట్రీస్ కూడ టెక్నికల్ కళాశాలలో ఉత్తీర్ణులైన కొంతమందిని తన కార్ఖానాలలో మెకానికల్ ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ శాఖలలో పని చేయుటకు నిమిత్తమై చేర్చుకొనిరి. దయాల్బాగ్‌లో ఉన్నట్టి వివిధములైన టెంపరెన్స్ కంపెనీలవారును దేశమందంతటను స్థాపించబడిన తత్సంబంధమైన సంస్థలవారు మున్ముందు ముందు కొందరు విద్యార్థులకు ఉద్యోగము నిచ్చుటకు ప్రయత్నించెదమని

ఆశించవచ్చును. ఉత్తీర్ణులైన విద్యార్థులు దయాల్బాగ్‌లో పనిచేయుచున్నను లేదా అమృతసర్‌లో పనిచేయుచున్నను ఆ రెండు సంస్థలములలో చేయుపని తమ కాలేజీయొక్క సేవయనియే నిస్సందేహముగ భావించుకొనవలయును. వారు ప్రపంచములో వ్యాపించియున్న తగాయిదాలు, గడబిడలు ఏమియు లేకుండ నిచ్చట బహుప్రేమపూరితమైన వాతావరణములో శాంతియుతమైన పవిత్రజీవితము గడుపుకొను అవకాశము తమకు గలుగుచున్నదను విషయమును పూర్తిగ తెలిసికొనవలయును.

ప్రస్తుతపు అలజడులు, ఆపత్తుల కాలములో యుద్ధము అనేక దేశములలో బహుతీవ్రముగ వ్యాపించి భారతదేశపు సరిహద్దు వరకు నిపుడు వచ్చియున్నందున ప్రజలందరును తమ మనస్సులను శాంతముగను, గంభీరముగను ఉంచుకొని పరిస్థితులన్నిటిని నమయానుకూలముగ తెలివితేటలతో గమనించుకొనవలసియున్నది. బహుస్వల్పవ్యాకుల పరిస్థితులలో సులువుగ అధైర్యపడిపోవునట్టి దుర్బల హృదయులు, నీరసమనస్కులును మరింత యధికముగ అశాంతి వ్యాకులతలను వ్యాపింపజేసి ఇతరులను గూడ గాబరాపెట్టి వారిధైర్య స్థైర్యములు గూడ పోవునట్లు చేయగలరు. అట్లుగాక, రాబోవు ఆపత్తులను గమనించి ప్రకృతి నియమముల ననుసరించి వాని నెదుర్కొనగల శక్తిగలవారు ప్రస్తుత యుద్ధమున కవసరమైన సామగ్రిని తయారుచేయు నిమిత్తమై తమ శక్త్యనుసారము పనిచేయుటకు కార్యక్షేత్రము లోనికి దిగవలసియున్నది. మీరిచ్చట నుండి తిరిగి వెడలిపోవునపుడు, మీ విద్యాభ్యాసము పూర్తియై పోయినట్లు తలంచవలదు. మీ రిచ్చట నేర్చుకొన్న స్వల్ప విద్యాభ్యాసము పుస్తక జ్ఞానముకన్న చాల యెక్కువ లాభదాయకమగు అనుభవ జ్ఞానమును మీరింకను సంపాదించుకొనవలసి యున్నది. అది సంపాదించుకొననియెడల మీ ప్రస్తుత శిక్షణ సంపూర్ణమనిగాని సంతోషదాయకమనిగాని పరిగణింపబడ జాలదు.

మీలో అమృతసర్‌లోని స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్సులో ప్రవేశించి ట్రైనింగు పొందగోరువారు వెంటనే ఇందు విషయమై ఒక దరఖాస్తు మీ ప్రిన్సిపల్ గారి వద్దకు పంపించుకొనవలయును. భావి కాలములో మీకు అభివృద్ధి కలిగించి ఉత్తమ పరిస్థితులు కలుగజేయుటకై సమస్త సౌకర్యముల నొనగూర్చగల రాధాస్వామీ సత్సంగముయొక్క సేవలో జేరి పనిచేసిన యెడల మీ యోగక్షేమములను సత్సంగము సర్వోత్తమ విధమున కనిపెట్టగలదు. నేను ఈ ఆశాజనకమైనట్టియు, ఆనందదాయకమైనట్టియు, సందేశ మిచ్చి మిమ్ములను కార్యక్షేత్రమునకు దిగవలసినదని ఆహ్వానించుటలో ముందు ముందు మీరు సర్వవిధముల సఫల మనోరథులు కావలయుననియే నా యభి

లాష. మీరు మీ మాత్ర సంస్థయైన దయాల్బాగ్ టెక్నికల్ కాలేజీ నెల్లప్పుడు జ్ఞప్తియందుంచు కొందురని నేనాశించు చున్నాను.

# 128

1942 ఆగస్టు 28 వ తేదీ సాయంకాలము సత్సంగము లోనికి రాధాస్వామీ సత్సంగసభయొక్క మాజీ కార్యదర్శియైన ప్రిన్సిపాల్ నారాయణ దాసుగారు వచ్చిరి. హుజూరువారు వారినుద్దేశించి దివ్యేచ్ఛకు శబ్దమును తీయించగ నీ క్రింది శబ్దము వచ్చినది.

చలో ప్రేమ సభా సే మిలో గీ సఖి ।
జహాఁ రాధాస్వామీ గున నిత గాయ రహే ॥టేక్॥
ప్రేమీ జన జహాఁ హిల్ మిల్ చాలేఁ।
గురు చరనన చిత లాయ రహే ॥2॥

(ప్రేమ బానీ, 3వ భాగము, 14 (2) వచనము శబ్దము 1)

హుజూరు వారిట్లు సెలవిచ్చిరి: ప్రిన్సిపాల్ గారు కాన్పూరు నుండి వ్రాసిన జాబులో తాము జిజ్ఞాసరూపమున దయాల్బాగు వచ్చి కొద్దిరోజులుండ దల్చుకున్నామని తెలిపిరి. ఈ విషయము హుజూరు సాహబ్జీ మహారాజ్ వారికి తెలిసినది. కావుననే ఈ శబ్దము ద్వారా ఇట్టిబోధ చేయబడినది.

హుజూరువారు తిరిగి ఇట్లు సెలవిచ్చిరి: ఒకవ్యక్తి ఒక స్థలములో చాల కాలము ఉండి అచ్చట భక్తి విశ్వాసములతో ప్రవర్తించిన పిదప ఆ స్థలమును విడిచి మరియొకచోటకు వెళ్ళి అచ్చట కొంత కాలము ఉండిన పిదప తిరిగి వచ్చిన యెడల అట్టి వ్యక్తి యథార్థముగ జిజ్ఞాసువని పేర్కొన జాలదు. ఏ స్థలముననను స్థిరమైన విశ్వాసము కలుగకుండ వివిధ స్థలములలో అన్వేషణ చేయుచు తిరుగు చున్న వ్యక్తినే జిజ్ఞాసువని పేర్కొన దగును. కావున నొక వ్యక్తి ఈ వుద్దేశ్యముతో ఏ స్థలమునకైన వెళ్ళినచో అందు దోషమేమియు లేదుగాని ఆ పద్ధతి సత్సంగి యొక్క ప్రవర్తనకు విరుద్ధము. సత్సంగి ప్రతి స్థలమునను జిజ్ఞాసువుగనే యుండునని హుజూరు సాహబ్జీ మహారాజ్ వారెన్నడును సెలవిచ్చి యుండలేదు.

సాహబ్జీ మహారాజు వారు సెలవిచ్చిన విషయమును నేను ఇతరులు చెప్పిన మాటల నాధారము చేసికొని మన్నించితి ననెడి గొప్ప సందేహము ప్రిన్సిపల్ గారిని బాధించుచున్నది. సాహబ్జీ మహారాజు వారు ఒక ప్రత్యేక

వ్యక్తిని గురించి ఆ వ్యక్తియే ముందు సత్సంగ కార్యక్రమమును కనిపెట్టి చూడగలరని స్వయముగ ప్రిన్సిపాల్ గారితోనే చెప్పినప్పటికిని అంతమాత్రమున నేమైనదని వారి యభిప్రాయము. ఏలననగ, హుజూరు సాహబ్జీ మహారాజు వారు ఆ మాట ప్రిన్సిపల్ గారితో అనిరిగాని సత్సంగ కార్యక్రమము ముందు నడిపించెదరని సూచించ బడిన వ్యక్తితో నేమియు బాహ్యముగ చెప్పనే లేనప్పుడు ప్రిన్సిపల్ గారితో చెప్పినంత మాత్రమున నేమైనదని ప్రిన్సిపల్ గారనుకొనుచున్నారు. ఈ విషయమును హుజూరు సాహబ్జీ మహారాజువారి చరణముల వద్దనే పెట్టి తేల్చుకొనుట శ్రేష్ఠముగ నుండును. దివ్యేచ్ఛకు తీయగ ఈ క్రింది శబ్దము వచ్చినది.

కాల నే జగత్ అజబ్ భరమాయా ।
మైం క్యా క్యా కరూం బఖాన్ ॥ 1 ॥
జో సాధన థే పిఛలే జుగ కే ।
సో కలిజుగ మేం కియే ప్రిమాణ్ ॥ 2 ॥

( సారబచన్, 8 వ వచనము, 17 వ శబ్దము )

హుజూర్ వారు ఈ శబ్దములోని ఈ క్రింది చరణములను మరియొక సారి చదివించిరి.

బుద్ధిమాన్ అభిమానీ జో నర్ ।
విద్యానారీ కే హుయే గులామ్ ॥ 4 ॥
బాకీ జీవ్ బీచ్ కే జత్ నే ।
నా మూరఖ్ నా అతి బుద్ధిమాన్ ॥ 5 ॥
భటక్ భటక్ భటకాయా సబ్ జగ్ ।
కోఈ న లగాయా ఠౌర్ ఠికాన్ ॥ 8 ॥

హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: జగత్తు అనగా సత్సంగ జగత్తు పరిస్థితి పైన చెప్పినట్లు తారుమారై జనులు అమాయిక భక్తుల నెవ్విధముగ మోసగించ దొడగుచుండుట వలననే సాహబ్జీ మహారాజువారు తమపద్ధతిని గూడ పూర్తిగ మార్చుకొని క్రొత్త పద్ధతి నవలంబించ నిశ్చయించుకొనిరి. అందువలన గలిగిన పర్యవసాన మేమిటో మనము చూచుచునే యున్నాము.

హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు మద్రాసులో చెప్పిన తమ అంతిమ సందేశములో, భగవంతుడు నన్నెట్టి పరిస్థితిలో నుంచదల్చిన నా పరిస్థితికే

మనము సంతోషముతో నంగీకరించ వలసి యున్నదని సెలవిచ్చిరి. వారు మన నొక చక్రవర్తిగ జేసిన-చో మన మింతకు ముందెన్నడు నేచక్రవర్తియు చూప లేనంతటి మహాప్రతిభతో సింహాసనము నలంకరించ వలయుననియు, లేక, మన నొక బిచ్చగాడు అనగా ఫకీరుగ చేసిన ఇతఃపూర్వము ఏ ఫకీరును దొర్లనంత యెక్కువగ నేలమీద పడి దొర్లవలయుననియు సెలవిచ్చిరి. ఈ సందేశము యొక్క ప్రారంభములో హుజూర్ వారు కర్తవ్యజ్ఞానమును, ఉత్తర దాయిత్వ భావమును గురించి కూడ సెలవిచ్చి అటుపిమ్మట చివరిభాగములో పేదరికము, దీనత్వమును గురించి సెలవిచ్చిరి. అట్లు సెలవిచ్చుటలో వారికొక ముఖ్యోద్దేశ్య ముండియే యుండును కదా! ఆ పరిస్థితిలో పేదరికముతో కార్యక్రమము జరి గించినను పరిపూర్ణ బాధ్యతాభావముతో నడచుకొన్న యెడల నష్టమేమున్నది? సత్సంగులలో అధిక సంఖ్యాకులు పొరపాటు చేయజాలరు గదా! అటులనే సభాసభ్యులలో అధిక సంఖ్యాకులును తప్పుడు మార్గమున పోజాలరు గదా! సాహబ్జీ మహారాజ్ వారు దయాల్బాగ్ నిర్మించి యుండగా వారెప్పుడు ప్రకట మైననుసరే ఇచ్చటనే ప్రకటము కావలసియున్నది. లేక వారెచ్చటనైన బయట ప్రకటమైనను కూడ చివరకు వారు ఇచ్చటకు రావలసినదే కదా! మీకందర కును సాహబ్జీ మహారాజ్ వారియందు ప్రేమభక్తు లున్నప్పుడు సాహబ్జీ మహా రాజ్ వారికి మీ యందు ప్రేమ యుండి తీరును. కావున వారు తమ ప్రేమీ భక్తులను విడిచి మరియొక స్థానమున కెట్లేగగలరు?

తిరిగి హుజూర్ వారె ప్రిన్సిపాల్ గారి నుద్దేశించి ఒక శబ్దమును తీయవలసిన దని సెలవిచ్చి, "ప్రిన్సిపల్ గారూ! మీకు అట్లు శబ్దము తీయించుట ఇష్ట మున్నదా?" యని ప్రశ్నించిరి. ఈ క్రింది శబ్దము వచ్చినది—

గురు ఆరత్ మైఁ కరనే ఆయీ।
దుఃఖ భరమ సబ్ దూర్ నసాఈ ॥ 1 ॥

( సారబచన్, 30వ వచనము, 4వ శబ్దము )

దాని అంతిమ చరణ మిట్లున్నది—

రాధాస్వామీ మగన్ హోయ్కర్ ।
జేఁ పర్శాదీ లే ఉఁ గోద్ భర్ ॥ 2 ॥

హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి : ప్రిన్సిపాల్ గారూ! మా మనస్సు ఈ శబ్ద ములో వర్ణించిన విధముగ నున్న యెడల ఇచ్చటనుండి మీకు పంపించిన ఉత్త రములోని షరతులను మన్నించుటకు మీ కభ్యంతర మేమి ఉండును? ప్రిన్సి

వారి శక్తులు జోడించి తమ కేమియు కష్టము లేదనియూ, తాము అట్లు చేయుటకు పూర్తిగ సిద్ధముగ నుంటిమని యు మనవి చేసికొనిరి.

# 129

1942 ఆగస్టు 31 తేదీ రాత్రి వివాహార్హులైన ఆడ, మగపిల్లల సమావేశ మొకటి సత్సంగహాలులో జరిగినది. శబ్ద పాఠానంతరము హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ఈ రోజున మగపిల్లలను, ఆడపిల్లలను ఇచ్చటకు పిలుచుటలో వారికి కొన్ని విషయములు స్పష్టముగ బోధించ వలయునని మా యుద్దేశ్యము. ఈ యుద్దేశ్యముతోనే దయాల్బాగులో నీ మధ్యన దయాల్బాగ్ మేరేజ్ పంచాయతీ యేర్పాటు చేయబడినది. కొందరు పెద్ద మనుష్యులు కలిసి వివాహ విషయములో కొన్ని నియమములను ఏర్పాటు చేసిరి. కాని ఆ నియమములను ఏర్పాటు చేసినవారికి అంతకు ముందే వివాహము లైనవి. కావున వివాహములు ముందు చేసికొనవలసిన వారును, అట్టి వివాహములతో ప్రత్యేక సంబంధము గలవారును ఈ నియమములను పరిశీలించి వీటిలో మార్పు, చేర్పు లేమైనను చేయదలచుకొన్న యెడల, వారి యభిప్రాయములను తెలిసికొని ఆ నియమములను ఆ విధముగ సంశోధించుటగాని లేక వీరు ఆ నియమములను తయారు చేసిన వారి దృష్టి కోణముతో నేకీభవించిన యెడల ఆ నియమములను మార్పు చేయకుండ స్వీకరించుటగాని యుక్తముగ నుండునని తోచినది.

వివాహములు అనేక విధములుగ నేర్పాటు చేయబడవచ్చును. ఒక పద్ధతి- కేవలము వధూవరుల తల్లి దండ్రుల యభిప్రాయమే ప్రధానముగ నెంచి వివాహము స్థిరపరచుట. రెండవది- పిల్ల, పిల్లవానియొక్క ఇష్టమే ప్రధానముగ జేసికొని యేర్పాటు చేయుట. మూడవది— వధూవరులయొక్కయు, వారి తలి దండ్రుల యొక్కయు ఇష్టమును కనిపెట్టి స్థిరపరచుట. ఇప్పుడు ఈ పద్ధతులలో మీ కేది నచ్చినదో మీరే తెలియజేయ వలయును. పిల్లవాడు, పిల్ల వారిరువురి తలి దండ్రులును, పురోహితులను, హుజూర్ రాధాస్వామీ దయాళుని, ఈ ఐదుగురి ప్రసన్నతయు నుండునట్లు చేయు పద్ధతి సర్వోత్తమమే. కాని ఈ ఐదుగురికిని అంగీకారము ఉండునట్లు చేయుట బహు కఠిన విషయము. కావున మీరు ఈ ఐదుగురి నుండియు మొదటి వారికిని, ఆఖరి వారికిని అనగా వధూవరులయొక్క ప్రసన్నతకును, హుజూర్ రాధాస్వామీ దయాళుని ప్రసన్నతకును ప్రాధాన్య మివ్వవలయునని నా యభిప్రాయము. తల్లి దండ్రులు చాలా కాలము వరకు ఉండునది లేదుకదా! కావున వివాహము చేసికొనెడి వ్యక్తుల యొక్క ప్రసన్నతయే ప్రధానము,

ఆడపిల్లలును, పిల్లవాండ్రును. హుజూర్ రాధాస్వామీ దయాళుని ప్రసన్నత ఎట్లు కలుగునో అదియే తమకు అంగీకారమని చెప్పుకొనిరి. హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : వివాహ నియమములను గురించి మీరు మీ అభిప్రాయములను ప్రకటించిరి. నాకు గూడ ఒక అభిప్రాయ మున్నది. అదేమనగ వివాహ సమయములో ఒక్క సూటు మాత్రమే పిల్లవానికిని, రెండుసూట్లు మాత్రమే ఆడపిల్లకును ఇవ్వవలయునని. ఇదిగాక మిగత ఖర్చులన్నియు ఆపుజేయవలయును. ఆడపిల్ల తరఫువారు వరుని బంధువులకును, తమ తరఫు వారికిని కలిపి మొత్తము ఏబది మందికి మించకుండ ఒక విందు చేయవచ్చును. మిగిలిన ధనము బ్యాంకులో జమకట్టవలయును. ఈ కాలములో వరకట్నముల యాచారము జనులకు చాల వ్యాకులము కలిగించుచున్నది. ఆడపిల్లలకు ప్రతిదినము ఐదు, ఆరు చీరలు మార్చుకొనులాగున చాల బట్టలు ఇచ్చినచో నందువలన గలిగెడి లాభ మేమున్నది? బ్యాంకులో ధనము జమచేసి యుంచిన యెడల ఆపత్సమయములలో అవసరము గలిగినపుడు దానిని ఉపయోగించుకొనవచ్చును.

ఆడ మగ పిల్లలందరును ఆ విషయములో తమ సంపూర్ణాంగీకారమును ప్రకటించిరి. హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : ఈ సమావేశ ప్రారంభములో దివ్యేచ్ఛకు తీసి చదివిన శబ్దములో చెప్పిన విషయము ననుసరించి ప్రస్తుత విషయమును పరిశీలించుకొనుడు. ఆ శబ్దము యొక్క పారమార్థిక భావమును కొద్ది సేపు కట్టిపెట్టిన యెడల మీకు ఆ శబ్దము యొక్క చరణముల సహజార్థమును, అది ప్రస్తుత విషయమున కెట్లు వర్తించుచున్నదో ఆ విషయమును చక్కగ బోధపడగలవు.

అబ్ మైం కౌన్ కుమతి ఉరఝానీ ।
దేశ పరాయా భఈ హూం బేగానీ ॥ 1 ॥
అబ్ కీ బార్ మోహిఁ లేవ్ సుధారీ ।
మైం చరనన పర్ నిస దిన వారీ ॥ 2 ॥

(సారబచన్, 33వ వచనము, 2వ శబ్దము)

హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : ఇంతవరకు మనము తప్పుడు విధముగ ప్రవర్తించుచు కష్టపడుచుంటిమి. ఇప్పుడు హుజూర్ రాధాస్వామీ దయాళుడు మనకు సుమతి దానమిచ్చి సవ్య మార్గమున బెట్టి పథ ప్రదర్శనమును దయ చేసిరి.

తిరిగి ఇట్లు సెలవిచ్చిరి. ఇప్పుడు ఒక విషయమును గురించి చర్చ పూర్తియైనది. ఇపుడు మీ యెదుట పెట్టవలసిన రెండవ విషయము ఇండస్ట్రీస్ ను గురించి. పరమ గురు స్వామీజీ మహారాజ్ వారు ఒక శబ్దములో దూది ఏకుట, నూలు వడకుట, బట్టలు నేయుట అను విషయములకు సంబంధించిన ప్రతి కార్యమును వర్ణించిరి. ఈ శబ్దము సత్సంగములో అనేక పర్యాయములు చదువబడినది. పిమ్మట కొన్ని సంవత్సరముల తరువాత 1905 లేక 1906వ సంవత్సరములో పరమగురు మహారాజ్ సాహెబ్ వారు నూలుమిల్లు స్థాపించు సమస్యను అలహాబాదులో సత్సంగుల యెదుట పెట్టి, అందుకొరకు షేర్లు కొనుగోలు చేయువారి జాబితా కూడ నొకటి తయారుచేసిరి. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు దయాల్బాగులో ఇండస్ట్రీస్ కార్యక్రమమును ప్రారంభించిరి. 1926వ సంవత్సరము దరిమిలా నూలుమిల్లు విషయములో తిరిగి మరొకసారి ఆలోచన జరిగి అందలి షేర్లు కొనుగోలు చేయుదల్చిన వారి జాబితా మరొకటి తయారు చేయ నారంభించిరి. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి అనంతరము ఈ కార్యభారమును సభవారు తమ మీద పెట్టుకొని, బహు ప్రయత్నములు చేసి అమృతసర్ లో వెంకటేశ్వర మిల్లును కొనుగోలు చేసిరి. ఇండస్ట్రీస్ కార్యక్రమమును సాగించుటలో సత్సంగులు తమ శక్తిని సంపూర్ణముగ వినియోగించి హుజూర్ రాధాస్వామీ దయాళుని దయా సహాయముల పైన ఆధారపడుచు ప్రతికూల పరిస్థితులలో గూడ ఆ పనిని గట్టి పట్టుదలతో సాగించిరి. తత్పరిణామముగ దయాల్బాగ్ ఇండస్ట్రీస్ యొక్క వస్త్రోత్పాదన ఐదు సంవత్సరముల లోపున సాలు ఒక్కంటికి ఎనిమిది లక్షల నుండి పెరిగి ఒక కోటి రూప్యములకన్న నధికముగ వృద్ధి చెందినది. సాలుసరి వస్త్రోత్పాదన నిస్సందేహముగ ఒక కోటి రూప్యములను మించిపోయినది గాని ఇంకను చాలమంది సత్సంగులు ఇప్పుడు గూడ పనిలేకుండా నున్నారు. నాకు బహుదూర ప్రదేశములనుండి ఉత్తరములు వచ్చుచున్నవి. వారు దయాల్బాగులో నివసించి జీవికోపార్జన చేయుగోరుచున్నారు. మీరు గూడ చదువు పూర్తియైన పిమ్మట ఉద్యోగాన్వేషణకై బయలుదేరవలసి యుండు నను విషయము మీకు తెలిసియే యుండవలయును. ప్రభుత్వోద్యోగములు చాల తక్కువగ నున్నవి. కావున మీకును ఉద్యోగములు లభించకుండినచో నిరుద్యోగ సమస్య ఇంకను పెరిగిపోవును. ఇండస్ట్రీస్ వృద్ధి చేసినందువలననే నిరుద్యోగ సమస్య అంతరించిపోగలదు. మీరు ఇండస్ట్రీస్ ను ఎంత కావలెనన్న అంతగ వృద్ధిజేసి వివిధ ప్రాంతములలో వివిధ విధములైన కార్ఖానాలను, వ్యాపారమును, ప్రారంభించవచ్చును.

నేను మన ఇండస్ట్రీస్ యొక్క వస్త్రోత్పాదన పరిమాణము 1943వ సంవత్సరము ఆఖరుకు రెండు కోట్లు చేయవలయునని గత సభా సమావేశములో

చెప్పి యుంటిని. లోకులు బహుశా మనలను ఇప్పుడు ధనార్జన చింతలో చిక్కుగొంటిమని చెప్పవచ్చును గాని అట్టి చింతలో పడుట మంచిదే యని మీరు గ్రహించవలయును. ఏలనన, మన వస్త్రోత్పాదన రెండు కోట్ల వరకు పెరిగినప్పుడు ప్రస్తుతము ఆర్థిక కష్టములలో చిక్కుకొనియున్న మన పేద సత్సంగులకు ధనలోపపు బాధ కనుపించనంత అధిక ధనము వారి జేబులలోను, బ్యాంకి పాస్ పుస్తకములలోను, మనీపర్సులలోను నిండిపోగల దను విషయము మీకే స్పష్టపడగలదు. ప్రస్తుతము తమ పాస్ పుస్తకములలో పది లేక ఇరువది రూపాయిలు కూడ నిల్వ లేనట్టి సత్సంగులు సత్సంగములో చాల మంది యున్నారు. వారి జీతములు ప్రతి మాసములో మూడవ వారము లోపలనే ఖర్చు అయి పోవుచున్నది. వారి కేదైన జబ్బుకాని గొప్ప అవసరముగాని కలిగిన యెడల వారెచ్చటనైన ఋణము చేయవలయునే గాని మరియొక ఉపాయము లేదు. కావున మీరు ఈ లోపున మన ఇండస్ట్రీస్‌ను బాగుగ వృద్ధి జేసిన యెడల రెండు సంవత్సరములగుసరికి వీరు తమ ఆర్థిక కష్టముల బారినుండి దాటిపోయి తమ కికము దెప్పుడైన అవసరము వచ్చినప్పు డితరులవలన ధన సహాయము గోరనవసర ముండదని స్వయముగ తామే చెప్పుకొను పరిస్థితి లోనికి వచ్చినట్లు మీరు అనుభవ సిద్ధముగ తెలిసికొనగలరు.

మూడవ విషయము మరియొకటి గూడ చెప్పవలసియున్నది. అదేమనగ హుజూర్ సాహబ్జీ మహారాజ్ సాహెబ్ భగవంతుడు మనుష్య జాతియొక్క సేవ జేయునిమిత్తమై సత్సంగము నెన్నుకొనిరని సెలవిచ్చి యుండిరి. ఈ ప్రపంచములో సత్సంగమే అధి మానవ **(Superman)** జాతిని ఉత్పన్నము చేయ గలదని వారు సెలవిచ్చి యున్నారు. కాని యెవరైన నొక వయోవృద్ధుడు ఒక్కరోజులోనే అధిమానవుని క్రింద మారి పోవునని ఆశించగలమా? ఉత్తమ స్వభావశాలియైన మానవుడు ముందు ఒకపిల్లవాడు గనే పుట్టి సరియైనపాలన పోషణల నొందిన పిమ్మట అధిమానవుడుగ నైపోగలడు కదా! కావున శిశు జననము విషయములోను, శిశువుల పాలన పోషణ విషయములోను యోగ్యమైన వాతావరణము నేర్పాటు చేయుట యత్యావశ్యకమై యున్నది. పిల్లలు సత్సంగ వాతావరణములో జనించి, ఆవాతావరణములోనే పెరిగి, విద్యాభ్యాసము నొంది జీవికోపార్జనకూడ చేసికొనవలయును. వారి హృదయములలో సేవాభావము, ఉత్సాహమును వృద్ధినొందుచు వారు సేవచేయుటలోనే లగ్నమై యుండవలయును. అట్లు చేసినపుడే శిశువు అధిమానవుడుగ తయారు కాగలడు.

నేను ఇప్పుడు మీయెదుట పెట్టిన నాలుగు విషయములను గురించి మీరు గట్టిగ నాలోచించుకొన వలయును. శిశువుల జననమును గురించియు, ఆడ, మగ

పిల్లల పెండ్లిండ్లను గురించియు, ఇండస్ట్రీస్ యొక్క అభివృద్ధిని గురించియు, సత్సంగములో అధిమానవజాతి ఉత్పన్నము అగుటను గురించియు నేను ఇప్పుడు మీకు కొన్ని విషయములు చెప్పియుంటిని. అభిప్రాయ మేమనగ పిల్లలు సుఖ శాంతులతో నుండవలయు ననియు, పెండ్లిండ్లు యోగ్యమైన పద్ధతిగ కావలయు ననియు, ప్రజలలో నిరుద్యోగ ముండకూడదనియు, వారికి ధనలోపము కలుగ కూడదనియు అందరియొక్క హృదయములలోను సేవ చేయుట కుత్సాహ ముండవలయుననియే. అనగా సమస్త విషయములు సవ్యముగ జరిగి జనులకు సాంసారిక బాధలు, చింతలు కలుగ కూడదని నా యభిప్రాయము. హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి విషయము లన్నిటిని గురించి మనకు సంపూర్ణా దేశ ముల నిచ్చి, అధిమానవ జాతి సత్సంగములో ఉత్పన్నము కాగలదను విషయ మును, హుజూర్ రాధాస్వామీ దయాళు రీప్రపంచమునకు ఏ మహాసేవ చేయు నిమిత్తమై సత్సంగము నెన్నుకొనిరో, ఆమహా సేవను సత్సంగ మెవ్విధముగ ఈ నూతన జాతి ద్వారా నెరవేర్చగలదో అను విషయమును, విశదీకరించి చెప్పిరి. కావున మనలో ప్రతివ్యక్తియు వారు పైన చెప్పిన ఆదేశముల నను సరించి మన ప్రవర్తనను మార్చుకొనుట మనకర్తవ్య ధర్మమై యున్నది.

## 130

1942వ సం॥ డిశంబరు 27వ తేదీ భండారా రోజున హుజూర్ మెహతాజీ మహారాజ్ వారు దయాల్బాగు యొక్క మితవ్యయపథ ప్రదర్శకులుగ ఏక గ్రీవముగ నెన్నుకొనబడిరి. ఆ హోదాలో హుజూర్ వారు భండారా రోజులలో ఒకనాడు సత్సంగములో నిట్లు సెలవిచ్చిరి. ఎంతటి అధిక త్యాగమైననుగూడ కనుబీయకుండచేసి జనులలో నిరుద్యోగ నిర్వ్యాపార పరిస్థితులను తొలగించు టయు, మానవ జాతి యొక్క సేవ చేయుటయునే మొదటి నుండియు సత్సంగము యొక్క ధర్మమైయున్నది. ఈ త్యాగమును క్రింద ఉదహరించిన పద్ధతిగ చేయ వచ్చును.

1. వ్యక్తిగతమిత వ్యయత్వము— ఒకవ్యక్తి తానుస్వయముగ నుపయో గించుకొను వస్తువులను మితముగ వాడుకొనుట. ఒక ఇంటిలోగాని లేక కుటుంబ ములోగాని ప్రతి వ్యక్తియు నీవిధముగ పొదుపుగ ప్రవర్తించినయెడల, ఆ మిత వ్యయత్వముయొక్క ప్రభావము కుటుంబ మందరిపైనను సామూహిక రూపమున వ్యక్తించి కుటుంబ మితవ్యయముగ, అనగా (Household or Family Economy) స్థాపితమగును.

2. ఈ విధముగ ప్రతిగృహమునను లేక కుటుంబములోను మితవ్యయత్వము అవలంబించబడు చున్న యెడల సమస్తసంఘము నందును దాని ప్రభావము వ్యాపించి సాంఘిక మితవ్యయము (Communal Economy) స్థాపితము కాగలదు.

3. మన మీ విషయమును మరొక అడుగు ముందుకు వెళ్లి పరిశీలించుడు. ప్రతి పట్టణములోని జనులును, లేక ప్రతి సమాజములోని జనులును పదార్థములను మితవ్యయ సిద్ధాంతము ననుసరించి వాడుకొనుచున్న యెడల దాని ప్రభావము సామూహికరూపమున సమస్త దేశము పైనను, లేక సమస్తజాతి యందును వ్యాపించి రాష్ట్రీయ మితవ్యయము (National or Country wide Economy) స్థాపితము కాగలదు. మన సానుభూతి సమస్తమానవ జాతిపైన నున్నది. కాని కొన్ని పర్వతముల మధ్యభాగమునకు గాని, లేదా కొన్ని సముద్రతీరముల మధ్య దేశమునకు గాని సీమితము కాలేదు. భారత దేశపు హద్దులు, సముద్రపు ఒడ్డులను దాటి దూరతరముగ నున్న జాతులు దేశముల విషయములో గూడ మన సానుభూతి, భాతృభావములు వ్యాపించి యున్నవి. కావున మన దేశములో మనము మితవ్యయ సిద్ధాంతము ననుసరించి ప్రవర్తించుచు, పదార్థములను నష్టపుచ్చకుండ పొదుపుగ వాడుకొని అట్లు మిగిల్చిన సామగ్రిని భారత దేశము నుండి దూరముగనున్న దేశములకు అంద జేయవల యుననియే మన హార్దిక వాంఛయై యున్నది. ఈ సేవ మనము సఫలముగ చేయగల్గినచో అందుకు పరిణామముగ ప్రపంచము అంతటిలో అంతర్జాతీయ మితవ్యయ వ్యవస్థ (International Economy) స్థాపితముకాగలదు.

సత్సంగు లందరును మితవ్యయ సిద్ధాంతము నెల్లప్పుడు దృష్టి యందుంచుకొని వ్యక్తిగతముగ మితవ్యయము చేయ నారంభించి ఇపుడు నేను సూచించిన అంతర్రాష్ట్రీయ మితవ్యయత్వము వైపునకు ముందంజ వేయుదురని నేనాశించవచ్చునా? ఆ మెట్టు ఎక్కిన పిదప మరేమి చేయబోవుదు రనెడి ప్రశ్న కలుగవచ్చును. అట్టి ప్రశ్న వచ్చినచో, సృష్టిలో నే పదార్థము వ్యర్థము గాకుండ సమస్త పదార్థములు నేదోయొక విధమున సద్వినియోగ మైపోవు లాగున యేర్పడి యున్న భగవంతుని ప్రకృతి నియమరూపమైన మితవ్యయ వ్యవస్థ నుదాహరణగ జెప్పవచ్చును. ఏ మానవుడు తన యావశ్యకతలను పెంచుకొనుట గాని, లేదా పెరిగిపోవుచున్నట్లు ప్రకటించుట గాని చేయక, ఇతరుల ఆవశ్యకతలు, అవసరములను తీర్చుటకే ప్రయత్నించవలయును.

పైన చెప్పిన విధముగ నే మానవుడైనను ప్రయత్న పూర్వకముగను, సహజ స్వాభావికముగను మితవ్యయ సిద్ధాంతము ననుసరించి నడుచుకొనుచు,

తన ఏకమాత్రి శ్వాసనుగాని, ఏకమాత్రి దృష్టిపాతమును గాని వృథావ్యయము చేయకుండ నుండినయెడల, అనగా పవిత్రి నామస్మరణ లేకుండ నొక్క శ్వాస మాత్రిమును గూడ తీసికొన కుండగను, ప్రిపంచములో నే పదార్థము పైనను, అది భగవన్నిర్మిత పదార్థ మనెడి భావన లేకుండ నెప్పుడు నొక్క దృష్టిపాతము గూడ చేయకుండను, కండ్లు మూసినతోడనే భగవద్ధ్యాన నిమగ్నుడగుచును ఉన్న యెడల, సతతము ఆ విధముగ భగవంతునితోను, ప్రికృతితోను, ఏక స్వర ముగ నైపోవుచున్నట్లు చెప్పవచ్చును. అట్టి పరిస్థితిలో నత డెంత కఠిన దుర్గ మములైనను, మార్గ మధ్యమున నున్న స్థానము లన్నిటిని దాటినవాడై, తన స్వస్థానమైన రాధాస్వామీ ధామమును చివరకు సునాయాసముగ జేరుకొన గలడు. అచ్చట జేరుకొని, తన కఠిన పరిశ్రిమ ప్రియాసల యొక్కయు మిత వ్యయ ప్రివర్తన యొక్కయు మధుర స్వాదిష్ఠ ఫలితములను అనుభవించును. అనగా చైతన్యామృత పానము చేయుచు హుజూర్ రాధాస్వామీ దయాళు నితో సంపూర్ణైక్యము నొందును.

# 131

1943 ఫిబ్రివరి 13వ తేదీని తిమర్నీలోని రాధాస్వామీ హైస్కూలు అధ్యాపకులు అర్పించిన గౌరవ పత్రిమునకు సమాధానము బల్కుచు హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: సతీమణులారా! సజ్జన పురుషులారా! నవయువక మిత్రు లారా! మీరు ఈనాడు ఉదయము మీ వార్షిక స్పోర్ట్సు ఉత్సవము చూచు టకై మాకు కలుగజేసిన ఈ సావకాశమునకై మేము మీకు అత్యంత కృతజ్ఞు లము. ఇచ్చటి విద్యార్థులు శారీరిక వ్యాయామమున నెక్కువ శ్రిద్ధ వహించుచు ప్రాతఃకాలమున స్పోర్ట్సు కొరకును, వ్యాయామము నిమిత్తమును అధిక సమయము వెచ్చించుచున్నారని తెలిసి మేము చాల సంతోషించుచున్నాము. ఉదయమున ఆటలలో పాల్గొనువారి ఆరోగ్యము బాగుండు నను విషయము నేను సర్వసాధారణముగ చూచుచున్నాను. కాని విద్యార్థు లీ విషయములో నింక నెక్కువ ఆవేశ పూరితమైన ఉత్సాహము చూపవలెనని నా కోరిక. అయితే వారు ఈ స్పోర్ట్సులో ప్రితిదినము నియమ బద్ధముగ పాల్గొనుట చాల యావశ్యక విషయము. ఇండస్ట్రియల్ విద్యా శిక్షణమును, క్రొత్త హాస్టల్ నిర్మాణమును కావలయునని కోరుచు విద్యార్థులు చెప్పుకొన్న విన్నపమును గూడ నేను చాల అభిరుచితో వింటిని. హెడ్ మాస్టరుగారును, పాఠశాల స్టాఫు వారందరును విద్యార్థుల అభివృద్ధి విషయము లోను, వారి శీల స్వభావములను సరిజేసి, వారి శారీరక, మానసిక శక్తులను వికసింపజేయు విషయములోను ప్రద

ర్పించిన ఉత్సాహ సేవా భావములకు నేను వారందరికి ధన్యవాదము లర్పించు చున్నాను. వీరందరును దయాల్బాగును ఆదర్శముగ జేసికొని ప్రవర్తించుచున్నం దున దయాల్బాగులోని కార్యకర్తలవలెనే వీరు కూడ నిచ్చట ఉత్తమాదర్శము చూపెదరని ఆశించుచున్నాను. విద్యార్థుల తరఫు నుండి యిచ్చిన గౌరవ పత్రి మును బట్టియు, హెడ్ మాస్టర్ గారి రిపోర్టును బట్టియు నిచ్చట యీ క్రింద ఉదహరించబడిన పనులు సాగించుట ముఖ్యావసరముగ నున్నట్లు తెలుపడు చున్నది. 1. ఒక ఆసుపత్రిని స్థాపించుటయు, 2. ఉపాధ్యాయులకు గృహ నిర్మా ణము చేయుటయు 3. స్టాఫు సభ్యుల పిల్లలకు స్కూలు జీతములు మురహా యిచ్చుటయు. అయితే దయాల్బాగు R. E. I. మేనేజింగ్ కమిటీ వారి కార్య ములు చేయుటకు నే నేమియు ప్రతిబంధము ఎవ్విధముగను గలుగజేయగోరను. కాని, ఒకటి విషయము మాత్రము నేను మీకు తెలియజేయవలెను. అదే మనగ, నీ విషయము లన్నిటిని పూర్తి చేయుటకై ఒక లక్ష రూప్యములు ఖర్చు చేయవలసి యున్నందున ప్రస్తుతము మేనేజింగ్ కమిటీ వారికంత పెట్టుబడి పెట్ట గల శక్తి లేదనియే. ఏలననగా, ప్రస్తుతము సర్వసామాన్యముగ సత్సంగు లందరి ఆర్థిక పరిస్థితియు దుర్దశలో నున్నందున, నీ శిక్షా సంస్థ లన్నిటికిని ఆర్థిక సహాయము చేయుచున్న దయాల్బాగు రాధాస్వామీ సత్సంగ సభకు కూడ గొప్ప గొప్ప ఆర్థిక కఠిన సమస్య లెక్కువగ నుండి వారే స్వయముగ నశక్త తలో పడియున్నారు. కావున మీరు మీ కోరిక లిపు డీడేరగలవనెడి ఆశ పెట్టు కొనరాదు. కాని నే నిపు డింతమాత్రము మీకు చెప్పగలను. ఏమనగా, మీ రిపుడు చెప్పుకొన్న విన్నపము లన్నిటిని మేనేజింగ్ కమిటీవారు సానుభూతితో విచారించి, దీనిలోనే విన్నపములు అన్నిటికన్న నెక్కువ యావశ్యకమైనచో వానిని కమిటీ యొక్క ఆర్థిక పరిస్థితి ననుసరించి వరుసగ నొకొక్కటి చొప్పున ముందుగ కొనసాగింప యత్నించెదరు. ఇపుడు నే నాఖరున మీకొక విషయము జ్ఞాపకము చేయుటలో అసంగతమేమియు నుండనేరదు. అదేమనగ, యీ పాఠ శాలకు భూమిని అమ్మిన ఆసామీ దానికి చాల హెచ్చు ధర కోరుచు ఆర్జీలు చేసి యున్నందున, ఆ భూమిని సంపాదించు నిమిత్తమై రాధాస్వామీ సత్సంగ సభవారికి చాల కష్టము కలిగి ధనవ్యయము గూడ అధికముగ నయ్యెను. సభ వారికి ఇంత కష్టము పడవలసి వచ్చునని ముందుగనే తెలిసి యుండినచో వా రిచ్చట పాఠశాల స్థాపించు కార్య భారమును నెత్తిన నెన్నడును పెట్టుకొని యుండరని నా నమ్మకము. ఇవన్నియు నట్లుంచి మీ కిపుడు నేను మరొక చాల ముఖ్యమైన హితోపదేశము చేయ వలసి యున్నది. అది మీకు నేనిపుడు చెప్ప కుండినచో, సభ వారు నామీద పెట్టిన మితవ్యయ పథప్రదర్శక హోదాయొక్క కర్తవ్య ధర్మము నెరవేర్చుటలో నేను లోపము చేసినవాడ నగుదును. అదే మనగ, మీరు సమస్త కృత్యములలోను మితవ్యయ నియమమును పాటించి,

ఆహార పానీయములలోను, ఇతర విషయములన్నిటిలోను, స
వ్యయమును వర్జించవలయును. ప్రస్తుతకాలములో మితవ్యయ
మహాలాభకరమును, ఉపయోగకరమునై యున్నది. పెండ్లిండ్ల
సమయపు ఖర్చులును చాలతీవ్రముగ తగ్గించవలసి యున్నది.
వలననే మీకు ప్రస్తుత ఆర్థిక క్లిష్టసమయములో జీవించుటకు సా

# 132

1943 మార్చి 18వ తేదీ సాయంకాలము చైనా దేశ
ఎడ్యుకేషనల్ మిషన్ (Educational Mission) దయాల్బా
ఆ మిషన్ వారి సమక్షమందు తేజః స్వరూపులైన హుజూర్ వారి

చైనా దేశపు ఎడ్యుకేషనల్ మిషన్ సభ్యమహోదయుల
ల్బాగ్ నివాసుల తరఫున నేను మీకు హృదయపూర్వక స్వా
చున్నాను. పవిత్రస్వరూపులైన హుజూర్ సాహబ్జీ మహారాజ్
స్వరూపువారు రాధాస్వామీ మతానుయాయులకొక శాశ్వత
నేర్పరచు నిమిత్తమై 1915వ సం॥ జనవరి నెలలో కాలనీకి శంఖు
ఇచ్చటనున్న వారు ప్రతి దినము ఉదయమున దైనిక కార్యక్రమ
వంతుని మహిమాగానముతో ప్రారంభించి, తిరిగి సాయంకా
లన్నియు పూర్తి చేసుకొన్న పిదప భగవంతుని స్తుతిపాఠము చేయ
చుందురు. ఈ వలసలో నెవరును పని పాటలు లేకుండ సోమరితన
సాహబ్జీ మహారాజ్ వారికిష్టము లేదు. ఏలనన, సోమరితనమ
కాలుడు సమస్తఆపత్తులను జీవునకు గలుగ జేయుననియు, నిర్వ్యా
తయే మానవజాతి కష్టము లన్నిటికి కారణ భూతమనియు వారికి
ఇట్టి వలస స్థాపించి జయప్రదముగ నడిపించవలయునన్న యెడల,
సుల యావశ్యకతలనన్నిటిని తానే పూర్తిజేయ గల్గునంత ఆత్మ
శక్తి గల్గియుండవలయునని వారెంచిరి. కావున వారు మానవ
బాల్యమునుండి వార్ధక్యావస్థ వరకు నవసరమైన సమస్త విషయ
లభింపజేయు నిమిత్తమై, ఇప్పుడే మీరు చూచివచ్చినట్టి భిన్న
సంస్థలను, వివిధ పారిశ్రామిక సంస్థలను ఇచ్చట స్థాపించిరి. ఈ పం
ములు పూర్తి చేయునట్లు, మాకొక (Maternity Hospital)
ఆస్పత్రియు, నొక (Eternity) అనగా స్మశాన భూమియు సొం
వని కూడ మీకు నమ్రతతో మనవి చేసికొనుచున్నాను. ఈ విధ

వునికి ఆవుర గాంతము అవసరమైన విషయము లన్నిటికి నిచ్చట ప్రిబంధము చేయబడినది.

ఇచ్చట ఇండస్ట్రీస్‌లోను, కార్ఖానాలలోను పనిచేయువిధానము నేర్పుటకై మా కొకస్టాఫుకాలేజీ కూడ నున్నది. మాకు ఒకబ్యాంకును, రెండు స్వంత టానరీలును గూడ (Tanneries) నున్నవి. వ్యవధి చాలనందున మీకు వానిని చూపించలేదు. ఇచ్చట నెవరికిని సొంతఆస్తి సంపాదించుకొనుట కనుమతి లేదు. సొంతవ్యాపార మెవరికిని చేసుకొనుట కనుజ్ఞ లేదు.

చైనా భారతదేశములు రెండు ఇరుగు పొరుగు దేశములు. ఈ ఇరు దేశముల నాగరికతలు ప్రాచీనములు. ఈ ఇరుదేశముల జనాభాయు నితర దేశము లన్నిటికన్న హెచ్చుగ నున్నది. కావున మీరు భారతదేశములో అడుగు పెట్టినపుడు, జనులు ఇట్టి శాంతి ప్రియమైన ప్రక్క దేశములు రెండును తమ స్వలాభ సంరక్షణముల నిమిత్తమై సాంస్కృతి కైక్యతను (Cultural Unity) తమ మధ్య స్థాపించు కొన కుండుటకు కారణ మెద్దియు గానరాదని మిమ్ములను హెచ్చరించ వచ్చును. ముఖ్యముగ, నైరోపా దేశస్థులు తమ అధికారసంపత్తులను పెంపు చేసికొను నాశతో నుండి, వారి హృదయములు ఈర్ష్యాగ్నిహోత్రములతో దగ్ధమైపోవుచు వారిలో వారు పరస్పరము యుద్ధములు చేసికొనుచున్న యీసమయములో నట్టి యైక్యభావము యొక్క మహత్వ మెక్కు వగ గానవచ్చును.

పాశ్చాత్య వైజ్ఞానిక సభ్యతకును, ప్రాచ్య సభ్యతా సంస్కృతులకును, ప్రాచీనకాలపు ఉత్తమ సిద్ధాంతములకును మధ్యన ఒక విఘమైన పరస్పర విరోధ మున్నట్లుగ కొన్ని యేండ్లనుండి రాజనీతిజ్ఞులకును, ఆత్మికులకును గోచరమగు చున్నది. వర్తమాన కాలపు విజ్ఞానశాస్త్ర విషయములలోని, యుత్తమ విషయములను అధికాధిక పరిణామములో నవలంబించి జీర్ణము చేసికొనగలశక్తి భారతదేశమునకు మెండుగ నున్నది. కావున దయాల్బాగు ప్రాచీన నవీన సభ్యతలను సంమిశ్రణ చేయగోరుచున్నది. మరియు భగవదిచ్ఛ యనుకూలించినచో ప్రాచీన నవీన సభ్యతల నట్లు సమ్మిశ్రితముచేసి మానవునియొక్క ఆధ్యాత్మి కావశ్యకతలకును, విజ్ఞాన శాస్త్రతత్త్వాన్వేషణ విధానమునకును భంగము లేకుండు లాగున భారతదేశీయుల స్వభావ తత్త్వములకు సరిపోవునట్టి ఒక నవీన ఆర్థిక వ్యవస్థను కల్పించి, ప్రాచ్యపశ్చిమ దేశముల యైకమత్యసాధనమైన యొక

అమూల్యాదర్శమును ప్రపంచమునకు సాధించి చూపగలమను సంపూర్ణ విశ్వాసము కూడ దయాల్బాగున కున్నది.

కావున దయాల్బాగు అనగ నేమి యని ప్రశ్నించినచో, అది యొక పారమార్థి కాదర్శముగల సంఘము. ఆధ్యాత్మికాదర్శమును ఐహిక కార్యకలాపముతో నేక స్వరమగునట్లు కలగలిపి, స్వతంత్ర జీవితమును గడుపుకొను నిమిత్తమై చేయుచున్న మహాప్రయత్నమని చెప్పవచ్చును. మా విద్యా సంస్థలలో చదువుకొన్న విద్యార్థులకు ఇచ్చటి పారిశ్రామిక సంస్థలలో పనిచేయుటకు అవకాశము గలుగ జేయుట మా పారిశ్రామిక సంస్థల బాధ్యతయై యున్నది. వారికి తగిన ట్రైనింగు ఇచ్చి, ఆ తర్వాతను ఉద్యోగములనుగూడ ఇచ్చెదము. రోమ్, గ్రీసు దేశములలో ఆ దేశముల విజ్ఞానశాస్త్ర సభ్యతా విషయములు ఆ యా దేశముల మత సంస్థలైన సమాధులలోను సన్యాసి మఠములలోను సురక్షితముగ నుంచుకొన్నట్లుగనే, ఒక్కొక్క దేశముయొక్క విజ్ఞానశాస్త్ర జ్ఞానసభ్యతల దీపము ఆ దేశపు ఆధ్యాత్మిక సంస్థలలో జాజ్వల్యమానముగ నుండినను ఉండవచ్చును. అట్టి యితర మతసంబంధమైన సంస్థ లింక ననేకము లీ ప్రపంచమున నుండవచ్చును. కాని దయాల్బాగువలెనే, సమస్త సంఘమునకు, జాతికిని మహోపకారముగనుండు విధమున నవీనార్థిక విధానములో ఉత్తమ సంస్కరణలు చేసి అభివృద్ధి నొందుచున్న ధార్మిక సంస్థ మాకు తెలిసినంతవరకు మరొకటి లేదనియే చెప్పవచ్చును. కొద్ది సంవత్సరములక్రితము వరకు మా ప్రయత్న మంతయు దయాల్బాగుయొక్క కేంద్రీయ సంస్థలను దిట్టపరచు నిమిత్తమయ్యే చేయుచుంటిమి. కాని ఇప్పుడిక రాష్ట్రములలోగూడ మా పరోపకారక సంస్థలను వ్యాపింప చేయదలచుకొన్నాము.

ఈ ప్రయత్నము సఫలమైననాడు ఇతర దేశములు, జాతులును గూడ మా యాదర్శమును అనుకరించబూనెదరు.

1910 లో స్థాపితమై పిమ్మట సొసైటీల చట్టము క్రింద రిజిస్టరైన 48 సభ్యులుగల రాధాస్వామీ సత్సంగసభ యనెడి ఉత్తమసంస్థ మా మత సంఘీయుల ఆచార వ్యవహారములను పరిశీలించుచు మా సంఘముయొక్క ఆస్తులను, వ్యవహారములను చక్కబెట్టుచు అందుల కవసరమైన నియమములను నిర్ణయించుచున్నది. యిందుండి పదిమంది సభ్యులుగల కార్యనిర్వాహక వర్గమొకటి ఎన్నుకొన బడినది. దయాల్బాగునకు ప్రత్యేకముగ ఒకప్రైవేట్ మ్యునిసిపల్ కమిటీయును (Private Municipal Committee) ఒక రక్షక (Watch and Ward) విభాగమును గూడ కలవు.

నేను ఈ ఉపన్యాసమును పెంచిమీకు తేనీరు సేవించుటకు ఆలస్యము చేయగోరుట లేదు. మీ విశ్వాసములను, ఆలోచనలను, తాగుమారు జేయ వలయునని గూడ నా యుద్దేశ్యము కాదు. రాధాస్వామీ మతముయొక్క రెండు మూడు ప్రధాన విషయములను మీకు నేనిపుడు చెప్పకుండ నుండి పోయినయెడల దయాల్బాగును గురించి మీకు గలిగెడి మానసిక చిత్రము అసంపూర్ణముగ నుండిపోవునని మాత్రము తప్పక నేను భావించుచున్నాను. రాధాస్వామీ మతము క్రీ. శ. 1861 సం॥లో ప్రారంభమైనది. మేము భగవంతుని అవతారముగ మన్నించుచుండెడి హుజూరు స్వామీజీ మహారాజు వారు క్రీ. శ. 1861వ సం॥లో ఈ మతమునకు పునాది వేసిరి. వారి అనంతరము ప్రకటమైన స్థానాపన్ను లందరును వారి ప్రతినిధులే. సాహబ్జీ మహారాజ్ వారు ఆ స్థానాపన్నుల వరుసలో ఐదవవారు. మా మతము Cosmopolitan అనగా భేద భావములు లేని, సార్వజనీనమతము. ఈ మతముయొక్క సిద్ధాంతములు, నియమములును లోకములో ప్రతి జాతియు ప్రతి దేశస్థులును సులువుగ ఆచరించ గల్గుదురు. మాకు సకల మతములయొక్క మతగురువులు మత స్థాపకుల యెడలను హృదయ పూర్వకమైన గౌరవమే యున్నది కాని, ఎవరియందును ద్వేషభావము లేదు.

రాధాస్వామీ మతములో భగవంతుని అస్తిత్వమునందు పూర్ణ విశ్వాసమున్నది. మానవుని ఆత్మ భగవంతుని నిజాంశయని ఈ మతముయొక్క సిద్ధాంతము. ఈ విధముగ భగవంతుడు అందరికి తండ్రి యనియు ప్రపంచము లోని మానవులందరు సోదరులనియు మా విశ్వాసము. భగవంతు డొక్కడే యని అనగా, ఆయన సమస్త చైతన్యముయొక్క భండారమై, సమస్త జగత్తును సృజించిన యథార్థమైన పరమ పితయని మా విశ్వాసము. ఈ మతము ఆంతర్యమున ఆధ్యాత్మిక సంపత్తును వృద్ధిచేసి కొనుటకే ప్రాధాన్యమిచ్చును. కాని ఇతరమైన ఆచార వ్యవహారముల యందు ఉపేక్షా భావము వహించి జాతివర్ణ సంబంధమైన సంకుచిత పరిధులను దాటిపోయినది. ఈ మత నాయకుని సాన్నిధ్య సాంగత్యములును వారి యాధిపత్యమున తరుచు జరుగునట్టి సత్సంగ సమావేశములలోను, వారి సేవలోను పాల్గొనుట మున్నగు విషయములే ఆధ్యాత్మికాభివృద్ధికి ఆవశ్యకములుగ నెంచబడుచున్నవి. వ్యర్థముగ అల్లరి చిల్లరి గుంపుల లోను, ఉత్సవములలోను కలిసి తిరుగుటయు, రాజకీయాందోళనలలో పాల్గొనుటయు, మద్య పదార్థములను తీసికొనుటయు, గుడ్లు, మాంసము వగైరా ఆహారములను తినుటయు, ఆధ్యాత్మికోన్నతికి హానికరము. క్రొత్తగ చేరబోవు ప్రతి సత్సంగికిని తన ఆదాయమునకు మించకుండ ఖర్చు చేసికొనుచు జీవితము గడపు కొనవలయు ననియు ఉత్తమమైన ఆచరణ గలిగి సౌజన్యముతో ప్రవర్తించ

వలయుననియు హితోపదేశము చేయబడును. మా గ్రంథములు చాల భాగము హిందీ భాషలో నున్నవి. కాని కొద్ది పుస్తకములు ఉర్దూ భాషలోకూడ గలవు. మా వార పత్రికలు ఉర్దూ, హిందీ, తెలుగు, తమిళము, ఆంగ్లభాష లలో ప్రచురింప బడుచున్నవి.

ప్రపంచములోని జనులందరు నొకే కుటుంబ పరివార మనియెడి, దృష్టి కోణమును మనసున ధరించి ప్రజలందరును జీవితము గడపవలయుననియే మా ఆదర్శము. మన కందరికి పరస్పర సంబంధ మున్నది. మన మొండొరులకు సహాయ సహకారము లొనర్పవలసియున్నది. మనము సకలజన శ్రేయోభిలాషతో నొండొరులకు సేవచేసి ఆత్మార్పణ భావముతో ప్రవర్తించినపుడే జీవితము యొక్క అసలు రహస్యము మనకు బోధపడగలదు. అట్టి భావము మనలో నుత్పన్నమైనపుడే మనము దుష్ట శక్తులను పరాజితము చేసి ప్రపంచమున చిరస్థాయిగ వాస్తవ శాంతిని స్థాపించగలము. ఏదైన మతముయొక్క శ్రేష్ఠత్వము ఆ మతస్థులకు భగవంతుని విషయములో గల భక్తి శ్రద్ధలనుబట్టి మాత్రమే గాక మానవ కోటికి ఆ మతము మూలమున గలిగెడి యుపకారాతిశయమును బట్టికూడ నిర్ణయించవలసి యున్నది. ఆత్మను భగవంతునితో నైక్యముచేసి తమారిపమైపోవుటయే సత్సంగము యొక్క ఆదర్శమైయున్నను మానవకోటికి లాభక్షేమములు గలుగజేయు నిమిత్తమై భక్తి శ్రద్ధలతో సేవ జేసినందువలన ఆ ఆదర్శము సిద్ధించుటలో నాటంక మేమియు గలుగనేరదనియే మా విశ్వాసము.

# 133

1943 ఏప్రియల్ 6వ తేదీ రాత్రి $7\frac{1}{2}$ గంటలకు ఆర్. ఇ. ఐ. కాలేజి ఫైనల్ క్లాసుల పిల్లలు, టెక్నికల్ కాలేజీ లెదర్ వర్కింగ్ స్కూల్ విద్యార్థుల యొక్కయు సమ్మిళిత సమావేశము హుజూర్ మెహతాజీ మహారాజ్ వారి అధ్యక్షత క్రింద సత్సంగ హాలులో జరిగినది. అన్నిటికన్న ముందు దివ్యేచ్ఛకొక శబ్దమును చదివిరి:

సురిత భరీ అగమ జల గగరీ ।
మైం దేఖే రాధాస్వామీ తేరీ నగరీ ॥ 1 ॥
మేరీ ప్రీతి లగీ అబ్ నగరీ ।
మై చఢీ గగన కీ డగరీ ॥ 2 ॥

మేరీ యార్ హులీ మమతా అబ్ సిగరీ ।
మై పహుంచీ సతగురు నగ రీ ॥ 3 ॥
గురు కహా శబ్ద జా పగ రీ ।
హంగతా కీ ఉతరీ పగ రీ ॥ 4 ॥
మా యా కీ ఇజ్జత్ బిగ డీ ।
రాధా స్వామీ చరన్ కో తక్ రీ ॥ 5 ॥

ఈ సమయమున ఇచ్చట పరిశ్రమలలో పనిచేయుటకు యోగ్యులైన సత్సంగీ సోదరీ సోదరులను, విద్యార్థులను సమావేశమగుటకై పిలచుటలో మా యుద్దేశ్య మేమనగ, వారికి ప్రస్తుత సమయము యొక్క ఆవశ్యకతలను గురించియు, ఈ సమయమున జరుగుచున్న మహా యుద్ధము మూలమున దినదినా భివృద్ధి నొందుచున్న ఆపత్తులు, వ్యాకులత్వములను గురించియు, తెలియజేసి సత్సంగ దృష్టికోణమును బట్టి ప్రస్తుత పరిస్థితిలో మన కట్టిపద్ధతి లాభదాయక ముగను, ఉపయోగకరముగను ఉండగలదో తెలియ పరచవలయుననియే. అదిగాక ఇచ్చటి సత్సంగులను, సత్సంగుల పిల్లలను, సత్సంగముతో సహాను భూతిగల వారిని, సత్సంగసంస్థలలో పనిచేయుచు తమక్షేమమును కనిపెట్టుకొన గల వారిని, ఒకప్రశ్నగూడ అడిగి తెలిసి కొనవలసి యున్నది. అదేమనగ, ఇప్పుడు వారికిని, వారికుటుంబీకులకు, బంధువులకును తదితరులకును ప్రస్తుత కాలపు ఆపత్తులు, కష్టములవలన బాధలు చాలతక్కువగ గలుగు నిమిత్తమై మేము చెప్పబోయెడి విధానములను సంతోష పూర్వకముగ అవలంబించుటకు వారు సిద్ధముగ నున్నారా యని ? గతించిన మూడు సంవత్సరముల నుండి ప్రపంచములో మహాయుద్ధము చెలరేగుచున్నది. కాని ఇంతవరకును మన అదృ ష్టము వలన అది భారత దేశమునకు దూరముగనే యున్నది. ఈ యుద్ధసమయ ములో మనకు కష్టములును, బాధలును, ధనవ్యయమును ఎంతయెక్కువగ గలుగు చున్నవో మీకే విదితము. ఆర్థిక కష్టములు, ధన నష్టములు, ఖనిజ పదార్థములు, భూములలో పండిన ధాన్యము వగైరాలును, హెచ్చుగ సముద్ర ములో మునిగిపోవుటవలన కలిగెడి నష్టములు, బాంబులు ప్రేల్చుట వలనను, ఇతర కారణములవలనను గలిగిన మహానష్టముల మూలమునను ఇచ్చట ఆహార ద్రవ్యములకు సకల విధములైన ఇతర పదార్థములకును ధరలు చాల పెరిగిపోయి నవి. ధరలు పెరుగుటయేగాక పదార్థములు లభించుటగూడ కష్టమై పోయినది. కావున యుద్ధములో గెలుపొందుటకు మహాశూరసైనికు లెట్లు అవసరమో ఆట్లే ఈపని సాధించుటకై కేవలము ఖనిజ పదార్థములు, ఆహారపదార్థము లే గాక మానవ జీవితమున కవసరమైన ఇతరసమస్త పదార్థములను గూడ ఉత్పా దన చేయగల్గ మనుష్యు లత్యవసరము. మనలో వృద్ధ సత్సంగులకు ఈ పని నేర

చేయుటకు శక్తి తే నందున నవయువకులకు ఈ విషయమును గురించి నేను ఓల్డ్ బాయ్ (Old Boy) హోదాలో సంభాషించుట యత్యావశ్యకమని తోచినది. అభిప్రాయ మేమనగ మన మిప్పుడు సాధించవలసిన కృత్యమునకై యుద్ధములో పోరాడునట్టి యోధు లెట్లవసరమో అట్లే ఇండస్ట్రీస్‌లో పనిచేయుటకు సమిత్తమై ఇండస్ట్రీ యోధులు గావలసి యున్నది. ఆ యోధులు కేవలము ద్రవ్యాభివృద్ధి చేయుట మాత్రమే గాక భూమిలో గుప్తమై యున్నట్టి విలువైన ఖనిజ పదార్థములను కూడ బయటకు లాగగల సమర్థులు కావలెను: ఈ పను లన్నిటికిని [illegible] నవ యువకులు కావలసి యున్నారు. కనుక ఈ కృత్యములో సంతోషముగ పాల్గొన గోరువారు తమ పేర్లను వ్రాయించుకొన వలయును. ఈ విషయములో ఎవరికైనను తెలిసికొన వలసిన విషయము లింక నేవైన యున్న యెడల వారు ఆ విషయముల నిప్పుడు అడిగి తెలిసికొనవచ్చును. వారిని సంతృప్తి పరచుటకై యథాశక్తి ప్రయత్నించెదము.

అటుపిమ్మట పిల్లలు తమ పేర్లు వ్రాయించుకొనిరి. తరువాత హుజూర్ వారు దివ్యేచ్ఛకు తీయుడని ఉత్తరువు ఇవ్వగ నీ క్రింది శబ్దము వచ్చినది.

చేత చలీ ఆజ సురత్ రంగీలీ ।
ఛూట్ గఈ మతి బుధి సబ్ మైలీ ॥ 1 ॥

( సారబచన్, వచనము 35 (2), శబ్దము 2 )

ఇట్లు సెలవిచ్చిరి : ఇప్పుడు మీ రీ శబ్దమును శ్రద్ధగ ఆకర్ణించుడు. ఇచ్చట ఆత్మను రంగీలీ (ప్రేమ పూరితము) యని వర్ణించుటలో ఆ ప్రేమ పూరిత లక్షణము మీ స్వభావమునకు వర్తింవగలదన్నట్లు స్ఫురించుచున్నది. "రంగీలీ సురత్ చేత చలీ", అనగా ప్రేమపూరితమైన జీవుడు మెలకువగ వర్తించెనని పైన చెప్పిరి. దీని యర్థమేమనగ, మీరు ఇప్పుడు ఏ తీర్మానము చేసికొనిరో అది మీరు బాగుగ గంభీర దృష్టితో విచారించియే చేసికొనిరని సూచించబడుచున్నది. మీరు ఇండస్ట్రీస్‌లో శ్రమపడి పనిచేయుటలో న్యూనత యున్నట్లు ఇంతవరకు భావించుకొను చుండిరి. కాని ఇప్పుడు మీరు చేసిన తీర్మానము ద్వారా ఆ భావమును తొలగించుకొనిరి. ఈ శబ్దములో రాధాస్వామీ దయాళురు మహా దయ చూపినట్లు వ్రాయబడియున్నది. దీనినిబట్టి మీరు చేసిన పని హుజూర్ రాధాస్వామీ దయాళునికి సంతోషకరముగ నుండి వారికి అందువలన ప్రసన్నత గలిగినట్లు తేటపడుచున్నది. మీకు అభీష్టసిద్ధి అవశ్యముగ లభించగలదు. మీరు ఇప్పుడు చేసికొన్న ఉత్తమ నిర్ణయమునకై నేను ఒక ఓల్డ్ బోయ్ (Old Boy) హోదాలో మిమ్ములను అభినందించుచున్నాను. నేను

త్వరలో మరియొక వారములో టెక్నికల్ కాలేజీ విద్యార్థులను కలిసికొని ఈ
విషయములో మరొకసారి మాట్లాడ దలచుకొన్నాను. వారు గావించిన ఈ
పనికై నాకు సంతోషమైనది. నేను వీరికి ఏమియు ఆశ కల్పించక పోయినను,
ఔన్నత్యాభివృద్ధుల వాగ్దాన మెద్దియు చేయకుండినను గూడ వీరు బహు సంతో
షముతోను, ఉదార భావముతోను సత్సంగ సేవ చేయు నిమిత్తమై ముంద
డుగు వేసిరి. ఇది చాల శుభ సూచకము.

# 134

1943 డిశంబరు నెలలో పంజాబు రాధాస్వామీ ఛారిటబుల్ సొసైటీ
స్థాపన విషయమై ప్రస్తావన జరిగినపుడు మహాత్మా నందగోపాల్‌గారి ఉపన్యా
సము అయినపిమ్మట దేదీప్యమాన స్వరూపులైన హుజూరు వారిట్లు సెలవిచ్చిరి:
మహాత్మాగారు ఆయన ఉపన్యాసములో హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారి
హితోపదేశమును ప్రమాణముగ తీసికొనిరి. హుజూరు సాహబ్జీ మహారాజ్
వారు "ప్రతి సత్సంగియు తన్ను తాను సత్సంగముయొక్క స్తంభముగ
భావించుకొన వలెనని తమ హితోపదేశములో సెలవిచ్చిన మాటను బట్టి
మీరు, స్తంభము భవనముయొక్క భారమును తన శిరమున నెట్లు భరించునో
అట్లే మీలో నెవరు కార్యభారము నంతను శిరమున మోయగలరో వారే
స్తంభమని అనిపించికొన గలరని జ్ఞాపక ముంచుకొనవలయుచు అట్టి భార
మును సహించ లేనపుడు స్తంభముననని చెప్పుకొనుటగాని అనుకొనుటగాని పొర
పాటు. కావున స్థాపింపబోవునట్టి సంస్థలను జయప్రదముగ నడిపించి వాని
బాధ్యతనంతను ఎవరు శిరమున భరింతురో వారు పెద్ద స్తంభములుగను, వాని
కార్యక్రమములో సహాయము జేయువారు చిన్న స్తంభములుగను పరిగణింప
బడుదురు. అయినను కొంతకాలము అనుభవము గలిగిన పిమ్మట ఈ చిన్న స్తంభ
ములుగూడ గొప్ప బాధ్యతలను వహించుటకు సమర్థములు కాగలవు. నేను ధర్మ
పురా(లాహోరు)లో క్రీ.శ. 1940వ సంవత్సరములో సత్సంగమునకు ప్రస్తుతకాల
ములో(Soldiers of Industries)సోల్జర్స్ ఆఫ్ ఇండస్ట్రీస్ అవసరమైయున్నా
రనియు, కావున మీలో ఈ సేవచేయుట కుత్సుకులైన వారు ఈ పని చేయుటకై
ముందుకు రావలెననియు, చెప్పియుంటిని. అటుపిమ్మట వస్తూత్పాదన హెచ్చు
చేయవలసిన యవసరము గలుగగా ('Heroes of Production') హీరోస్
ఆఫ్ ప్రొడక్షన్ వస్తూత్పాదనలో వీరియొక్క ఆవశ్యకత గలిగినది. వారు వస్తూ
త్పాదన బాగుగ వృద్ధిచేసిరిగాని ప్రస్తుతము సొసైటీని సురక్షితముగ చేయ,
గలిగినట్టి Saviours (సేవియర్స్) అనగా సంరక్షకులైన జనులయొక్కయు

సంస్థలయొక్కయు, ఆవశ్యకత గలుగుచున్నది. కావున మీరందరును ముఖ్యముగ పంజాబు దేశస్థులు ఇవ్విధమైన సొసైటీ తయారు చేయగోరుచున్న యెడల మీరు ఈపనియొక్క సమస్త భారమును శిరమున మోసికొనవలసి యున్నదని తెలిసికొనవలయును. కేవలము పేరు వ్రాయించుకొని నామకార్థమై జేరుట యుక్తము గాదు. మీకు సేవచేయు బాధ్యత పూర్తిగ వహించుటకు ఇష్టమున్న యెడలనే మీరీపనిచేయుట సవ్యమగును. అట్టి సొసైటీ గూడ ధన్య మగును. ఈ ప్రస్తావన సర్వసమ్మతితో నంగీకరించబడినది.

# 135

1944 సంవత్సరము అక్టోబరు 21 వ తేదీ మద్రాసు రాష్ట్రములోని కోయంబత్తూరు పట్టణములో సార్వజనీన సమావేశ మొకటి జరిగినది. అందులో పట్టణములోని విద్యావంతులు, పేరు ప్రతిష్ఠలు గలవారును పాల్గొనిరి. దేదీప్యమాన స్వరూపులైన హుజూర్ వారు **A Better World Order** అనగ ఉత్తమ ప్రాపంచిక వ్యవస్థ అను విషయముపైన ఉపన్యాస మిచ్చిరి. సర్. ఆర్. కె. షణ్ముగం చెట్టియార్ సభాపతిగ నుండిరి. హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: గతించిన ఐదు సంవత్సరముల నుండియు ప్రస్తుత మహాయుద్ధము వలన ప్రపంచములో గలుగుచున్న భయంకర నష్టమును, రక్తపాతమును మన మందరమును చూచునే యున్నాము. క్రితము మహాయుద్ధములో గలిగిన ఇవ్విధమైన వినాశ రక్తపాతములను జనులు ఇంకను మరచిపోలేదు, మనయొక్క రాబోవు సంతతి వారు గూడ తమజీవితములలో ముందు ముందు ఇంతకన్న గూడ యధిక వినాశ పరిస్థితులు ఎన్ని అనుభవించ వలసి వచ్చునో ఎవరును చెప్ప జాలరు. ఈ సమయమున ప్రతి దేశములో కోణ కోణములనుంచియు, ప్రపంచమున జీవులు సుఖముగ జీవితము గడుపుకొనగలుగునట్లు ఒక **New Order** అనగ నూతన వ్యవస్థ స్థాపితమై, అట్టినూతన వ్యవస్థమూలమున సమస్త దేశములలోను వ్యాపించి పోవుచున్న ఈర్ష్యా ద్వేషములు శాశ్వతముగ మటుమాయమై భవిష్య కాలములో యుద్ధములు ఎప్పటికిని లేకుండ నుండిపోవలయుననెడి ఆర్తనాదము వెలువడు చున్నది. మరెన్నడు లోకమున యుద్ధములు లేకుండ చేయుటైతే అసంభవమేమో కాని దేశములోని ప్రజలు తమజీవితమును సుఖముగ గడుపుకొను లాగున ప్రబంధము జేయుట చాలవరకు సాధ్యమే వేర్వేరు దేశముల మధ్య ఏకత్వభావము, పరస్పర మిత్రభావమును కలిగించవలయును. ప్రపంచమున నివ్విధమగు నూతన వ్యవస్థను స్థాపించవలయు నన్నచో అన్నిటి కన్న ముఖ్యవిషయ మేమనగా దైనందిన కార్యములను చక్కబెట్టు

ప్రబంధ కర్తలును ఉన్నత పదవులలో నున్నవారును, శాసనకర్తలైన వారును (దూరదృష్టి గల్గినట్టి బుద్ధిశాలురను గూడ ఈ వర్గములలో నేను జేర్చుగోరు దును) వీరందరును కలిసి ఈ ఉద్దేశ్య ప్రాప్తికై న్యాయబుద్ధితో హృదయ పూర్వకముగ పాటు పడవలసి యున్నది. తిరిగి హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ప్రజలలో ఉచ్చనీచ తారతమ్యములకు సంబంధించిన భావములు నశించి పోవల యును. మనము వర్ణము, కులము, సంప్రదాయము, మతములకును సంబంధించిన భేద భావములను విడిచిపెట్టవలయును, అట్టి భేద భావముల ననుసరించి నడచు కొనగూడదు. నా అభిప్రాయములో వివేకశాలురైన మానవులెవరును ప్రపం చమునకు సృష్టికర్త ఒక్కడే కాదు అనేకు లున్నారని చెప్పజాలరు. సమస్త ప్రపంచమున కొక్కరే సృష్టికర్త యున్నచో ప్రపంచములో ప్రజలందరు ఒండొరులను సోదరులుగను సోదరీలుగను భావించుకొన వలసి యున్నది. నేను పైన చెప్పిన విషయములు జనులకు సమ్మతమైనచో ప్రపంచమున నవ్విధమైన నూతన వ్యవస్థను స్థాపించు నిమిత్తమై యెట్టి ఉపాయములను అవలంబించ వల యునో మనము ఆలోచించుకొనవలసి యున్నది. ఇవ్విధమైన వ్యవస్థను స్థాపించు టకై భిన్నాభిప్రాయములు, భిన్న విశ్వాసములును గల వివిధ ప్రజలకును యెవరి అభిప్రాయములను, విశ్వాసములను వారు అవలంబించుటకును, ఇతరులకు ప్రక టించుటకును సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యము లుండవలయు ననియు వారికి జీవితావశ్యకతల విషయములో నిశ్చింతగ నుండు నట్లేర్పాట్లు చేయవలయు ననియు, వారి కెవ్విధమైన రోగములు లేకుండ నుండవలయుననియు, జనులు చెప్పవచ్చును. ఈ విషయములు వినుట కత్యాకర్షకముగనే యుండును. కాని వానిని ఆచరణలో పెట్టినపుడే వాని వాస్తవ లాభము ప్రాప్తించగలదు. ఈ విషయములో నేను చెప్పెడి సలహా యేమనగా, పైన చెప్పిన ఆదర్శ సిద్ధికై చట్ట నియమములను తయారు చేయు బాధ్యత యే మనుష్యుల కప్పజెప్పబడునో వారా పనిని నెరవేర్చుటలో తమ సొంత లాభ నష్టముల ఆలోచనలను గాని, తమ రాగద్వేషములను గాని అడ్డు రానివ్వకూడదు. వారు సమస్త కృత్యము లను విశాల హృదయముతో అవగాహన చేసికొనవలయును. అట్లు చేసినయెడల వారు ఏర్పాటు చేసెడి నియమ నిబంధనల మూలమున అధికాధిక సంఖ్యాకు లైన జనులకు సుఖశాంతులు లభించగల సావకాశము గలుగును.

నేను పై విషయము జెప్పినపుడు ఒక జన సామాన్యమును మాత్రమే మనసున పెట్టుకొని చెప్పలేదు. వాస్తవములో సకల విషయములను, ప్రభుత్వ మును, జనసామాన్యమును, కలిసి పరస్పర సహాకారభావముతో తేల్చుకొన్న

పరిస్థితిలోనే ఉత్తమ పరిణామము లేర్పడు నను విషయమునుగూడ నేను స్పష్టీక రించ గోరుచున్నాను. శాసన సభా సభ్యులు తమపాలనలోనున్న దేశ ప్రజలను తమ సోదరులుగ భావించుకొనవలయునే గాని శాసిత ప్రజలపైన కేవలము అధికారము చలాయించుచు అట్టి శాసిత దేశముయొక్క సాధన సంపత్తి వలన స్వలాభము పొందవచ్చునని మాత్రమే భావించుకొన గూడదని వారు జ్ఞప్తి యందుంచుకొనుట ఆవశ్యకము. నేను ప్రజానీకములో (Public) నొక వ్యక్తినే గావున, ఆహోబాలో నా సోదరులకు వారేమి చేయుటకు సమర్థులో వారేమి చేయవలసియున్నదో తెల్పవలసిన బాధ్యత నాపైన ఉన్నదనుట నిస్సందేహము. మనము ధార్మిక, సామాజిక, రాజనైతిక విషయములు వర్గాలలో నెవరికి నచ్చిన భావములు విశ్వాసములను వారు ధరించుటకు పరస్పరము సంపూర్ణ స్వాతంత్ర్యము నివ్వవలయునని నేను దీనతా నమ్రత్వములతో మీకు విన్న వించుకొందును. ఇతరులు మనదృష్టికోణముతో నేకీభవించనందువలన గాని లేక వారేదేని ప్రత్యేక విషయములలో తమకిష్టమైనట్టి పరలోక భావనములను, ఆలోచనలను ప్రకటన చేయుచున్న హేతువు మూలమున గాని వారియందు మన మెన్నడు నప్రియ భావమును చూపగూడదు. జనులకు తమ జీవితావశ్యక సామగ్రిని నిశ్చింతగను స్వతంత్రముగను సమకూర్చుకొను విషయములో, మనసున గట్టిగ పట్టించుకొనవలసిన విషయమేమనగా ప్రతివ్యక్తి వద్దను అత నికి కావలసిన పరిణామములో అన్నవస్త్రములు లోటులేకుండ నుండవలయు ననియు మరి ప్రతివ్యక్తికి ఎవనికే మార్గమున నే ప్రకారముగ వృద్ధినొంద గల యవకాశ మున్నదో అతడా మార్గముననే అవిధముగనే అభివృద్ధి నొంది పరిపూర్ణ మానవుడగుటకు పూర్తియైన సావకాశము గలుగజేయవలయు ననియునే. వాస్తవమునకు, ఇతర కార్య క్షేత్రము లన్నిటికన్న నీ కార్య క్షేత్రములోనే జనులకు, కలసి మెలసియుండి పరస్పర సహకారము చేసికొను అవకాశములు ఎక్కువగ నుండును. కావున మీరు తను స్నేహితుడు పరిచయ స్థుల కొక్కరికే గాక ప్రభుత్వమునకు గూడ నీ విషయములో సహాయోగము చేయగల్గుదురు. ఏలనన, ఇట్టివిధమైన మన కార్యక్రమమంతయు దాన ధర్మ ములు పరోపకార భావమునకును సంబంధించినది. కావున నీ పట్టణములో నిప్పుడు నేను నిలుచున్న స్థలము నుండియే మన దయాశీలురైన మిత్రుడగు మిస్టర్. జి. డి. నాయుడుగారు చాల కాలమునుండి జరిగించుచున్న పనులను గురించి మీ కందరకును చెప్పదలచుకున్నాను. ఆయన ఇచ్చట ఇండస్ట్రీస్‌ను టెక్నికల్ ఎడ్యుకేషన్‌ను జారీచేసి జనులకు ఒకక్రొత్త మార్గమును చూపించిరి. ఈ కార్యక్రమముద్వారా పరోపకార బుద్ధిగల ప్రతిమానవునికిని సమస్త ప్రపంచములోను కొన్ని యేండ్లనుండి ప్రస్తావించ బడుచున్న నూతన ప్రపంచ వ్యవస్థను (New World Order) స్థాపించుటలో సహాయము చేయుటకును,

తన యోగ్యతాశక్తి సామర్థ్యములను ఆ ఆదర్శ సిద్ధికై వినియోగించుటకును ఉత్తమ సావకాశము లభించుచున్నది. తగినంత ధన సంపత్తిగల మానవులు ఈ ఉత్తమ శుభాదర్శ ప్రాప్తికై తమ ధనము నిర్విఘ్నముగ వెచ్చించ వచ్చును. ఎక్కువ ధనము లేనివారు కూడ తమ శక్త్యనుసారము ధనమును ఈ శుభ కార్యములో వెచ్చించవచ్చును. ఈ విధముగ దేశములోని సాధన పరికరము లన్నియు ఒక స్థలమున ఏకత్రితము చేసినందువలన నెన్నియో సాంకేతిక సంస్థలను (Technical Institutions) ఏర్పాటుచేయు సావకాశము కలుగును ఆ సంస్థలమూలమున మీ కందరకును వృత్తిపనులు నేర్చుకొనుటకును, అన్న వస్త్రములు, వసతి గృహముల విషయములో గలుగు సకల ఆవశ్యకతలను సమకూర్చుకొనుటకును కావలసిన ధన సంపాదన చేసికొనగల సావకాశము కలుగును. సమస్త కార్యక్రమమును నిరాటంకముగ జరిగిపోవుట కవసరమైన ధర్మ సంస్థలు (Trusts and wakf) ఏర్పాటు చేసికొనవచ్చును. సర్ సాహబ్జీ మహారాజ్ వారు 1915 వ సంవత్సరములో శంకుస్థాపనచేసి స్థాపించిన దయాల్బాగు 1916వ సంవత్సరము లగాయతు తన శక్త్యనుసారము ఈ మార్గమున ముందంజ వేయుచునే యున్నది. ఈ వలసలో ప్రస్తుతము మగపిల్లల కొక ఇంటర్ మీడియట్ కాలేజీయును, ఆడపిల్లలకు మరొక కాలేజియు నున్నవి. గతించిన మూడు సంవత్సరములనుండి ఆడపిల్లల కాలేజీలో బి. ఏ. క్లాసులు కూడ ప్రారంభించిరి. ఒక టెక్నికల్ కాలేజి, ఒక లెదర్ వర్కింగు స్కూలు, ఒక సత్సంగ స్టాఫ్ కాలేజీ, పసిపిల్లల కొక నర్సరీస్కూలు కూడ ఉన్నవి. ఇవిగాక ఈ వలసలో ఒక అలోపథిక్ హాస్పిటల్ గూడ మెటర్నిటీ వార్డు సమేతముగ ఉన్నది. ఆరుగురు అలోపథిక్ డాక్టర్లు ఈ వలసలోని రోగులకు ఉచితముగ చికిత్సచేయుచున్నారు. గతించిన రెండు సంవత్సరములనుండియు సత్సంగులు స్థాపించిన ఛారిటబిల్ సొసైటీల సహాయముతో సభవారు దేశములోని వివిధ పట్టణములలో నింతవరకు పదునైదు ఫ్రీ ప్రైమరీ స్కూళ్ళను, పదునైదు హోమియోపథిక్ డిస్పెన్సరీలను స్థాపించిరి. 1916 వ సంవత్సరము దరిమిలా దయాల్బాగులో స్థాపించిన పరిశ్రమలన్నియు సభవారిచేతనే స్థాపించబడినవి. సాహబ్జీ మహారాజు వారు నిరుద్యోగముగను నిర్వ్యాపారముగనున్న వారందరికిని వృత్తి కల్పించ వలయునని కోరుచుండిరి. యుద్ధసమయమున ప్రజలకెట్టి అవసరములు ఇబ్బందులు కలుగునో వారికి ముందుగనే తెలుసును గావున వారు ఇచ్చట వివిధ పరిశ్రమలలోని వస్తూత్పాదన ఒక కోటిరూప్యముల వరకును వృద్ధి చేయవలయు ననెడి తీర్మానమును సత్సంగ సభలో ప్యాస్ చేయించిరి. అందువలన సత్సంగులను లిమిటెడ్ కంపెనీలు స్థాపించి వేర్వేరు పరిశ్రమలను నడిపించు నిమిత్తమై ప్రోత్సహించుట యవసరమని తోచినది. అందువలను 1941 వ సంవత్సరము ఏప్రియల్ నెలనుండియు ఈ సంస్థ పరిశ్రమలు వేర్వేరు

కంపెనీల రూపమున స్థాపింపబడినవి. ఈ కంపెనీలలోని షేరుహోల్డ
ర్లను ఏ కంపెనీ కా కంపెనీలో ప్రత్యేకముగ నున్నారు. సభా
హోల్డర్లందరిని వారిచ్చిన మూలధనము మీద నూటికి ఆరు రూపా
డెండు ఇచ్చుటకు నిర్ణయించిరి. ఈ ఏర్పాటు ద్వారా డైరెక్టర్లం
అయిదేండ్ల గడువులో ఇండస్ట్రీస్ యొక్క వార్షిక వస్తూత్పాద
రూపాయిలకన్న హెచ్చిపోవునట్లు సాధించి యుద్ధము ప్రారంభి
యతు కొద్ది సంవత్సరములలోనే ఆరువేల మందికి ఉద్యోగముల ని
పాధి కలుగజేసిరి.

ఈ వివిధ కంపెనీలతో బాటును సభతో బాటును సత్సంగ
దయాల్బాగ్ వస్తు విక్రయము గావించు నిమిత్తమై దేశములోని వి
ములలో నిట్టి లిమిటెడ్ స్టోరులను స్థాపించుటకై ప్రోత్సహించబ
తము భారతదేశపు పట్టణములు, పల్లెలలో అట్టి లిమిటెడ్ స్టోరులు
డెబ్బది ఐదు ఉన్నవి. ఆ సంఖ్య ఇంకను పెరుగుచున్నది. ఒక్కొక్క
ప్రాంతమునకు సంబంధించిన ఏయే వస్తువులను ఉత్పాదన చేయించ
వస్తూత్పాదన చేయుట ప్రారంభించి జనుల యొక్క యావశ్యకతలను
లను పూర్తి చేయవలయునని వివిధ ప్రాంతములలోని స్టోరులను ప్రో
చేయుచున్నాము. ఉత్తమోత్తమ విధమైన వస్తు సామగ్రిని మిక్కిలి
ధరలకు అమ్మవలయునని యే దయాల్బాగ్ స్టోరులు, దయాల్బాగ్ క
సదా ప్రయత్నించుచున్నవి. ఆ విధముగ నీ కంపెనీలకును, స్టోరుల
మును సంపాదించుటయే ప్రధానోద్దేశ్యముగ పెట్టుకొనినందున వీనికి
లాభములు కలుగుటలేదు.

జన సామాన్యమునకు మేమిపుడు దయాల్బాగులోను, ఇతర
లోను జరిగించుచున్న కార్యక్రమమును, నేనిపుడు సూచించిన ప
నచ్చి వారందుకు సమ్మతించిన యెడల ఉత్తమ విధమైన ప్రాపంచిక
(World Or. er) లేక ప్రపంచమున నంతర్దేశీయ స హ యో గ
స్థాపించు విధానము వారికి స్పష్టముగ బోధపడగలదు. ఛారిటబిల్ సొ
కూడ నిందులో జేర్చవచ్చును. ఇట్టి సంస్థల నధిక సంఖ్యలో వివిధ స్థ
తెరచినచో ప్రభుత్వము మీద నింతవరకు మోసియున్న భారము క
త్వరలో వారికి తొలగిపోవును. దేశములోని యితర జనులు కూడ నీ వ
నమునకు ఈ భారమును బాధ్యతను తమరు కూడ భరించ నుద్యుక్తులగు

# 136

1944 డిసెంబరు 25వ తేదీని బోర్డ్ ఆఫ్ అనెంప్లాయ్‌మెంట్ అండ్ ఇండస్ట్రీస్ దయాల్బాగ్ ( Board of Unemployment and Industries, Dayalbagh ) యొక్క సమావేశములో హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: భారతదేశములో అన్ని ప్రాంతములలోను వేర్వేరు స్థలములలో దయాల్బాగ్ వంటి సంస్థలు స్థాపితము కాగలవని సాహబ్జీ మహారాజ్ వారు అనేక పర్యాయములు సెలవిచ్చియున్నారు. ఈ వచనము నిస్సంశయముగ కార్య రూపము పొల్పగలదు. కాని సత్సంగములో కార్యకర్తల యొక్క సంఖ్య ఆవశ్యకమైనంతగ పెరిగి సత్సంగమునకు తగినంత మూలధనముండి, ఆ కార్యక్రమము జరిగించవలసిన స్థలములో నందుకు తగిన సౌకర్యములు తగినంతగ లభ్యమైనప్పుడే ఆ విషయము సిద్ధించగలదు. గతించిన యేడు సంవత్సరములలోను చేసినకృషి యంతయు చాల భాగము దయాల్బాగులోనే చేయబడినది. కాని ఇతరప్రాంతములలో చాల తక్కువ జరిగినది. కాని ఈ కార్యక్రమమంతయు దేశముయొక్క వివిధ ప్రాంతములలోని ముఖ్య పట్టణములలోను తదితర స్థలములలోను గూడ వృద్ధి చేయవలసిన సమయ మిప్పుడు వచ్చినది. మనము గతించిన ఏడెనిమిది యేండ్లలో నెరవేర్చిన కార్యక్రమముకన్న నాలుగురెట్లధిక పరిమాణములో నికముందు కార్యక్రమమును జరిపించవలయు ననెడి దృఢ సంకల్పము చేసికొన వలయును. కావున నిపుడు సత్సంగు లందరు ఈ సంకల్పమును, ఉద్దేశ్యమును మనసున పెట్టుకొని తమ కర్తవ్య బాధ్యతలను గురించి ఒండొరులతో ఆలోచించుకొన వలయును. మేము భిన్న భిన్న పట్టణములకు ఈ సారి వెళ్ళి చూచినపుడు, సమస్త ప్రాంతములలోను, పట్టణములలోను సత్సంగ కార్య క్రమమును సాగించుట అత్యవసరమై యున్నట్లును, అందుకు తగిన సావకాశములు, సౌకర్యములును గూడ అచ్చట లభ్యమగు చున్నవనియు, అదిగాక మూడు నాలుగు స్థలములలో ఈ కార్యక్రమము సాగించుటకై ప్రణాళికలు గూడ తయారగు చున్నట్లును బోధపడినది. ఈ కృత్యమును నెరవేర్చుటకై సత్సంగులు సంసిద్ధులుగ నున్న యెడల ఈ కార్యక్రమము త్వరలోనే ప్రారంభింప బడగలదు. మద్రాసు రాష్ట్రములోను, ట్రావెన్కూర్‌లోను గల హరిజనులకు సవర్ణ హిందువులకును అభివృద్ధి గలుగజేయుటకై సత్సంగముయొక్క కార్యక్రమమును ఆ ప్రాంతములలో సాగించవలయునని మద్రాసురాష్ట్ర సోదరులు ఒకానొకప్పుడు హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారిని ప్రార్థించిరి. కావున ఆ సందర్భములో భిన్న భిన్న స్థానములకు వెళ్ళి ఏయే స్థానములలో ఆ కార్య క్రమమును జరిగించిన నుపయోగకరముగ నుండునో గమనించి నివేదిక (Report) పంపించు నిమిత్తమై 1936వ సంవత్సరములో ఒక తమిళ దేశీయుల సమితి ( Tamil

Committee) కూడ యేర్పాటు చేయబడినది. కొంతకాలమైన పిమ్మట ఆ సమితి యొక్క నివేదిక అందిన పిమ్మట హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు త్వరలో తామే మద్రాసు వచ్చుచుంటిమి గావున ఈ విషయము నప్పుడే నిర్ణయించెదమని సమాధానము వ్రాసి పంపిరి. వారు శరీరమును విడిచి ఇప్పటికి పదునిమిది సంవత్సరములు గతించినవి. ఈ మధ్య కాలములో దేశకాల పరిస్థితులు కూడ చాల యెక్కువగ మారిపోయినందున ఇంతకు ముందునకన్న నిప్పుడు ఎక్కువ సదుపాయములు కూడ లభ్యమగుచున్నవి. సత్సంగము ఈ స్థానములలో చేయదలచుకొన్న కార్యక్రమమును ఇప్పుడు ఆ రాష్ట్ర ప్రభుత్వములును, శాసన కర్తలును స్వయముగ చేయించగోరు చున్నందున మనము ఈ పరిస్థితుల వలన లాభమును తప్పక పొందవలసి యున్నది. ఈ విషయములో మన కొంత మాత్రమును బద్ధకించ కూడదు. ఆలస్యము చేయకూడదు. మన దేశములో నలు దిక్కుల నుండియు మాత్రమే గాక ప్రపంచములోని సమస్త దేశముల నుండియు కూడ "ముందడుగు వేయుడు. నూతన ప్రపంచ వ్యవస్థను స్థాపించు" డనెడి నినాదములు వెలువడుచున్నవి. నూతన ప్రాపంచిక వ్యవస్థ స్థాపన చేయు నిమిత్తమై ప్రతి స్థలమునను మార్పులు చేయుట ఆవశ్యకమగును. కావున ఇప్పుడు ఏయే మార్పులు ఆ నూతన ప్రాపంచిక వ్యవస్థా స్థాపన నిమిత్తమై ఆవశ్యకమని తోచునో వానిని త్వరలో పూర్తి చేసి మన ప్రవర్తన విధానమును అందుకు తగినట్లు మార్చుకొన వలయును. మన మెవరి కన్నను వెనుకబడి పోకుండునట్లు ఎల్లప్పుడు ముందడుగు వేయుచునే యుండవలయును. అందు నిమిత్తమై కార్యకర్తలు కావలయును. వేరు వేరు ప్రాంతములలో సభ యొక్క సంస్థలను స్థాపించి జయప్రదముగ నడిపించి వాని నభివృద్ధి నొందించుటలో తగు సహాయము చేయగలిగినట్టి స్వయం సేవకులు కావలయును. ఇప్పుడు స్వయం సేవకులుగ పేర్లు వ్రాయించుకొను వారందరును ఈ దృష్టి కోణముతో నాలోచించుకొని స్వయం సేవకులుగ జేరుటకు నిశ్చయించుకొన వలయును. వారు ఆ విషయమును ఇప్పుడు వెంటనే తెల్పుకొని చెప్పవలయు నను నిర్బంధము లేదు. ఏదైన లోపముగాని సందేహముగాని ఉన్న యెడల మీ రాంతర్యమున ధ్యానము చేసికొని ఈ పనిలో స్వయం సేవకునిగ జేరి పనిచేయుట సరియేనా యని తెలుసుకొనుటకై భగవంతుని ప్రార్థించవలయును. చేరవలయునని జవాబు లభించిన యెడల హృదయపూర్వకముగ ఈ కార్యములో జేరి పోవలయును. లేని యెడల మీకన్న వెనుక నున్న వారు ముందుకు వచ్చి మిమ్ములను వెనుకకు త్రోసివేయుదురు. సమావేశము పూర్తియైన పిదప దివ్యేచ్ఛ కీ క్రింది శబ్దమును తీసి చదివిరి.

అబ్ మన్ ఆతుర్ దరస పుకారే।
కల్ నహీం పకడే ధీర్ న ధారే ॥ 1 ॥

(సారబచన్, వచనము 33, శబ్దము 1)

శబ్ద పాఠానంతరము హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి : నేను ఇప్పుడు చెప్పి యున్న విషయమును గురించి నేను మీకు ఇంకను పూర్తిగ వివరించనే లేదు. నా హృదయమున నింతవరకు బయలు వెడలుచున్న ఆలోచనలను పసుసగ మీ యెదుట ప్రస్తుత పరచితిని. ఇప్పుడు గూడ నా హృదయమున ఉన్న విషయములను ఒకటి రెండిటిని మాత్రము తప్పించి మిగిలినవన్నియు మీ యెదుట ప్రస్తుత పరచితిని. మన దృష్టికి గోచరమైనట్టి మన పూర్వ లోపము లన్నియు నట్లే యుండిపోయినవి గాని వానిని మనము పోగొట్టుకొన లేదు. చెప్పవచ్చిన దేమనగా గత సంవత్సరములలో జరిగిన కార్యక్రమము యొక్క ఫలితము సంతోషముగ లేదు. ఇప్పుడు మనకు ఉండ వలసినంత అభివృద్ధి ఇంకను కన బడుటలేదు. కావున నేను నిన్నను ఈ రోజునను మీ యెదుట ప్రస్తుత పరచి నట్టియు ఇప్పుడు ప్రస్తుత పరచుచున్నట్టియు విషయములను మీరు సంపూర్ణ శ్రద్ధతోను దూరదృష్టితోను గ్రహించుకొని హృదయమున నెలకొల్పుకొని సరి యైన నిర్ణయమునకు వచ్చి ఆ ప్రకారము పూర్తిగ నడచుకొనుడు. లేని యెడల భగవంతుడు చేయదల్చుకొన్న కార్యము ఇప్పుడు సత్సంగములో నడిపించు చున్న పద్ధతిని పూర్తిగ నెరవేరనిచో ఆ కార్య సాధనకై దీనత్వముతో చెప్పెడి ప్రస్తుత పద్ధతి మార్చవలసి వచ్చి మరొక మానవుడు వచ్చి ఈ దీన త్వమునకు బదులుగ మరొక ప్రతికూల పద్ధతి నవలంబించి ఈ కార్యమును సాధించవలసిన పరిస్థితి యేర్పడవచ్చును. కావున నేను మీకు మనవి చేసికొన్న విషయములయొక్క మహత్త్వమును పూర్తిగ గ్రహించుకొని దూరదృష్టితో విషయమంతయు నిర్ణయించు కొనవలయును. ఈ రోజు డిశంబరు 25 వ తేదీయని జ్ఞాపకముంచుకొనుడు. ఈ రోజుననే యేసుక్రీస్తు ప్రభువును సిలువను వేసిరి. ఈ రోజు యొక్క మహత్త్వమును మీరు మనసున పెట్టుకొనుడు. సాహబ్జీ మహారాజువారు ఈ కుర్చీని విశ్రాంతి స్థానము గాదనియు, ఈ కుర్చీలో ముళ్ళు మేకులును ఉన్నవనియు అనేక పర్యాయములు సెలవిచ్చియుండిరి. దీనిలో కూర్చుండుట సుఖదాయకము కాదు. మీరు పైని చెప్పిన రెండు విషయము లను బాగుగ మనసున పెట్టుకొని ఈ నాటి కార్యక్రమ విషయములో యథా యోగ్యమైన నిర్ణయము చేసికొనవలయును.

# 137

1944 డిశంబరు 2వ తేదీన దేదీప్యమాన స్వరూపులైన హుజూరువారు రాధాస్వామీ సత్సంగ సభయొక్క సమావేశమునకు దయచేయలేదు. ఆ సమావేశానంతరము దయచేసి ఇట్లు సెలవిచ్చిరి. ఏదేని వివాహము జరుగవలసి యున్నప్పుడు ఆ పెళ్ళికొడుకు గాని ఆ సమయమున కనుపించని యెడలను లేదా ఒక నాటకము ప్రారంభము గావలసియున్నప్పుడు ఆ కథా నాయకుడు అక్కడ కనిపించకపోయినను ఆ వివాహము గాని నాటకము గాని జరుగుట అసంభవము గదా! నిన్న వస్తువిక్రియ సమయములో బయటనుండి వచ్చిన స్టోర్సు డైరక్టరులు, సేల్సుమెన్లును హాజరు కాలేదు. జమ్ము, నాగ్‌పూర్, గ్వాలియర్, రావల్‌పిండి, లాహోరు వగైరా స్థలముల పేర్లు పిలువబడినవి, కాని ఒక్కరుగూడ రాలేదు. ఇట్టి నిర్లక్ష్య భావముతో గూడిన వీరి ప్రవర్తన నా మనస్సునకు చాల బాధ కలిగించినది. ఈ కార్యము ఒక్క మానవునికి సంబంధించిన పని యని గాని లేక ఒక ప్రత్యేక వ్యక్తికి సంబంధించిన పని యని గాని భావింపరాదు. ఇది సమస్త సంఘమునకును, జాతికిని సంబంధించినది. కావున సంఘీయులందరును వీరిని నిన్న ఎందుకు రాలేదో కారణము అడిగి తెలిసికొనుటకు హక్కుదారులై యున్నారు. వీరు ఇచ్చటికి రాకుండ నుండిపోయి ఒక క్షణమాత్రమైనను వృథా వ్యయము గలిగించినచో ఇచ్చట కలిసికొన్న ఐదువేల సత్సంగులకును ఐదువేల నిముషములు అనగా ఇంచుమించు ఎనుబది నాలుగు గంటలు లేక మూడున్నర దినములు నష్టపెట్టిన వారగుచున్నారు. ఈ విధముగ వీరొక ఘోర అపరాధమును చేసిన వారుగ పరిగణింప బడ నేరరా? ఈ సంఘ మంతయు ఈ పెద్దలను ఈ అపరాధమునకై తగిన సమాధానము చెప్పవలయునని గోరతగరా? మీరు ఒక వ్యక్తి వచనములను చెప్పుచుండ వలయుననియు, మీరు వానిని ఒక చెవితో విని రెండవ చెవిలోనుండి పోనిచ్చుచు కాలక్షేపము చేయవలయుననియే అనుకొనుచున్నారు. కాని మీరు ఆ ప్రకారము నడచుకొని కార్యక్రమము జరిపించవలసి యున్నదనికూడ అనుకొనుటలేదు. ఈ కారణములచే నేను ఈ రోజున సభా సమావేశములో వచ్చికూర్చుండుటకు వాస్తవముగ నర్హుడను గానని భావించి సభా సమావేశమునకు నేను రాలేదు (హుజూర్ వారు సభయొక్క యూనిఫారమ్ దుస్తులను తిరిగి ఇచ్చివేయుచు) నా వద్ద నున్న సభా యూనిఫారమ్ దుస్తులను నే నిచ్చి వేయుచున్నానని సెలవిచ్చిరి. మీ యిష్ట ప్రకారము ఉత్తమ విధమున సేవ జేయగలిగిన మరొక వ్యక్తి యెవరైన నున్నయెడల అట్టి వ్యక్తి వీనిని తీసికొనుట సమంజసము. (సభా సదస్యులందరును, అచ్చట నున్న ఇతర సత్సంగులును అందరు నిలబడి క్షమార్పణ గోరిరి.) హుజూరు వారు అప్పు డిట్లు సెలవిచ్చిరి: ఇందులో క్షమార్పణ

ప్రశ్నయే లేదు. ఇది ఒక గంభీర విషయము. కార్యక్రమమును యోగ్యమైన విధముగ నడిపించ వలయునా వలదా యను ప్రశ్న యొక్కటే పొడముచున్నది. యేదేని కార్యము లేక కర్తవ్య బాధ్యత కొందరికి వప్పుచెప్ప బడినపుడు ఆ కార్య కర్తలే ఆ కార్యమును విడిచి వెళ్ళిపోయిన యెడల ఆ సమస్త కార్య క్రమము యొక్క భారము ఏ వ్యక్తి శిరమున నున్నదో ఆ వ్యక్తి ఆ పనిని సాధించుట యెట్లు? ఆ కార్య భారముయొక్క ఉత్తరదాయిత్వమును ఆ వ్యక్తి శిరమున యే మహాపురుషు డుంచెనో ఆ మహాపురుషునికి అందును గురించి ఆ వ్యక్తి సమాధాన మేమి చెప్పగలడు? ఒక సైన్యము యొక్క లెఫ్టినెంట్ ఆ సైన్యము యొక్క కెప్టెనుతో సహకరించని యెడల యుద్ధము ఎట్లు సాగగలదు? అట్టి పరిస్థితిలో కెప్టెన్ రాజీనామా యిచ్చి అతని స్థానములో ఉత్తమ విధమున పని సాగించగలిగిన మరొక వ్యక్తి ప్రవేశించి ఆ పనిని బాగుగ సాగించుటయే శ్రేష్ఠము. అటులనే ఒక మేనేజింగ్ డైరెక్టరు కాని ఇతర కార్యకర్తలు గాని వారి కార్యమును నెరవేర్చుటకు తగిన అర్హతను గలిగి యుండని యెడలను, లేక జన సామాన్యమునకు వారి యందు విశ్వాసము తప్పిపోయినను అట్టివారు తమ పదవికి రాజీనామా నిచ్చుచు మరొక యోగ్య వ్యక్తులను ఆ స్థలములలో పెట్టుటయే ఉత్తమము. కావున ఇందులో క్షమార్పణ కోరుట యను ప్రశ్నయే లేదని నేను మనవి చేసికొనుచున్నాను. **Under the circumstances I lay down arms, (uniform) here. You should place it on better shoulders.** అనగ ఈ పరిస్థితిలో నేను నా ఆయుధములను (వస్త్రములను) తిరిగి వెనుకకు ఇచ్చివేయుచున్నాను. మరొక శ్రేష్ఠతరమైన అధిక యోగ్యత గల వ్యక్తిని వీనితో అలంకృతుని జేయగోరు చున్నాను. మీ రీ సమయములో గలిగించిన పరిస్థితి వంటి పరిస్థితియే సర్కార్ సాహెబ్ వారి కాలములో గూడ నొకప్పుడు కలిగెను. అప్పుడా పద్ధతిని నడచుకొన్నందువలన యెట్టి పరిణామము గలిగెనో మీ కందరకును బాగుగ తెలిసియే యున్నది. ఇక ముందు గూడ అట్టి పరిణామమే తిరిగి తటస్థించగలదు. సాహెబ్జీ మహారాజ్ వారు 1914వ సంవత్సరములో పర్యటన చేసి వచ్చిన పిదప బట్టలను అందరికి ఇచ్చుచు నా కొక తలగడ ఇచ్చి అది నీవు తలక్రిందనైన లేదా తలమీదనైన ఉంచుకొనవచ్చునని సెలవిచ్చిరి. తలక్రింద పెట్టుకొనుట యనగ ఆ తలగడ నాకు సాయము చేయు ననియు, అనగ నా కది తోడుగ నుండుననియు, శిరముపైన ఉంచుకొనుట వలన వారి దయామయ రక్షక హస్తము నా శిరమున నుండుననియు నేను ఎందును గురించియు చింతపడ నవసరము లేదనియు వారి యభిప్రాయ మైనట్లు తేటపడుచున్నది. అనగ వారి రక్షా సహాయములు రెండును నాకు తోడుగ నుండునని వారు సూచనగ సెలవిచ్చిరని బోధపడుచున్నది. 1937వ సంవత్సర

ములో హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు మద్రాసులో నుండగ "నేను ఇక ముందు వచ్చినపుడు గణేశ్వరరావు వలె బలిష్ఠమైన బాహువులు గలిగి ఇచ్చట పర్యటనకు వచ్చెద"నని సెలవిచ్చి యుండలేదా? వారు ఈ విషయములన్నిన్నిటిని చెప్పుటలో వారి యభిప్రాయ మేమై యుండును? భవిష్యములో కార్యక్రమము మహా తీవ్రముగ సాగించ బడుననియే వారి యభిప్రాయము. మీ రందరును ఆ విధముగ పని సాగించుటకు తయారుగ లేనిచో రాజీనామా ఇచ్చుటయే నాకు సవ్యమైన విధానము. 1937వ సంవత్సరములో మీమీ స్టోర్సు యొక్క ఆవశ్యకతలను గురించిన ఛార్టు ఒకటి కొద్ది మాసముల ముందుగనే మీరు నింపి పంపవలయుననియు, అట్లు చేసినందువలన పని సాగించుటలో నెక్కువ సౌకర్యముగ నుండు ననియు మీకు చెప్పబడినది. అట్లు నింపుటలో మీ కేమి కష్టమున్నది? ఏదేని స్టోర్సులో సప్లై అయిన సామగ్రి అచ్చట నిల్వగ నుండి పోయిన యెడల దానిని ఆ ప్రాంతీయ డిస్ట్రిబ్యూటింగ్ స్టోర్సు ద్వారా మరొక స్టోర్సునకు పంపించవచ్చును. దయాల్బాగ్ వస్తు సామగ్రి యెద్దియు బజారులో అమ్ముడు కానట్టిది లేదు. కావున ఒకవస్తువు ఏదేని స్టోర్సులో అమ్ముడుగాకుండ నుండి పోయిన యెడల దానిని ఈ విధముగ మరొక స్థలమునకు పంపించవచ్చును. పైన చెప్పిన విధముగ ఛార్టు పంపినందువలన మీ కెట్టి హానియు గలుగనేరదు. సంఘమందరును తిరిగి తిరిగి క్షమార్పణ నర్థించిన మీదట హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి: నేను మీ కందరకు నిపుడే సర్కార్ సాహబ్ వారి కాలములో జరిగిన తప్పుడు పద్ధతినే మనము గూడ పోవుచున్నామని చెప్పియుంటిని. సత్సంగములో Military discipline (సైనిక క్రమశిక్షణ) యుండినపుడే గాని పని నడువజాలదని నా యభిప్రాయము. ఏ వ్యక్తి కైనను ఒక ఆజ్ఞ (Command) ఇవ్వబడినపుడు దానిని సైనిక క్రమశిక్షణ పద్ధతిని (Military discipline) పద్ధతిగ వెంటనే నెరవేర్చవలయును. అట్లు చేయుటలో పెద్ద, పిన్నయని గాని, అధికారి, సేవకుడు అను భావమును గాని అడ్డుగ మధ్యన చొరనీయుగూడదు. మీరు ఈ విషయమును మనసున నుంచుకొని, మనలో సైనిక క్రమశిక్షణ స్థాపించుట యుక్తమో కాదో తేల్చుకొనవలయును.

సభా సమావేశము పూర్తియైన మీదట లంచ్ (Lunch) జరిగినది. సభా సభ్యులందరును గాక బిజినెస్ కును, ఇండస్ట్రీస్ కును సంబంధించిన కార్యకర్త లందరును గూడ అందులో పాల్గొనిరి.

హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి: ప్రతి స్టోర్సుయొక్క కార్యకర్తయు తన స్టోర్సునకు అవసరమైన వస్తువుల కోటా (Quota) ఇచ్చటి నుండి తిరిగి వెళ్ళిపోక ముందే తప్పక ఒక ఫారమ్‌లో నింపవలయును. అట్లు (Quota) ను భర్తీ

చేయుట స్టో ర్సు కు ను, ఇండస్ట్రీస్ కును ఈ రెండింటికిని చాల ఆవశ్యకము. కావున ఈ పని చేయుటలో జాప్యము చేయకూడదు.

భోజనానంతరము రత్నాబాయి, లక్ష్మీబాయి యనెడి పేర్లుగల యిరువురు మహారాష్ట్ర భక్త సోదరీమణులు క్రింది శబ్దమును పఠించిరి :

మన్ మోరా గురు సంగ్ లాగ్ హో ॥టేక్ ॥
గురుసంగ్ ప్రీతి కరో తుమ్ ఐసీ,
జస జోతీ సంగ నయనా ।
పల బిసరే కుఛ్ సూఝే నాహీం,
ఘోరమ ఘూర్ హీ రైనా హో ॥ 1 ॥

( ప్రేమబిలాస్, శబ్దము 111 )

శబ్ద పాఠానంతరము హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి. If you want to eat you must sweat first. If you want Self Government you must learn to govern yourself first. If you want to deserve anything you must learn to serve others. అనగ మీకు భోజనము కావలయునన్న యెడల మొట్టమొదట మీరు కష్టపడి చెమటూడ్చి పనిచేయవలయును. మీరు స్వరాజ్యము కావలెనని కోరినచో మొట్ట మొదట ఆత్మనిగ్రహము చేసికొనుట నేర్చుకొనవలయును. ఏ పదవికైనను మీ కధికారార్హతలు గలుగవలయునని గోరినచో మీ రితరులకు సేవ చేయుట ముందు నేర్చుకొనవలెను.

## 138

1945వ సంవత్సరము మార్చి నెల 18వ తేదీన విద్యార్థుల సత్సంగములో నీవలసలోని యెనిమిది యేండ్లకు మించిన వయసుగల పిల్లలందరును తమసంరక్షకులతో కూడ వచ్చి హాజరయిరి. శబ్ద పాఠానంతరము హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి : ప్రస్తుతకాలమునకు పూర్వకాలమునకును చాల భేద మున్నది. పరిస్థితులు, ఆదర్శములు, ఆలోచనలు, ఆవశ్యకతలును అన్నియు మారి పోయినవి. పూర్వకాలములో అందరికిని అన్న వస్త్రములు సమృద్ధిగ నుండె జనసంఖ్య ననుసరించి వసతికి గృహములును కావలసినన్ని యుండెడివి. ఇప్పుడు జన సంఖ్య పెరిగి, క్రొత్త క్రొత్త భేదములు బయలుదేరినందున జనుల ఆవశ్యకతలు పెరిగి పోయి పూర్వముకన్న చాల మారిపోయినవి. ఆ హేతువు వలననే కొన్ని

దేశములు తమ బలపౌరుషముల నుపయోగించి ఇతర దేశములపైన అధికారము చలాయించు పద్ధతి నవలంబించిరి. వారు ఆపై దేశప్రజలను వివిధ రూపములైన యన్యాయములుచేసి తమ స్వాధీనములో నుంచుకొని, తమసొంత ఆవశ్యకతలను వారి ద్వారా వారి దేశముల ద్వారాను పూర్తిచేసి కొనుచున్నారు. యుద్ధములు చేయు జాతులలో, బలవత్తరమైన వారందరు నొక సంఘముగ నేర్పడి, ప్రజలకు నలురకములైన స్వాతంత్ర్యములు గలుగజేసిన యెడల వారికి ప్రస్తుతము గలుగుచున్న బాధలు చాలవరకు నశించిపోగలవని తీర్మానించిరి. ఆ నాల్గు స్వాతంత్ర్యము లెవ్వి యనగా: 1. రుగ్మత నుండి స్వాతంత్రత. అనగా రుగ్మతగల్గినపుడు ప్రతివ్యక్తికిని అవసరమైన చికిత్సకు సంపూర్ణ ప్రబంధ ముండవలయును. 2. ప్రతి వ్యక్తికిని వసతికి గృహము విషయములోను, అన్నపానీయములు, కట్టు వస్త్రముల విషయములోను తగిన యేర్పాటు చేయవలయును. 3. జనులలో నిరక్షరత యుండకూడదు. అనగా జనులందరికి వ్రాతకోతలు చేతనై యుండవలయును, అందరును పవిత్రాంతఃకరణ గలవారు కావలయును. 4. మత విషయములు, ఇతర విషయములలోను ఎవరి ఇష్టాను సారము వారు భిన్న భిన్న భావములను స్వీకరించుటకును, వానిని ప్రచారము చేయుటకును, వానిని గురించి తమ యభిప్రాయములను నిర్భయముగ ప్రకటించుటకును ప్రతివ్యక్తికిని పూర్ణ స్వాతంత్ర్య ముండవలయును. ఈ యావశ్యకతలలోనే మానవుని సమస్తావశ్యకతలును ఇమిడి యున్నవనియును, అందువలన ఈ స్వాతంత్ర్యములు గలుగ జేసిన యెడల ప్రజలందరికి జీవితములు సుఖశాంతులతో గడచిపోగలవనియును ఆ దేశముల ప్రజల యభిప్రాయము. అట్లైనచో తిరిగి మహాయుద్ధములు వచ్చునేమో యను భయము ఉండదని వారి యభిప్రాయము. కాని మీరు కనిపెట్టి చూచినచో దయాల్బాగులో నీ నాల్గు విధములైన ప్రబంధములు ప్రప్రథమము నుండియు నేర్పాటు చేయబడి నడపబడుచునే యున్నవి. అట్లుండగా సద్గురుభక్తి చేయుచు సత్సంగ శిక్షణ ననుసరించి నడుచుకొన్నందువలన ఇహసంబంధమైన ఆవశ్యకతలు పూర్తికాజాలవనియు, ఆ శిక్షణ వలన మానవులు ఉత్సాహ రహితులుగను, బద్ధకస్తులుగను అయిపోయి, వారిలో ఆత్మవిశ్వాసము నశించిపోవుననియు, జనులు మరి దోషారోపణ మెట్లుచేయగలరు? ప్రస్తుత సమయములో మనను బాధించుచున్నట్టి హెచ్చుధరలు వగైరా కష్టముల నుండి మనము తప్పించుకొన గోరినచో ఆ లోపములను పూర్తిచేయుటకు సరియైన యుపాయము ఇండస్ట్రీసే అని మీరు గుర్తించవలయును. పెద్ద పెద్ద దేశముల ప్రజలు అందరును కలిసి ప్రతివ్యక్తికిని జీవనోపాధి గల్గించువృత్తి యుండవలెననియు, ఆ వృత్తి ఆ వ్యక్తి యొక్క ఖాళీ సమయము అంతయు వినియోగపడు నట్లుండవలయుననియు నిర్ణయించిరి. మీరీ విషయము మనసున నుంచుకొని యిపుడేమి చేయవలసి యున్నదో తెల్పు

కొనుడు. ఈ సంవత్సరము హైస్కూలు పరీక్షలకు వెళ్లుచున్న పిల్లలు చాల తొందరగా తేల్చుకొన వలయును. ఏమియు నాలోచించు కొనకుండ ఆర్ట్సుకాలేజీలలో జేరిపోవుట తప్పడు పద్ధతి. మీకు పరీక్షలు ఇంకను కొన్నిరోజుల వరకు మొదలు పెట్టవు. కావున మీకీ విషయమును గురించి ఆలోచించు కొనుటకు 3,4 రోజులు గడువున్నది. మీరిచ్చట కార్ఖానాలోనే పని నేర్చుకొనవలెనన్న నాపని నేర్చుకొనుటకు సత్సంగము తరఫు నుండి మీకు సంపూర్ణ సావకాశ మివ్వ బడును. ఇండస్ట్రీస్‌లో పని నేర్చుకొన్నందువలన మీకు లభించినంత జీతములు ఆర్ట్సుకాలేజీలలో చదువుకొన్నవారి కెన్నటికిని లభించ నేరవు. మీ కిప్పుడు దయాల్బాగ్ ఇండస్ట్రీస్‌లో తయారైన వస్తుసామగ్రి చూపించ బడును. కొన్నిరోజులు ట్రైనింగ్ అయిన తరువాత నీవస్తువులను మీరే స్వయముగ తయారుచేసి డబ్బు సంపాదించగలరు. పాఠశాలలలో చదువుకొను చుండగనే, ఈ పనులలో ట్రైనింగు కావలయునని కోరు విద్యార్థులు, తమ సంరక్షకులతో సలహా సంప్రతింపులు చేసికొని పేర్లువ్రాయించుకొన వచ్చును. కొన్నిరోజుల క్రితము మీకు **Dignity of Labour** అనగా పరిశ్రమ యొక్క ఉన్నత తరహాను గురించి వివరించితిమి. మీరు కష్టపడి ధన సంపాదన చేసికొను అలవాటు నేర్చుకొన వలయును. స్కూళ్లలో చదువుకొనుచునే, యెంతయో కొంత సంపాదించు కొనుచుండవలయును. అనగా **Earn while you learn.** మొదటలో మీ సంపాదన నిస్సందేహముగ తక్కువగనే యుండును. ఇప్పుడు అయితే మీ తల్లిదండ్రులు పాటుపడి పనిచేయ గలశక్తి గల్గియున్నారు. కావున వారి ఇరువురి సంపాదన వలనను మీకుటుంబ పోషణ అయిపోవుచుండును. కాని వారు వృద్ధులైనపుడు వారి సంపాదన తగ్గిపోవును. కాని మీరు ప్రారంభమునుండియు పాటుపడి పనిచేసి ధనార్జనచేయుటకు అలవాటు పడి యున్నయెడల కావలసినంత ధనమును సంపాదించ గలుగుదురు. కావున ఈ విధముగ రెండువైపుల నుండియు ధనార్జన కలిసినందువలన ఆదాయములో లోపము లేకుండ కుటుంబ పోషణ సులభముగ నైపోవును. ఆ తర్వాత 7వ తరగతి లగాయతు 12వ తరగతివరకు క్లాసులలో చదువుచున్నట్టి విద్యార్థులును, టెక్నికల్ కాలేజీ విద్యార్థులును చాలమంది పేర్లు వ్రాయించుకొనిరి. హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: ఇప్పుడు పేర్లు వ్రాయించుకొన్నవారికి మేము అభ్యాస పద్ధతి నుపదేశించను లేదు. సత్సంగులుగ చేయను లేదు. కాని వారిని సత్సంగము యొక్క ఇండస్ట్రియల్ మిలిషియా (**Industrial Militia**) అనగా పారిశ్రామిక సేనలో చేర్చుకొంటిమి. ఆ సేనాదళములో పనిచేసి వారు తమకు స్వయముగను, తమ దేశమునకును ఉపకారము చేసికొన గల్గుదురు. ఇతర దేశములు తమ దేశములలో తయారైన వస్తువులను భారత దేశమునకు పంపు నిమిత్తమై యుద్యుక్తలగు చున్నారనెడి వదంతులు ఇక్కాలమున చాల వినవచ్చుచున్నవి. మీరు

ఈ ఇండస్ట్రియల్ మిలిషియాను (Industrial Militia) వృద్ధి చేసిన యెడల మీరితర దేశముల సరకులను కొనుటకు బదులుగ మీరే సకల విధ సామగ్రిని తయారు చేసికొని, స్వంతముగ నుపయోగించుటయే గాక, ఇతర పరదేశములకు గూడ యెగుమతి చేయగలరు.

అప్పుడు రెండుశబ్దములు పఠనముచేసిరి. పేర్లు వ్రాయించుకొన్న విద్యార్థులకు హుజూరువారు మిఠాయి ప్రసాదము దయచేసి, కరచాలనము (Shake-hand) చేసిరి.

## 139

1949 అక్టోబరు 16వ తేదీన జరిగిన సభాసమావేశములో హుజూర్ వారిట్లు సెలవిచ్చిరి: నాకు చిన్నప్పటి నుండియు వ్యవసాయము చేయుటయందాసక్తి మెండుగ నుండి, కృషికులతో స్నేహమెక్కువగ నుండెడిది. నేను ఆ కారణము మూలముననే, విద్యావిషయములో ఇంజనీరింగు చదువుకొని, పంటచేలకు, నీటి సప్లైకి సంబంధించిన ఇంజనీరుపని చేయగోరితిని. కాని ప్రభుత్వము నన్ను P.W.D. విభాగములో నియోగించి నాకు రోడ్లు, భవనములును నిర్మాణముచేయు కృత్యమును అప్పగించిరి. అయినను గూడ నాకు వ్యవసాయ కార్యము, చేలకు నీటిపారుదల కృత్యములును చేయుదమనెడి ఆసక్తి హృదయమున యథాప్రకారము తీవ్రముగనే యున్నది. అందుమూలముననే నన్ను మొట్టమొదట సర్గోధాలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు పదవిలో నియమించినపుడు నేను నా ఆవరణలో భూమిని వ్యవసాయము జేయనారంభించితిని. ఆతర్వాత గూడ నన్నెచ్చట ఉద్యోగములో వేసినను నా ఆవరణలో నేను సస్యములను పండించి కూరగాయలను వేయుచునే యుంటిని. దయాల్బాగు ప్రబంధకార్యము నాకు అప్పజెప్పబడినపుడు నేను 1940 వ సం॥ రములోనే మొట్టమొదట ఇచ్చట గోధుమలు పండించవలయునని సలహా యిచ్చితిని. ఆ సమయములో నిచ్చట యాబది యెకరముల భూమి మాత్రమే వ్యవసాయము చేయబడుచుండెను. కాని బర్సీన్, నేపియర్, గడ్డి వగైరా పశుగ్రాసములుదప్ప మరొక సస్యము లెవ్వియు ఇచ్చట పండించబడుట లేదు. ఇచ్చట తయారైన పశుగ్రాసము కూడ పశువులకు సంవత్సరము పూర్తిగ చాలకుండుటచే బయటనుండి కొనవలసి వచ్చుచుండెను. కావున నప్పటి నుండియు నిచ్చట సస్యములు పండింపనారంభించితిమి. 1941 వ సం॥ రములో 16 ఎకరములలోను, మరుసటి సంవత్సరము 20 ఎకరములలోను, 3 వ సాలు 30 ఎకరములలోను అటులనే సాలు సాలుకి పెంపుచేయుచు 1947—48వ సంవత్సరములో ఇన్నూరు ఎకరములలో ధాన్యములు పంట పండించితిమి. అప్పటిలో

రెండవ ప్రపంచ మహాయుద్ధము జరుగుచుండెను. మన పశువులకు గ్రాసము కొనుగోనుటకు బయట కూడ లభ్యము గాకుండెను. ఆకారణముచే మొదటి పంట, రెండవ పంట సస్యముల గడ్డి జాగ్రత్త పెట్టుట ప్రారంభించి పచ్చిక గ్రాసపు భూములను గూడ పెంచితిమి. అందుమూలమున గతించిన 3 సంవత్సరముల నుండియు మేము యెండుగడ్డి గాని, పచ్చి గ్రాసము గాని బయట నుండి కొనుట పూర్తిగ ఆపివేసితిమి. మన పశువులకు ఉపయోగించుటయేగాక, చుట్టు ప్రక్కలజనుల పశువులకు గూడ కొంత పశుగ్రాసమును అమ్ముచుంటిమి. ఈ లోపున మాకు అనేక కారణముల వలన ప్రతి సంవత్సరము ధాన్యపు భూముల విస్తీర్ణమును హెచ్చు చేసుకొనవలసిన యవసరము కలుగు చుండెను. ధరలు పెరిగిపోవుటవలన దేశములో ధాన్యముల రేషనింగు ప్రారంభమై, గోధుమల రేషను మొత్తము ప్రతి వ్యక్తికిని 2 ఛటాకులు మాత్రమే ఇచ్చునట్టి క్లిష్టపరిస్థితి వచ్చెను. ఆ పరిస్థితి జూచినపుడు ప్రభుత్వము గోధుమల రేషను ఇంకను తగ్గించిన యెడల ప్రజలకు తిండిలేక చనిపోవు పరిస్థితి గలిగి, దయాల్బాగు వాస్తవ్యులకు గూడ చాల ప్రమాద పరిస్థితి కలుగనచ్చు ననెడి భయము కలిగెను. కావున గోధుమల వ్యవసాయపు భూముల విస్తీర్ణమును అధికాధికముగ, బహు త్వరితములో పెంచివేయవలయునని, దయాల్బాగులో వీలుగనున్న ప్రతిభూమి లోను గోధుమలు పండించవలయుననియు దూరదృష్టితో నిశ్చయించబడినది. భగవంతుని దయవలన నట్లు జరుగకుండ నుండవలయునే గాని, తిరిగి యుద్ధము వచ్చిన యెడల, యుద్ధావసరము నిమిత్తమై దేశములోని గోధుమలను ప్రభుత్వము ఏ విధముగనైన కొనుగోలు చేసివేయుదురు. అట్లైనచో దేశములో గోధుమలకు కరువు రాగలదు. ఆ పరిస్థితిలో వ్యవసాయము చేయకుండ నున్న వారికి గొప్ప వ్యాకుల పరిస్థితి గలిగి జనులు తిండి లేక చనిపోవు సమయము వచ్చినపుడు మీరేమి చేయుదురో, యేమి తిందురో చెప్పుడు. ఆ పరిస్థితిలో మీరందరు నిస్సందేహముగ దయాల్బాగులోని ప్రెసిడెంటుగారి వద్దకు, ఇతర పదాధికారుల వద్దకును వెళ్ళి మాకు తినుటకు రొట్టె ఇప్పించవలయునని కోరుచు, ఆ బాధ్యత సంపూర్ణముగ వారి శిరమున పెట్టుదురు. కావున మీరు ఈ దూరదృష్టితో ఆలోచించుకొన్న యెడల, ఇచ్చట ప్రారంభించిన వ్యవసాయ కార్యము అంతయు పూర్తిగ సమంజసమును యుక్తము నైనదనియు, కాలమాన పరిస్థితులను బట్టి చాల యావశ్యక మైనదనియు మీకు బోధపడగలదు. ఈ యావశ్యకత మీరు అంగీకరించిననాడు మీరు వ్యక్తిగతముగను, సామూహికముగను ఈ కార్యములో పూర్తిగ పాల్గొని దీనిని అభివృద్ధి చేసి జయప్రదముగ సాగించని యెడల నట్టి ప్రవర్తన యెవ్విధముగ యుక్తమగునో ఆలోచించుకొనుడు. మిమ్ముల నెవరును ధనము నిమ్మని గోరుటలేదు. మీలో ప్రతి వ్యక్తియు పూర్తిగ శ్రద్ధ వహించి శరీరమును వంచి పనిచేయుట మాత్రమే ఆవశ్యకము,

ప్రతి దినము నిట్లు మిమ్ములను హెచ్చరించుట నా కిష్టము లేదు. ఇది సరియైన పద్ధతి కూడ కాదు. ఇందువలన నాకు కష్టము కలుగుచున్నది. మీరే ఈ కృత్యము యొక్క ఆవశ్యకతను అర్థము చేసుకొని మిమ్ముల నెవరును బలవంతము పెట్టనక్కర లేకుండగను, బ్రతిమాలుకొన నక్కర లేకుండగను ఈ పనిలో పాల్గొనవలయును. ఈ మధ్యన ప్రభుత్వమువారు గూడ ప్రతి వ్యక్తియు ప్రతి దినము సోషల్ సర్వీసు అనగ సాంఘిక సేవ చేయుచుండ వలెననియు, ప్రతి గ్రామములోని నివాసస్థు లందరును కలిసి ఆయా గ్రామములలో నిరుపయోగముగ పడియున్న భూములను కృషి యోగ్యముగ చేయు నిమిత్తమై పాటుపడి వాని నెవ్విధమున నైన ఉపయోగములో పెట్టవలయుననియు నిశ్చయించిరి.

ఆది నుండియు నింతవరకు ఇతర దేశములకు ధాన్యము పంపుచున్నట్టి ఈ భారతదేశము, ఇందలి జనాభాలో నూటికి 85 శాతము కృషిక వర్గముగ నుండియు కూడ, యీనాడు తన ప్రజల ఆహారమునకై యితర దేశములపైన ఆధారపడి యుండవలసి వచ్చు నంత దారిద్ర్యములో నుండి పోవుటయు, ప్రతి సంవత్సరమును కోట్లకొలది రూపాయిల ధాన్యములను పై దేశముల నుండి దిగుమతి చేయుటయు నెంత లజ్జాస్పదము! దేశములో డాలర్ల కొరతమూలమున ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, కెనడావగైరా డాలరు దేశముల నుండి ధాన్యములు లభ్యమగుట కష్టముగనున్నది. బాహ్యదేశములు ప్రతివస్తువుకును మూల్యమును డాలర్లు లేదా బంగారము రూపమున నివ్వవలయునని నిర్బంధించుచున్నారు. ఈ విషయమునకై యెన్నియో యేండ్ల నుండి భారతదేశమునకు బంగారము ఖర్చుచేయవలసి వచ్చుచున్నది. అందుచే బంగారముధర యేటేట పెరిగి పోవుచున్నది. బంగారము ధర పెరిగిపోవుటచే మన భక్త సోదరీలు ఇంట నున్న బంగారమును, వస్తువులను అమ్మివేయు చున్నారు. కాని తాము వ్యవసాయపు పనులు చేయకుండుటచే తమ్ము తామును, మిగత జనులందరిని గూడ ఇతర దేశములపైన ఆధారపడి పోవునట్లు చేయుచున్నామని ను, తమ వస్తు రూపముగనున్న వెండి బంగారములను పరాయి దేశములకు పంపించి, తిరిగి తమకు గాని, తమ సంతానమునకు గాని ఆ వెండి బంగారములు మరెన్నడు లభ్యము గాకుండ చేసికొను చున్నామనియును వారు తెలుసుకొనుట లేదు.

అప్పుడు ఆడవాండ్రకు ఇవ్విధముగ సెలవిచ్చిరి: మీరు కృషి కార్యమును బహిష్కరించిన యెడల కొద్ది కాలములో మీకు బంగారము గూడ పూర్తిగ లేకుండు పరిస్థితి కలుగ గలదను విషయమును మీరు జ్ఞాపక ముంచుకొనుడు. మీ వస్తువులన్నియు లాగుకొనబడి పోగలవు. వానిని రక్షించు కొనుటకై మీరు రోజును నియమ పూర్వకముగ కొంత సమయము నేర్పరచు కొని కృషి

కార్యములో తప్పక పాల్గొను చుండుటయే యుపాయము. మనము ప్రతి సంవత్సరము 6 వేల మణుగుల గోధుమలైనను పండించుచున్నయెడల ఆ మాత్రము పంట పండించుట కష్ట మేమియు కాదు. దయాల్బాగ్ నివాసులందరికిని మనిషి ఒక్కంటికి 2 ఛటాకుల గోధుమలు చొప్పున రేషను యివ్వగలము. ప్రస్తుతము మన భూములలో స గ టు న ఎకరమునకు 10 మణుగులు గోధుమలు పండుచున్నవి. కాని కొద్ది కాలములో ఎకరమునకు 20 మణుగులవరకు హెచ్చు చేయవచ్చును. ఇప్పుడు మనము 32 రకముల కూరగాయలు, స స్య ము ల ను పండించుచున్నాము. అందులో గోధుమలు, యవలు, శనగ, మొక్కజొన్న, గంట్లు, పెసర, ఆవాలు, చిలగడదుంపలు, బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, గోబీ, క్యాబేజి, చామదుంప, మిరపకాయ, వే రు శ న గ, ప్ర త్తి, పుచ్చకాయలు, ఖర్బూజాలు, బర్సీన్ గడ్డియు, నింక నెన్నియో రకములు చేరియున్నవి. ఇంతియ గాక, వేరుశనగ, చిలగడదుంప, బంగాళాదుంపల పంట నీ సంవత్సరము హెచ్చు చేయు చున్నాము. ఇచ్చట చెరకు, కందులు, మినుములు, పెసలు, బటాణీలు, వగైరా యితర పంటలు గూడ పండించవచ్చును. పాటుపడి పని చేసినందువలననే యీ పనులన్నియు నింతవరకు సఫలమయినవి.

తిరిగి ఇట్లు సెలవిచ్చిరి : ఇప్పుడిచ్చట కృషి కార్యము నియమానుసారముగ చేయుచుండుటచే పాఠశాల విద్యార్థులును, పసిపిల్లలును గూడ గత సప్త వర్షముల నుండియు రోజు తప్పిపోకుండ పొలములకు వచ్చి ఈ పని చేయుచుండుటచే వారి హృదయములలో నిందు విషయమై ఆసక్తి ఆదరములు పెంపొందగలవు. ఇకముందు కాలములో నీ పిల్లలు పెద్దవారైనపుడు, వ్యవసాయము యొక్క సంస్కారములు వీరికి చిన్నతనము నుండియు పడిపోవుచుండుటచే, వీరొక కృషిక జాతివారుగ తయారు కాగలరు. ఇపుడు మీావద్ద భూమి యుండి, భూములకు పట్టుటకు నీరును ఉండి భవిష్యములో కృషికుల జాతియొకటి తయారై పోవుచు నుండగా, మీా రీ వ్యవసాయ కార్యమును కట్టి పెట్టి వేసిన యెడల అదేమి సమంజసముగ నుండును. అప్పుడు మీారు ఈ కృషిక జాతి నెచ్చటికి పారద్రోలెదరు? ఇప్పుడు దేశమునకు గుమాస్తాలు వ్రాతగాండ్రును అవసరము లేదను విషయము మీారు తెలుసుకొన వలయును. ప్రతి దేశమునను ఇక్కాలమున వస్తూత్పాదన వృద్ధి చేయవలయుననియే మొరలు వినవచ్చుచున్నవి. వ్రాత కోతల పని చేయువా రీ కృత్యమును సాగించజాలరు. ఇందులకై కాయకష్టము చేయువారును, రైతులును కావలసి యున్నది. కావున మీారును మీా సంతానమును రైతులుగను, శ్రామికుల వర్గముగను తయారు కావలసియున్నది.

మీరు అప్పుడే సజీవముగ నుండగలరు. నేను ఇచ్చట కార్యక్రమ భారమును నామీద పెట్టుకొన్నది లగాయతు నేను మిమ్ములనే విషయములోను మోసము చేయలేదు గదా! ప్రారంభములో Industrial Programme నేను చేబట్టి నప్పుడు మిల్లును కొని స్టోర్సు స్థాపించి బ్యాంకిని తెరచితిమి. ఆ విధముగ కోటి రూపాయిల ప్రణాళిక పూర్తి చేసితిమి. భవిష్యకాలము యొక్క ఆవశ్యకతలను గుర్తు పట్టి అందుకుతగిన ప్రణాళికను తయారుచేయుట ప్రతి మానవునికిని సాధ్యమగు కృత్యముగాదు. ఈ పని కొద్ది వ్యక్తులు మాత్రమే చేయగలరు. గత ద్వాదశ వర్షములలో సత్సంగములో నే నేపని చేసినను మీ యోగ క్షేమములు శ్రేయస్సునే ప్రధాన లక్ష్యముగ పెట్టుకొని సాగించితిని. ప్రస్తుతము వ్యవసాయ కార్యము గూడ అదే దృష్టి కోణముతో సాగించబడుచున్నది. మీకు ఈ పని చేయుటలో శారీరక కష్టము కలుగుచున్నదనుట వాస్తవమే. ఉదయమున లేచి పని పాటలు పెందలకడనే చేసికొనవలసి వచ్చును. కాని అట్లు చేయుటవలన మీకును మీ కుటుంబమునకును మీ కులమునకును మాత్రమే గాక, మీ జిల్లా, మీ రాష్ట్రము, సమస్త భారత దేశమునకు గూడ మీ వలన లాభము చేకూరుచున్న దనెడి విషయమును మీరు గమనించుకొనవలయును. కొద్ది రోజులలో సాళువా పంటలు కోతకు వచ్చుచున్నవి. దాళ్వా విత్తనములు జల్లవలసి యున్నది. ఇవి చాల యావశ్యక కృత్యములు. కష్టపడి పని చేయవలసి యుండును. అప్పుడే మనము మన కత్యావశ్యకమైన గోధుమ వ్యవసాయమును సకాలములో చేయగల్గుదుము.

ఇప్పుడు మీకు సహాయము చేయు నిమిత్తమై స్త్రీలు గూడ సంసిద్ధులైనందున మీ కార్య భారములో వారు చేయ గలిగినంత భాగము మీకు తప్పిపోవును. అవ్విధముగ మీ రింత వరకు పడుచున్న శరీర కష్టములో కొంత భాగము మీకు భవిష్య కాలములో తగ్గిపోగలదు. నేను ఆఖరున మిమ్ములను రెండు ప్రశ్న లడగదలచుకొన్నాను. మీ రాలోచించి సమాధానము చెప్పవలయును. మనము వ్యవసాయ కృత్యమును ఇకముందు సాగించవలయునో, కట్టిపెట్టవలయునో యనెడి విషయమును ఇచ్చటనే తేల్చివేసి కొందము. 1.సాహబ్జీ మహారాజ్ వారి కిచ్చట వ్యవసాయ కార్యము సాగించి అభివృద్ధి చేయవలయునను దివ్యేచ్ఛయే లేనిచో వారిచ్చట భూముల నేల కొనుగోలు చేసి ఈ బీడు భూములలో దయాల్బాగ్ మైనరు, యమునా పంపుకాల్వ యనెడి రెండు కాల్వలను కూడ నేల త్రవ్వించిరో మీరే చెప్పుడు. దీనిని బట్టి వారికి భవిష్యకాలములో నిచ్చట వ్యవసాయ కృత్యము సాగించు దివ్యేచ్ఛ తప్పక ఉన్నదనియే బోధపడుచున్నది. సత్సంగ కార్య ప్రణాళికలో కృషి కార్యము చేరి యున్నదనియు ఆ పని తప్పక సాగించవలసి యున్నదనియు సాహబ్జీ మహారాజ్ వారు

సెలవిచ్చినట్లు నాకు మొట్టమొదట రెండు సంవత్సరముల క్రితమే ప్రేమిభాయీ చంద్రశేఖర మిశ్రాగారి వలనను ప్రేమీభాయీ తీరథ్ రామ్ గారి వలనను తెలిసినది. అది విని నేను చాల సంతోషపడితిని. వారి దివ్యేచ్ఛ అట్లున్నప్పుడు మీలో కొందరు ఈ పని చేయుటకు వెనుదీయుట ఎట్లు సమంజస మగును? 2. మిమ్ములను నేను అడుగదలచుకొన్న రెండవ ప్రశ్న ఏమనగ బయటనుండి రేషన్ గోధుమలు మన కిచ్చుట కట్టివేసినచో మీరు అప్పుడేమి చేయుదురు? మీరు దూరదృష్టితో ఈ రెండు విషయములను గురించి ఆలోచించుకొని ఈ సమస్యకు సమాధానమును, మీరు చేతులెత్తి అవుననియో, కాదనియో తెలియజేయుడు. అంతట అధికాధిక సంఖ్యగా అచ్చట నున్నవారు కృషి కార్యము నామోదించుచు చేతులెత్తిరి.

# 140

1950వ సం॥ జూలై 17వ తేదీ ఇంజనీరింగ్ కాలేజీ ఉద్ఘాటనసమయములో హుజూర్ మెహతాజీ మహారాజ్ వారిట్లు సెలవిచ్చిరి :- దయాల్బాగ్ నివాసులారా, సోదరీ సోదరులారా, నవయువక మిత్రులారా ! ఇంజనీరింగ్ కాలేజీ ప్రిన్సిపాల్ గారి ఆహ్వానము నంగీకరించి మీరందరు నిచటకు వచ్చి కలిసికొన్నందుకు నేను భగవంతునికి ధన్యవాదము లర్పించు చున్నాను. సత్సంగ దృష్టికోణములో సోమవారమురోజు శుభదినముగ మన్నింపబడు చున్నది. ముసల్మాన్ సోదరులకు ఈనాడు 'ఈదుల్ ఫితర్' అను పండుగ దినము అగుటచే వారు గూడ అట్లే ఈ రోజును ముఖ్యముగ భావించెదరు. మన నవయువక మిత్రులు పురాతనమునుండియు ప్రసిద్ధికెక్కిన ఇతరకళాశాలల కన్న మన ఈ క్రొత్త ఇంజనీరింగ్ కాలేజీకి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి దీనిలో చేరినందుకు నేను ముఖ్యముగ వారికి ధన్యవాదము లర్పించు చున్నాను. దయాల్బాగ్ ఇంజనీరింగ్ కాలేజీ తెరచుట కనుమతి ఇచ్చినట్లు ఆగ్రా విశ్వవిద్యాలయ కులాధిపతియైన యు. పి. గవర్నరు గారి వద్దనుండి మాకు 25 మే 1950వ తేదీనాడే కబురందినది. నేను అందునిమిత్తమై వారికి చాల కృతజ్ఞుడను. మాకు ఇంజనీరింగ్ కాలేజీకొరకు స్వంతభవనమును లేదు. ఇతరసామగ్రియైన నేమియు లేదు. ఈ స్వల్పకాలములో మేము చేయగలిగినంత వరకు ఏర్పాట్లు అల్పపరిమాణములోనే చేసితిమి. కలకత్తా, బొంబాయి, మద్రాసు, మచిలీపట్టణము, బెనారస్, రూర్కీ, ఆగ్రాపట్టణముల నుండియు, దయాల్బాగ్ నుండియు, మాకు లభించిన సామగ్రిని మాత్రమే మేము తెప్పించు కొనుచున్నాము. ఈ విషయములో మీ ప్రిన్సిపాల్ గారు వారి సహచరులును చేయుచున్న ప్రయత్నములకు నేను

వారికి గూడ హృదయ పూర్వకముగ కృతజ్ఞుడను. దేశమునకు స్వాతంత్ర్యము లభించినపిమ్మట భారతప్రభుత్వము దేశములో ప్రస్తుతమున్నట్టి ఇంజనీరింగ్ కాలేజీలను లెక్క చూచుకొని దేశముయొక్క ఆవశ్యకతలను పరిగణించుచు ప్రతి సంవత్సరము నాలుగువేల ఇంజనీర్లు క్రొత్తగ తయారు గావలసియున్న దని నిర్ణయించుకొని, నాలుగు ఉన్నత శ్రేణి కాలేజీలను క్రొత్తగ తెరువ వలసి యున్నదనియు, ప్రస్తుతము డిప్లొమాస్థాయిలో నున్న కొన్ని కాలేజీలను ఉన్నత శ్రేణిలోనికి మార్చవలయుననియు తీర్మానించుకొనిరి. కావున రాధా స్వామీ సత్సంగముగూడ తనశక్తిప్రకారము ఈ అవసరమును తీర్చు నిమిత్తమై సంసిద్ధమైనది. ఈ విషయములో మాకు భారతప్రభుత్వము సహాయమును చేయుటకు వాగ్దానమిచ్చినందున మేము వారికి కృతజ్ఞులము.

నేను మీకిచ్చెడి ఒకమంచిసలహా యేమనగ, మీరు మాంసము, మద్యము, మత్తుపదార్థములను పూర్తిగ వర్జించి, మీ కర్తవ్యములను చక్కగ గమ నించుకొని వానిని నెరవేర్చుకొనుచు, ఉపయోగకరమైనట్టి శ్రేష్ఠ పదార్థము లను వేనిని గూడ వ్యర్థముగ పాడుచేయవలదనియే. మీరు మీ క్రైసందిన వ్యవహారములలో దీనభావముతో ప్రవర్తించవలయును. మీరు జగద్రక్షకుని నెల్లప్పుడు జ్ఞాపకముంచుకొని సకల కృత్యములను వారి నామస్మరణతో చేసి కొనుచు, మీమీ కృత్యములను సొంతముగ పూర్తిచేయుటలో లోపమెంత మాత్రము చేయవలదు. ఉత్తమకోటి ధైర్యసాహసములతో ప్రవర్తించవలెనే కాని, మనో దౌర్బల్యమును, పరాజయ భయమును మనసున ఎన్నడు చొర నీయరాదు. న్యాయ సమ్మతమైనట్టియు, జనసామాన్యమునకు అంగీకృత మైన ట్టియు భావముల నెన్నడు త్రోసివేయరాదు. రాత్రివేళ తొందరగ పరుండి ఉదయమున పెందలకడనే లేచునట్టి అలవాటు చేసికొనుడు. అట్లు చేసినందు వలన మీకు బుద్ధి వికాసము, జీవితానందమును లభించగలవు. ఈ నాడు మీరు పూర్తి చేయగల కార్యమును మరునాటికి ఎన్నడును అట్టేపెట్టుంచ గూడదు. మీరు మీ మిత్రులతోను, స్నేహితులతోను హృదయ పూర్వక మైన ప్రేమ భావముతో మసలుకొనవలయును. మీ కళాశాల యెడల మీరు ఉత్తమ గౌరవభావమును పెంపొందించుకొనవలయును. ఏలనన నా కళాశాలయే మిమ్ములను ఇచ్చట నున్న కాలములో కర్తవ్య పరాయణులైన నాగరికులుగ జేయుటయేగాక వివిధ విధములైన నూతన సామగ్రిని తయారు చేయగల-ప్రస్తు తము మీలో గూఢముగ నున్న - గుప్త శక్తిని గూడ మేల్కొల్పుచున్నది. "సాదా జీవనము, ఉత్తమ భావములు" అనెడి చాల పురాతనమైన లోకోక్తి యున్నది కదా జీవిత సంగ్రామములో సజీవముగ నుండుటయే చాల జటిల ప్రశ్నగ నున్న యీ ప్రస్తుత సమయములో నీ లోకోక్తియొక్క మహత్త్వము

సత్వరముగ బోధపడగలదు. మీ మనస్సులను హృదయములను అల్లకల్లోలము చేసి మీ పథమునుండి తప్పిపోవునట్లు చేయు పరిస్థితుల లోనికి గాని స్థలములలోనికి గాని మీ రెన్నడు పోరాదు. ప్రతిదినము మీరు వ్యాయామము చేయుచు ఆట పాటలలో పాల్గొనుచుండవలయును. కాని కేకలు వేసి గందరగోళము చేయుట గాని మీస్వంత సమయముగాని ఇతరుల సమయమును గాని వృథా చేయుటగాని ఎన్నడు జరిగించరాదు.

ఏ కళాశాల యైనను దేశమునకు లాభకరముగ నుండుట దాని కార్య కర్తలు విద్యార్థుల పైనను ఆధారపడి యున్నది. కార్యకర్తలు విద్యార్థులను ఇతరుల పిల్లలుగ భావించుకొనక తమ స్వంత పుత్రులుగనే భావించుకొనుచు వారి అభివృద్ధి కొరకై శరీర మనస్సులను ధార పోయవలయును. విద్యార్థులు తమ యుపాధ్యాయులకు సంపూర్ణ గౌరవమిచ్చి, వారెట్లు చెప్పిన నట్లే నడచుకొనుచు వారి విద్యానుభవముల వలన సంపూర్ణ లాభమును పొందవలయును. పర్యవసాన మేమనగా, మీా రిచ్చట నున్నంతకాలము మీాకు యేర్పాటు ప్రబంధము వలన సంపూర్ణ లాభము పొందవలయును. దాటిపోయిన క్షణము తిరిగి రానేరదు. మీారు మీ జీవితములో భారత దేశమునకు, ప్రతి ప్రాణికి సేవ చేయుట కర్హత గల్గు నట్లు తయారు కావలయును. అట్లైనచో, మీ పేరు దయాల్బాగ్ ఇంజనీరింగ్ కాలేజీ ఇతిహాసములో స్వర్ణాక్షరములతో వ్రాయబడగలదు. మీ కాలేజీ ప్రిన్సిపాల్ గారును, మీ ఉపాధ్యాయ బృందమును సదా మీ శ్రేయస్సునే కోరుచు, మీ అభివృద్ధి కొరకే యెల్లప్పుడు పాటుపడు చుందురని నాకు నమ్మకమున్నది. భగవంతుడు మీ మనో రథముల నీడేర్చుగాత !

# 141

1950 డిశంబరు 28వ తేదీ సాయంకాలము సత్సంగమైన పిమ్మట మహిళా అసోసియేషన్ వారు ఇంటర్ నేషనల్ ఉమెన్సు కాన్ఫరెన్సు యొక్క కార్యక్రమమును ఒక డ్రామా రూపమున ప్రదర్శించిరి. డ్రామా అయిన పిదప హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి : మహిళా అసోసియేషన్ సమావేశములో జరిగిన W. T. C. ఫంక్షన్‌కు W. T. C. ప్రిన్సిపల్ గారు ఆమె పదవి హోదాలో నన్ను రావలసినదని రెండు మూడు రోజుల క్రితము ఆహ్వానించిరి. అప్పుడు ఆమె చదివిన రిపోర్టులో ఆమె హుజూర్ రాధాస్వామీ దయాళుని గౌరవ మర్యాదలకు భంగము కలిగించెడి ఎట్టి కృత్యమును స్త్రీ లెన్నడు చేయరాదని చెప్పిరి. అనగా భగవంతుని గౌరవ మర్యాదలను కాపాడవలసిన పూచి ఆడ వాండ్రి మీాద నున్నదని అభిప్రాయము. పిమ్మట డ్రామా ప్రారంభించినపుడు ఆడపిల్లలు వాద్య సంగీతముతో కలిపి చేసిన ప్రార్థనలో ఇట్లు చెప్పబడినది.

సరన్ తేరీ హమ్ ఆయ్ ప్రభూ జీ లాజ్ హమారీ తుమ్ కో ।

(అర్థము : హే ప్రభూ మేము మీ శరణ్యము లోనికి వచ్చి యుంటిమి. మా మర్యాదను కాపాడవలసిన భారమంతయు మీ మీదనే యున్నది.)

ఈ గీతములోనే కొంత ముందుకు వెళ్ళగ " ఓ భగవంతుడా! మా ప్రవర్తన లోకమున నిరుపమానమై సమయోచితముగ నుండులాగున మమ్ములను సన్మార్గమున నడిపించవలయును. ప్రపంచమున మీ పేరు ప్రసిద్ధి కెక్కునట్లుగ చేయవలెను. మేము స్త్రీలము మిమ్ముల శరణు జొచ్చితిమి. మా గౌరవ మర్యాదలు మీ చేతులలో నున్నవి." అని ప్రార్థన చేయబడినది. ఈ రెండు విషయములును యుక్తమైనవే. ఈ కాలమున ఔన్నత్యాభి వృద్ధులను గురించిన చర్చయే నలుదెసల నుండియు వినవచ్చుచున్నది. కనుక భారతదేశ స్త్రీలు లేదా అధమాధమము దయాల్బాగ్ స్త్రీలైనను ఈ ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ డ్రామాయొక్క యథార్థ తత్వమును గ్రహించి మనసున నాటిపోవునట్లు చేసుకొని అన్ని విషయములలోను యోగ్యముగ ప్రవర్తించి అంతర్ రాష్ట్రీయ సంస్థలలో గణనీయతను, పేరు ప్రతిష్ఠలను సంపాదించుకొన్న యెడలనే వీరి ప్రవర్తన నిస్సందేహముగ సమయోచితము, నిరుపమానమును కాగలదని చెప్పవచ్చును. మరియు అప్పుడే ఈ డ్రామా ప్రదర్శించుట గూడ యుక్తముగను సఫలముగను ఉండును. అధమాధమము దయాల్బాగ్ స్త్రీలు ఈ ప్రపంచమున ఆదర్శ స్త్రీలుగ తయారై భారతదేశమునకును సమస్త ప్రపంచమునకును అనుకరణీయమైన ఆదర్శమును చూపవలయును. భారతదేశపు స్త్రీ, పురుషులును, ఇతర దేశస్థులును మిమ్ములను వచ్చి చూచినను లేక నెప్పుడైన మీరే వెళ్ళి వారిని కలిసికొనుట తటస్థించినను మీరు వారి దృష్టిలో శ్రేష్ఠతరముగనున్నట్లు తట్టి మృత జీవి, సజీవుల మధ్య గల తారతమ్యము వారికొక విధముగ బోధపడగలదు. మీ జీవిత విధానమును చూచిన మీదట వారికి మీరే వాస్తవముగ సజీవులనియు, మీ యెదుట వారు మృతజీవిసములనియు బోధపడవలయును. మరియు మిమ్ములను చూచిన పిమ్మట మీ దృష్టాంతమును బట్టి, వారు కూడ మీ ద్వారా సజీవులుగ నుండు పద్ధతి నేర్చుకొనగలమనెడి విశ్వాసము వారికి గలుగవలయును. అట్లు చేయు నిమిత్తమై మీరీ క్రింది సిద్ధాంతముల ప్రకారము నడుచుకొనవలయును.

1. గృహకృత్యములలో పొదుపు పాటించుచు ఖర్చు తగ్గించు అలవాటు చేసికొనవలయును.

2. బట్టలు, జోళ్ళు, సబ్బులు, నూనె వగైరాలును ధాన్యములు, కూరలును, ఇతర పదార్థములును దయాల్బాగులో తయారైన వానిని మాత్రమే మీ యిండ్లలో ఉపయోగించుకొన వలయును.

3. బయటి వస్తువులను ఉపయోగించుట వీలైనంత వరకు పూర్తిగ కట్టి పెట్టవలయును.

4. తలమీద ముసుగు లేకుండ నుండుటయు, రెండుజడలు వేసికొనుటయు, తలమీద పలుచని కండువాతో ముసుగు వేసికొనుటయు, వంటిమీద నల్లే పలుచని బట్ట ధరించుటయు, నింద్యమైన అలవాట్లు కావున వానిని విడిచిపెట్టవలయును. అటులనే పెదవులకు లిప్‌స్టిక్ రాచుకొనుటయు, ముఖమునకు పౌడర్లు వ్రాసి కొనుటయు పూర్తిగ కట్టిపెట్టి సామాన్య విధమైన జీవితమును గడుపుట నేర్చు కొనవలయును.

5. ఆవశ్యకతనుబట్టి సమయము ననుసరించియు మీకు అప్పుడప్పుడు ఇవ్వ బడెడి హితోపదేశములను ఆజ్ఞలను మన్నించెదమని మీరు ప్రతిజ్ఞ చేసుకొన వలయును.

ఇప్పుడును ఇకముందును గూడ మీరు అన్నమాటకు తప్పకుండ కట్టుబడి యుండెదమని మాకు నమ్మకము గలిగించిన యెడలనే నేనును, ఇతర సభా సభ్యులును ఈ సమావేశములో పాల్గొనుట యుక్తమగునుగాని లేనిచో ఇది బొత్తిగ వ్యర్థము. మీ జీవిత విధానమునుబట్టియు సంభాషణ సరళిని బట్టియు మీ నడవడి ఆహారపానీయములు దుస్తులు వగైరా సకల విధములైన ఆచరణ లను బట్టియు దయాల్బాగ్ స్త్రీలందరును ఒకే విధమైన దుస్తులు ధరించి, ఒకేవిధమైన సత్ప్రవర్తనతో • నడచుకొనుచు ఐకమత్యముగ జీవితము గడిపెడి సంఘమని బాహ్యమున నున్న స్త్రీలకు నమ్మ కము కలుగు లాగున మీరు ఆదర్శ ప్రాయముగ నడుచుకొన వలయును. వీరిలో వీరికి అంతః కలహములు గూడ నెవరును కలుగజేయలేదని అంతరకు నమ్మకము గలుగు విధమున మీ ప్రవర్తన ఉండవలయును. మిమ్ములను చూచి జీవితమును సుఖశాంతులతో గడుపుట కిదియే పద్ధతియని ఇతరులు మిమ్ములను మెచ్చుకొన వలయును. వీరిలో వీరికి పరస్పర ద్వేషములు లేవనియు, వీరికి దురాశ లేదనియు నమ్మకము పుట్టవలయును. ఇంటి డబ్బు ఇంటనే పొదుపుగ నుంచుకొనుట వలన ఇతరుల నాశ్రయించ వలసిన యవసరముండదు. అందరును కలిసిమెలిసి ప్రేమభావముతో జీవితము గడుపుకొనవలయును. ఈ పద్ధతి జీవితమే కాలానుగుణముగను, నిరుపమానముగ నుండును. కావున ప్రపంచమున మీకు పేరు ప్రతిష్టలు గలుగును. మీరిప్పుడు ప్రార్థనలో కోరిన మనోరథ మప్పుడే యీడేరగలదు.

## 142

1951 మార్చి 25 వ తేదీ హోలీ రోజున మధ్యాహ్నము స్పెషల్ సత్సం

గము అయినది. హుజూర్ వారు ఆనాడు ఉదయమున దివ్యేచ్ఛను తీసి చదివిన శబ్దమునే తిరిగి చదివించితిరి. ఆ శబ్దము ఈ క్రింద సూచింపబడినది.

చలో రీ సఖీ అజ పియా సే మి లాఊ ।
తన మన ధన కీ ప్రీతి ఛుడా ఊ ॥1॥
(సారబచన్, బచన్ 20, శబ్ద 1)

హుజూరు వారు మీలో నెవరెవరు నిజగృహమునకు వెళ్లి మీ ప్రియతముని కలుసుకొనవలెనని ఉత్సుకులుగ నున్నారని ప్రశ్నించగ, చాలమంది చేతులెత్తిరి. అప్పుడు హుజూరు వారీ శబ్దమును తిరిగి చదివించి, సత్సంగులు ఈ శబ్దమును బాగుగ అవగాహన చేసికొని దీని భావార్థమును హృదయమున జీర్ణింపజేసికొనవలసియున్నదని సెలవిచ్చిరి. ఈ శబ్దములో మనోమాయల యొక్క బంధములను విచ్ఛిత్తి చేసికొన వలయునని సూచించబడినది. "మీలో నెవరెవరు మీ గృహముల యందు బంధనమును విచ్ఛిత్తి చేసికొని వానిని హుజూరు రాధాస్వామీ దయాళుని చరణములందు మరతులేమియు పెట్టకుండ అర్పణచేయుటకు సంసిద్ధులుగ నున్నారు. మీలో శరీరమనోధనముల బంధనములను తెంపుకొని నిజగృహమునకు చేరుకొన సంసిద్ధు లెవరున్నారు? అని హుజూరు వారు ప్రశ్నించిరి. ఈసారి చేతులెత్తిన వారి సంఖ్య చాల తగ్గి పోయినది. అప్పుడు తిరిగి దివ్యేచ్ఛకు శబ్దమును తీయించగా ఈ క్రింది శబ్దము వచ్చినది.

ఆజ ఆరతీ కరూం సుహావన ।
భావన పావన మన లలచావన్ ॥ 1 ॥
( సారబచన్, బచన్ 30, శబ్ద 18 )

శబ్దపాఠమైనపిదప హుజూరు వారు మీలో నెవరికైతే ఈ శబ్దమును విన్నమీదట మనసులు మారినవో వారు మరొకసారి విమర్శించుకొని తమ యిండ్లను సంతోషపూర్వకముగ భేంటు ఇచ్చుటకు తయారుగ నున్నారేమో చూచుకొనుడని సెలవిచ్చిరి. అపుడు చేతులెత్తినవారి పేర్లు సెక్రెటరీగారు కాగితముపైన వ్రాసిన పిమ్మట హుజూరు వారు వారి నొక్కొక్కరినే దగ్గరకు పిలిచి కుంకుమబొట్టు పెట్టిరి. అపుడు హుజూరువారు అందరికి నానందము గలుగ జేయునట్టి శబ్దమును చదువుమని సెలవివ్వగ నీక్రింది శబ్దము వచ్చినది.

ఉమండ రహీ ఘటమేం ఘటా అపార్ ॥ టేక్ ॥
( సారబచన్, 36 బచన్, 1 శబ్దము )

పిమ్మట హుజూరు వారు వారి పిచకారీ పట్టుకొని సోదర, సోదరీమణులందరి పైనను ప్రేమరంగు వర్షించిరి.

# పరమగురు హుజూర్ మెహతాజీ మహారాజ్ వారి దివ్య సందేశములు

## ( MESSAGES )

## 143

1940 డిసెంబరు 31 వ తేదీ సాయంకాలము సత్సంగములో హుజూర్ వా రిట్లు సెలవిచ్చిరి : మిమ్ముల నెన్నడు వీడకుండునట్టి కాలమనెడి మీ పురాణ మిత్రునకు ఒక సంవత్సరము గతించి పోబోవుచున్నది. కావున, సత్సంగ వ్యవహారములను పరిశీలించుకొని సత్సంగ ప్రగతియు వ్యక్తిగతముగ ప్రతి సత్సంగి ప్రవర్తనయు సరియైన మార్గమున పోవుచున్నదా లేదాయని విమర్శించుకొని, సరియైన మార్గముననే పోవుచున్నట్లు మీకు తోచినయెడల. సత్సంగము సాంఘికముగను, సత్సంగులు వ్యక్తిగతముగను క్రితము సంవత్సరముకన్న ముందడుగు వేసి అభివృద్ధి నొందుచున్నారో, లేక క్రితము సంవత్సరములో నెట్లుండిరో ఇప్పుడుకూడ నదే స్థితిలో నున్నారో, లేక అంతకన్న వెనుకబడి పోయిరో విచారించుకొనవలసి యున్నది. అట్లు విచారించుకొన్న మీదట సత్సంగము సాంఘికముగను, సత్సంగులు వ్యక్తి గతముగను వృద్ధి నొందుట లేదనియు, మన మవలంబించిన పద్ధతి మనను తప్పుడు త్రోవను పెట్టి అధోగతి పాలు చేయుచున్నట్లు తేలిన యెడల మనము ఈ పద్ధతిని విడిచిపెట్టి సరియైన మార్గమున పోవుటకు ప్రయత్నించ వలయును.

మీ యెదుట నేను ప్రస్తావించ తలచుకొన్న మరియొక విషయ మేమనగ నేను గత సంవత్సరము బహుశా ఇదే రోజున మీకు సత్సంగు లొక్కరు మాత్రము తప్ప ప్రపంచములో మిగత వారందరును మహా దుఃఖములు, కష్టములలోను చిక్కుకొని యున్నారని చెప్పి యుంటిని. మన మందరమును హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణముల వద్ద ఆ దయాళుని మహాదయ చూపి సమస్త సత్సంగు లనేగాక మానవజాతి నంతను గూడ ఆపత్తులనుండి తప్పించి వారికందరికిని పారమార్థిక కార్య క్రమమును సాగించుకొను లాగున సంపూర్ణ సావకాశము కలుగజేయు నిమిత్తమై ప్రార్థన చేయవలసి యున్నది. అట్లు చేసిన యెడల వారందరును తమ ఉత్తరములలో తరచుగ వ్రాసి కోరుకొను మన్న విధమున శాంత చిత్తులను, సంతుష్టి పూరితులునై యుండి స్మరణ

ధ్యాన భజనలు, సత్సంగ సేవలను సుళువుగ చేసికొన గలుగుదురు. 1936వ సంవత్సరములో హుజూర్ సాహబ్జీ మహారాజువారు సమస్త మానవ జాతికిని సేవ మన సంఘము ద్వారా జరిగించు నిమిత్తమై రాధాస్వామీ దయాళురు మన సంఘము నెన్నుకొనిరని సెలవిచ్చియుండిరి.

మీ కందరకును హుజూర్ సాహబ్జీ మహారాజ్ వారు సెలవిచ్చిన ఈ విషయమునందు పూర్ణ విశ్వాసమున్నచో, మనలో నెవరును గూడ అట్టి నమ్మకమునకు భంగకరమైన కృత్యముల నెన్నడు చేయకుండ నుండుటయే గాక మన ప్రవర్తన కూడ మన సంఘము ఈ ప్రపంచమున ఉత్తమ సేవలు నెరవేర్చు నిమిత్తమై రాధాస్వామీ దయాళునిచే నిజముగ నెన్నుకొనబడియున్న దనెడి దృఢ ప్రతీతి మన సంఘమును గురించి అందరకుగల్గు లాగుననే యుండవలయును. మనము చేసెడి ప్రతి కృత్యమును మనము భగవంతునిచే నెన్నుకొన బడిన సంఘముయొక్క సభ్యులమని రుజువు చేసెడి విధముగ నుండవలయును. కాలము గతించుచున్న కొలది, మన సేవా కార్యక్రమము ఒక రోజుకన్న నొకరోజు మహా వేగముగ సాగిపోవుచు, మన సేవ, యాదర్శములును ఉన్నతోన్నతముగ పెరుగు చుండవలయును. ఆ దయాళువు మన సేవను చూచి ప్రసన్నులయినచో, తక్షణమే వారు మనకు తమ నిజధామమున నివాసము దయచేయుదురు. లేదా మన సేవ వారికి తగినంత తృప్తికరముగ లేనియెడల మనకు సేవ యింకను బాగుగ చేయు నిమిత్తమై అధిక సౌకర్యములను, నూతన సావకాశములను కలుగ జేయుదురు. ఈ రాత్రి పండ్రెండు గంటలకు ప్రాత సంవత్సరమునకు ఉద్వాసన చెప్పి క్రొత్త సంవత్సరమునకు స్వాగతము ఇచ్చు నిమిత్తమై క్రైస్తవ దేవాలయములలో గంటలు వాయించుదురు. ఆంగ్ల భాషలో దీనిని ఈ క్రింది విధముగ వివరింతురు :

Ring out the Old, Ring in the New.

ఈ పై వాక్యమునకు, గతమును పోనిండు, భవిష్యమును గురించి చింతింపుడని యర్థము. మనము రేపు ఉదయము లేచిన తోడనే, హుజూర్ రాధాస్వామీ దయాళుడు మనకు రాబోవు సంవత్సరములో గత సంవత్సరము కన్న నెక్కువ శ్రేష్ఠతరమైన సేవ చేయగల్గునట్లు శక్త్యుత్సాహములను దయచేయుదురుగాత యని ఆ దయాళుని పాద పద్మములందు ప్రార్థన చేయుదము.

## 144

దయాల్బాగ్ బిజినెస్ సెక్రెటరీగారు 1942వ సంవత్సరము మే 31వ తేదీ

వరకు జరిగిన సాలుసరి వస్త్రోత్పాదన, విక్రయముల పట్టికను మూడు మాసా ములో నున్నట్టి హుజూర్ డైరెక్టరు వారికి జూన్ 5వ తేదీని సంస్థ గుర్తించిన పండ్రెండు నెలలో చేయబడిన మొత్తము వస్త్రోత్పాదన 1 కోటి 5 లక్షల 28 వేల 118 రూపాయిలైనదని వ్రాసి, ఈ మహా శోభాయమాన ప్రణాళిక పూర్తి చేయు విషయములో పాల్గొనిన జను లందరి మీాదను ప్రత్యేక విశేష దయా కటాక్షములను చూపవలయునని హుజూర్ వారి చరణములందు ప్రార్థన చేసిరి. ఈ ఉత్తరమునకు హుజూర్ డైరెక్టరువారు సమాధానము ని మ్న ఫ ము గ నిచ్చిరి: దయాల్బాగ్ యొక్క వివిధ పారిశ్రామిక సంస్థలు మూడు రెక ప్రకా రము వారి శక్తి కొలది పాటుపడి వస్త్రోత్పాదనను అంచనా మేరకు పూర్తి చేసి ర నెడి విషయము నిజముగ నొక ప్రశంసనీయ కృత్యమే. ఈ ప్రణాళిక పూర్తి చేయు మహా కార్యములో పాల్గొనిన వారందరి పైనను మహా దయా కటాక్షములు చూపవలెనని మీారు చేసెడి ప్రార్థనలో నేను హృదయ పూర్వక ముగ పాల్గొనుచున్నాను. ఇంతియేగాక నే నొక అడుగు ము ం దు కు వేసి హుజూర్ రాధాస్వామీా దయాళురు ఈ ప్రోగ్రాము పూర్తి చేయుటలో నెవ్వి ధమునను పాల్గొన కుండిన వారి యందును, కాదు కాదు మీాదు మిక్కిలి ఈ ప్రోగ్రామ్ పూర్తి యగుటకు అనేక విధములైన అడ్డు ఆటంకములను కలుగజేసిన వారి యందు గూడ దయా కటాక్షములు చూపవలయునని ప్రార్థన చేయు చున్నాను.

## 145

1944 ఆగస్టు 10వ తేదీని హుజూరు వా రీ క్రింది సందేశ మిచ్చిరి: **Be an early riser and be economical, industrious, truthful, kind and considerate, a good citizen and a true Bhakta of Huzur Radhasoami Dayal** (మీారు ఉదయమున పెందలకడనే నిద్ర నుండి లేచు చుండవలయును; పొదుపు పాటించవలయును; కష్టపడి పనిచేయు నలవాటు చేసి కొన వలయును, నిజము పలుకుచుండ వలయును; దయాశీలురై ఇతరుల కష్టము లను పాటించి నడచుకొనుచుండ వలయును; ఉత్తమ నాగరికులై హు జూ ర్ రాధాస్వామీా దయాళుని నిజ భక్తులుగ నుండవలయును.)

## 146

1945 జూలై 19వ తేదీన సత్సంగముయొక్క ఇండస్ట్రియల్ ప్రోగ్రా మును గురించియు, దయాల్బాగ్ స్టోర్సు కార్యక్రమమును గురించియు హుజూర్

వారిట్లు సెలవిచ్చిరి : ఐరోపా యుద్ధము సమాప్తమైపోయినందువలన భారత దేశపు కార్ఖానాలు విదేశీ సామగ్రితో నెట్లు పోటీ చేసి నిలబడగలవు అనెడి ఒక పెద్ద సమస్య మన కార్ఖానాలన్నియు నెదుర్కొనవలసి వచ్చినది. పై దేశముల సరకు మన దేశమునకు రోజు రోజు అధికాధికముగ దిగుమతి అగుచున్నట్లు కనబడుచున్నది. దయాల్బాగు కార్ఖానాలకు గూడ నిదే సమస్యయేర్పడినది. కావున కార్ఖానాల ప్రబంధకర్తలు బాహ్య సామగ్రితో పోటాపోటీ చేయు నిమిత్తమై దేశములో చలామణి కాగల్గు నట్టి క్రొత్త వస్తువులను తయారుచేయు ప్రయత్నములో నున్నారు.

దేశములో ప్రస్తుతము నడచుచున్న కంట్రోళ్ళు, చట్టములు వగైరాల మూలమున కార్ఖానాలకు కావలసినంత సరకు తయారుచేయుట వీలగుటలేదు. అందుచే వారికి ఎట్టి వస్తువులు తయారు చేయవచ్చును ఎట్టివి తయారు చేయకూడదు అను విషయము తెల్సుకొనుట కవకాశము తక్కువమైపోయినది. ఈ పద్ధతులను గమనించి దూరదృష్టిగల దయాల్బాగ్ స్టోర్సుల మేనేజర్లకు డైరెక్టర్లకును మేము చెప్పెడి సలహా యేమనగ దయాల్బాగ్ నుండి యే యే క్రొత్త సామగ్రి తయారై వచ్చినను దానిని అమ్మివేయు నిమిత్తమై పూర్తి ప్రయత్నము చేయవలయునని యే.

కాలముయొక్క మార్పుల కనుగుణముగ తమ స్వభావములో గూడ మార్పు చేసికొనుట కెవరు సిద్ధముగ నుందురో అట్టివారే కర్మక్షేత్రమున బుద్ధిమంతులని పేర్కొనబడ నర్హులు. ఈ సిద్ధాంతానుసారము నడచుకొనని యెడల దయాల్బాగ్ స్టోర్లు కాలప్రవాహములో పూర్తిగ వెనుకబడి పోవలసి వచ్చును.

సత్సంగ సంఘము యొక సజీవ సంఘము, సత్సంగు లందరు దానియొక్క క్రియాశీలాంగములును. ఇండస్ట్రీ ప్రోగ్రామును సత్సంగము తన భుజస్కంధముల మీద పెట్టుకొన్నందున ప్రతి సత్సంగియు దూరదృష్టితోను, కర్తవ్య జ్ఞానముతోను శరీరమనస్సులను పూర్తిగ నర్పించి పని చేయవలసియున్నది. మరియు, డైరెక్టరుగారి వద్దనుండి తమకు వచ్చెడి సలహాలను వారు పూర్తిగ అనుసరించి వానివలన లాభాన్వితులు గావలెను.

సోదరులందరును పై విషయములను సవ్యముగ గమనించి వారి కివ్వబడుచుండెడి సలహాలన్ను ఆచరణలో పెట్టుచుందురని మేము ఆశించుచున్నాము.

## 147

1945 ఆగష్టు 8వ తేదీన హుజూరువారు ప్రేమ ప్రచారక్ యొక్క విశేషాంకమునకు క్రింది సందేశము నిచ్చిరి :

'Waste nothing' has been an important principle of my life. I have always advised men and women young and old alike, to see that they do not waste their time, energy, thought, wealth, food, clothing in short anything, they possess, lest they find themselves in want of them at the time of need.

I also consider waste as nothing short of sin.

ఎట్టి పదార్థమును వ్యర్థముగ పాడుచేయ కూడదను విషయము నా జీవితములో నొక ప్రధాన సిద్ధాంతము. నే నెల్లపుడు పిన్నలు, పెద్దలు, పురుషులు, స్త్రీలు అందరకును వారు తమ సమయమునుగాని, శారీరక శక్తిని, గాని మానసిక శక్తినిగాని, ధనమును గాని ఆహార ద్రవ్యములను గాని, బట్టలనుగాని, క్లుప్తముగ చెప్పవచ్చినచో వారికున్నట్టి వస్తువులలో నెద్దానిని కూడ వృధా వ్యయము చేయరాదు. అట్లు నడచుకొనినచో ఆ వస్తువు అవసరము కలిగిన రోజున దానిలోపము వారికి బోధపడగలదనియు హెచ్చరించుచుంటిని.

ఏ పదార్థమునైన వ్యర్థముగ పాడుజేయుట పాపకృత్యము కన్న నేమియు తీసిపోదనియే నా అభిప్రాయము.

## 148

1946 ఆగష్టు 6వ తేదీన హుజూరు వారు ప్రేమ ప్రచారక్ విశేషాంకమునకు క్రింది సందేశము నిచ్చిరి :

A community which wishes to go ahead with its works must remain united in purpose, thought and action.

It must also conserve all its resources of men, money and materials and exercise forethought and arrange for the fulfilment of its aims in good time.

This can be possibile only if every member of the community contributes his or her best effort towards the attainment of the community's ideal.

Discipline, self-sacrifice and hard sustained w
not only very helpful in the endeavour but are very e

ఏ సంఘము లేక జాతియైనను తన కార్యక్రమమును ముందుక
కొనుచు, అభివృద్ధి నొందగోరినచో అది తన యుద్దేశ్యములను, భ
ఆచరణలను ఏకస్వరముగ నుంచుకొని నడచుకొనవలయును.

మరియు నా సంఘము తన కందుబాటుగ నున్న కార్యకర్త
మును, ధన సంపత్తిని, సాధన సామగ్రిని గూడ జాగ్రత్త పెట్టుకొను
దృష్టికలిగి నడచుకొనుచు, తనయాదర్శము సకాలములో సిద్ధించు
ఏర్పాట్లు కూడ చేసికొనవలయును.

ఆ సంఘముయొక్క ఆదర్శము సాధించు నిమిత్తమై అం
వ్యక్తియు తనశక్తికొలది పట్టుదలతో పనిచేసిననాడె పైన చెప్పి
సాధ్యమగును.

ఈ కార్యసిద్ధికై క్రమశిక్షణయు, ఆత్మ సమర్పణము, నిరం
పరిశ్రమయు సహాయకరము లగుటయేగాక అత్యంత ఆవశ్యక వి
కూడ చెప్పవలయును.

# 149

1947 జనవరి 23 వ తేదీని వసంత పంచమి దినమున
మెహతాజీ మహారాజ్ వారీ క్రింది సందేశము నిచ్చిరి:

May this Basant bring everyone nearer God,
to our organisation, unity among all Indians, an
and contentment to all humanity.

ఈ వసంత సమయము ప్రతి వ్యక్తికిని భగవంతునికి అధిక స
గలుగజేసి, మనసంఘమునకు శక్తి సామర్థ్యములను ప్రసాదించి, సమ
దేశీయులలో పరస్పర సహకార ప్రేమభావములను పెంపొందిం
మానవజాతికిని సుఖశాంతు లొసంగు లాగున భగవంతుడు దయా
లను చూపుగాత!

## 150

1941 సెప్టెంబరు 19 వ తేదీని హుజూరు మెహతాజీ మహారాజ్ వారు తెలుగు ప్రేమప్రచారక్ విశేషాంకమునకై క్రింది సందేశము నంపిరి :

Shortage of food grains, and of consumer goods in the country is the topic of the day and it behoves every satsangi to contribute his mite towards increasing their production, both directly and indirectly.

Satsangies should cultivate the haleit of talking less, eating less, sleeping less, and of devoting more and more time in Sewa and Sumiran"

ఇక్కాలమున ఆహార ద్రవ్యములు తదితరమైన వాడుక పదార్థముల యొక్కయు కొరతను గురించి గొప్ప సమస్య దేశమందంతటను వ్యాపించినది. కావున ప్రతి సత్సంగియు తాను స్వయముగ తన యావచ్ఛక్తిని పంటలు, ఇతర వస్తూత్పాదనను వృద్ధిచేయుటకై వినియోగించుటయే గాక ఇతరులను గూడ నట్లు చేయులాగున ప్రోత్సహించవలసి యున్నది.

సత్సంగులు భోజనము తక్కువగ చేయుచు, తక్కువగ నిద్రపోవుచు, తక్కువ సంభాషణచేయుచు తమ సమయమును అధికాధికముగ భగవంతుని సేవాస్మరణాలలో వెళ్ళబుచ్చునట్టి అలవాటు చేసికొనవలయును.

## 151

1951 ఆగస్టు నెలలో ప్రేమ ప్రచారక్ విశేషాంకమునకై ఈ క్రింది సందేశమును హుజూరు వారు పంపించిరి :

Living on honest bread earned with the sweat of one's brow has been one of the important teachings of Satsang and every Satsangi is expected to act upto it. Equally important for Satsangies is the principle that they should always keep their accounts clear and permit no debt to remain pending. This has been emphasised many times in Satsang in recent years. Those who act on this can always await the Lord's pleasure with an easy conscience and light mind.

సత్సంగులు శ్రమపడి న్యాయముగ సంపాదించుకొనిన ఆదాయముతోనే కాలక్షేపము చేయవలయు నను విషయము సత్సంగము యొక్క ఒక ప్రధాన సిద్ధాంతము. కావున ప్రతి సత్సంగియు సత్సంగముయొక్క ఈ ఉత్తమ బోధ ప్రకారము తప్పక ప్రవర్తించునని ఆశించుచున్నాము. అటులనే సత్సంగులకు ముఖ్యమైన మరియొక ఆదర్శమేమనగ వారు తమ జమాఖర్చు లెక్కలను నిర్దుష్టముగను, అప్పుసొప్పులు లేకుండగను ఉంచుకొనుచు ఎవరికి నెవ్విధముగ ఋణపడకుండ నుండవలయును. ఈ విషయమును గురించి గత సంత్సరములలో అనేక పర్యాయములు సత్సంగములో నొక్కి చెప్పబడినది. ఈ ఆదర్శముల ప్రకార మెవరు ప్రవర్తించుదురో వారు నిశ్చింతహృదయులై శాంతచిత్తముతో భగవంతుని దయావర్షమునకై ఆశించవచ్చును.

# 152

1952 నవంబరు నెలలో కాన్పూరుజిల్లా సత్సంగ్ సమావేశ సమయమున హుజూర్ వారు కాన్పూర్ సత్సంగుల కంపిన సందేశము :

Rest assured that whenever Satsangies collect With the sincerest and impretentious object of rememering Huzur Radhasoami Dayal in some ligitimate way, His Grace surely attends such congregation and there can be no doubt about gaining mutual benefit therefrom.

సత్సంగు లెచ్చటనైన హుజూర్ రాధాస్వామీ దయాళుని స్మరణచేసి కొన వలయునను సిర్వ్యాజమైన సదుద్దేశముతో క్రమపద్ధతిని సమావేశమైనపుడు, అట్టి సమావేశమునందు వారి దయాకటాక్షములు వర్షించుసను విషయము నిస్సంశయ మని మీరు పూర్తిగ నమ్మవచ్చును. అట్టి సమావేశములో పాల్గొనినవారి కందరికిని పరస్పర సమావేశమువలన లాభము కలుగునను నెడి విషయమును గురించి సందియముండ నవసరము లేదు.

# 153

21 జనవరి 1961వ తేదీ పవిత్ర వసంత పంచమీ రోజున ప్రాతః కాల సత్సంగమైన పిమ్మట హుజూర్ వారు ఆంగ్లభాషలో ఇచ్చిన సందేశమునకు అనువాదము ఈ క్రింద పొందుబరచ బడినది,

పరమ పురుషపూరనధనీ హుజూర్ స్వామీజీ మహారాజ్ వారు ఆగ్రా పట్టణములో ఒక మిక్కిలి చిన్న సందులో ఒకచిన్నగృహమున జన్మించిరి. ఆ యింటిని నేను ఈ మధ్యనే చూచుట తటస్థించెను. వారు ఆ స్థానముననే 1861 ఫిబ్రవరి 15 వ తేదీ వసంత పంచమీ శుభ దినమైన శుక్రవారమునాడు సత్సంగమును సకల జనసామాన్యమునకు జారీచేయించు దివ్యేచ్ఛ ధరించిరి. అటు పిమ్మట పదునైదేండ్ల వరకును ఆ స్థలముననే సత్సంగము జరుగుచుండెడిది. హుజూర్ మహారాజవారి కాలములో సత్సంగము సామాన్యముగ పీపల్మండీలో వారి గృహములోనున్న మధ్యప్రాంగణములో జరుగుచుండెడిది. అచ్చట స్థలము అరువది లేక డెబ్బదిమంది వ్యక్తులకు గూడ కూర్చుండుటకు బహు కష్టము మీద సరిపోవు చుండెడిది. ఆ కాలమున ఈ మహా పురుషులు తప్ప మరె వరును గూడ, సత్సంగము వృద్ధినొంది ఒకానొకరోజున ప్రస్తుతసమయములో నున్నట్లు ఒక మహాసంఘముగ తయారై సత్సంగానుయాయులు లక్షలకొలది సంఖ్యలో పెరిగి లోకము నందన్ని స్థలములలోను వ్యాపించి పోగలదని ఊహించ నైనా ఊహించలేదు.

2. సత్సంగ ప్రగతి మొదటలో చాల చిన్న పరిమాణములోనే ఆరంభ మైనదనుట సత్యమే. అయినను దానికి అద్భుత శక్తి కలదు. అట్లుండుట గూడ న్యాయ సమ్మతమే. ఏలనన, సత్సంగ ప్రచారమునకు శంకుస్థాపన రాధాస్వామీ దయాళురే స్వయముగ చేసిరికదా! మరియు సర్కార్ సాహబ్ వారు మానవ రూపము ధరించిన ఆ నిజధార సమస్త సృష్టికిని యుద్ధారము పూర్తియగు వరకు తిరిగి తను నిజ ధామమునకు మరలిపోనేరదను సిద్ధాంతమును దృఢ పరచిరి. కావున సత్సంగము నూరేండ్ల నుండియు నిరంతరాభివృద్ధి నొందుచు వచ్చెను. ఈనాడు 1961వ సంవత్సరము జనవరి 21వ తేదీ వసంత పంచమీ సుదినమున దానికి నూరేండ్లు పూర్తియైనవి.

3. నిస్సందేహముగ నీ దినము సత్సంగ ప్రపంచ మంతయు ఆనంద భరితమై ఆనందోత్సవము జరిపించవలసిన దినమే. ఏలనన 1861వ సంవత్సర ములో ఈ సుదినముననే సత్సంగ మనెడి పసిపిల్ల ఉద్భవించి ఇన్ని సంవత్సర ముల నుండియు నిరంతరాభివృద్ధి నొందుచు ఈ రోజున దానికి నూరు సంవత్సర ముల వయసు వచ్చినది. కాని సత్సంగ వ్యవస్థతో నేదో యొక విధముగ సంబం ధము కలిగి యున్న మన అందరి పైనను ఒక గొప్ప ప్రధాన బాధ్యత ఏర్పడి నది. ఏలనన మన ఆశయములు, ప్రవర్తనయును సత్సంగ వ్యవస్థ యొక్క అభి వృద్ధికి సహాయ కరములైనను కావచ్చును లేక ఆటంక కరములైనను కావచ్చును.

4. కావున మనమందరమును ఈ పవిత్ర సమయమున నింతవరకు మనము కావించిన కృత్యముల పైనను, జరిగిన విషయముల పైనను సింహావలోకనము చేసి మనము మన ఆచరణ, ప్రవర్తనల వలన సత్సంగ ప్రగతికి నష్టము కలిగినదో, లేక దాని ఔన్నత్యమునకు సహాయము కలిగినదో పరిశీలించుకొనుట ఆవశ్యకము. మనము సత్సంగాభివృద్ధికి ఎంత స్వల్పాతి స్వల్పమైన ఆటంకమైనను కలుగజేసినట్లు గోచరమైనచో మనము మన పద్ధతులను వెంటనే మార్చుకొనవలసి యున్నది. మనము ఇతః పూర్వము సత్సంగాభివృద్ధికి దీనత్వముతో నేదైన కొద్ది సహాయము చేయగలిగినచో ఇకముందు దానికి మించిన సహాయమును చేయుటకై మనము ప్రయత్నించవలయును.

5. మన విషయములోను, సత్సంగ విషయములోను, హుజూర్ రాధాస్వామీ దయాళుని విషయములోను మనకు గల కర్తవ్యము బాధ్యత తెలిసినవారు మనలో కొందరున్నారు. అయినను అట్టి జ్ఞానము లేనివారే చాలమంది కలరు. అంతకన్న అధిక సంఖ్యాకులకు అట్టి కర్తవ్య పాలన చేయగల సాహసోత్సాహములు లేవు. అట్టి కర్తవ్యములను తమ శక్త్యనుసారము పాలించవలయుననెడి ఇచ్ఛయే లేనివారు కూడ మరికొందరు గలరు.

6. అదెట్లున్నను, మన పూర్వాచారములలోను ప్రాచీన విశ్వాసముల లోను చిక్కుకొనిపోయి, సత్సంగ ప్రచారములోను దాని అభివృద్ధి నిమిత్తమును మనము పాటుబడి పనిచేయకుండ నుండిపోయినచో మనము హుజూరు రాధాస్వామీ దయాళుని మహా దయా కటాక్షములతో మనకు ప్రసాదించిన మహోత్తమ సావకాశమును కోల్పోయితి మనెడి వాస్తవ జ్ఞానము మనకు ఎప్పటికైన జనించక తప్పదనియు, అప్పుడు రాధాస్వామీ దయాళుని నూరేండ్ల క్రితము పవిత్ర వసంత పంచమి రోజున ప్రపంచమునకు మహా దయతో ప్రసాదించిన మహోత్తమ సందేశమును ప్రచారము చేయుటలో మనము మన మూర్ఖత్వము మూలమున అట్టి లోపము చేసితిమని తెలుసుకొని పశ్చాత్తాప పడవలసి వచ్చునని యు మనలో ప్రతి వ్యక్తియు మనసున జ్ఞాపకముంచుకొనుట యత్యావశ్యకము.

7. ఇంతవరకు గతించిన మనజీవితమును గూడ మనము సింహావలోకనము చేసి చూచుకొని, మనము సత్సంగములో జేరినది మొదలు ఇంత వరకును వారిశరణ్యము నొందినపుడు మన మీద దయాళుని మొదట చూపించుచుండిన తీరుననే ఇప్పుడు గూడ దయాకటాక్షములు చూపుచున్నారో లేక ఆ దయాప్రవాహమునకు ఆటంకము ఏదైనను మధ్యలో వచ్చిపడినదో యను

విషయమును గూడ మనము పరిశీలించుకొన వలసియున్నది. ఆ ప్రవాహ మిపుడు మనవైపునకు ప్రవహించుట ఆగిపోయినట్లు గోచరమైనయెడల మనము పూర్వము వలెనే వారికి దయాపాత్రులమై యుండక అభాగ్యుల మేల అయి పోయితిమను విషయమును న్యాయబుద్ధితో హృదయపూర్వకముగ విమర్శించు కొనవలయును. మరియు మనతప్పిదములను ఆ దయాళురు క్షమించి, మంద బుద్ధులము, పాపాత్ములము నైనట్టి వారిబిడ్డల మగు మన శిరముల మీద వారి దయా భరిత రక్షకహస్తము నెల్లపుడు నుంచుదురు గాత యని మనము హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణ కమలము లందు దీనత్వముతో ప్రార్థన చేయ వలయును.



8. మన మట్లు చేసిన యెడల, వారిదయాకటాక్షప్రవాహము తిరిగి ఇతః పూర్వమువలెనే మన మీదికి ప్రవహించుట మాత్రమే గాక, మన మూర్ఖత్వముచే మనము చేసిన అపరాధములను తప్పిదములను గూడ వారు మహాదయతో క్షమించి వేయుదురని నాకు పూర్ణవిశ్వాసమున్నది.

9. పరమ పిత హుజూర్ రాధాస్వామీ దయాళురు మనకందరికి సుమతి వరదాన మిచ్చుగాత! సత్సంగప్రచారము ఇతః పూర్వముకన్న అత్యధికముగ వృద్ధి నొందుగాత. రాధాస్వామీ.



## 154

1974 జనవరి 1వ తేదీ ప్రాతఃకాల సత్సంగములో హుజూరు వారిట్లు సెలవిచ్చిరి :

నేను చెప్పెడి యీచిన్న మాటకూడ మీరు కొంచెము వినగోరు చున్నాను.

**Devotion to Radhasoami Dayal, discrimination between right and wrong, physical strength, financial stability and good luck, may be your lot throughout the year 1974.**

హుజూర్ రాధాస్వామీ దయాళుని చరణకమలము లందు భక్తియు, యుక్తాయుక్త వివేచనశక్తియు, శరీర దార్ఢ్యము, ఆర్థిక సమృద్ధియు, అదృష్టైశ్వర్యములును మీకందరికి నీ 1974వ సంవత్సరము అంతయు లభించుగాత.

హుజూరు వారు 1974వ సంవత్సరము మీకందరికి శుభప్రదమగుగాత యని కూడ తిరిగి ఆశీర్వదించిరి.